శ్రీరస్తు

# తులసీ రామాయణము

( గోస్వామి తులసీదాసు కృత )


రచయిత :

శ్రీ యం. కృష్ణమాచార్యులు








పబ్లిషర్స్

**టాగూరు పబ్లిషింగ్ హౌస్**

కాచీగూడా చౌరస్తా, హైదరాబాదు - 500 027.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

**బాలసరస్వతీ బుక్ డిపో**

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ కర్నూలు - 518 001

టి. వెంకటేశ్వర్లు శెట్టి చేంబర్స్

నెం.4 సుంకురామ శెట్టి వీధి, మద్రాసు - 600 001


 1999 [వెల : 120/-

# ప్రకాశకుల మనవి

శ్రీగాయత్రీ సుప్రభాతం తదుపరి మా సంస్థ అఖిలాంధ్రావనికి సమర్పిస్తున్న మలి కానుక తులసీరామాయణము.

రామాయణము మహాకావ్యాన్ని ఆదికవి వాల్మీకి మొదలుగా ఎందరో మహనీయులు తమతమ రీతులలో చాలా మనోహరంగాను, ధర్మబోధకముగాను విరచించి లోకోపకారం చేశారు.

శ్రీ తులసీదాస్ అవధి అనే హిందీభాష శాఖలో రచించిన మహాకావ్యమే "రామచరితమానసమ్" అనే తులసీ రామాయణం.

ఈ మహోదత్త కావ్యాన్ని శ్రీమాన్ కృష్ణమాచార్యులుగారు చక్కని తెలుగులో ఆంధ్రీకరించగా మేము దానిని తెలుగువారి కరకమలాలలో కానుకగా అర్పిస్తున్నాము.

తెలుగు వాళ్ళందరూ దీనిని చదివి తరించి మాప్రయత్నం సఫలం చేయగోరుచున్నాము.

ప్రకాశకులు

# నివేదనము

రఘువంశ భూషణుడు, మర్యాదాపురుషోత్తముడైన శ్రీరామ చంద్రునితో సమానుడు నేటివరకు ఏ దేశమునందుగాని, ఏ కాలమునందు జన్మించలేదనుట నిర్వివాదాంశము. శ్రీరాముడు సాక్షాత్ పరబ్రహ్మ, పరమాత్మ.

*పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం।*
*ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥*

అని భగవద్గీతయందు భగవంతుడు తెలిపినట్లు దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ గావించి, ధర్మసంస్థాపనకై శ్రీమన్నారాయణుడు శ్రీరామచంద్రునిగా అవతరించెను. శ్రీరాముడు అనంతుడు. అతని గుణములనంతములు. ఆదికవి వాల్మీకి శ్రీరాముని గుణసమూహమును వర్ణించెను. శ్రీరాముడు సద్గుణ సాగరుడు, శరణాగత వత్సలుడు, పితృవాక్యపరిపాలకుడు, వినయశీలి, ధీరుడు, గంభీరుడు, అసహాయశూరుడు, అనపాయ సాహసి, ప్రతిజ్ఞాపాలకుడు, ధర్మజ్ఞుడు, ధర్మస్వరూపుడు.

శ్రీరామచంద్రుడు వేదవేద్యుడైతే, శ్రీమద్రామాయణము వేదముతో సమానము. ఆదికవి వాల్మీకి దృష్టిలో శ్రీరాముడు మాయామానుష విగ్రహుడు. వేదధర్మాన్ని, ఆర్షధర్మాన్ని స్వయముగా ఆచరించి, ఆదర్శమూర్తియై చిరకీర్తి నొందిన మహాపురుషుడు. వాల్మీకి సంస్కృతములో రచించిన శ్రీమద్రామాయణమును ఆధారముగా చేసికొని ఎందరో మహాకవులు ఆయా దేశాలలో వారి వారి భాషలలో శ్రీమద్రామాయణమును రచించి, తాము తరించి ఇతరులను తరింపజేసిరి. శ్రీమద్రామాయణము సర్వకాల, సర్వావస్థలకు, సమస్తజనులకు ఆదర్శమైన పవిత్ర గ్రంథము.

శ్రీగోస్వామీ తులసీదాసుగారు శ్రీమద్రామాయణమును సరళమైన హిందీ భాషలో రచించిరి. శ్రీతులసీదాసు వాల్మీకి మహర్షి

అంశావతారమని ప్రతీతి. సాక్షాత్ శ్రీపరమేశ్వరుడే శ్రీతులసీదాసుగారిని శ్రీమద్రామాయణమును రచించమనీ, అట్లు రచించబడిన ఆ కావ్యము సామవేదముతో సమానముగా ఫలమునిచ్చునని ఆదేశించెను. శ్రీశంకరుని ఆదేశానుసారము తపోనిష్ఠుడు, మహాభక్తుడైన శ్రీగోస్వామీ తులసీదాసుగారు అతిసరళమైన హిందీ భాషలో శ్రీరామచరితమానసమును రచించిరి. ఈ పవిత్ర కావ్యమును శ్రీతులసీదాసు వారణాశిలో శ్రీవిశ్వనాథుని మందిరమునందుంచగా పరమేశ్వరుడు స్వయముగా దీనిపై 'సత్యం, శివం, సుందరం' అని వ్రాసి తన చేవ్రాలు చేసెను. ఇట్లీ కావ్యము పరమశివునిచే ఆశీర్వదించబడినది. సంస్కృతమున గల శ్రీమద్రామాయణమును పఠించుట వలన కలుగు సర్వసిద్ధులు 'శ్రీరామచరిత మానసము' ను పఠించుట వలన కూడా కలుగును.

శ్రీరామచంద్రుడు మాయామానుష విగ్రహుడేగాక లీలామానుష విగ్రహుడుకూడ. ఈ తత్త్వమును శ్రీతులసీదాసు శ్రీరామచరితమానసమున చక్కగా వర్ణించెను. శ్రీశంకరుడు సదా రామమంత్రమును జపించుటయేగాక, పార్వతీదేవికి ఆ మంత్రమును ఉపదేశించి ఆచార్య స్థానమునలంకరించెను. కాశీ క్షేత్రమునకు వెళ్ళి తన్ను సేవించిన వారికి ఆసన్న సమయమున పరమశివుడు నేటికినీ శ్రీరామమంత్రమునుపదేశించి వారికి పరమపదప్రాప్తి కల్గించునని విజ్ఞుల, ప్రాజ్ఞుల విశ్వాసము.

శ్రీగోస్వామీ తులసీదాసు విరచిత "శ్రీరామచరితమానసము"ను ఎందరో అనువదించి లబ్ధ ప్రతిష్ఠులైరి. అతి సరళమైన తెలుగు భాషలో పండితులు, పామరులు, యువకులు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, అన్ని వర్గములవారు దీనిని పఠించి, ఆనందించి, తరించుటకు చేయబడిన ప్రయత్నమే ఈ వచనరూప సంక్షిప్త తులసీరామాయణము. సహృదయులు దీనిని పఠించి ఆనందించెదరని నా ప్రార్థన.

హైదరాబాదు,
ధాతృ సం॥ ఫాల్గుణ, భవదీయుడు
శుద్ధ దశమి 18–12–1997, యం. కృష్ణమాచార్యులు
మంగళవారము.

# ఇందులో....



★ ★ ★

# తులసీ రామాయణము

## మొదటి సోపానము

## బాలకాండము

### 1. మంగళాచరణము

సమస్త వర్ణములకు, వాటి అర్థములకు, నవరసములకు, ఛందస్సులకు మరియు సమస్త శుభకార్యములకు అధిదేవతలైన సరస్వతీ విఘ్నేశ్వరులకు నమస్కారములు. అంతఃకరణ స్థితుడైన భగవంతుని సిద్ధులు దర్శించుటకు వలయు శ్రద్ధావిశ్వాస రూపులైన పార్వతీ పరమేశ్వరులకు నమస్కారము, ఎవ్వరి నాశ్రయించుటచే వక్రరూపుడైన చంద్రుడు కూడా పూజ్యుడగుచున్నాడో, అట్టి శంకరుని జ్ఞానస్వరూపుని గురుదేవునికి నమస్కరించెదను. సీతారాముల గుణసమూహమనెడి పుణ్యవనమునందు విహరించు విశుద్ధ విజ్ఞానఖనులైన వాల్మీకి హనుమంతులకు నా నమస్కారములు. సృష్టిస్థితిలయకారిణి, క్లేశహారిణి, సర్వశుభప్రదాయిని శ్రీరామచంద్రుని పత్నియైన సీతాదేవికి నమస్కరించెదను. ఎవ్వని మాయకు ఈ విశ్వము, బ్రహ్మాదిదేవతలు, అసురులు, వశీభూతులో, ఎవని మహిమచే క్షణిక జగత్తు సత్యముగా తోచునో, ఎవని పాదములు సంసారసాగరమును దాటించు నౌకలో అట్టి శ్రీరామునికి నమస్కరించెదను. వేదపురాణ శాస్త్రసమ్మతమై వాల్మీకి రచితమైన శ్రీరాముని కథను ఇతర గ్రంథస్థకథలను జోడించి తన ఆత్మానందమునకై తులసీదాసు రచించుచున్నాడు.

## 2. వందనము

గణాధిపతి, గజముఖుడు, విజ్ఞానఖని, సుగుణాలరాశి, స్మరించనవారికి కార్యసిద్ధి కలిగించు శ్రీ వినాయకుడు నాపై కృప చూపుగాక! ఎవని దయవలన మూగవాడు వక్తగా, కుంటివాడు పర్వతారోహకుడుగా మారునో, కలియుగపు పాపములు భస్మమగునో అట్టి భగవంతుడు నన్ను కృపతో జూచుగాక! నీలవర్ణశరీరుడు, తామరసనేత్రుడు, క్షీరసాగరశయనుడు శ్రీమన్నారాయణుడు నా హృదయమున వసించుగాక! కుందేందుధవళశరీరుడు, కరుణామూర్తి, దీనరక్షకుడు, మన్మధమర్దనుడు పార్వతీనాథుడైన పరమేశుడు నన్ను అనుగ్రహించుగాక! కృపాసముద్రుడు, అజ్ఞానాంధకారమును పారద్రోలు విజ్ఞాననిధి, మానవాకారమున నున్న శ్రీహరియైన నా గురుపాదపద్మములకు నమస్కరించెదను.

గురుదేవుని పాదధూళి సంసార బాధలను నశింపజేయు దివ్యౌషధము. నిర్మలమై, శుభప్రదమై, ఆనందమయమై, మనోదర్పణముపైని మైలను తుడిచివేయును. స్మరణమాత్రముననే అజ్ఞానమును పారద్రోలి ఆత్మానందము నొసగును. అట్టి గురుదేవుని పాదధూళియను అంజనముచే నా మనోనేత్రమును శుద్ధమొనర్చుకొని సంసారబంధములనుండి ముక్తిని ప్రసాదించు శ్రీరామచరితమును వర్ణించెదను.

అజ్ఞానజనిత సందేహములను పారద్రోలు భూసురులకు, సద్గుణసంపన్నులైన సాధువులకు నమస్కరించెదను. సాధుసమాగమము ఆనందమయము, శుభప్రదము. అది ఒక కదులుచున్న ప్రయాగక్షేత్రము. రామభక్తి అను గంగాప్రవాహము, బ్రహ్మవిచారమను సరస్వతీనది, విధినిషేధరూపములైన కథలు యమునానదియై శివకేశవుల కథల నెడి త్రివేణీసంగమము వినినవారికి ఆనందము, శుభము నిచ్చును. సాధుసమాజరూపమైన ఈ ప్రయాగక్షేత్రము అన్ని దేశములలో, అన్ని సమయములనందు లభ్యమగును. ఈ తీర్థరాజము అలౌకికము,

అవర్ణనీయము. భక్తితో ఇందు స్నానమాడినవారికి ధర్మార్థకామమోక్ష ఫలము లభించును. సాధుపురుషులమహిమ జగద్విదితము. వివేకమును కలిగించు సత్ సాంగత్యము శ్రీరాముని దయవల్లనే లభ్యమగును. పుష్పములు తమ సుగంధమును అందరికీ సమానముగ పంచినట్లు సాధుజనులు తాము కష్టముల నోర్చియు ఇతరులను ఉద్ధరింతురు. అట్టి సరళచిత్తులు, లోకోపకారులు, స్నేహశీలురైన సాధువులు ఈ బాలుని దయ తలచి శ్రీరామచరణకమలములపై ప్రీతి కలుగునట్లు అనుగ్రహింతురుగాక!

నిష్కారణముగా సత్పురుషులను హింసించువారు, ఇతరులకు హాని చేయుచు ఆనందించువారు, అందరి హితమును నాశనము చేయువారు, సదా ఆత్మస్తుతి, పరనింద చేయువారు, భగవంతుని కథలకు దూరముగానుండువారు, ఇతరుల ఉన్నతిని చూచి ఈర్ష్యపడువారు – ఇట్టి దుష్టులకు కూడా నమస్కరించెదను. అమృతము, విషము ఒకే సముద్రమునందు పుట్టినట్లు సజ్జనులు, దుర్జనులు కూడా ఈ ప్రపంచములో జన్మింతురు. కాని వారి కర్మఫలముగా కీర్తి, అపకీర్తులను పొందెదరు.

భగవంతుడు చేతనాచేతన రూపమైన విశ్వమునందు మంచి చెడులను సృష్టించెను. హంసవలె సాధువులు గుణములను మాత్రమే గ్రహించి, దోషములను విసర్జింతురు. అట్లే ఈ గ్రంథము నందలి గుణములను మాత్రమే గ్రహించి, దోషములను విస్మరించమని నా ప్రార్థన. భగవంతుడెవరికి విచక్షణాశక్తిని ప్రసాదించునో వారే గుణములను గ్రహించగలరు. కాని మంచివారు కూడా మాయమోహితులై కాల స్వభావ కర్మలప్రభావమున సన్మార్గమునుండి తొలగుదురు. భగవద్భక్తులు ఈ పొరపాటును గ్రహించి దుఃఖదోషములనుండి రక్షింపబడుదురు. అట్లే దుష్టులు సత్సాంగత్యము వలన సత్కార్మములను ఆచరించినను వారి దుష్టస్వభావము మారదు. వారికి గూడా నా నమస్కారము.

విశ్వమునందలి చేతానాచేతన పదార్థములన్నియు, భూ,జల,నభ జీవరాసులన్నియు సీతారామమయములని భావించి వాటికి నమస్కరించుచున్నాను. దేవతలు, దైత్యులు, మనుష్యులు మొదలగువారందరు నాపై కృపజూపుతురుగాక! శ్రీరామచరితము అగాధము. నా బుద్ధి అతి స్వల్పము. శ్రీరాముని గుణములను వర్ణింప సాహసించుట మజ్జిగ కూడా సంపాదింప యోగ్యతలేని వాడు అమృతమును కోరుట వంటిదగును. సజ్జనులు నా యీ సాహసమును క్షమించి, తల్లిదండ్రులు తమ పిల్లల పలుకులను విని ఆనందించునట్లు, నాపై కృపజూపుతురుగాక! దుర్జనులు పరిహసించినను సుజనులు నా రచనలు విని ఆనందించెదరని నా పూర్ణవిశ్వాసము, శ్రీహరి పాదపద్మములందు భక్తి లేనివారికి, అవగాహనారహితులకు ఈ కథ నిస్సారముగ నుండును. హరిహరభక్తులకు శ్రీ రఘునాథుని కథ మధురముగా నుండును. సజ్జనులు ఈ కథను శ్రీరామభక్తివైభవ భూషితమైనదిగా తెలుసుకొని విని ప్రశంసింతురు. నేను కవిని గాను, వాక్చతురుడనుగాను, కళలందు, శాస్త్రములందు నాకు ప్రావీణ్యతలేదు. నానాశబ్దప్రయోగములు, అలంకారములు, ఛందస్సులు, భావములు, రసములు, కవితా సౌందర్యముల గూర్చిన జ్ఞానము కూడా నాకు లేదు. కాని లోకవిదితమైన రామనామ మహిమ అనెడి ఒకే ఒక గుణమున్నది. జ్ఞానులు, వివేకులు దీనిని విచారించి ఆలకింతురుగాక!

## 3. శ్రీరామనామ మహిమ

శ్రీరామనామము అత్యంత పవిత్రము. వేదపురాణసారము, కళ్యాణప్రదము, సదా సాంబశివుడు శ్రీరామనామమే జపించుచుండును. గొప్పకవిచే వ్రాయబడిన ప్రశంసనీయమైన కావ్యము కూడా రామనామము లేనిదే రాణించదు. కాని అల్పజ్ఞుడైన కుకవిచే వ్రాయబడిన కావ్యము కూడా రామనామవైభవముచే అలంకృతమైనచో, సజ్జనులు దానిని గౌరవముతో చదివి ఆనందింతురు. నా కవిత

దోషయుతమైనను రామకథావర్ణనతో కూడుటవలన శుభప్రదమైనది. శ్రీ రఘునాథుని కథ కలియుగపాపములను కడిగి కళ్యాణమును చేకూర్చును. నా కవితా స్రవంతి పావన గంగానదివలె అనేక వంకరలుగానున్నను శ్రీ హరి వైభవసాంగత్యముచే సుజనులకు ఆమోదయోగ్యమగును. శ్మశానములోని బూడిదకూడా శంభుని శరీరమును తాకినపుడు సుగంధయుతమై, పవిత్రమగును. అట్లే శ్రీరామ వైభవ సాహచర్యముచే నా కవిత అందరికీ అత్యంతప్రియమగును. నల్లని ఆవులపాలు కూడా తెల్లగానే ఉండును. మరియు పుష్టికరమని అందరూ త్రాగుదురు. అట్లే నా భాష గ్రామ్యమైననూ సీతారాముల కథ వర్ణింపబడుటవలన సుజనులు విని గానము చేయుదురు.

కవి భక్తితో స్మరించగానే వాగ్దేవి సరస్వతి బ్రహ్మలోకమును వదలి భూమికి పరుగెత్తి వచ్చును. ఈ దూరప్రయాణపు బడలిక తీరుటకు సరస్వతీ దేవి శ్రీరామచరితమను మానస సరోవరమున స్నానమాడుటతప్ప వేరే ఉపాయము లేదు. కవులు సామాన్యమానవుల చరిత్రను పొగిడిన సరస్వతీ దేవి తన రాకకు పశ్చాత్తాపపడును. ఈ విషయము గ్రహించియే కవులు, పండితులు, కలియుగ పాపములను నశింపచేయు శ్రీరామచరితమును గానమొనర్చెదను.

పాపభూయిష్టమైన కలియుగములో పుట్టి, హంసవేషము ధరించి కాకివలె ప్రవర్తించువారు, వేద సమ్మతమైన మార్గములను వదలి దుర్మార్గములో సంచరించువారు, అసత్యస్వరూపులు, పాప భాండములు రామభక్తులమని చెప్పి ప్రజలను మోసగించు వంచకులు, కామక్రోధలోభములకు దాసులు అనేకులు గలరు. వారిలో నేను ప్రథముడను, నియమరహితుడను, కపటిని, సంసారవ్యామోహితుడను. నా దుర్గుణములకు లెక్కలేదు. అయినప్పటికి మూర్ఖుడను మందబుద్ధినగు నేను శ్రీరామ వైభవమును వర్ణించుటకు సాహసించితిని. శ్రీరాముని వైభవము వర్ణింపనలవికానిదని తెలిసిననూ ఎవరుకూడా వర్ణించుట

మూనలేదు. భగవంతుడొక్కడే. అతడు నిష్కాముడు, నిరాకారుడు, జన్మనామములులేనివాడు, సచ్చిదానందస్వరూపుడు, పరంధాముడు, విశ్వవ్యాపి అయినను దివ్యశరీమును ధరించి భక్తులను కాపాడుటకు అనేకావతారములలో లీలల నాచరించెను. శ్రీరఘునాథుడు సరళస్వభావుడు, సర్వశక్తిమంతుడు, దీనజనరక్షకుడు. ఇది తెలిసియే బుద్ధిమంతులు శ్రీహరి యశమును కీర్తించి తమ వాణిని పునీతము, సఫలము చేసుకొందురు. ఈ కారణముననే శ్రీరామపాదపద్మములకు శిరసాప్రణమిల్లి శ్రీరఘునాధుని గుణగాన మొనర్చెదను. పూర్వము వ్యాసవాల్మీకి మున్నగు మహాకవులకు, శ్రీరామగుణములను వర్ణించిన ఆధునిక కవులకు, భూత భవిష్యత్ వర్తమాన ప్రాకృత కవులందరికీ నమస్కరించి శ్రీరామకథను గానము చేయుటకు సాహిసించుచున్నాను. తన జలములలో స్నానమాచరించి, ఆ జలమును త్రాగిన వారి పాపములను హరించు గంగాదేవి, తన వైభవమును పలికిన లేక వినినవారి అజ్ఞానమును తొలగించు సరస్వతీదేవి నాకు పూజ్యులు. నా తల్లిదండ్రులు గురువులైన పార్వతీ పరమేశ్వరులకు, దీనబాంధలు దాతలగు శ్రీరామసేవకులకు నమస్కరించి శివపార్వతుల అనుగ్రహముచే శ్రీరామకథను ప్రేమపూర్వకముగా వర్ణించెదను. దీనిని ప్రేమాదరములతో చదివిన, వినిన వారు కలియుగ పాపముల నుండి విముక్తులై సౌభాగ్యవంతులై శ్రీరామపాద ధ్యానానందమును అనుభవింతురు. శ్రీశివపార్వతుల అనుగ్రహము వలన గ్రామ్యభాషలో వ్రాసినను ఈ కవిత మిక్కిలి ప్రభావము కలిగియుండును.

కలియుగ పాపములను కడిగివేయు సరయూనది ప్రవహించు అయోధ్యాపురికి, అందలి జనులకు నమస్కరింతును. దశరథునికి, పుణ్యమూర్తులైన అతని సతీమణులకు ప్రణమిల్లుదును. వారి పుత్రుని సేవకునిగా నన్ను కృపజూతురుగాక! శ్రీరామచంద్రునిపై ప్రగాఢ ప్రేమను కలిగిన జనకమహారాజునకు, భరతునకు నమస్కరించెదను.



శ్రీరాముని కీర్తియనెడు నిర్మల పతాకమునకు దండమువంటివాడు, ఆదిశేషుడు, కృపాసింధువైన లక్ష్మణుడు నాకు ప్రసన్నుడగుగాక! రిపుసూదనుడు, సుశీలుడు సదా భరతుని అనుగమించువాడు శత్రుఘ్నుడు నన్ను బ్రోచుగాత!

ఎవరి వైభవమును సాక్షాత్తు శ్రీరామచంద్రుడే పొగిడెనో అట్టి పరిపూర్ణజ్ఞాని, రాక్షసవనమునకు అగ్ని వంటివాడు, తన హృదయములో సదా రాముని ధరించినవాడు, వాయుపుత్రుడైన ఆంజనేయస్వామికి నా అభివాదములు. సుగ్రీవుడు మొదలగు వానర వీరులకు, రాక్షస రాజైన విభీషణునికి నమస్కారము. శుకయోగికి, సనకాది మహామునులకు, నారదాదిఋషులకు, భక్తులకు, పండితులకు, నమస్కరించెదను.

జనకసుత, జగజ్జనని, కరుణామయుడైన శ్రీరాముని ప్రియతమ అయిన జానకిదేవి చరణకమలములకు మ్రొక్కెదను. సర్వశక్తిసంపన్నుడు, కమలనయనుడు, ధనుర్బాణధారి, భక్తుల క్లేశములను హరించి సుఖమునొసంగువాడైన శ్రీరామచంద్రునికి మరల మనోవాక్కాయ కర్మలచే వందనమాచరింతును. శబ్దము – అర్థము, జలము – తరంగములు వేర్వేరుగా కనపడినను వాస్తవముగా ఒక్కటియైనట్లు శ్రీసీతారాములు ఒక్కటిగా నన్ను బ్రోచుగాక!

సూర్య, చంద్ర, అగ్ని ప్రకాశములకు కారణము, సృష్టి స్థితి లయ కారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల రూపము, వేదములకు ప్రాణము, నిర్గుణము గుణనిదానమైన రామనామమునకు నమస్కారము. రామనామ మహామంత్రమును పరమశివుడు సదా జపించుటయేగాక, కాశీలో చనిపోవువారికి ఉపదేశించుటచే వారికి ముక్తి లభించుచున్నది. రామనామము వలన శ్రీ గణేశునికి ప్రథమ పూజార్హత లభించెను. ఆదికవి పునీతుడాయెను. రామనామము విష్ణుసహస్రనామములకు సమానము. రామనామము ఈ లోకమున లాభము, పరలోకమున ముక్తిని ప్రసాదించును. భగవంతుని సగుణ నిర్గుణ రూపములకు

నామము సుందరమైన సాక్షి. జీవన్ముక్తులైన యోగులు నామజపము వలన తత్వజ్ఞానమును పొంది నామరూపరహితమైన అనిర్వచనీయ బ్రహ్మానందమును పొందుదురు. కలియుగములో నామజపము అతి శక్తిమంతమైనది. శ్రీరాముడు స్వయముగా మనుష్యశరీరమును దాల్చి రాక్షసులను వధించి భక్తులను కాపాడెను. కాని రామనామము అనేక కోట్ల దుర్జనుల మనస్సులను మార్చి పవిత్రమొనర్చెను. శ్రీరాముడు కోతుల సహాయముతో సముద్రమును దాటగలిగెను. కాని రామనామము స్మరించినంతనే భక్తులు భవసాగరమును దాటగలుగుదురు. కావున రామనామము రామునికన్న గొప్పది. మహర్షులు, సిద్ధులు, యోగులు, భక్తులు రామనామమును జపించి తరించిరి. కలియుగమునందు రామ నామము కల్పవృక్షము. అట్టి పరమకళ్యాణకారియైన రామనామమును స్మరించి శ్రీరఘునాధునికి శిరసా ప్రణమిల్లి శ్రీరాముని గుణములను వర్ణించెదను. రాళ్లను ఓడలుగా, వానరులను మంత్రులుగా చేసిన శ్రీరామచంద్రుడు సహజముగా మందబుద్ధినైన నన్ను దయతలచి నా ప్రేమను, భక్తిని స్వీకరించును. నా దోషములను గణింపక నా నిర్మల హృదయమును మాత్రమే చూచి సుగ్రీవుని, విభీషణుని అనుగ్రహించినట్లు నన్ను కూడా కరుణించుగాక!

## 4. శ్రీరామచరిత వైభవము

శివుడే మనోహరమైన ఈ కథను రచించి దయతో పార్వతీదేవికి వినిపించెను. అదే కథను శివుడు రామభక్తుడైన కాకభుశుండికి వినిపించెను. అతడు యాజ్ఞవల్క్యమునికి తెల్పగా అతడు భరద్వాజ మునికి వినిపించెను. వీరిద్దరు విజ్ఞానులు, సమదర్శినులు. శ్రీహరి లీలలను తెలిసినవారు. నేనదేకథను సూకర క్షేత్రమున నా గురువుగారి నుండి మాటిమాటికి విని నా బుద్ధిననుసరించి కొద్దిగా గ్రహించినాను. దానిని సరళ భాషలో కవితాబద్ధము చేసి ఆనందించెదను. నా అల్పబుద్ధివివేకము శ్రీహరిప్రేరణ లేకున్న ఈ రచన చేయజాలదు.

శ్రీరామకథ అందరికీ ఆనందము నిచ్చునది. కలియుగ పాపములను హరించునది, జీవులకు ముక్తిని ప్రసాదించునది.

శ్రీరామగుణసమూహము జగత్ కళ్యాణకారకము, జ్ఞానవైరాగ్య యోగములను ప్రసాదించునది. పాపసంతాపశోకములను నాశనము చేయునది. అజ్ఞానాంధకారమును పారద్రోలునది. శ్రీరామచరితము సంపూర్ణ పుణ్యఫలస్వరూపము. శ్రీరామచంద్రుడు అనంతుడు. అతని గుణములు అనంతములు. అతని కథలు అపారమైనవి. ఏ విధముగా పార్వతీదేవి శివుని ప్రశ్నించినది, ఏవిధముగా మహేశ్వరుడు వివరముగా సమాధానమిచ్చినది ఒక విచిత్ర కథాప్రబంధముగా వ్రాసి గానము చేసెదను. నా గురువుగారి చరణకమలరేణువులను శిరస్సున ధరించి, మరల అందరికి చేతులెత్తి నమస్కరించి, నా కథా రచనలో దోషములు రాకుండుగాకయని ప్రార్థించుచు భక్తితో మహేశ్వరునికి శ్రీహరికి ప్రణమిల్లి పదహారువందల ముప్పయి ఒకటో సంవత్సరమున (1574 AD) పవిత్రమైన రామకథను తెలిపెదను.

చైత్రమాసము, నవమి, మంగళవారము నాడు అయోధ్యానగరమున ఈ కథ ప్రారంభమయ్యెను. శ్రీరాముని జన్మదినము నాడు సర్వతీర్థములు అయోధ్యను చేరునని వేదములు తెలుపుచున్నవి. దేవతలు, అసురులు, పక్షులు, మనుష్యులు, మునులు వచ్చి శ్రీరఘునాథుని సేవింతురు. ఆ దినము సజ్జనసమూహములు గుంపులుగా వచ్చి పవిత్ర సరయూనదియందు స్నానమాచరింతురు. శ్రీరాముని మనసున ధ్యానించి నామమును జపింతురు. సరయూనది దర్శనము స్పర్శ, స్నానము, జలపానము పాపములను హరించును. సుందరమైన అయోధ్యానగరము శ్రీరామచంద్రుని వైకుంఠము, పరమ పవిత్రము. నేనీ కథను ఇచ్చటనే ప్రారంభించినాను. ఈ కథపేరు 'రామచరితమానసము', అనగా శ్రీరాముని చరిత్రయను మానససరస్సు. [illegible]

కాలిపోవు మనస్సు ఈ సరస్సులో మునిగినంతనే సుఖమును పొందును. శివుడు దీనిని రచించి తన మనస్సులో స్మరించి ప్రసన్నుడాయెను. తగిన సమయమును చూచి పార్వతిదేవికి వినిపించెను. అందువలన దీనిని 'రామచరితమానసము' అని పిలిచెను.

శంభుని కృపచే ఒక మధురభావన తులసీదాసును రామచరిత మానస రచనకై ప్రోత్సహించెను. ఈ రచయిత తన బుద్ధిననుసరించి మనోహరముగా రచించెను. ఇందలి ఏడు కాండములు ఈ మానస సరోవరపు మెట్లు. వీనిని జ్ఞాననేత్రములతో చూచినంతనే మనస్సు ప్రసన్నమగును. శ్రీ రఘుపతి నిర్గుణ మహిమ అగాధమైన ఈ నీటి లోతు. ఇందులో వర్ణించబడిన శ్రీ సీతారాముల వర్ణన అమృతతుల్య మైన జలము. ఉపమాలంకారములు మనోహరతరంగములు. వివిధ కవితాయుక్తులు ఇందలి ముత్యపు చిప్పలు, సుందరమైన ఛందస్సులు, దోహాలు అనేక రంగులతో శోభిల్లు కమలములు. అనుపమార్థములు, సుందరభావములు, ఉన్నత భాష ఇందలి పరాగ మకరంద సుగంధములు. ఇందలి పుణ్యసమూహములు తుమ్మెదల గుంపులు. జ్ఞానవైరాగ్య విచార చర్చలు హంసలు. కవిత యందలి ధ్వని వక్రోక్తి గుణజాతులు మనోహరమైన చేపలు. ధర్మార్థకామమోక్షములు, జ్ఞాన విజ్ఞాన చర్చలు, కావ్యమునందలి నవరసములు, జపతపయోగవైరాగ్య ప్రసంగములు – ఇవన్నియు ఇందలి సుందర జలచరములు. పుణ్యాత్ములు, సాధువులు చేయు శ్రీరామనామ గుణవర్ణణలు ఇందలి జలపక్షులు. సాధు జనుల సమావేశములు నాలుగు వైపులగల మామిడి తోపులు. శ్రద్ధ వసంత ఋతువుతో సమానము. అనేక ప్రకారములైన భక్తినిరూపణలు, క్షమ, దయ, ఇంద్రియ నిగ్రహము అను గుణములు ఇందలి లతావితానములు. మనోనిగ్రహము, యమ, నియమములు ఇందలి పుష్పములు. జ్ఞానమే ఫలము. శ్రీహరి చరణకమలములపై గల భక్తి ఈ జ్ఞాన ఫలమునందలి మధురరసము. ప్రసంగవశమున చెప్పబడిన ఇతర విషయములు, కథలు ఇందలి చిలుకలు, కోయిలలు మొదలగు అనేక పక్షులు.

ఈ కథా శ్రవణము వలన కలుగు రోమాంచము సుందర పుష్పవాటిక లేక ఉద్యానవనము. సుఖమే ఇందలి పక్షుల విహారము. నిర్మలమైన మనస్సే తోటమాలి. అతడు తన సుందర నేత్రములనెడి కుండలతో ప్రేమయనెడి జలమును ఈ తోటకు పోయును. ఈ కథను శ్రద్ధగా గానము చేయువారు ఈ సరోవరమునకు రక్షకులు. సాదరముగా విను స్త్రీపురుషులు దేవతా స్వరూపులైన అధికారులు. అత్యంత దుష్టులు, విషయలోలురు అగు దౌర్భాగ్యులు కొంగలతో, కాకులతో సమానము. వారీ సరోవర ప్రాంతమునకు రారు. యేలయనగా నత్తలు, కప్పలు, నాచు లాంటి విషయవాంఛాప్రసంగములు ఇందు లేవు. శ్రీరాముని కృపలేనిదే ఎవరు ఈ సరస్సును చేరలేరు. సాంసారిక కార్యకలాపములను దుర్గమ పర్వతములను, మోహము, మదము, అభిమానము అను గహనారణ్యములను, వివిధ కుతర్కములను నదులను దాటి ఈ సరోవరము చేరవలెను. ఎవరిపైన శ్రీరామచంద్రుని కృపాదృష్టికలదో వారీ విఘ్నములను అధిగమించగలరు. సాదరముగా ఈ సరోవరమున స్నానమాడి తాపత్రయములనుండి రక్షింపబడుదురు. ఇందు స్నానమాడగోరువారు శ్రద్ధతో సజ్జనుల సాంగత్యము చేయవలెను.

ఇట్టి మానససరోవరమునుండి శ్రీరామయశోవైభవమను జలధార ప్రవహించెను. ఇదియే సరయూనది. ఇది సకల శుభములకు కూడలి. లౌకిక వైదిక మతములు దీని సుందర తీరములు. మానస సరోవర పుత్రికయైన ఈ సరయూనది ప్రవాహమున గడ్డిపోచలవంటి చిన్నవి, మహా వృక్షములవంటి పెద్దవి అయిన కలియుగ పాపములన్నియు సమూలముగా పడిపోవును. ఈ నదీ తీరమునగల శ్రేష్ఠమైన పట్టణము అయోధ్య. ఇది సాధుజనులతో కూడి నిరుపమానమై సర్వశుభములకు నిధి. సుయశోరూపియైన సరయూనది శ్రీరామభక్తి అనెడి గంగను చేరును. తర్వాత అనుజుడైన లక్ష్మణుడితో కూడిన శ్రీరాముని ప్రతాపయశోరూపమైన శోణనదము దీనితో చేరును.

సరయూ శోణనదుల మధ్య ప్రవహించు భక్తి రూపియైన గంగానది జ్ఞానవైరాగ్యములతో కూడి యుండును. తాపహారిణులు అయిన మూడు ప్రవాహములు ఒక్కటిగా శ్రీరాముడు అను సముద్రమును చేరును.

శ్రీరాముని యశస్సనెడి సరయూనది శ్రీరామచరితమను మానస సరోవరమునుండి బయలుదేరి రామభక్తియనెడి గంగా ప్రవాహముతో కలిసినది. దీనిని వినుటచే సజ్జనుల మనస్సులు పవిత్రమగును. శ్రీరామచంద్రుని జన్మదిన శుభాకాంక్షలు నదీతరంగశీకరములు. నలువురు సోదరుల బాల్య చేష్టలే ఇందలి కమలములు. శ్రీ సీతాదేవి స్వయంవరమను సుందర కథ ఈ నదికి శోభకూర్చును. అనేక వివేక పూరిత ప్రశ్నలు పడవలు. వాటి సమాధానములే నావికులు. పరశురాముని కోపము ఇందలి భయంకరమైన సుడిగుండము. శ్రీరాముని శ్రేష్ఠమైన వచనములు సుబద్ధ ఘట్టములు. శ్రీరాముని, అతని సోదరుల వివాహ మహోత్సవములు ఈ నదికి వరదలు. ఈ నదియందు స్నానమాచరించు వారు పుణ్యాత్ములు. కైకేయి దుర్బుద్ధియను తుంగచెట్ల వలన సంభవించిన ఘోర విపత్తు నిర్మలమైన భరతుని చరిత్రలో శాంతమైనది.

శ్రీరామ వైభవమను ఈ నది ఆరు ఋతువులందు అన్ని వేళలను శోభాయమానముగా నుండును. శివపార్వతుల వివాహము హేమంత ఋతువు. శ్రీరామజన్మోత్సవము సుఖదాయకమైన శిశిరఋతువు. శ్రీరామవివాహమహోత్సవ వర్ణన, ఋతురాజైన వసంతము. శ్రీరాముని వనగమనము గ్రీష్మఋతువు. వనములో సంచారమును వర్ణించు కథలు తీవ్రమైన సూర్యతాపము మరియు గాలి. భయంకరమగు రాక్షసులతో చేసిన యుద్ధము వర్షఋతువు. ఇది దేవతలను పంటపొలాలకు సుఖప్రదమైనది. శ్రీరాముని రాజ్యపాలనమునందలి సుఖము, వైభవము మనోహరమైన శరదృతువు.

పతివ్రతాశిరోరత్నమైన సీతాదేవి గుణముల వర్ణన ఈ నదీజలముల నిర్మలత్వము. భరతుని స్వభావము ఈ నది శీతలత్వము. నలుగురు సోదరుల భ్రాతృప్రేమ ఈ నీటి మాధుర్యము. సుగంధము. ఈ నీరు కామ క్రోధాది శత్రువులను పారద్రోలి నిర్మల వివేక వైరాగ్యములను కలిగించును. స్నానమొనర్చి పానము చేసినవారి హృదయమునందలి పాపతాపములను హరించును. శ్రీరామయశమనెడి ఈ నది నీటిలో తమ హృదయములను కడుగనివారు విషయవాంఛలకై పరుగెత్తుచూ, మృగతృష్ణకై పరుగెత్తు జింకలవలె నిరాశతో తిరిగివచ్చి దుఃఖింతురు.

## 5. యాజ్ఞవల్క్య - భరద్వాజ సంవాదము

ఈ ఉత్తమ జలముల గుణములను నా బుద్ధి ననుసరించి పొగడి, ఆ జలములందు మనస్సుతో స్నానమాడి శివపార్వతులను స్మరణచేసి తులసీదాసను పేరుగల నేను ఈ సుందర కథను వినిపించుచున్నాను. శ్రీరఘురాముని చరణకమలములను నా హృదయమున నిడుకొని అతని కృపను పొంది మునిశ్రేష్ఠులైన యాజ్ఞవల్క్య భరద్వాజుల సంవాదమును తెలిపెదను.

భరద్వాజముని ప్రయాగలో నివసించెను. ఆయన తపస్వి. శమ దమ దయా నిధానమును. శ్రీరామచరణామృతపిపాసి, పరమార్థమార్గమున మిక్కిలి నిపుణుడు. తీర్థరాజమైన ప్రయాగను మాఘమాసమున సూర్యుడు మకర రాశిలో ప్రవేశించినప్పుడు జనులందరు దర్శింతురు. త్రివేణీ సంగమమున స్నానమాచరించి, వేణుమాధవుని పాదపద్మములను పూజించి, అక్షయవటమును స్పృశించి పులకితులయ్యెదరు. ప్రయాగలోని భరద్వాజ ఆశ్రమము అతి పవిత్రమైనది, రమణీయమైనది. మునివరుల మనస్సును దోచునది. త్రివేణిలో స్నాన మాచరించిన ఋషులు భరద్వాజాశ్రమమున సభ చేసి శ్రీవారి గుణములను గూర్చి ముచ్చటింతురు. గురువులు తమ గోష్ఠి యందు బ్రహ్మనిరూపణము, ధర్మవిధానములు, తత్త్వ విభాగములు

చర్చింతురు. ఈ విధముగా ప్రతి సంవత్సరము మాఘమాసము అంతయు గడిపి తమ ఆశ్రమములకు పోవుదురు. ఒకసారి మునులందరు మకర స్నానముల తర్వాత తమ ఆశ్రమములకు పోయిరి. కాని భరద్వాజ ముని పరమ జ్ఞానియైన యాజ్ఞవల్క్యముని పాదములకు నమస్కరించి, అతనిని తన ఆశ్రమముననే నిలుపుకొనెను. అతని చరణకమలములను సాదరముగా కడిగి, ఉన్నతాసనమున కూర్చుండబెట్టి భరద్వాజుడు తన మృదుమధుర వాక్కులతో నిట్లనెను: "హే ప్రభూ! మీరు సర్వవేదాలను ఎరిగినవారు. నాకు ఒక సందేహము కలదు. దానిని అడుగుటకు భయము, సిగ్గు కలుగుచున్నవి. అడుగక పోయినచో మరల అవకాశము లభించదు. ఏ విషయమునైనను గురువునుండి దాచినచో నిర్మల జ్ఞానము కలుగదు. కావున దయచేసి నా సందేహనివృత్తి చేయండి. సజ్జనులు, పురాణములు రామనామమహిమ అపారమైనదని శ్లాఘించినవి. కళ్యాణ స్వరూపుడు, అవినాశి అయిన శంకరుడు సదా రామనామము జపించును. ప్రభూ! ఈ రాముడెవరు? ఒక రాముడు అయోధ్యాపతియైన దశరథుని కుమారుడు. భార్యావియోగముచే అపార దుఃఖమును పొంది చివరకు యుద్ధములో రావణుని సంహరించెను. అతని చరిత్ర జగద్విదితము. శివుడు నిరంతరము జపించునది ఈ రాముడేనా? లేక మరొకరా? మీరు సత్యవ్రతులు, సర్వజ్ఞులు. నా సందేహమును నివృత్తి చేయండి."

యాజ్ఞవల్క్య మహర్షి చిరునవ్వుతో ఇట్లనెను: "శ్రీరాముని వైభవము మీకిదివరకే తెలియును. మీరు మనోవాక్కర్మలచే శ్రీరాముని భక్తులు. శ్రీరాముని గుణగణములను మరల వినగోరి ఈ ప్రశ్న నన్నడిగినారు. ఇదే సందేహము పార్వతీదేవి ప్రకటించగా మహాదేవుడు రామకథను వర్ణించెను. ఇప్పుడు నేను నా బుద్ధిననుసరించి శివపార్వతుల సంవాదమును వినిపించెను. ఆ సంవాదము ఎప్పుడు ఎందుకు జరిగినది వినండి:"

త్రేతాయుగమున ఒకసారి శివుడు అగస్త్యుని వద్దకు పోయెను. జగజ్జనని అయిన భవాని సతీదేవి కూడా అతనిని అనుసరించెను. మహర్షి శంకరుని పూజించి శ్రీరామకథను వినిపించెను. సుందరమైన హరిభక్తిని గూర్చి శివుడు అగస్త్యునికి వర్ణించి చెప్పెను. ఆవిధముగ హరి గుణములను వినుచూ, వినిపించుచూ శివుడు కొంతకాలము అక్కడ గడిపెను. పిదప ఋషి ఆజ్ఞను తీసుకొని శివుడు కైలాసమునకు చనెను. దక్షకుమారి అయిన సతీదేవి కూడా వెంటపోయెను. అదే సమయమున భూభారమును అణచుటకు శ్రీహరి రఘువంశమున అవతారము దాల్చెను. తండ్రియైన ధశరథుని ఆజ్ఞతో రాజ్యత్యాగము చేసి ప్రభువు దండకారణ్యమున ముని వేషముతో సంచరించుచుండెను. "నేనెట్లు శ్రీహరి దర్శనము చేసికొనగలను? ప్రభువు మారు రూపమున అవతారమెత్తినాడు. నేనటు పోయినచో అందరూ అతనిని గుర్తింతురు" అని మహాదేవుడు ఆలోచించుచు పోయెను. సతీదేవికి ఈ విషయము తెలియదు.

"రావణుడు మానవుని చేతిలోనే చావును వరముగా బ్రహ్మనుండి పొందెను. శ్రీహరి బ్రహ్మవాక్కును సత్యమొనర్చును. నేనిప్పుడు చూచుటకు పోయినచో పాశ్చాత్తాప పడెదరు"– మహాదేవుడు ఈ విధముగా ఆలోచించుచుండెను. ఎట్టి ఉపాయము తోచలేదు. ఇంతలోనే నీచుడైన రావణుడు మారీచుని సహాయముతో మోసముతో వైదేహిని అపహరించెను. మాయామృగమును వధించి శ్రీరాముడు లక్ష్మణునితో ఆశ్రమమునకు వచ్చి నిర్జనమైన ఆశ్రమమును చూసి సామాన్య మానవుని వలె విరహవ్యాకులుడయ్యెను. ఎన్నడూ సంయోగవియోగములను, హర్షవిషాదములను ఎరుగని శ్రీహరి విరహ దుఃఖమును పొందెను. ఆ సమయమున శివుడు శ్రీరాముని జూచెను. హృదయము ఆనందముతో పులకరించెను. కాని తానెవరో చెప్పుటకు అది సమయము కాదని మిన్నకుండెను. "ఓ జగత్

కళ్యాణకర్త! సచ్చిదానందరూప! నీకు జయమగుగాక!" అని పల్కుచు పరమశివుడు ఆనందముతో పులకరించుచుండెను.

## 6. సతీదేవి సందేహము

సతీదేవి శంకరుని ఈ స్థితిని చూసి "శివుడు జగత్ పూజ్యుడు, జగదీశుడు అయినను ఒక రాజకుమారుని సచ్చిదానందా, పరంధామా అని సంబోధించి ప్రణమిల్లెను. అతని సౌందర్యమును చూచి ప్రేమమగ్నుడైనాడు. దీనికి కారణమేమి?" అని తనలో తాను ఆలోచించుకొనెను. "సర్వవ్యాపి, అజుడు, మాయాతీతుడు, వేదములు కూడా తెలిసికొనలేని పరబ్రహ్మ మానవదేహమును ధరించునా? ఒకవేళ విష్ణుమూర్తి దేవతలను రక్షించుటకు మానవ దేహము ధరించినచో, త్రిపురారి అయిన శంకరుని వలె శ్రీహరి కూడా సర్వజ్ఞుడు కదా! అట్టి జ్ఞానఖని, లక్ష్మీపతి. అజ్ఞాని వలె భార్యను వెదకుచు తిరుగునా? మరి సర్వజ్ఞుడు అయిన శివుని వాక్కు అసత్యము కానేరదు"– ఈ విధముగా ఆమె మనసు పరిష్కరించలేని సందేహముతో నిండిపోయెను. భవాని మౌనముగా నున్ననూ శివుడు అంతర్యామి కావున ఆమె మనస్సులోని సందేహమును తెలిసికొని ఇట్లనెను: "సతీ, నీది స్త్రీ స్వభావము. ఇట్టి సందేహమును మనస్సులో నుంచుకోరాదు. అగస్త్యుడు ఎవరి కథను వినిపించెనో, ఎవరి భక్తిని గూర్చి నే నతనికి వివరించినానో, నా ఇష్టదైవమైన రఘువీరుడతడే. మునులు, యోగులు, సిద్ధులు నిరంతరము ఎవరిని ధ్యానించెదరో, వేద పురాణ శాస్త్రములు "నేతి, నేతి" అని ఎవని కీర్తిని గానము చేయునో, ఎవరు సర్వ వ్యాపకుడైన బ్రహ్మ, సమస్త లోకములకు స్వామియో, నిత్యుడైనవారో ఆ భగవంతుడే ఈ శ్రీరాముడు. భక్తులను రక్షించుటకు రఘువంశమున అవతారము నెత్తెను."

పరమశివుడు అనేక మార్లు చెప్పిననూ ఆ ఉపదేశము సతీదేవి మనస్సున నాటలేదు. ఇది విష్ణుమాయ అని తెలిసికొని శివుడు చిరునవ్వుతో యిట్లనెను: "నీ మనస్సున సంశయము ఉన్నచో నీవే వెళ్ళి సంశయనివృత్తి చేసికొనుము. నీవు తిరిగి వచ్చు వరకు నేనీ వటవృక్షపు నీడలో కూర్చొని యుందును." పరమశివుని ఆజ్ఞను పొంది సతీదేవి కార్యోన్ముఖురాలయ్యెను. శ్రీరాముని దివ్యత్వమునెట్లు పరీక్షించవలెను? అని ఆలోచించసాగెను. అక్కడ శివుడొక నిర్ణయమునకు వచ్చెను. 'దక్షపుత్రికయగు సతీదేవికి ఏదో ఆపద రానున్నది. నేను నచ్చచెప్పినప్పటికీ ఆమె సందేహము దూరము కాలేదు. ఇది విధివైపరీత్యము. శ్రీరాముని సంకల్పమే జరిగి తీరును.' అని శివుడు శ్రీహరినామజపము చేయుచూ కూర్చుండెను.

సతీదేవి మాత్రము శ్రీరాముడున్న చోటుకు పోయెను. మనస్సులో చాలా ఆలోచించిన తర్వాత సతీదేవి సీతాదేవి రూపము ధరించి శ్రీరాముడు వచ్చు మార్గమున ముందుకు నడిచెను. లక్ష్మణుడు మారువేషముననున్న సతీదేవిని చూచి చకితుడై ఏమియు మాట్లాడ లేకపోయెను. సర్వవ్యాపి, సర్వజ్ఞుడైన శ్రీరాముడు ఆమె సతీదేవి అని గ్రహించి అంజలి ఘటించి ప్రశ్నించెను: "పరమశివు డెక్కడ తల్లీ? ఒంటరిగా ఈ అడవిలో సంచరించుటకు కారణమేమి?" శ్రీరాముని కోమలమైన వచనములు విని సతీదేవి హృదయము తల్లడిల్లెను. "నేను పరమేశ్వరుని మాటలను లెక్కచేయక శ్రీరామచంద్రుని ముందట నా అజ్ఞానమును ప్రదర్శించినాను. నేను శివునితో ఏమని తెలుపగలను?" అని తలంచినంతనే సతీదేవి హృదయమున భయము, సంతాపము ఉత్పన్నమాయెను.

శ్రీరాముడు సతీదేవి భయాందోళనలను తెలుసుకొని తన మహిమను చూప దలిచెను. ఆమె తాను వెళ్లు మార్గమున

ఆశ్చర్యమునొకను చూచెను. శ్రీరాముడు, సీతాలక్ష్మణులతో కలిసి తనకంటే ముందుగా పోవుచుండెను. వెనుకకు తిరిగి చూచినచో అక్కడ కూడా సీతారాములే కనపడిరి. ఎటువైపు చూచిననూ ప్రభువు సిద్ధులతో, మునీశ్వరులతో కూడి యుండెను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, సకల దేవతలు, శ్రీరామచంద్రుని చరణములకు మ్రొక్కి సేవించుచుండిరి. దేవతలు అనేక రూపములతో వారి భార్యలతో సహా శ్రీరాముని సేవించుచుండిరి. సకల చరాచర ప్రపంచమును సర్వప్రాణికోటిని ఆమె తిలకించెను. ఎక్కడ చూచిననూ సీతారామలక్ష్మణులనే చూచి ఆందోళిత చిత్తముతో, దేహస్మృతి కోల్పోయి కండ్లు మూసుకొని మార్గమధ్యమున కూర్చొనెను. మరల కన్నులు తెరచినంతనే ఏమియు కనపడలేదు. మాటిమాటికీ సీతారాములను స్మరించుచు శివుడున్న చోటికి వచ్చెను.

సమీపమునకు రాగానే మహాదేవుడు "ప్రభువును ఎట్లు పరీక్షించితివి?" అని ప్రశ్నించెను. శ్రీరాముని శక్తిని తెలుసుకొన్న సతీదేవి "స్వామీ! నేనేమీ పరీక్షించలేదు. అక్కడకు పోయి మీ వలెనే శ్రీరామునికి నమస్కరించినాను. మీ వచనము అసత్యము కానేరదు. మీపై పూర్తిగా విశ్వాసము గలదు" అని పల్కెను. శివుడు ధ్యానముద్ర వహించి సతీదేవి చేసిన పని అంతయు తెలిసికొనెను. సతీదేవి అసత్యమాడుట కూడా శ్రీరాముని మాయ తప్ప వేరుకాదని తలంచెను. సతీదేవి సీతాదేవి రూపమును ధరించుటను తెలుసుకొని శివుడు చాలా విచారించెను. "నే నిపుడు ఈమెను దాంపత్యప్రేమతో చూచిన నా భక్తి మార్గము నాశమగును. నేను పాపము చేసినవాడిని అగుదును. సతీదేవి పరమపవిత్రమైనది. ఆమెను వీడలేను, ప్రేమించలేను" అని శివుడు సంతాప హృదయముతో ఏమియు మాట్లాడక యుండెను.

## 7. పార్వతీ జననము

పరమశివుడు "సతీదేవిని ఈ శరీరముతో దాంపత్య భావముతో చూడను" అని నిశ్చయించుకొని శ్రీరాముని స్మరించుచు కైలాసమునకు పోయెను. అపుడు మనోహరమైన ఆకాశవాణి వినిపించెను. "మహాదేవా! మీకు జయము. మీరు భక్తితో మంచి నిర్ణయము తీసుకున్నారు. మీరు రామభక్తులు, సమర్థులు, దైవస్వరూపులు. మీరు తప్ప యిట్టి ప్రతిజ్ఞ నెవరు తీసుకోగలరు?" ఆకాశవాణి వాక్యమును విని సతీదేవి భీతిల్లి సంకోచముతో శివునడిగెను: "హే కృపాళు! మీరే ప్రతిజ్ఞ చేసితిరి? మీరు సత్యస్వరూపులు, దయానిధులు"– సతీదేవి ఎంత అడిగినను శివుడు ఏమియూ సమాధానము చెప్పలేదు. ఆమె మనస్సులో అనుమానము కలిగెను. "సర్వజ్ఞుడైన శివుడంతయు తెలుసుకొన్నాడు. నేను శంకరుని మోసగించితిని. మూర్ఖురాలిని, అవివేకిని. ప్రేమస్వరూపమును తెలుసుకోలేదు. పరమశివుడు గంభీరుడు, కృపాసముద్రుడు. నా అపరాధమును గూర్చి ఏమియూ అనలేదు" అని తలపోసెను. శివుని ముఖములో మార్పును గమనించి ప్రభువు తనను పరిత్యజించినాడని తలచి వగచెను. తన తప్పిదమును యోచించి పరితాపమునొందెను.

సతీదేవి హృదయము అనుదినము విచారముతో బరువెక్కుచుండెను. "ఈ శోక సముద్రమును ఎట్లు దాటగలను? నా భర్త మాటలు అసత్యములని భావించి శ్రీ రఘురాముని అవమాన పరిచితిని. విధాత నాకు విధించిన శిక్షకు నేనర్హురాలను" అని ఆలోచించుచూ శ్రీరాముని మనస్సులో స్మరించి ప్రార్థించెను. "ప్రభూ! నీవు దయానిధివి, నీకు ప్రణామములు. నేను నిజముగా శివుని చరణకమలములనే నమ్మినచో, మనోవాక్కర్మలచే పతివ్రత నయినచో ఈ ప్రాణములు పోవుగాక! సర్వసాక్షీ! ప్రభూ! ఏదైన ఉపాయముచే నేను నా శరీర త్యాగము

చేయగలిగి శ్రమలేకుండా పతి వియోగ బాధనుండి విముక్తురాలగునట్లు నన్ను అనుగ్రహింపుము."

ఈ విధముగా సతీదేవి దారుణ దుఃఖమును అనుభవించెను. ఎనభైఏడువేల సంవత్సరములు గడిచెను. శివుడు ధ్యానము నుండి మేలుకొనెను. సతీదేవి అతని పాదములకు మ్రొక్కెను. శివు డామెను ఎదుట ఒక ఆసనముపై కూర్చుండ నాజ్ఞాపించి శ్రీహరి కథలను వినిపించసాగెను. అప్పటికి సతీదేవి తండ్రియగు దక్షుడు ప్రజాపతి ఆయెను. ఆ పదవికి తగిన వాడని నిర్ణయించి బ్రహ్మ అతనిని నియమించెను. ఉన్నత పదవి లభించగానే దక్షుడు దురభిమాని అయ్యెను. మునులందరినీ పిలిపించి గొప్ప యజ్ఞము నారంభింపచేసెను. యజ్ఞభాగములు స్వీకరించుటకు దేవతలందరినీ ఆహ్వానించెను. కాని, శివుని మాత్రము ఆహ్వానించలేదు. దేవతలందరు భార్యలతో సహా తమ విమానములను ఎక్కి ఆకాశమున పోవుట చూచి సతీదేవి ఈ కోలాహలమునకు కారణమేమని మహాదేవుని అడిగెను. శివుని వలన తన తండ్రి చేయబోవు యజ్ఞమును గూర్చి విన్న సతీదేవి సంతోషించి ఇట్లు ఆలోచించెను: "మహాదేవుడు అనుమతించిన ఈ నెపముతో నేను కొన్ని రోజులు నా తండ్రిగారి ఇంట్లో ఉండవచ్చును." పతిపరిత్యాగఖేదము ఆమెను బాధించుచుండెను. భయసంకోచములతో ప్రేమ పూరిత వాక్కులను పలికెను: "నా తండ్రిగారి ఇంట్లో గొప్ప వేడుక జరుగుచున్నది. ప్రభువు దయతో అనుమతించిన నేను వెళ్ళి చూచెదను." పరమేశ్వరుడు ఇట్లనెను: "నీ మాట బాగుగనే వున్నది. నాకునూ సమ్మతమే. కాని మీ తండ్రి దక్షుడు తన కుమార్తెలను అందరిని పిలిచి, నా మీదగల వైరము వలన నిన్ను మాత్రము పిలువలేదు. ఒకసారి బ్రహ్మసభయందు నాతో మీ తండ్రి అప్రసన్నుడాయెను. అందువలన ఇప్పుడు నన్ను అవమానించుచున్నాడు. భవానీ! ఆహ్వానించకుండ పోయినచో మన

ఆత్మగౌరవము, ప్రేమాభిమానములు నష్టమగును. స్నేహితుడు, యజమాని, తండ్రి, గురువు – వీరింటికి పిలువకున్న పోవచ్చును. కాని ఎక్కడయితే ద్వేషము ఉండునో అక్కడికి పోవుట శుభము కాదు." శివుడామెకు అనేక విధముల నచ్చచెప్పెను. నిలుపుటకు అనేక ప్రయత్నములు చేసెను. కాని సతీదేవి పట్టుబట్టెను. భావావేశమున శివుని మాటలు ఆమె చెవికెక్కలేదు. శివుడు తన ముఖ్యగణములను వెంటనిచ్చి ఆమెను సాగనంపెను.

సతీదేవి తండ్రిగారి ఇల్లు చేరగానే దక్షునికి భయపడి ఎవరు కూడా ఆమెను గౌరవముతో చూడలేదు. తల్లి మాత్రము ప్రేమతో ఆహ్వానించెను. చెల్లెండ్రు చిరునవ్వుతో పలకరించిరి. దక్షుడు ఆమె క్షేమసమాచారములు కూడా అడుగలేదు. సతీదేవిపై క్రోధముతో అతని దేహము వణకుచుండెను. సతీదేవి యజ్ఞశాలకు పోయి చూడగా అచట శివుని కర్పించుటకు యజ్ఞభాగము కనిపించలేదు. అపుడు శివుడు చేసిన హెచ్చరిక ఆమెకు అర్థమాయెను. తన స్వామికి జరిగిన అవమానమును తెలుసుకొని ఆమె హృదయము దహించుకపోయెను. ఆమెకు పతి తనను పరిత్యజించినపుడు కూడా అంత దుఃఖము కలగలేదు. తల్లి ఆమెను ఊరడించుటకు ప్రయత్నించెను. కాని తల్లి అనునయ వాక్యములు ఫలించలేదు. సతీదేవి యజ్ఞకార్యక్రమమును ఆపివేసి యజ్ఞశాలలో ఉన్నవారితో యిట్లనెను: "సభాసదులారా, మునులారా! ఎవరయితే శివుని అవమానము చేసినారో లేక విన్నారో వారందరూ దాని ఫలితమును అనుభవించెదరు. త్రిపురారి అయిన పరమేశ్వరుడు జగదాత్మ, జగత్పిత, సర్వశుభంకరుడు. అట్టి శివుని నా తండ్రి మందబుద్ధియై అవమాన పరిచినాడు. అట్టి దక్షునికి జన్మించిన ఈ శరీరమును త్యాగము చేసెదను," అని పల్కుచు సతీదేవి యోగాగ్నిలో భస్మమయ్యెను. అది చూచిన సభికు లెల్లరు హాహాకారములు చేసిరి. సతీదేవి మరణమును విని శివుని గణములు

యజ్ఞమును ధ్వంసము చేయ నారంభించిరి. యజ్ఞనాశనమును చూచి మునీశ్వరుడయిన భృగువు దానిని రక్షించెను. ఆ సమాచారమును వినిన శంకరుడు మిగులక్రుద్ధుడై, వీరభద్రుని పంపెను. అతడు యజ్ఞమునంతను ధ్వంసము చేసి, అచట దేవతలను యథోచితముగా శిక్షించెను. శివద్రోహులకు పట్టు గతియే దక్షునికి కూడా పట్టెను. సతీదేవి చనిపోవుచూ తాను జన్మజన్మలకు శివుని పాదకమలములపై అనురాగము కలుగునట్లు వరమిమ్మని శ్రీహరిని ప్రార్థించెను. ఆ కారణముననే హిమవంతుని గృహములో పార్వతిగా మరల జన్మించెను.

## 8. పార్వతీ తపస్సు

ఉమాదేవి హిమాలయమున జన్మించగానే ఆ ప్రదేశము సకల సిద్ధులకు, సంపదలకు నిలయమాయెను. మును లచట సుందరమైన ఆశ్రమములను నిర్మించుకొనిరి. హిమవంతుడు వారికి యోగ్యమైన స్థానములను ఇచ్చెను. ఆ సుందర పర్వతము నానావిధఫలపుష్ప శోభితములైన వృక్షములతో విరాజిల్లెను. అనేక రకముల మణులు కూడా ప్రకటితమాయెను. నదులు, నిర్మలజలధారలతో ప్రవహించుచుండెను. అన్ని జీవులు సహజ వైరములను మాని పరస్పర ప్రేమతో నివసించుచుండెను. గిరిజాదేవి రాకతో ఆ పర్వతము మిక్కిలి శోభాయమానమాయెను. ప్రతిదినము మంగళకరమైన ఉత్సవములు జరుగుచుండెను, బ్రహ్మాది దేవతలు కూడా హిమాలయ వైభవమును పొగడుచుండిరి. నారద మహర్షి ఈ విషయమును తెలుసుకొని అక్కడికి చనుదెంచెను. పర్వతరాజు అతనిని సాదరముగా అర్ఘ్యపాద్యాదులతో పూజించి ఉచితాసనాసీనునిగా చేసి తన భార్యతో సహా మహర్షి పాదములకు ప్రణమిల్లెను. తన అదృష్టమును పొగడుకొనుచు హిమవంతుడు పార్వతీదేవిని అతని పాదముల కడనుంచి యిట్లనెను: "మహాత్మా! మీరు సర్వజ్ఞులు, త్రికాలవేదులు. కావున బాగుగా యోచించి ఈ బాలిక గుణదోషములను వివరించుడు."

నారదుడు నవ్వి గూఢమై కోమలమైన వాణితో నిట్లనెను: "మీ కుమార్తె సకల సద్గుణరాశి. స్వభావత: సుందరమైనది, సుశీల, మరియు చతుర. ఈమెకు ఉమ, అంబిక, భవాని అనునవి పేర్లు. ఈ కుమారి సర్వసులక్షణ సంపన్న. ఈమె తన పతికి అత్యంత ప్రియురాలగును. ఈమె అచంచలమైన దాంపత్య సుఖమును అనుభవించును. తన తల్లిదండ్రులకు యశమును గూర్చును. ఈ కన్య సకల జగత్తునకు పూజ్యురాలగును. ఈమెను సేవించిన వారికి ఏదియూ దుర్లభము కాదు. ప్రపంచములో ఈమె నామస్మరణచేయు స్త్రీలకు పాతివ్రత్యభాగ్యము దొరకును. కాని గిరిరాజా! ఈమెలో కొన్ని దోషములు కూడా గలవు. ఈమెకు భర్తయగువాడు నిర్గుణుడు, నిరభిమాని, తల్లిదండ్రులు లేనివాడు, ఉదాసీనుడు, సంశయహీనుడు, యోగి, జటాధారి, నిష్కామహృదయుడు, దిగంబరుడు, అమంగళవేషదారి."

నారదమహర్షి పలుకులు విని హిమవంతుడు, అతని భార్య మిగుల దుఃఖించిరి. కాని పార్వతీదేవి మాత్రము ప్రసన్నురాలాయెను. "దేవర్షి వచనములు అసత్యములు కానేరవు" అని తలచి పార్వతీదేవి శివుని పాదపద్మములను తన మనస్సున నిలుపుకొనెను. హిమవంతుడు, అతని భార్య మైనాదేవి మిగుల చింతించి మునీశ్వరుని ఉపాయమును అడిగిరి.- నారదమహర్షి యిట్లు పలికెను: "పర్వతరాజా! బ్రహ్మ లలాటమున లిఖించిన దానిని తప్పింప నెవరికినీ సాధ్యము కాదు. అయినను నేనొక యుపాయము చెప్పెదను. దేవతలు సహకరించిన కార్యసిద్ధి యగును. నేను వర్ణించినట్టి వాడే ఉమకు భర్త కాగలడు. ఇందులో సందేహము లేదు. కాని నేను చెప్పిన దోషము లన్నియు పరమశివునిలో నున్నవి. శివుని ఆమె పరిణయము ఆడినచో ఆ దోషములను జనులందరు గుణములుగా పరిగణింతురు. గంగాజలమున శుద్ధాశుద్ధ జలము ప్రవహించిననూ గంగను అపవిత్రము అని ఎవ్వరూ

అనరు. అట్లే సమర్థులగువారికి ఎట్టి దోషములు ఉండవు. కావున అన్ని విధముల ఈ వివాహము శుభప్రదము. కాని మహాదేవుని సేవ చాల కఠినమైనది. తపస్సు చేత అతడు శీఘ్రముగా సంతుష్టుడు అగును. నీ కుమార్తె శివుని ప్రాప్తికై తపమాచరించిన త్రిపురారి ఆమె అదృష్టమును మార్చగలడు. శివుడు కృపాసముద్రుడు, వరదుడు, శరణన్నవారి క్లేశములు బాపువాడు, భక్తులకు వాంఛిత ఫలములను ఇచ్చువాడు." ఈ విధముగా పలికి పార్వతిదేవిని ఆశీర్వదించి "పర్వతరాజా! భయము వలదు. నీ కంతయు శుభమగును" అని పలికి బ్రహ్మలోకమునకు పోయెను.

నారదుడు పోయిన తర్వాత మైనాదేవి తన భర్తతో ఏకాంతముగా యిట్లనెను: "ప్రభూ! మహర్షి మాటలు నా కర్థము కాలేదు. వరుని కులము, వంశము మన కుమార్తెకు తగినట్లున్నచో వివాహము జరిపించుడు, లేనిచో కన్యగానే ఉండిపోనీయండి. పార్వతి నాకు ప్రాణసమానము. ఆమె వివాహము యోగ్యునితో కానిచో లోకులు పర్వతరాజు స్వభావతః కఠినుడు, మూర్ఖుడు అని అందురు." మైనాదేవి పలుకులు విని హిమవంతుడు యిట్లనెను: "ప్రియా, నిశ్చింతగా భగవంతుని స్మరించుము. పార్వతిని సృష్టించిన వాడే ఆమెకు కళ్యాణము కూడా జరుపును. నీకు నిజముగా కూతురిపై ప్రేమ యున్నచో వెళ్ళి శివునిగూర్చి తపమాచరించుటకు సలహానిమ్ము. నారదుని పలుకులు సాభిప్రాయములు, సకారణములు. శివుడు సకల సద్గుణ సంపన్నుడు, నిష్కళంకుడు." భర్త మాటలు విని మైనాదేవి సంతోషించి పార్వతి వద్దకు పోయెను. కాని ప్రేమతో ఆమె కంఠము గద్గదమై ఏమియు మాట్లాడలేకపోయెను. ఆమెను తన వడిలో కూర్చుండబెట్టుకొని హృదయమునకు హత్తుకొనెను. అపుడు జగజ్జనని భవాని మృదుమధురముగా యిట్లనెను: "అమ్మా, వినుము. నేను చూచిన స్వప్నమును తెలిపెదను. ఒక అందమైన తెల్లని శ్రేష్ఠ

బ్రాహ్మణుడు నాకు ఉపదేశించెను. ఓ శైలకుమారీ! నారదుని పలుకులు ముమ్మాటికి సత్యము. తపస్సు సుఖప్రదమై బాధలను పాపములను హరించును. ఈ ప్రపంచమును బ్రహ్మ సృష్టించుటకు, విష్ణువు పాలించుటకు, శివుడు లయమొందించుటకు, శేషుడు ఈ భూమిభారమును మోయుటకు వారి తపోబలమే కారణము. భవానీ! ఈ సృష్టికంతకు తపస్సే ఆధారము. ఇది గ్రహించి నీవు తపస్సు చేయుము." ఈ మాటలు విని తల్లి మిగుల ఆశ్చర్యము నొందెను. హిమవంతునితో ఈ స్వప్న వత్తాంతమును వినిపించెను. మాతాపితరులను అనేక విధముల అనునయించి ఉమాదేవి తపస్సునకై బయలుదేరెను. వ్యాకులచిత్తులయిన ఆమె తల్లిదండ్రులను వేదశిరుడు అను ముని వచ్చి ఊరడించెను. పార్వతీదేవి మహిమలు తెలుసుకొని అందరు ప్రసన్నులైరి.

పార్వతీదేవి ఈశ్వరుని పాదపద్మములనే మనస్సున ధ్యానించుచూ తపస్సును ప్రారంభించెను. ఆమె సుకుమార శరీరము తపస్సుకు తగినది కాకున్ననూ తన భోగములను అన్ని వదిలి పరమేశ్వరుని పైననే మనస్సు నిలిపెను. దేహముపై ధ్యాస లేకపోయెను. అనేక సంవత్సరములు కేవలము కందమూలములు, పండ్లు భుజించెను. ఆ తర్వాత కొన్ని సంవత్సరములు కూరగాయలు, తర్వాత కొన్ని దినములు నీరు, గాలి మాత్రమే ఆహారమాయెను. పిదప అనేక సంవత్సరములు నేలపై రాలిన ఎండుటాకులను భుజించెను. తర్వాత వానిని కూడా మానివేసి కఠోరమైన ఉపవాసము చేసెను కనుక ఆమెకు అపర్ణ అని పేరు కలిగెను. తపస్సు వలన ఆమె శరీరము శుష్కించెను. ఆకాశమునుండి ఒక గంభీర వాణి వినిపించెను:

"ఓ గిరిరాజ కుమారీ! నీ మనోరథము సఫలమైనది: త్రిపురారి త్వరలో నీకు లభించును. ఈ కఠినమైన తపస్సును మానుము. ఎందరో జ్ఞానులు, మునులు ఉన్నారు. కాని ఎవరూ ఇంత కఠోరమైన

తపస్సును చేయలేదు. నీ తండ్రి సప్తర్షుల ప్రేరణచే నిన్ను పిలుచుటకు వచ్చినపుడు నీ పట్టుదలను వదిలి ఇంటికి పొమ్ము. ఈ బ్రహ్మవాణి సత్యమగును. దీనిని నీ మనస్సులో నుంచుకొనుము." ఆకాశము నుండి వచ్చిన బ్రహ్మవాణిని విని పార్వతీదేవి సంతోషముతో పులకరించెను.

యాజ్ఞ్యవల్క్యుడు భరద్వాజునితో శంకరుని గాథను వినిపించెను. సతీదేవి తన తండ్రిగారింట్లో శరీరత్యాగమును చేసినది మొదలు శివునిలో వైరాగ్యము అధికమాయెను. సదా రామనామమును జపించుచూ, శ్రీరాముని గుణకీర్తనలనే వినుచుండెను. ఒకచోట మునులకు జ్ఞానోపదేశము. మరొకచోట శ్రీరాముని గుణసంకీర్తనలను చేసెడివాడు. శివుడు జ్ఞాని, కామరహితుడైనను సతీ వియోగముచే దుఃఖితుడాయెను. భక్తి దినదినాభివృద్ధిగాంచెను. శివుని కఠోర నియమము, అనన్య భక్తిని చూచి కృపాళువైన శ్రీరామచంద్రుడు గొప్ప తేజస్సుతో ప్రత్యక్షమాయెను. శంకరుని అనేక విధముల స్తుతించి పార్వతీదేవి జననము మొదలు తపస్సు వరకు ఆమె పవిత్రగాథను వివరించెను. వెళ్ళి పార్వతీదేవిని వివాహము ఆడుమని ఉపదేశించెను. శివుడు "మీ ఆజ్ఞ నాకు శిరోధార్యము" అని పలికెను. శంకరుని భక్తి జ్ఞానధర్మనిరతలను చూసి ప్రసన్నుడై అంతర్ధానమాయెను. అదే సమయమున సప్తర్షులు శివుని వద్దకు వచ్చిరి. మహాదేవుడు అత్యంత మధుర వచనములతో యిట్లనెను: "మీరు పార్వతివద్దకు పోయి ఆమె భక్తిని పరీక్షించండి. ఆమె సందేహములను నివృత్తి చేయండి. ఆమె తండ్రియైన హిమవంతుడు ఆమెను తిరిగి ఇంటికి పిలుచుకొని వచ్చునట్లు చేయండి." ఋషులు పార్వతీదేవి వద్దకు వెళ్ళి, "ఓ భవానీ! ఎందు నిమిత్తము ఈ ఘోరతపస్సును ఆచరించుచున్నావు? ఎవరిని ఆరాధించుచున్నావు? నీ మనస్సులోని కోరిక ఏమి," అని అడిగిరి. పార్వతీదేవి బదులు పలికెను: "నా మనస్సులోని మాటను

చెప్పుటకు సంకోచము అగుచున్నది. మీరు నా మూర్ఖత్వమునకు నవ్వెదరు. నారదుని మాటలను విశ్వసించి నేను రెక్కలు లేకుండగనే ఎగురుటకు ప్రయత్నించుచున్నాను. నేను పరమేశ్వరుని పతిగా పొంద దలచినాను." ఈ మాట వినగానే ఋషులు నవ్వి "నీవు పర్వతరాజు పుత్రికవు. నారదుని ఉపదేశము విన్నవారు ఎవ్వరూ బాగుపడలేదు. దానికి దక్షకుమారులు, హిరణ్యకశిపుడు, చిత్రకేతువు మొదలగువారు తార్కాణములు. నారదుడు కపటి, అతనిని విశ్వసింపకుము. శివుడు ఉదాసీనుడు, గుణహీనుడు, కువేషధారి, కపాలములను, సర్పములను ధరించినవాడు, కులము, గృహము లేనివాడు, అట్టివానిని పెండ్లాడిన నీకు ఏమి సుఖము లభించును? మా మాటలు వినుము. సుందరుడు, పవిత్రుడు, సుశీలుడు, సద్గుణరాశి, వైకుంఠవాసుడు విష్ణుమూర్తితో నీ వివాహము జరిపించగలము." ఆ మాటలు విని పార్వతీదేవి "మహాదేవుడు దోషములచే, మహావిష్ణువు సద్గుణములచే నిండియుండవచ్చును. కాని నా మనస్సు ఈశ్వరార్పితము అయినది కావున దయచేసి మీరు మరలిపొండి." పార్వతీదేవి భక్తిని చూచి "భవానీ! నీకు జయమగుగాక! మీరు జగన్మాయ, పరమేశ్వరుడు భగవంతుడు, మీరిరువురు జగత్పితలు" అని పలికి మునీశ్వరులు పార్వతీదేవి పాదములకు మ్రొక్కి పోయిరి. అక్కడనుండి సప్తర్షులు హిమవంతుని పార్వతీదేవి వద్దకు పంపగా అతడామెను ఇంటికి పిలుచుకొచ్చెను. పిదప ఋషులు శివుని వద్దకు పోయి ఉమాదేవి కథనంతయు వినిపించిరి. పార్వతీదేవి ప్రేమను వినిన శివుని మనస్సు ఆమెపై లగ్నమాయెను. సప్తర్షులు సంతోషించి తమ నివాసములకు వెళ్ళిపోయిరి. పిదప శివుడు శ్రీరాముని ధ్యానములో కూర్చొనెను.

## 9. కామదహనము

ఆ కాలమున తారకుడు అను రాక్షసుడు తను భుజబలము, ప్రతాపము, తేజస్సులచేత, అన్ని లోకములను, లోకపాలకులను జయించెను.

దేవతలు తమ సుఖ సంపదలను కోల్పోయిరి. వాడు జరామరణములు లేనివాడు. వానిని జయించుట అసాధ్యము. దేవతలు వానితో యుద్ధములు చేసి ఓడిపోయిరి. వారు బ్రహ్మదేవునితో మొరపెట్టుకొనిరి. బ్రహ్మవారిని ఓదార్చి ఆ రాక్షసుని శివుని కుమారుడు చంపగలడు అని పలికెను. "దక్షయాగములో ప్రాణత్యాగమొనర్చిన సతీదేవి మరల హిమవంతుని కూతురుగా జన్మించి శంకరుని వివాహమాడుటకు తపస్సు చేసినది. కాని శివుడు సర్వసంగపరిత్యాగియై ధ్యానములో మునిగినాడు. మీరు పోయి మన్మథుని శివుని వద్దకు పంపండి. అతడు శివుడి మనస్సును క్షోభపెట్టును. తర్వాత మనము శివుని వేడుకొని అతని పెండ్లి చేసెదము. ఇది ఒకటియే దేవతలను రక్షించుటకు మార్గము." ఇది విని దేవతలు సమ్మతించి, మన్మథుని స్తుతించగా అతడు ప్రత్యక్షమాయెను. దేవతలు కామదేవునితో తమ ఆపదను గూర్చి చెప్పిరి. వారి మాటలు విని మదనుడు నవ్వి, "శివునితో వైరము నాకు శుభము కాదు. అయినను పరోపకారమే పరమధర్మము, కావున మీ పనిని చేయగలను" అని పలికి అందరికీ నమస్కరించి తనధనుస్సును, పుష్పబాణములను ధరించి వసంతుడు మొదలగు స్నేహితులతో బయలుదేరెను. "శివునితో వైరము వలన నాకు మరణము నిశ్చయము" అనుకొనుచు మదనుడు సమస్త ప్రపంచమును తన వశము చేసికొనెను. వెంటనే వేదమర్యాదలు మటుమాయమాయను. బ్రహ్మచర్యము, వ్రతములు, సంయమనము, ధైర్యము, ధర్మము, జ్ఞానవిజ్ఞానములు, సదాచారములు, జపయోగవైరాగ్యములు అన్నియు మంటగలిసెను. ప్రపంచములో అల్లకల్లోలము వ్యాపించెను. స్త్రీ పురుషులు చరాచర జీవులన్నియు మానమర్యాదలు వదలి వేసి, కామమునకు బానిసలైరి. సిద్ధులు, విరక్తులు, మహామునులు, యోగులు, దేవతలు కూడా తమ నియమములను తప్పిరి. కామదేవుని ఈ లీల బ్రహ్మాండములో రెండు ఘడియలు ఉండెను. అందరి

మనస్సులను కాముడు అపహరించెను. శ్రీ రఘునాథుని రక్షణలోను న్నవారు మాత్రము నిగ్రహమును పాటించిరి.

కామదేవుడు శివుని చూడగానే గడగడ వణకసాగెను. వెంటనే ప్రపంచము యథాస్థితిని, జీవులందరు ప్రశాంతతను పొందిరి. రుద్రుని చూచి కాముడు భయపడెను. వెనకకు మరలిపోవుట అవమానకరము. ముందుకు పోయి ఏమియూ చేయలేడు. "తనకు మరణమే నిశ్చయమని" తలచి వసంత ఋతువును ప్రేరేపించెను. నూతన వృక్షములన్నియు పుష్పశోభితము లాయెను. వనములు, ఉపవనములు, బావులు, చెరువులు, ప్రకృతి అన్ని దిశలందు శోభాయమానమై ప్రేమమయమై కనపడెను. శీతలసుగంధిత-మందపవనములు కామాగ్నిని ఇనుమడింపచేసెను. సరోవరములలో కమలములు వికసించెను. వాటిపై తుమ్మెదలు రొద చేయనారంభించెను. కలహంసలు, కోకిలలు, చిలుకలు మధుర గానమును వినిపించెను. అప్సరసలు సంగీతనాట్యములు ప్రదర్శించిరి. కామదేవుడు అనేక ఉపాయములు పన్నిననూ శివుని తపస్సమాధి చెదరలేదు. మదనుని కోపము హెచ్చాయెను. ఒక అందమైన మామిడికొమ్మను ఎక్కి అతడు తన ధనుస్సుపై పూలబాణములను సంధించి ఒక్కసారి వదిలెను. అది నేరుగా శివుని హృదయములో గ్రుచ్చుకొనెను. శివుని సమాధి చెదరిపోయెను. మనస్సు క్షోభించెను. పరమేశ్వరుడు కన్నులుతెరచి చూడగా మామిడి చెట్టుపై అకులలో దాగివున్న మదనుడు కనిపించెను. శివుడు కృద్ధుడై మూడవ కన్ను తెరచి చూడగానే మన్మథుడు కాలి ,మసి అయెను. ముల్లోకములు కంపించెను. విశ్వమునందు హాహాకారములు వ్యాపించెను. విషయలాలసులు చింతించిరి. యోగులు నిష్కంటకులైరి.

మన్మథుని భార్య రతీదేవి తన భర్త మరణవార్త విని మూర్ఛిల్లెను. శోకతప్తహృదయమై శివుని సన్నిధికి ఏతెంచి అనేక విధముల

ప్రార్థించుచూ ముందు నిలుచుండెను. అసహాయ స్థితిలో నున్న స్త్రీని చూచి కరుణామూర్తి అయిన పరమేశ్వరుడు యిట్లు పలికెను: "ఓ రతీ! ఈ రోజు నుండి నీ భర్త అనంగుడు అనబడును. దేహము లేకున్ననూ అందరిని వ్యాకుల పరుచును. నీ భర్తను పొందు మార్గమును వినుము. పృథ్వీ భారమును బాపుటకు శ్రీహరి యదువంశములో శ్రీకృష్ణుడుగా అవతరించినపుడు అతనికి నీ భర్త ప్రద్యుమ్నుడు అను పేరున కుమారుడుగా జన్మించును. నా పలుకులు అబద్ధములు కావు"- శివుని మాటలు విని రతీదేవి వెళ్ళిపోయెను.

## 10. శివపార్వతుల వివాహము

బ్రహ్మాది దేవతలు ఈ సమాచారమును విని నేరుగా వైకుంఠమును చేరిరి. అచ్చటినుండి బ్రహ్మ, విష్ణువు, మొదలగు దేవతలందరు శివ సాన్నిధ్యమును చేరి అనేక విధముల స్తుతించిరి. చంద్రమౌళి ప్రసన్నుడాయెను. కృపాసముద్రుడైన పరమేశ్వరుడు "దేవతలారా! మీ రాకకు కారణము ఏమి? అని అడిగెను. బ్రహ్మ ఇట్లు పలికెను: "ప్రభూ! మీరు అంతర్యామి. అయినను నా విన్నపము వినుడు. దేవతలందరి హృదయములో ఒక కోరిక కలదు. వారు మీ వివాహమును చూడవలెనని కోరికతో నున్నారు. కాముని భస్మము చేసిన పిదప రతీదేవికి వరమునిచ్చి మేలు చేసినారు. ప్రభూ! మొదట దండించి తర్వాత క్షమించుట మహాత్ముల స్వభావము. పార్వతీదేవి గొప్ప తపస్సు చేసినది. దయచేసి ఆమెను అంగీకరించండి." బ్రహ్మదేవుని విజ్ఞాపనను విని శ్రీరాముని ఆజ్ఞను జ్ఞప్తికి తెచ్చుకొని శివుడు "అట్లే అగుగాక!" అని పలికెను. దేవతలు దుందుభులు మ్రోగించిరి. పుష్పవర్షము కురిసెను. అందరు జయజయధ్వానములు చేసిరి. ఇది తగిన సమయమని తలంచి సప్తర్షులు అక్కడికి వచ్చిరి. బ్రహ్మదేవుడు వారిని హిమవంతుని వద్దకు పంపెను. మొదట వారు పార్వతీదేవి వద్దకు పోయి మధురముగా కపటపు మాటలాడిరి. "ఆ సమయమున

నారదుని మాటలు విశ్వసించి మా సలహో వినకపోయితివి. ఇప్పుడు మీ ప్రతిజ్ఞా భంగమయినది. మహాదేవుడిపుడు కామదేవునే భస్మము చేసెను." ఆ మాటలు విని పార్వతిదేవి నవ్వి యిట్లనెను: "జ్ఞానులైన మునులారా! కామదేవుని శివుడు ఇప్పుడు కాల్చినాడని, ఈ రోజు వరకు అతడు సవికారుడు అని మీ ఉద్దేశ్యము, కాని నా అభిప్రాయములో శివుడు సదాయోగి, జన్మరహితుడు, అనన్యుడు, నిష్కాముడు. ఈ విషయము తెలిసి కూడా నేను మనోవాక్కర్మలచే అతనిని సేవించినాను. కావున వినుడు. దయామయుడైన ప్రభువు నా ప్రతిజ్ఞను సఫలము చేయును. శివుడు కామదేవుని కాల్చినాడనుట మీ అవివేకము. హిమము అగ్ని వద్దకు ఎట్టి పరిస్థితులలోను పోలేదు. ఒక వేళ పోయినచో కరగిపోవును. అట్లే కామదేవుడు మహాదేవుని వద్దకు పోయి భస్మమయినాడు." పార్వతీదేవి వచనములను విని సప్తర్షులు ఆమె భక్తి విశ్వాసములకు సంతోషించిరి. ఆమెకు శిరసా ప్రణమిల్లి హిమవంతుని సమీపించిరి. సప్తర్షులు హిమవంతునికి విషయమునంతనూ తెలిపిరి. కామదేవుడు భస్మమగుటను విని అతడు మిగుల దుఃఖించెను. రతీదేవికిచ్చిన వరమును విన్న పిదప సంతోషించెను. మనస్సులో శివుని వైభవమును తలచుకొని మునీశ్వరులను సాదరముగా ఆహ్వానించి వారిచే శుభదిన, నక్షత్ర ఘడియలను పరిశీలింపచేసి వేదోక్తముగా వివాహ ముహూర్తమును నిర్ణయించెను. హిమవంతుడు లగ్న పత్రికను సప్తర్షులకిచ్చి వారికి పాదాభివందనము చేసి విన్నవించెను. వారు ఆ పత్రికను బ్రహ్మదేవునకిచ్చిరి. బ్రహ్మ దానిని చదివి మహదానందభరితుడాయెను. బ్రహ్మదేవుడు లగ్నపత్రికను చదివి వినిపించగా మునులు, దేవతలు సంతోషించిరి. ఆకాశమునుండి పుష్పవర్షము కురిసెను. వివిధ వాద్యములు మ్రోగెను. దిశదిశలందు మంగళకళశములు అలంకరింపబడెను. దేవతలందరూ తమ వాహనములను, విమానములను సిద్ధపరచిరి. మంగళకర శకునములు కనిపించెను, అప్సరసలు ఆనందముతో నాట్యమాడిరి.

శివుని భూతగణములు అతనిని అలంకరించిరి. జటాజూటములపై సర్పములతో కిరీటము నుంచిరి. సర్పములతోనే కుండలములు, కంకణములు ధరింపచేసిరి. శరీరముపై విభూతిని పూసిరి. సింహ చర్మమును ధరింపచేసిరి. లలాటమున చంద్రుడు, శిరస్సున గంగ, మూడునేత్రములు, సర్పముల ఉపవీతము, కంఠమున విషము, కపాల హారములతో అశుభవేషమును ధరించియు మహేశ్వరుడు శుభప్రదుడు, కృపాళువు. హస్తములందు త్రిశూలము, డమరుకమును ధరించి మంగళవాద్యములతో ఎద్దునెక్కి బయలుదేరెను. శివుని చూచి దేవాంగనలు "ఈ వరునికి తగిన వధువు ప్రపంచములో దొరకదు" అని తమలో తాము అనుకొనిరి.

బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలు తమ తమ వాహనములపై ఊరేగింపులో పాల్గొనిరి. కాని ఊరేగింపు వరునికి తగినట్టుగా లేకుండెను. అప్పుడు విష్ణుమూర్తి దిక్పాలకులను పిలిచి "సోదరులారా! ఈ ఊరేగింపు వరునికి తగ్గట్టుగా లేదు. క్రొత్తనగరములో ఏల హాస్యాస్పదులు అయ్యెదరు? మీరు మీ పరివారముతో వేర్వేరుగా నడవండి." విష్ణుమూర్తి మాటలు విని దేవతలు నవ్వి తమ సేనలతో వేర్వేరుగా నడిచిరి. ఇది చూచి మహాదేవుడు నవ్వి "శ్రీహరి తన వ్యంగ్య ధోరణి ఎప్పుడూ మానడు" అనుకొనెను. శివుడు భృంగిని పంపి తన పరివారమును రప్పించెను. శివుని ఆజ్ఞను విని వారందరు వచ్చి తమ ప్రభు పాదపద్మములకు నమస్కరించిరి. రకరకములైన వారి వేషములు, వారి వాహనములు చూచి శివుడు కూడా నవ్వెను. కొందరికి నోరే లేదు. మరికొందరికి అనేక నోళ్ళు కలవు. కొందరికి చేతులు కాళ్ళు లేకుంటే, మరికొందరికి అనేకములు ఉన్నవి. నేత్రహీనులు కొందరైతే, అనేక నేత్రములు కలవారు కొందరు. కొందరు లావుగా బలిష్ఠముగా నున్నారు. మరి కొందరు బక్కగా, బలహీనులుగా నున్నారు. కొందరు కృశించిన దేహము కలవారు, మరికొందరు

బలిష్ఠకాయులు. కొందరు పవిత్రులు, కొందరు అపవిత్రులు. వారు భయంకరమైన సొమ్ములు ధరించిరి. చేతులలో పుర్రెలు కలిగి వుండిరి. శరీరములు రక్తసిక్తమై యుండెను. వారు గాడిదలు, కుక్కలు, పందులు, నక్కలు మొదలగు జంతువుల ముఖములు కలిగియుండిరి. ఈ భూతప్రేతపిశాచములు అత్యానందముతో పాటలు పాడుచు నాట్యము చేయుచుండిరి. చూచుటకు వికారముగా నుండి విచిత్ర ధ్వనులు చేయుచుండిరి. పెళ్ళికొడుకుకు తగినట్లు ఊరేగింపు కూడా ఉండెను. మార్గములో అనేక రకముల తమాషాలు, వినోదములు చేయుచుండిరి.

అక్కడ హిమవంతుడు వర్ణనాతీతమైన వివాహమంటపమును సిద్ధము చేయించెను. ప్రపంచములోని చిన్నా పెద్దా పర్వతములు అన్నిటికీ, అడవులు, సముద్రములు, నదులు, చెరువుల అధిదేవతలకు ఆహ్వానములు పంపెను. కామ రూపులైన వీరు సుందరశరీరములతో తమ భార్యలను, ఇతర పరివారములను వెంటపెట్టుకొని హిమవంతుని గృహమును చేరిరి. స్నేహపూర్వకముగా మంగళగీతములను పాడిరి. పర్వతరాజు అనేక అతిథిగృహములను అలంకరింపచేసి వారికై అమర్చెను. వారు తమ యోగ్యతానుసారము వాటిలో చేరిరి. మనోహరమైన ఆ నగరశోభ బ్రహ్మసృష్టిని కూడా తలపించుచుండెను. వనములు, ఉపవనములు, నదీతటాకముల శోభ అవర్ణనీయము. ప్రతి ఇంటికి మంగళతోరణములు, ధ్వజపతాకములు కట్టబడియుండెను. జగన్మాతయే అవతరించిన ఆ నగర శోభను ఏమని వర్ణించగలము? ఐశ్వర్యము, జయము, సుఖసంపదలు అన్నియు ఒక్కచోటనే యుండెను.

ఊరేగింపు నగరమును సమీపించుచున్నదని వినగానే నగరములో కోలాహల మధికమాయెను. ఆహ్వానించు సభ్యులు తమను, తన వాహనములను అలంకరించుకొని పెళ్లి కుమారుని,అతని పరివారమును

ఎదుర్కొనుటకు ముందుకు నడిచిరి. దేవతా బృందమును చూచి అందరు సంతోసించిరి, శ్రీహరిని చూచి ఆనంద పరవశులైరి. కాని శివుని పరివారమును చూచి వారి వాహనములు భయముతో వెనుకకు పరుగెత్తెను. యువకులు ధైర్యము వహించి అక్కడనే యుండిరి. కాని పిల్లలు ప్రాణభయముతో పరుగెత్తిరి. గృహములు చేరిన పిదప వారు వణుకుచూ తల్లిదండ్రులకు యిట్లు చెప్పదొడంగిరి: "ఏమి చెప్పవలెను? మాటలు రావటములేదు. ఇది వివాహపు ఊరేగింపా లేక యముని సైన్యమా? పెండ్లికుమారుడు ఎద్దుపై నెక్కినాడు. సర్పములు, పుర్రెలు, అతని ఆభరణములు. శరీరమున బూడిద రాచుకొనెను. దిగంబరి, జటాధారి, భయంకరుడు. అతనితో భూత ప్రేత పిశాచ రాక్షసులు గలరు. ఈ వరుడి ఊరేగింపును చూచి బ్రతికినవాడే పుణ్యాత్ముడు. వాడే గౌరి వివాహమును చూడగలడు." శివుని పరివారమును గూర్చి తెలుసుకొని పెద్దలు నవ్విరి. పిల్లలకు నచ్చచెప్పి భయము వలదని ధైర్యము చెప్పిరి.

ఆహ్వాన సంఘ సభ్యులు పెండ్లికుమారుని, అతని పరివారమును ఎదుర్కొని వారికి తగిన అతిథి గృహములలో నుంచిరి. పార్వతి తల్లియగు మైనాదేవి మంగళహారతిని వెలిగించెను. ఇతర స్త్రీలు మంగళగీతములు పాడిరి. ఆమె బంగారు పళ్ళెమును చేతిలోనిడుకొని శివుని ఆహ్వానించుటకు పోయెను. స్త్రీలు రుద్రుని చూడగానే భయభీతులై తమ ఇండ్లకు పారిపోయిరి. శివుడు తన విడిది గృహమునకు పోయెను. మైనాదేవి హృదయములో మిక్కిలి పరితాపమును పొందెను. పార్వతిని ప్రేమతో తన వడిలో కూర్చుండబెట్టుకొని, కనులలో నీరు నింపుకొని యిట్లు పలికెను: "మూర్ఖుడైన విధాత నిన్నింత అందముగా సృష్టించి, నీకొక పిచ్చివానిని భర్తగా చేసెను. కల్పవృక్షమునకు కాయవలసిన ఫలము ఒక విషవృక్షమును ఎట్లు చేరును? నీతో సహా నేను పర్వతశిఖరముపైనుండి దూకెదను. అగ్నిలో పడెదను. లేదా

సముద్రములో మునిగెదను. ప్రపంచములో నా కప్రతిష్ఠ రానిమ్ము. కాని నా కంఠములో ప్రాణముండగా నేనీ పిచ్చివానితో నీ వివాహము చేయను."

హిమవంతుని పత్ని దుఃఖితురాలగుట చూచి ఇతర స్త్రీలు మిగుల ఖిన్నులైరి. కూతురుపై తనకు గల ప్రేమను తలచుకొని మైనాదేవి మిగుల రోదించెను. నారదుని అనేక విధముల నిందించెను. తల్లి దుఃఖితురాలగుట చూచి పార్వతీదేవి మృదుమధురముగా యిట్లు పలికెను: "అమ్మా! విధి వ్రాతను తప్పించనెవరితరము కాదు. నా ప్రారబ్ధమున పిచ్చివాడు భర్తగా పొందవలెనని యున్న ఇతరులను ఏల నిందించవలెను? అనవసరమైన కళంకమును నీవు నెత్తిన వేసుకోవద్దు. దుఃఖమును మానుము. మా అదృష్టమున ఏయే సుఖదుఃఖములున్నవో వాటిని ఎక్కడకు పోయిననూ అనుభవించక తప్పదు." పార్వతీదేవి వినయపూర్వకమైన వచనములను విని స్త్రీలందరు విధాతను తిట్టుచూ కన్నీరు గార్చిరి.

ఆ సమాచారమును విని హిమవంతుడు నారదుని ఇతర సప్తర్షులను వెంటపెట్టుకొని వచ్చెను. నారదుడు ఉమాదేవి పూర్వ జన్మవృత్తాంతమును చెప్పి అందరినీ శాంతింపచేసెను. "మైనాదేవీ! నీ కూతురు జగజ్జనని, భవాని. ఈమె ఆద్యంతములు లేని శక్తి స్వరూపిణి. శివునికి సదా అర్ధాంగి, లోక సృష్టి, పాలన, లయకారిణి. ఇచ్ఛామాత్రమున మాయా రూపమును ధరించగలదు. మొదట ఈమె దక్షుని పుత్రికగా సతీదేవి అను పేరుతో శంకరుని వివాహమాడెను. ఒకరోజు శివునితో పాటు గృహోన్ముఖురాలై వస్తుండగా రఘుకుల తిలకుడైన శ్రీరాముని వదనసరోజమును చూచెను. శివుని మాటలు లక్ష్యపెట్టక భ్రమవశమున సీతాదేవి రూపమును ధరించిన దోషమునకు శంకరుడు ఈమెను పరిత్యజించెను. పతి వియోగమును సహించక తండ్రి గృహమున యజ్ఞమున యోగాగ్నిలో

దగ్ధమాయెను. మరల మీ గృహమున జన్మించి తన పతిని పొందుటకు తపమాచరించెను. గిరిజాదేవి సదాశివుని ప్రియమైన అర్ధాంగి. మీ సంశయమును మానుడు." నారదుని వచనములు విని అందరిశోకము తొలగిపోయెను. క్షణములోనే ఆ వృత్తాంతము నగరములోని ఇంటింటికీ వ్యాపించెను.

మైనాదేవి, హిమవంతుడు, అమితానందముతో పార్వతీదేవికి పాదాభివందనము చేసిరి. పౌరులందరు మిక్కిలి సంతసించి, మంగళగీతములు పాడుచూ రకరకములైన సువర్ణకలశములను అలంకరించిరి. పాకశాస్త్రానుసారము అనేక రకములైన వంటలు సిద్ధపరచిరి. హిమవంతుడు బ్రహ్మ,విష్ణువు మొదలగు దేవతలందరినీ సాదరముగా ఆహ్వానించెను. అతిథులు అనేక పంక్తులలో కూర్చొని నిదానముగా భుజించిరి. అందమైన యువతులు మధురగానములతో వ్యంగ్యధోరణిలో హాస్యము చేసిరి. అప్పటి వేడుక పొగడ కోటి గొంతుకలు సరిపోవు. భోజనానంతరము తాంబూలము సేవించి అతిథులు తమ గదులకు పోయిరి.

మునులు హిమవంతునికి లగ్నపత్రికను చదివి వినిపించి వివాహ ముహూర్తము సమీపించినదని తెలుప, హిమవంతుడు దేవతలందరిని పిలిచి ఉచితాసనములపై కూర్చుండవేడెను. వేదోక్తముగ వేదిక సిద్ధపరచబడెను. ముత్తయిదువలు మంగళ గీతములు పాడిరి. ఒక దివ్యసుందర సింహాసనమును వేదికపైనుంచిరి. బ్రాహ్మణులకు నమస్కరించి మనస్సులో తన ప్రభువైన శ్రీరాముని తలచి శివుడా సింహాసనము నలంకరించెను. పిదప మహర్షులు పార్వతీదేవిని పిలిచిరి. సఖులు ఆమెను అలంకరించి పిలుచుకొని వచ్చిరి. ఆమె రూప లావణ్యమునకు దేవతలందరు ముగ్ధులయిరి. ఆమెను జగన్మాతగా గుర్తించి వారు మనస్సులో ప్రణామములు అర్పించిరి. సౌందర్యరాశియైన భవానీమాత మండపములో మధ్యకు వచ్చి శివుని

పాదారవిందములను సిగ్గుతో దర్శించెను. మునుల ఆజ్ఞతో శివుడు పార్వతి మొదట గణపతిని పూజించిరి. (ఇది విని ఎవ్వరికి ఏ అనుమానము రాకూడదు. ఎందుకనగా దేవతలు అనాదికాలముగా ఉన్నారు.) మహర్షులు వేదోక్తపద్ధతిలో వివాహమును జరిపించిరి. హిమవంతుడు కుశపాణియై పార్వతిదేవి హస్తమును పట్టుకొని భవునికి అర్పించెను. శంకరుడు పార్వతీదేవి పాణిని గ్రహించగా ఎల్లరు 'శంకరునికి జయమగుగాక' అని పల్కిరి. వివిధవాద్య సంగీతగోష్ఠి జరిగెను. కన్నుల పండుగగా శివపార్వతుల కళ్యాణమహోత్సవము జరిగెను. దాసదాసీలు, రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, ఆవులు, వస్త్రములు, రత్నములు మొదలగు ఇంకను అనేక విధములైన కానుకలు వరదక్షిణగా సమర్పించి హిమవంతుడు చేతులు జోడించి యిట్లనెను: "పరమేశ్వరా! మీరు పూర్ణకాములు, నేను మీకేమి ఇవ్వగలను?" అని పలికి శివుని పాదపద్మములపై పడెను. కృపాసాగరుడైన శంకరుడు అతనిని అనేక విధముల సంతుష్టునిగా చేసెను.

మైనాదేవి కూడా సంతుష్టాంతరంగయై శివుని పాదములపై పడి యిట్లనెను: "ప్రభూ! నా కూతురు ఉమ నాకు ప్రాణమునకంటె ప్రియమైనది. మీరీమెను దాసిగా స్వీకరించి ఈమె అపరాదములను క్షమించుడు." శివుడామెకు అనేక విధముల నచ్చజెప్పెను. పిదప మైనాదేవి కూతురును తన వడిలో కూర్చుండబెట్టుకొని అనేక విధముల సతీధర్మములను ఉపదేశించెను. ఆమె కన్నులు నీటితో నిండెను. మరల మరల కూతురును తన హృదయమునకు హత్తుకొని ప్రేమవిహ్వలయయ్యెను. కాని దుఃఖించుటకు అది సమయము కాదని ధైర్యము వహించెను. పార్వతీదేవి తన తల్లి వద్ద ఇతర సఖులవద్ద సెలవుగైకొనెను. అందరూ ఆమెను ఉచితరీతిని ఆశీర్వదించిరి. శంకరుడు యాచకులను తృప్తిపరచి కైలాసమునకు పయన మాయెను. దేవత లందరు సంతోషముతో పుష్పవృష్టి కురిపించిరి. ఆకాశమున

నగారాలు ప్రమోగించిరి. హిమవంతుడు సాదరముగా కొంత దూరము వారితోపాటు పోయెను. శివు డతనిని ఓదార్చి తిరిగి పంపెను. పర్వతరాజైన హిమవంతుడు తన యింటికి తిరిగి వచ్చి ఇతర పర్వతములను, సరస్సులను పిలిచి వారిని ఆదరించి వినయముతో దాన సమ్మానపూర్వకముగా వీడ్కోలు ఇచ్చెను. శివుడు కైలాసమును చేరగానే దేవతలందరు తమ తమ నివాసములకు వెళ్ళిరి. శివపార్వతులు అనేక భోగభాగ్యములతో తమ భూతగణములతో కైలాసమున ఉండిరి. చాలాకాలము పిదప వారికి షణ్ముఖుడను కుమారుడు జన్మించెను. అతడు యుద్ధములో తారకాసురుని సంహరించెను. ఈ కథ వేదపురాణశాస్త్రములలో వర్ణించబడినది. శివకుమారుడైన కార్తికేయుని జన్మవృత్తాంతము, అతని ప్రతాపము జగద్విదితము. శివపార్వతుల వివాహకథను చెప్పిన, లేదా వినిన స్త్రీ పురుషులందరు తమ కార్యములందు జయమును పొందుదురు.

## 11. శివపార్వతుల సంవాదము

మనోహరము, సుఖప్రదమైన శంభుని చరితమును విని భరద్వాజుడు పరమానందభరితుడాయెను. ఇంకనూ వినవలెనని కోరిక కలిగెను. నేత్రములు నీటితో నిండెను. శరీరము రోమాంచము అయ్యెను. ప్రేమవశమున నోటమాట రాలేదు. అతని స్థితిని గమనించిన యాజ్ఞవల్క్యుడు యిట్లనెను: "మునీశ్వరా! మీ జన్మ ధన్యము, గౌరీపతి మీకు ప్రాణసముడు. శివుని చరణకమలములందు భక్తి లేనివాడు శ్రీరాముని మెప్పును కలలో కూడా పొందలేడు. విశ్వనాథుని యందు నిష్కపటప్రేమ యుండుటయే శ్రీరామభక్తికి లక్షణము. నిరపరాధియైన సతీదేవిని కూడా పరిత్యజించి శ్రీ రఘునాథుని స్మరణయందే గడిపిన శివునితో సమానమైన శ్రీరామప్రియులెవరు? మునీశ్వరా! శ్రీరాముని లీలలు అపారమైనవి. నూరుకోట్ల శేషులు కూడా వానిని వర్ణించలేరు. అయినను నా మనస్సును ధనుర్ధారియైన

శ్రీరాముని పైనుంచి ఆయన ప్రేరణతో నేను విన్నంత వరకు మీకు చెప్పెదను."

పర్వతములలో కైలాసము శ్రేష్ఠమైనది, రమణీయమైనది. ఎందుకనగా శివపార్వతులచ్చట నివసించెదరు. సిద్ధులు, యోగులు మొదలగు పుణ్యాత్ములు ఆనందస్వరూపుడైన శివుని ఆరాధించెదరు. ఆ పర్వతముపై ఆరు ఋతువులందు కూడా నిత్యనూతనసుందరమైన వటవృక్షము ఒకటి కలదు. ఆ చెట్టు నీడ అతి మనోహరము. అది పరమశివునికి ఇష్టమైన చోటు. ఒకసారి శివుడు అక్కడికి విశ్రాంతికై వెళ్ళి పులితోలు పరచుకొని దానిపై కూర్చొనెను. శిరస్సున జటామకుటము, దానిపై గంగ, నేత్రములు కమలములవలె విశాలములు. కంఠము నీలవర్ణము, లలాటమున విదియ చంద్రునితో శివుడు శోభాయమానుడై యుండెను. కామారియైన శివుడు మూర్తీభవించిన శాంతరసము వలె శోభిల్లుచుండెను. ఇదే మంచి సమయమని తలచి భవాని అతని వద్దకు వచ్చి అతి ప్రసన్నురాలై కూర్చొని తన పూర్వజన్మ వృత్తాంతమును జ్ఞప్తికి తెచ్చుకొనెను. భర్తకు తనపై మునుపటికంటే ఎక్కువ అనురాగముండుటను గ్రహించి నవ్వి, మృదుమధురముగా పల్కెను: "ప్రభూ! మీ మహిమ ముల్లోకములలో ప్రసిద్ధము. మీరు సమర్థులు, సర్వజ్ఞులు, కళ్యాణస్వరూపులు, యోగ, జ్ఞాన, వైరాగ్యసముద్రులు. శరణాగతులకు మీరే కల్పవృక్షము. మీరు నాకు ప్రసన్నులైతే, నిజముగా నన్ను మీ దాసిగా భావించితే శ్రీరఘునాథుని కథను చెప్పి నా అజ్ఞానమును దూరము చేయండి. కల్పవృక్షము నీడలో నివసించు వాడు దారిద్ర్యదుఃఖమును ఎట్లు అనుభవించును? పరమాత్మతత్త్వము తెలిసిన జ్ఞానులు, బ్రహ్మవాదులైన మునులు శ్రీరామచంద్రుని అనాదిబ్రహ్మగా పేర్కొందురు. మీరు కూడా అహర్నిశలు 'రామరామ'యని జపించుచుండెదరు. ఈ రాముడు అయోధ్యనరేశుని కుమారుడైన రాముడేనా? లేక

జన్మరహితుడు, నిర్గుణుడు, అగోచరుడైన మరొక రాముడా? ఒకవేళ అతడు రాజకుమారుడైనచో, నిర్గుణబ్రహ్మ ఎట్లగును? ఒకవేళ బ్రహ్మ అయినచో భార్యా విరహమున ఎట్లు దుఃఖించును? ఇచ్ఛారహితుడు. సర్వవ్యాపకుడు, సర్వసమర్థుడైన రాముడు వేరై యున్నచో అతన్ని గూర్చి నాకు వివరించండి. పూర్వజన్మలో నేను శ్రీరాముని మహిమను చూచినాను. అత్యంత భయముతో మీకీ విషయమును చెప్పలేదు. అయినను నా మనస్సు సమాధాన పడలేదు. దానికి తగిన ఫలితము ననుభవించినాను. నా మనస్సులో ఇంకను సంశయము కలదు. దయచేసి నా సందేహ నివృత్తి చేయండి. శ్రీరాముని గుణముల పావనకథను వినిపించండి. అంజలి ఘటించి ప్రార్థన చేసెదను. ఒకవేళ స్త్రీగా దానిని వినుటకు నాకధికారము లేనిచో నేను మనోవాక్కాయకర్మలచే మీ దాసిని. సజ్జనులు ఆర్తులైనవారితో రహస్యములు కూడా దాచక చెప్పెదరు. వినుటకు వారికి అధికారము గలదు. ఆర్తురాలనై ప్రార్థించుచున్నాను. దయవుంచి శ్రీరఘునాథుని కథను వినుపించుడు.

నిర్గుణబ్రహ్మ అయిన భగవంతుడు సగుణస్వరూపుడుగా ఏల అవతరించెనో మొదట తెలపండి. శ్రీరాముని అవతారకథ, అతని బాల్య చేష్టలు, అతడు జనకుని కుమార్తెను వివాహమాడుట, ఏ కారణమువలన రాజ్యత్యాగము చేసినది, వనములో అతడు చేసిన అద్భుతకార్యములు, రావణుని ఏ విధముగా చంపెను. రాజ్యాభిషిక్తుడైన పిదప అతని లీలలు, తర్వాత ఎట్లు ప్రజలతో సహా వైకుంఠమును చేరెను – ఈ విషయములన్నియూ సవిస్తరముగా చెప్పండి. ఇంకా నేనడుగని విషయాలు ఏమైనా ఉంటే వాటిని కూడా దాచకుండా చెప్పండి."

సహజసుందరములై కపటరహితములైన పార్వతీదేవి ప్రశ్నలకు శివుడు ప్రసన్నుడాయెను. శ్రీరామచంద్రుని చరిత్ర అంతయు

మహాదేవుని హృదయమునందు ప్రతిఫలించెను. శ్రీరాముని దివ్యమంగళమూర్తికూడా హృదయఫలకము మీదికి వచ్చెను. శివుని శరీరము పులకరించెను. పరమానందమూర్తియైన శివునికే అమితానందము కలిగెను. పరమేశ్వరుడు రెండు ఘడియలు ధ్యానమగ్నుడైన తర్వాత బాహ్యప్రపంచమునకు వచ్చెను. అమితానందముతో శ్రీరాముని చరిత్రను వర్ణించసాగెను:

"శ్రీరాముని తెలియని వారికి మిథ్యా ప్రపంచము సత్యమువలె భాసించును. నిదుర మేల్కొన్నవానికి స్వప్నజగత్తు మాయమైనట్లు శ్రీరాముని తెలుసుకొన్నవారికి ఈ మాయా జగత్తు అదృశ్యమగును. ఎవని నామము జపించిన సర్వమనోరథములు సిద్ధించునో అట్టి మంగళస్వరూపుడు, అమంగళహారి, దశరథుని ప్రాంగణములో ఆడుకొను బాలస్వరూపుడైన రాముడు నాపై కృపజూచుగాక!" అని శివుడు శ్రీరాముని స్మరించి, నమస్కరించి అమృతమయమైన వాణితో యిట్లనియె: "పార్వతీ! నీవు ధన్యురాలవు. శ్రీరఘునాథుని చరణకమలములపైగల అనురాగముచే లోకకళ్యాణము కొరకు నీవీ ప్రశ్నలు అడిగితివి. జగత్పావని గంగవలె శ్రీరాముని కథాప్రసంగములు లోకములను పవిత్రము చేయును. శ్రీరాముని కృపచే నీ మనస్సులో స్వప్నమునందు కూడా శోకమోహసందేహభ్రమలు రావు. అయినను నీవు సందేహములు అడిగినావు. ఎవని హృదయమునందు శ్రీహరి భక్తి లేదో వాడు జీవన్మృతుడు. శ్రీహరి కథలు విని ఆనందించని హృదయము కఠినమైనది. దయలేనిది. కావున గిరిజా! దేవతలకు ఆనందము, రాక్షసులకు సంకటము కలిగించు శ్రీరామ కథను వినుము.

ఓ గిరిరాజ కుమారీ! శ్రీరాముని సుందర నామధేయము, గుణములు, చరిత్ర, జన్మకర్మలన్నియు లెక్కించ వీలులేనివి. శ్రీరాముడు అనంతుడు. అట్లే అతని కథ, కీర్తి, గుణములు

అనంతములు, కావున శ్రీరాముని చరణములను భజింపుము. సూర్యకిరణములు తమస్సును పారద్రోలునట్లు నా వచనములు నీ సందేహములను తొలగించును.

సగుణ, నిర్గుణ, బ్రహ్మలకు భేదము ఏమీ లేదని మహామహులు, వేదపురాణములు చెప్పుచున్నవి. నిర్గుణ, నిరాకార, అగోచర, అజుడైన పరమాత్మయే భక్తుల ప్రేమకు వశుడై సగుణుడగుచున్నాడు. శ్రీరాముడు సచ్చిదానందరూపుడైన సూర్యుడు, అక్కడ అజ్ఞానమను రాత్రి లేశ మాత్రము కూడా లేదు. షడైశ్వర్య యుక్తుడగు పరమాత్మ స్వభావసిద్ధముగా ప్రకాశరూపుడు. హర్షశోకములు, జ్ఞానాజ్ఞానములు, అహంకారమమకారములు బద్ధుడైన జీవుని లక్షణాలు. సర్వవ్యాపి, పరమానంద స్వరూపుడు, పరాత్పరుడు, పురాణపురుషుడగు శ్రీరామచంద్రుడు వీటికతీతుడు. అట్టి రఘుకుల మణియైన రామచంద్రుడు నాకు స్వామి" అని చెప్పి పరమశివుడు తన శిరస్సును వంచి నమస్కరించెను.

అజ్ఞానులు తమ దోషమును గుర్తు ఎరుగక తమ మోహమును ప్రభువుపైన ఆపాదించెదరు. మూర్ఖుడయినవాడు మేఘావృతమయిన ఆకాశమును జూచి సూర్యుడు మేఘములతో కప్పబడియున్నాడని భ్రమించును. నిర్మలమైన శ్రీరామచంద్రుని మోహవశుడనుట నిర్మలమైన ఆకాశమును అంధకారము, పొగ ధూళితో కూడినదని భావించుటవంటిది.

"ఓ గిరిజా! ఎవని కృపచే ఈ భ్రమ నివారణమగునో, అట్టి కృపాళువు శ్రీరఘురాముడు. అతని ఆద్యంతములు ఎవరికి తెలియవు. వేదములు కూడా అతనిని ఊహించి పొగడినవి, చరాచర జగత్తునకు అతడు ప్రభువు, సర్వహృదయజ్ఞుడు. మనుష్యులు ఉద్దేశ్యరహితముగా అయినను ఎవని నామస్మరణ చేసినచో అనేక జన్మల సంచిత పాపములు దగ్ధమగునో, భక్తితో ధ్యానించువారిని సంసారసముద్రమును

ఎవడు దాటించు నావయో, అట్టి పరమాత్మయే శ్రీరామచంద్రుడు. కాశిలో చనిపోవు ఏ ప్రాణినైననూ నేను శ్రీరామనామబలమువలన శోకరహితముగా చేయుదును."

భ్రమనివారకములైన శివుని మాటలు విని పార్వతీదేవి సందేహములు దూరమాయెను. శ్రీరామపాదపద్మములయందు భక్తివిశ్వాసములు ఇనుమడించెను. అవిశ్వాసము, తర్కవితర్కములు తొలగిపోయెను. శివుని పాదపద్మములకు మ్రొక్కి అంజలి ఘటించి పార్వతి అమృతమయ వాక్కులను పల్కెను: "చంద్రకిరణములవలె శీతలములయిన మీ వచనములను విని శరదృతువు తాపము వంటి నా మోహము తొలగిపోయెను. నా సంశయములన్నిటిని తొలగించితిరి. ఇప్పుడు శ్రీరాముని యదార్థస్వరూపము తెలిసినది. అయినను నాపై ప్రసన్నులై మొదట నేనడిగిన ప్రశ్నకు సమాధానము తెల్పుడు. శ్రీరాముడు పరబ్రహ్మ, జ్ఞానస్వరూపుడు, అవినాశి, నిర్మలుడు, సర్వహృదయాంతర్యామి. అతడు మానవ శరీరమును ఏల ధరించెను? నాకు విశదీకరించండి."

పార్వతీదేవియొక్క వినయపూర్వక వాక్కులను విని, శ్రీరామ కథయందు ఆమె విశుద్ధప్రేమను చూచి కృపానిధానుడైన శివుడు మనస్సున ఆనందించి బహువిధముల ఉమాదేవిని ప్రశంసించుచూ పలికెను: "భవానీ! శ్రీరామచరితమానసమను నిర్మలకథను వినుటకు ముందు రామావతారమును గురించి వినుము. శ్రీహరి అవతారములకు అనేక కారణములు గలవు. బుద్ధి, మనస్సు, వాక్కులకు అతీతుడైన శ్రీహరి అవతారములను గూర్చి సాధువులు, మునులు, వేదపురాణములు వారి బుద్ధిననుసరించి ఊహించిరి. ఎప్పుడు ధర్మమునకు హాని ఏర్పడునో, నీచులు, అసురులు, గర్విష్ఠులు వృద్ధిచెంది చెప్పుటకు వీలులేని అధర్మ కార్యములను ఆచరిస్తారో; దేవతలు, భూమాత, బ్రాహ్మణులు, గోవులు దుఃఖితులవుతారో అపుడు కృపతో శ్రీహరి

రకరకములైన శరీరములను ధరించి సజ్జనుల దుఃఖముల తొలగించును. రాక్షసులను చంపి, దేవతలను వేదమర్యాదలను రక్షించి తన ఉజ్జ్వల కీర్తిని విస్తరింపచేయును. భక్తులు అతని వైభవమును కీర్తించి సంసార సాగరమును దాటుదురు.

భవానీ! శ్రీరామజన్మకు అనేక కారణములు గలవు. అవి అద్భుతమైనవి. శ్రీహరికి జయవిజయులను ఇద్దరు ద్వారపాలకులుండిరి. సనకాది మునుల శాపము వలన వారు తామస స్వభావముకల హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అను పేరుగల రాక్షసులుగా జన్మమెత్తిరి. వారు సురపతియైన ఇంద్రుని కూడా జయించిరి. హిరణ్యాక్షుని వధించుటకు శ్రీహరి వరాహావతారమును దాల్చెను. నరసింహావతారమున హిరణ్యకశిపుని వధించి భక్త ప్రహ్లాదుని కీర్తిని వ్యాపింపచేసెను. భగవంతుడు స్వయముగ వధించినను హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు శాపవిముక్తులు కాలేదు. వారే తిరిగి రావణ, కుంభకర్ణులను మహా వీరులయిన రాక్షసులుగా జన్మించిరి. తన భక్తులపై అనురాగము వలన భగవంతుడు అనేక మార్లు అవతారములు ఎత్తెను. ఆ అవతారములలో అదితి కశ్యపులు అతని తల్లిదండ్రులు. వారే కౌసల్యా, ధశరథులుగా జన్మించిరి. శ్రీహరి వారికి కుమారుడుగా జన్మించి రావణ, కుంభకర్ణులను వధించెను. మరొక కల్పములో జలంధరుడు అను రాక్షసుడు దేవతలందరినీ యుద్ధములో ఓడించెను. వారి ఆపదను జూచి మహేశ్వరుడు కూడా అనేకమార్లు అతనితో పోరాడెను. కాని జలంధరుడి భార్యయైన బృంద పాతివ్రత్యమహిమ వలన త్రిపురాసుర సంహారియైన శివుడు కూడా వానిని సంహరించలేకపోయెను. కపటోపాయముచే విష్ణువు ఆమె పాతివ్రత్యమును భంగపరచి దేవతలను కాపాడెను. ఆ మోసమును గ్రహించిన బృంద కోపముతో శ్రీహరిని శపించెను. శ్రీహరి లీలావిలాసుడు, కృపాళువు. ఆమె శాపమును అంగీకరించెను. ఆ జలంధరుడే మరల రావణుడై

జన్మించెను. శ్రీరాముడు అతనిని యుద్ధమున చంపి మోక్షమును ప్రసాదించెను.

## 12. నారదుని మోహము

భరద్వాజా! వినుడు. ప్రతి అవతారకథను కవులు అనేక విధములుగా గానము చేసిరి. "ఒకసారి నారదుడు శాపమిచ్చిన కారణమున శ్రీహరి అవతారమెత్తెను." ఈ మాట వినగానే పార్వతీదేవి చకితురాలై "నారదుడు విష్ణు భక్తుడు, జ్ఞాని. అట్టివాడు భగవంతునికి ఏల శాపము ఇచ్చెను? లక్ష్మీపతి అపరాధమేమి?." అనెను శివుడు నవ్వి యిట్లనెను. శ్రీరఘునాథుని సంకల్పము వలన లోకమున అనేక సంఘటనలు జరుగును. హిమాలయ పర్వతమునందు అతి పవిత్రమైన, సుందరమైన గుహలు కలవు. అందు ఒకదాని సమీపమున నిర్మల గంగ ప్రవహించును. అట్టి పవిత్రమైన ఆహ్లాదకరమైన ప్రదేశమును చూచి నారదుడు, శ్రీహరిపై గల భక్తిపారవశ్యముచే సమాధిగతుడాయెను. నారదముని స్థితి సామర్థ్యములను చూచి దేవేంద్రుడు భయపడి అతని తపోభంగము చేయుటకు మన్మథుని పంపెను. ప్రపంచములో కామ లోభ ప్రవృత్తి గలవారు కాకివలె ఎల్లప్పుడు ఇతరులను చూచి భయపడుదురు. అట్లే నారదుడు తన స్వర్గమును ఆక్రమించునేమో? అని ఇంద్రుడు భయపడెను.

కామదేవుడు నారదుని స్థానమున వసంతమును సృష్టించెను. వృక్షములపై విచిత్ర వర్ణముల పూలు వికసించెను. తుమ్మెదలు రొద చేసెను. శీతల, మంద, సుగంధయుతమైన గాలి వీచసాగెను. రంభాద్యప్సరసలు అనేక రాగములలో పాడిరి. నృత్యము చేసిరి. కాని శ్రీహరి రక్షణలో నున్న నారదునిపై మన్మథుని కపటమాయలు ఫలించక పోవుటచే నారదుని పాదములపై పడిరి. మదనుడు తన ఓటమిని అంగీకరించి సెలవు గైకొని పోయి, నారదుని సౌశీల్యమును గూర్చి చెప్పగా దేవేంద్రుని సభలోని వారు ఆశ్చర్యపడి నారదుని

గొప్పతనమును పొగడిరి. నారదుని మనస్సులో 'కామదేవుని జయించితిని' అను అహంకారము ఎక్కువాయెను. పరమేశ్వరునికి తన వృత్తాంతమును తెలుపగా అతడు "ఓ మునీ, నీవు నాకు చెప్పిన కథను విష్ణుమూర్తికి చెప్పవద్దు" అని ఉపదేశించెను. కాని నారదుడు శివుని సలహాను పెడచెవిని పెట్టి అహంకారమున బ్రహ్మలోకమునకు, ఆ పిదప వైకుంఠమునకు పోయెను. లక్ష్మీపతి లేచి నారదుని ఆహ్వానించి కూర్చుండబెట్టి నవ్వుచూ "మునీశ్వరా! చాలా దినములకు దయచేసితిరి" అనెను. శివుడు చెప్పవద్దు అని వారించినను, నారదుడు కామదేవుని చేష్టలను గూర్చి చెప్పెను. శ్రీహరిమాయ అలంఘ్యము. దానికి వశులు కానివారు ప్రపంచమున లేరు. భగవంతుడు మృదు మధురముగా యిట్లు పలికెను. "మునీశ్వరా! ఎవరి హృదయములో జ్ఞానవైరాగ్యములు ఉండవో వాని మనస్సు మోహావేశమగును. మీరైతే బ్రహ్మచర్యవ్రతదీక్షాపరులు, ధీరబుద్ధులు. మిమ్ములను కామదేవుడు ఏమి చేయగలడు?" నారదుడు స్వాభిమానముతో "ప్రభూ! ఇది అంతయు మీ దయ" అనెను. దయాసాగరుడైన విష్ణుమూర్తి ఆలోచించెను. "ఇతని హృదయములో స్వాభిమానము అంకురించినది. వెంటనే దీనిని సమూలముగా తీసివేయుదును. భక్తులను కాపాడుటయే నా వ్రతము. ఈ మునికి హితము చేకూర్చుటకు, నా లీలలు కొనసాగుటకు ఒక ఉపాయమును చేసెదను." నారదుడు విష్ణుమూర్తికి వందనము నాచరించి అతి గర్వముతో వెళ్ళి పోయెను.

విష్ణుమూర్తి మాయవలన నారదుడు వెళ్ళు మార్గమధ్యమున అతి సుందరమైన నగరము నిర్మింపబడెను. అందరి స్త్రీ, పురుషులందరు అతి సుందరులు. ఆ నగరమునకు శీలనిధి అని రాజుండెను. అతని వైభవము నూరు మంది ఇంద్రులతో సమానమైనది. అతడు స్వయముగా రూపము, తేజస్సు, బలము, నీతి అను లక్షణములు కలవాడు. అతని కుమార్తె విశ్వమోహిని సర్వశుభలక్షణ సంపన్న.

ఆమె విష్ణుమూర్తి మాయాశక్తియే. ఆమె స్వయంవరము చాటింపబడి రాజకుమారులకు ఆహ్వానములు పంపబడెను. కౌతుక ప్రియుడైన నారదుడు అచటికి వచ్చి నగరవాసులతో విషయమంతయు తెలుసుకొని రాజభవనమునకు పోయెను. రాజు అతనిని సాదరముగా పూజించి తన కుమార్తెను చూపి ఆమె గుణదోషములను ఆలోచించి చెప్పుమనెను. రాజకుమారిని చూడగానే ముని వైరాగ్యమంతయు మాయమాయెను. ఆమె సులక్షణములను చూచి తన్ను తాను మరచిపోయెను. హృదయములో సంతోషించెను. కాని బయటికి ప్రకటించలేదు. ఆ రాజకుమారి లక్షణములను తనలో తాను తర్కించుకొనెను. "ఈమెను వివాహమాడిన వాడు అమరుడగును. రణభూమిలో అతనిని ఎవరు జయించలేరు. చరాచరజీవులన్నియు అతనికి సేవ చేయును." ఈ విషయములన్నియూ బయటకు చెప్పకుండా ఈమె చాలా అదృష్టవంతురాలని చెప్పి వెళ్లిపోయెను.

నారదుడు తనలో తాను ఆలోచించసాగెను. "ఈ కన్య నన్నెట్లు వరించగలదు? ఈ సమయమున నే నతి సౌందర్యవంతునిగా కావలెను. రాజకుమారి నన్ను జూచి నా మెడలోనే వరమాల వేయవలెను. ఈ సమయమున శ్రీహరియే నాకు సహాయకుడు" అని నారదుడు శ్రీహరిని ప్రార్థించెను. శ్రీహరి ప్రత్యక్షమాయెను. అత్యంతదీనుడై నారదుడు శ్రీహరితో "దయచేసి నాకు సహాయపడుడు. నేను మీ దాసుణ్ణి. మీ సౌందర్యము నాకివ్వండి. ఏదోవిధముగా నేను ఆ రాజకుమారిని వివాహమాడవలెను" అనెను. విష్ణుమూర్తి తన మాయా ప్రభావమునకు నవ్వుకొని యిట్లనెను. "ఓ నారదా! ఒక వ్యాకులుడైన రోగి తనకు హానికరమగు రుచిగల ఆహారములడిగిన వైద్యుడు ఇవ్వడు. అతనికి ఏది హితమో దానినే ఇచ్చును. కావున నీకేది హితమో నేను అదే చేయగలను" అని చెప్పి శ్రీహరి అంతర్ధానమునొందెను.

మాయామోహవశుడైన నారదుడు విష్ణుమూర్తి పలుకుల అంతరార్థమును గ్రహించలేకపోయెను. మహర్షి వెంటనే స్వయంవరసభా మంటపమును చేరెను. బాగా అలంకృతులైన రాజకుమారులు తమ పరివారములతో అచ్చట ఆసీనులైరి. మహర్షి తనలో తాను యిట్లు అనుకొనెను. "నా అందము ఈ రాజకుమారులను మించినది. రాజకుమారి నన్ను తప్ప వేరే ఎవరిని వరించదు." మహర్షి హితము గోరి భగవంతు డతనికి పరమ వికారస్వరూపమును ఇచ్చెను. కాని ఎవరును అతనిలో మార్పును కనిపెట్టలేదు. నారదుడు అనియే భావించి అందరూ మ్రొక్కుచుండిరి.

అక్కడ శివుని గణములిద్దరుండిరి. వారికి ఈ రహస్యము తెలిసియుండెను. వారు బ్రాహ్మణవేషధారులై నారదుడు కూర్చున్న వరుసలోనే కూర్చొని నారదుడు వినునట్లు బిగ్గరగా వ్యంగ్యవచనములు పలుకుచుండిరి. "శ్రీహరి ఇతనికి చాలా అందమైన రూపమును ఇచ్చినాడు. రాజకుమారి ఇతనిని చూడగనే ముగ్ధురాలై వరమాల వేయును." మహర్షి మోహపరవశుడై యుండుటచే వారి మాటల అర్థములు గ్రహించలేదు. కేవలము రాజకుమారి మాత్రమే అతని కోతిముఖమును భయంకరాకారమును చూచెను. జయమాలను చేతిలో ధరించి ఒక్కొక్క రాజకుమారుని చూచుచూ ఆమె నారదునివైపు కన్నెత్తియైనా చూడకుండా ముందుకు నడిచెను. నారదుడు మాటి మాటికి లేచి నిలుచుండెను. అతని స్థితిని చూచి శివగణములు నవ్వుచుండిరి. దయానిధియైన శ్రీహరి రాజు వేషమును ధరించి అక్కడికి వచ్చెను. రాజకుమారి ఆయన మెడలో మాలవేసెను. లక్ష్మీపతి ఆమెను తీసుకొని పోయెను. రాజులందరు నిరాశులైరి. మోహావేశపరుడైన నారదమహర్షి బుద్ధి భ్రష్టమయినది. శివుని దూతలు ఒకసారి "నీ ముఖము అద్దములో చూచుకో" అని పలికి పరుగెత్తిపోయిరి. నారదుడు నీటిలో తన వికారరూపమును చూచి

మిక్కిలి కోపముతో "మీరు నిశాచరులైన రాక్షసులగుదురు గాక!" అని శివగణములను శపించెను.

మరల నీటిలో ఒకసారి తన స్వరూపమును చూచుకొని "శ్రీహరి లోకములో నన్ను నవ్వులపాలు చేసెను. ఇప్పుడేపోయి అతనిని శపించెదను." అని పోవుచుండగా త్రోవలోనే శ్రీహరి, లక్ష్మిదేవి మరియు రాజకుమారితో పాటు ప్రత్యక్షమై "మునీ! వ్యాకుల చిత్తుడవై ఎక్కడికి పోవుచున్నావు?"అని పల్కెను. మాయామోహవశుడైన మునికి బుద్ధి నశించుటచే "నీవు కపటివి. అసూయాపరుడవు, స్వార్థపరుడవు, స్వతంత్రుడవు, ఎవరి అధీనములో నుండవు. కావున మంచిని చెడు, చెడును మంచి చేస్తావు. ఈ నీ హృదయములో హర్షామర్షములు లేవు. శుభాశుభకర్మలు నిన్ను బాధించవు. నీకు భయము లేదు. ఇంతవరకు నిన్నెవరు సరియైన మార్గములో నుంచలేదు. ఇదియే నా శాపము. నీవు నాకు కోతిరూపమును ఇచ్చినావు. కావున కోతులే నీకు సహాయకారులగుదురు. నేను వరించిన స్త్రీ నుండి నన్ను దూరము చేసితివి. కావున నీవు కూడా స్త్రీ వియోగముతో దుఃఖించెదవు." ప్రభువు నారదుని శాపమును సంతోషముగా స్వీకరించెను. అతని మాయాబంధములను తొలగించెను.

శ్రీహరి మాయను తొలగించగానే లక్ష్మిదేవి, రాజకుమారి అదృశ్యపోమైయిరి. నారదుడు భయభీతుడై శ్రీహరి పాదములపై పడి "శరణాగతవత్సలా! నన్ను రక్షింపుము. నేను మిమ్ము అనేక బాధాకరములైన మాటలాడితిని. నా పాపమునకు నిష్కృతి లేదు. నా శాపము నిష్ఫలమగు గాక!" ప్రభువు సమాధానముగా "నారదా! ఇందులో నీ దోషమేమియూ లేదు. ఇది నా సంకల్పము. పోయి శంకరుని ధ్యానించుము. శివునితో సమానమైన ప్రియులు నాకెవ్వరు లేరు. ఎవరైతే శివుని కృపకు పాత్రులు కారో వారికి నాపై భక్తి

కలుగదు. దీనిని మనస్సులో నమ్మి భూలోకములో చరించుము. నా "మాయ నీ దగ్గరికి రాదు. ఇట్లు అనేక విధముల నారదుని ఊరడించి విష్ణుమూర్తి అంతర్ధానమాయెను.

నారదుడు శ్రీహరి గుణకీర్తన చేయుచు పోవుచుండగా, శివదూతలు అతనిని చూచి భయముతో వచ్చి సాగిలపడి ప్రార్థించిరి: "మునీశ్వరా! మేము బ్రాహ్మణులము కాము. శివుని దూతలము. మీ పట్ల మహాపరాధము చేసి దాని ఫలితమును అనుభవించినాము. మమ్ములను శాపవిముక్తులుగా చేయండి." దీనదయాపరుడైన నారదుడు వారితో "మీరిద్దరు రాక్షసులుగా జన్మించండి. మీకు గొప్ప ఐశ్వర్యము, తేజస్సు, బలము, సంప్రాప్తించును. మీరు మీ భుజబలముతో ఎప్పుడు విశ్వమును జయించుదురో, అప్పుడు విష్ణుమూర్తి మానవ శరీరము ధరించి యుద్ధమునందు మిమ్ము సంహరించి మోక్షమును ప్రసాదించును" అనెను. వారు మునికి నమస్కరించి పోయిరి. కొద్దికాలము తర్వాత వారు రాక్షసులుగా జన్మించిరి.

ఈ కారణము వల్లనే శ్రీహరి ప్రతి కల్పమందు దేవతలను ప్రసన్నులుగా చేయుటకు, సజ్జనులకు సుఖమునిచ్చుటకు భూమిభారమును బాపుటకు మానవ అవతారము ధరించెను. శ్రీహరి జన్మకర్మలు అనేకములు, అలౌకికములు, అవి సుందరములు, సుఖదాయకములు. శ్రీహరి లీలలను వర్ణించుచు మహర్షులు పరమ పవిత్రమయిన కావ్యమును రచించిరి. వివేకవంతులు వానిని చదివి, విని ఆశ్చర్యమగ్నులైరి. శ్రీరామచంద్రుని సుందరకథను గానము చేయుటకు కోటి కల్పములు కూడా చాలవు. భవానీ! జ్ఞానులైన మునులు కూడా హరిమాయామోహితులగుదురని తెలుపుటకే నారదుని కథను చెప్పితిని. ప్రభువు లీలామయుడు, శరణాగతవత్సలుడు, సేవించుటకు సులభుడు, అందరి దుఃఖములను హరించువాడు. దేవతలు, మానవులు,

మునులు కూడా శ్రీహరి మాయామోహితులయినవారే. కావున మాయకు ప్రభువైన అట్టి భగవంతుని భజింపవలెను.

## 13. శతరూపామనువుల వృతాంతము

పార్వతీ! భగవంతుని అవతారమునకు మరొక కారణమును వినుము. జన్మరహితుడు, నిర్గుణుడు, నిరాకారుడైన భగవంతుడు అయోధ్యాపతిగా ఏల అవతారము దాల్చెనో ఆ కథను చెప్పెదను. ఆ ప్రభువే మునివేషధారియై తన సోదరునితో తిరుగుచుండగా నీవు చూచినావు. అతని లీలలు చూచి సతీరూపమున నీవు పిచ్చిదానివై యుంటివి. నేటికినీ ఆ ఉన్మాదపు ఛాయ వదలలేదు. భ్రమరూపమగు రోగములు రూపుమాపు ఆ చరిత్రను వివరించెదను వినుము.

ఈ మానవజాతి అంతయూ స్వయంభువుమనువు, శతరూప అనుదంపతుల సంతతి. వీరు మిక్కిలి ధర్మాచరణపరులు. వారి కుమారుడు ఉత్తానపాదుడు. అతని కుమారుడు హరి భక్తుడైన ధ్రువుడు. మనువు చిన్న కుమారుడైన ప్రియవ్రతుని వేదపురాణములు కూడా ప్రశంసించినవి. వారి కుమార్తె పేరు దేవహూతి. ఆమె భర్త కర్దముడు. ఆ పుణ్యదంపతులకు భగవంతుడు కపిలుడు అను పేర కుమారుడుగా జన్మించి సాంఖ్యతత్వమును ప్రతిపాదించెను.

స్వాయంభువమనువు చాలా కాలము రాజ్యపాలనము చేసి వార్ధక్యమున హరిభక్తిలేని నా జీవితము వ్యర్థము అని తలచి కుమారునికి రాజ్యమునప్పగించి భార్యతో సహా వనమునకేగెను. వారు పుణ్యతీర్థములలో ప్రసిద్ధిగాంచిన నైమిశారణ్యమునందు మునులు, సిద్ధులను చూచి ప్రసన్నులైరి. గోమతీనదీ తీరము చేరి ఆ నిర్మల జలము నందు స్నానమాచరించిరి. మునులతో సహా ఆ దంపతులు సకల తీర్థములను సేవించుచూ, జటావల్కల ధారులై

సకల పురాణములను వినుచుండిరి. మంత్రరాజమయిన ద్వాదశాక్షరీ మంత్రము (ఓం నమో భగవతే వాసుదేవాయ)ను జపించుచు తపస్సు చేసిరి. నిర్గుణుడు, ఆద్యంతరహితుడు, బ్రహ్మజ్ఞానులు నిరంతరము స్మరణచేయు పరమప్రభువు, వేదములు "నేతి, నేతి" అను పల్కునట్టి, బ్రహ్మవిష్ణుమహేశ్వరుల ఉనికికి కారణమైనట్టి ఆనందస్వరూపుడు, ఉపాధి రహితుడు, అసమానుడైన పరబ్రహ్మను చూడగోరిరి. అట్టి సమర్థుడు శక్తిశాలి అయిన ప్రభువు కూడా భక్తులకు వశుడై లీలాశరీరమును ధరించి దర్శనమిచ్చును.

ఆ విధముగా వారనేక వేల సంవత్సరములు తపస్సు చేసిరి. వారి శరీరములు అస్థిపంజరములు అయిననూ వారి మనస్సులలో ఎట్టి బాధ కలుగలేదు. సర్వజ్ఞుడయిన భగవంతుడు వారిని తన నిజమయిన భక్తులుగా గుర్తించెను. ఆకాశము నుండి "వరము కోరుకో" అని ఒక అమృతవాణి వారి చెవులలో నుండి హృదయములో ప్రవేశించెను. వెంటనే వారి శరీరములు సౌందర్యము, బలములతో కూడుకున్నవాయెను. ప్రేమను ఆపుకోలేక మనువు, శతరూపలు సాష్టాంగ దండ ప్రణామంబులు ఆచరించి యిట్లు పలికిరి: "సేవించువారికి కల్పతరువు, కామధేనువైన ప్రభూ! బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కూడా నీ పాదరజమును పూజింతురు. సుఖప్రదాతవు, శరణాగతవత్సలుడవు, చరాచర సృష్టికి స్వామివి. మాపై కరుణయున్నచో మాకొక వరము నిమ్ము. నీ రూపమును మా నేత్రపర్వముగా ప్రత్యక్షము చేయుము." ఆ దంపతుల భక్తిపూరిత ప్రార్థనకు సంతుష్టుడై భగవంతుడు వారికి ప్రత్యక్షమాయెను. నీలకమలములవలె కోమలము, నీలమణివలె ప్రకాశవంతము, నీలమేఘమువలె సరసము అగు ఆ నీలదేహకాంతిని చూచి కోటి మన్మథులు కూడా లజ్జితులైరి. శరత్‌చంద్రుని వంటి ముఖ సౌందర్యము, చెక్కిళ్లు, గళముల అందము, శంఖమును బోలు మెడ, ఎర్రని పెదవులు, మనోహరమైన దంతములు, నాసిక, వెన్నెలవంటి

చిరునవ్వు, వికసించిన కమలములవంటి కన్నులు, ఆకర్షణీయమైన చూపులు, అత్యంత మనోహరములై ఉండెను. కామదేవుని ధనుస్సును తలదన్ను కనుబొమలు, తిలకమును ధరించిన లలాటము, చెవులకు వ్రేలాడు చేపలవంటి కుండలములు, శిరస్సుపై కిరీటము, తుమ్మెద లగుంపు వంటి మృదుకేశములు, చూపరులను సమ్మోహితులను చేసెడు వక్షముపై శ్రీవత్సము, వనమాల, రత్నఖచిత హారములు మణులు పొదగిన ఆభరణములు అత్యంత శోభాయమానముగా నుండెను. సింహమువంటి బలిష్టమయిన మెడపై పవిత్ర యజ్ఞోపవీతము వ్రేలాడుచుండెను. ఏనుగు తొండముల వంటి భుజదండములు, మేఖలాయుతమైన నడుము, చేతులందు ధనుర్బాణములు గల అత్యంత రమణీయ రూపమును వారు చూచిరి. విద్యుత్ ప్రకాశ మునధఃకరించు పీతాంబరము, ఉదరముపై త్రివళులు యమునా నది గాంభీర్యమును భ్రమరముల తేజస్సును తలదన్ను నాభి, సదా మునీశ్వరుల మనస్సులనెడి తుమ్మెదలు విహరించు చరణకమలములు గల అతి మనోజ్ఞమైన రూపమును గాంచిరి. వామభాగమున సదా అనుకూలవతి, సౌందర్యరాశి, జగన్మాత, ఆదిశక్తి అయిన సీతాదేవి రాజిల్లుచుండెను. మనువు శతరూపలను ఆ దంపతులు శ్రీహరి రూపమును కనులార్పక చూచుచునే యుండిరి. ఎంత జూచిననూ తనివి తీరని ఆ సుందరాకృతిని చూచి వారి హృదయములు ఆనందముతో ఉప్పొంగెను. సాష్టాంగ ప్రణామములు ఆచరించి వారు శ్రీహరి పాదములను పట్టుకొనిరి. కరుణామయుడైన శ్రీహరి తన కరకమలములతో వారిని లేవనెత్తి "నేను అత్యంత ప్రసన్నుడనైతిని, మీరేవరమును కోరిన దానిని ఇచ్చెదను, కోరుడు" అని పల్కెను. ప్రభు వచనములు విని ఆ దంపతులు అంజలి ఘటించి ఇట్లనిరి: "ప్రభూ! నీ చరణకమలముల దర్శనముతోనే మా కోరికలు అన్నియు తీరినవి. అయినను ఒక్క కోరిక మిగిలినది. అది సుసాధ్యమా, కష్టసాధ్యమా మేము ఎరుగము, కరుణామూర్తులగు మీరు ఇచ్చుట

సులభము. కాని కృపణులమయిన మేము పొందుట కష్టము. మీతో సమానుడైన పుత్రుని ప్రసాదించుడు." రాజుయొక్క అనన్య ప్రేమను అతని మధుర వచనములను విని "అట్లేకానిమ్ము. నేనే నీకు పుత్రుడుగా జన్మించెదను" అని పల్కెను. శతరూపాదేవి "ప్రభూ! చతురుడైన రాజు ఏ వరము అడిగెనో నాకు కూడ అదే ఇష్టము. మీ నిజభక్తులు ఏ అలౌకిక దివ్య సుఖమును అనుభవించి పరమగతిని పొందెదరో అదే భక్తి విశ్వాసములను ముక్తిని ప్రసాదించుడు" అని పల్కెను, కరుణానిధియగు ప్రభువు "అట్లే అగుగాక! నా ఆజ్ఞను పాలించి దేవేంద్రుని రాజధానియైన అమరావతియందు వసించుడు. అక్కడ కొద్దికాలము సుఖము అనుభవించిన పిదప నీవు అయోధ్యకు రాజువై జన్మించెదవు. అపుడు నేను ఇచ్ఛాపూర్వకముగా నా అంశలన్నిటితో దేహమును ధరించి నీ యింట జన్మించి భక్తులకు ఆనందమును గూర్చు చరిత్రను చేయుదును. భాగ్యవంతులయిన మనుజులు సాదరముగా నా కథలను విని మమతాగర్వములను వదలి భవసాగరమును దాటెదరు. ఇది నా సత్య ప్రమాణము." అని దయాసాగరుడు భగవంతుడు అంతర్ధానమాయెను. ఆ దంపతులు కొద్దికాలము ఆశ్రమములో భగవంతుని మూర్తిని ధ్యానించుచు గడిపిరి. తర్వాత సహజముగా ఎట్టి కష్టము లేకుండా దేహత్యాగము చేసి దేవతా రాజధాని అయిన అమరావతికి పోయిరి."

## 14. ప్రతాపభానుని కథ

ఆ విధముగా శివుడు పార్వతికి వినిపించిన అత్యంత పవిత్రమయిన ఆ కథను యాజ్ఞ్యవల్క్యుడు భరద్వాజునితో చెప్పెను. మునీశ్వరా! శ్రీరాముని జన్మకు మరొక కారణము కూడ కలదు. ఇది ఒక పవిత్ర ప్రాచీన కథ, వినుడు. దీనిని శివుడు పార్వతీదేవికి వినిపించెను. ప్రపంచములో ప్రసిద్ధికెక్కిన కైకయరాజ్యమును సత్యకేతువు అను రాజు పాలించుచుండెను. అతడు ధర్మాత్ముడు, నీతిమంతుడు,

తేజస్వి, ప్రతాపవంతుడు, సుశీలుడు, బలవంతుడు. అతనికి ఇద్దరు పుత్రులు ఉండిరి. వారు కూడ యోధులు, సద్గుణసంపన్నులు. వారిలో జ్యేష్ఠుడు ప్రతాపభాను. రాజ్యమునకు ఉత్తరాధికారి. రెండవవాడు అరిమర్దనుడు. మహాభుజబలుడు, సంగ్రామములో పర్వతసమానుడు. ఆ సోదరులిద్దరు అతి మైత్రితో యుండిరి. వారిమధ్య ఎట్టి కపటము, ద్వేషము లేదు. రాజు తన పెద్దకుమారునికి రాజ్యమునిచ్చి శ్రీహరి ధ్యానమునకై వనములకు యేగెను. ప్రతాపభాను ప్రజలను వేదోక్తధర్మానుసారము పరిపాలించెను. అతని మంత్రి ధర్మరుచి నీతిజ్ఞుడు, బుద్ధిమంతుడు. చతురుడైన మంత్రి, బలశాలియైన సోదరుడు, రాజు స్వయముగ రణధీరుడు. చతురంగ బలము, సమర్థులైన సైనికులతో రాజు దిగ్విజయయాత్ర చేసి అనేక రాజులను ఓడించెను. వారినుండి పన్నులు స్వీకరించి వారిని విడిచిపెట్టెను. ప్రతాపభాను భూమండలమునకు చక్రవర్తియై ప్రజానురంజకముగా పాలించెను. గురువులను, దేవతలను, సజ్జనులను, బ్రాహ్మణులను సేవించుచుండెను. దానధర్మములు చేయుచూ వేదపురాణశాస్త్రములు వినుచుండెను. తీర్థస్థానములలో బావులు, చెరువులు, ఉద్యానవనములు, దేవతామందిరములు, వసతి గృహములు నిర్మించెను. ప్రతిఫలాపేక్ష లేకుండా మనోవాక్కర్మలచే తాను చేయు ధర్మములనన్నిటినీ వాసుదేవార్పణము చేయుచుండెను.

ఒకనాడు ప్రతాపభాను ఉత్తమాశ్వమును ఎక్కి వేటకై వింధ్యాటవికి పోయి అనేక మృగములను వేటాడెను. అతడు ఒక అడవి పందిని చూచెను. నీలగిరిశృంగమువలె విశాలమైన ఆ సూకరమును చూచి, రాజు తన గుఱ్ఱమును అతివేగముగ దానివెంట పరుగెత్తించెను. అది వాయువేగముతో పరుగెత్తెను. కాని రాజు ధనుర్బాణములను ధరించి దానిని వెంటాడెను. ఆ పంది చాలదూరము పరుగెత్తి ఒక గహనారణ్యములో దూరెను. రాజు ఏకాకి అయినను ప్రయత్నము మానలేదు. కాని దట్టమైన అడవిలో దారితప్పి అలసటచే ఖిన్నుడై,

ఆకలిదప్పితో వ్యాకులుడై గుఱ్ఱమును తీసుకొని నదీ, తటాకములను వెతుకుచూ పోయెను. నీరు దొరకక మూర్ఛితుడాయెను. తర్వాత లేచి వనములు తిరుగుచు ఒక ఆశ్రమము చేరెను.

అక్కడ ప్రతాపభానుచేత యుద్ధములో ఓడింపబడి సైన్యమును వదిలి పారిపోయిన ఒక రాజు కపటముని వేషధారియై వసించుచుండెను. అతడు ప్రతాపభానుని గుర్తించెను. కాని ప్రతాపభాను అతనిని గుర్తించలేదు. అతనిని మునీశ్వరునిగా తలచి, గుఱ్ఱము దిగి నమస్కరించెను. ఆ కపట సన్యాసి చూపిన ఒక సరోవరమునందు స్నానమాడి నీరుగ్రోలెను. అలసట దీరిన రాజును ఆ సన్యాసి తన ఆశ్రమమునకు తీసుకొనిపోయి, "నీవెవరు? ప్రాణమునకు లెక్కచేయక ఈ అడవిలో ఒంటరిగా తిరుగ కారణమేమి? నీలో చక్రవర్తి లక్షణములు కనిపించుచున్నవి. నిన్ను జూచి నాకు జాలివేయుచున్నది" అనెను. రాజు సమాధానముగా "మునీశ్వరా! ప్రతాపభాను అను రాజునకు నేను మంత్రిని. వేటకై వచ్చి మార్గము మరచితిని. అదృష్టవశమున మీ దర్శనము అయినది" అని పల్కెను. కపటముని అతనితో "నాయనా, చీకటిపడినది. నీ నగరము ఇక్కడికి డెబ్బది యోజనములు ఉన్నది. ఘోరాంధకారము, ఘనారణ్యము, మార్గమగమ్యము. కావున ఈ రాత్రి ఇక్కడనే యుండి రేపు ఉదయమున పొమ్ము" అని పల్కెను. రాజు ఆ సన్యాసి ఆజ్ఞను శిరసావహించి గుఱ్ఱమును చెట్టుకు కట్టి అక్కడ కూర్చొనెను. కపట మునికి పాదాభివందనము చేసి, "మునీశ్వరా! నేను మిమ్ములను తండ్రివలె భావించెదను. నన్ను మీ పుత్రుడు లేక సేవకునిగా భావించి మీ పేరు మొదలగు వివరములు తెలుపగలరు" అని పల్కెను. కపట సన్యాసి మోసకారి. ప్రతాపభానుని పట్ల కోపము, ద్వేషము కలవాడు. కాని వాటిని బయటికి కనపడనీయక కోమల వచనములతో యిట్లనెను: "నా పేరు భికారి. నేనిప్పుడు. నిరాశ్రయుడను, నిర్ధనుడను. నేనిచట

చాలకాలమునుండి నివసించుచున్నాను. శ్రీహరి తప్ప నాకు ఎవరితో పనిలేదు, నీవు అతి పవిత్రుడవు. నీపై నాకెక్కువ ప్రీతి కలదు. నా పేరు "ఏకతను" అనగా సృష్టి ప్రారంభమయిన నుంచి నేను ఒకే దేహమును దాల్చినాను. ఆశ్చర్యపడవలదు. తపస్సుచే సాధ్యముకానిది ఏదీలేదు". ఇట్లు తపస్వి అనేక పురాణ ఇతిహాసములు చెప్పి రాజును పూర్తిగా వశపరుచుకొనెను. అప్పుడు రాజు తన పేరును ప్రకటించెను. అప్పుడు సన్యాసి "రాజా! నాకంతయు తెలియును. నీ పేరు ప్రతాపభాను, నీ తండ్రి పేరు సత్యకేతువు. రాజులు ఎక్కడపడితే అక్కడ తమ పేరును ప్రకటించరాదని నీతిశాస్త్రము చెప్పుచున్నది. నీ సరళత్వము, ప్రేమ విశ్వాసములు, నీతి నైపుణ్యములు చూచి నీపై మమత్వము పెరిగినది. కావున నీ కోరిక ఏమో తెల్పుము" రాజు సంతోషించి, సన్యాసికి నమస్కరించి ఇట్లనెను:

"దయాసాగరా! మీ దర్శనము చేతనే నా కోరికలన్ని సిద్ధించినవి. అయినను మీరు సమర్థులు కావున దుర్లభమయిన ఒక కోరికను కోరెదను. నా శరీరము జరామరణరహితమై ఉండుగాక! యుద్ధములో నన్నెవ్వరు జయించకుందురుగాక! భూమిపై నూరు కల్పములు నా ఏకచ్ఛత్రాధిపత్యము ఉండుగాక!"

ఆ కుహనాసన్యాసి ఇట్లు పలికెను: "రాజా! అట్లే అగును. కాని ఒక సమస్య కలదు, వినుము: ఒక బ్రాహ్మణజాతి తప్ప మృత్యుదేవత కూడ నీకు దాసోహమనును. ఎందుకనగా తపోబలముచేత బ్రాహ్మణులు శక్తి సంపన్నులవుతారు. వారి క్రోధమునుండి తప్పించుకొనుట కష్టము. వారికి వ్యతిరేకముగా హింస, మోసము కూడ పనిచేయవు. విప్రశాపము తప్ప యముడు కూడ నిన్ను నాశనము చేయలేడు. కావున నీవు బ్రాహ్మణులను వశము చేసుకున్నచో బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కూడ వశమగుదురు." రాజు కపట సన్యాసి మాటలు విని "బ్రాహ్మణులు ఏ విధముగా నాకు వశమగుదురో

సెలవివ్వండి" అని పల్కెను. దానికి సన్యాసి నవ్వి ఇట్లు పలికెను. "నీవు ఈ అడవిలో దారి తప్పినది, నాతో కలిసినది, నేను చెప్పు విషయములు ఎవ్వరికినీ చెప్పరాదు. అప్పుడే నీ కోరిక నెరవేరును. బ్రాహ్మణులను వశపరచుకొనుటకు ఒక్క సులభోపాయము కలదు. అది నా అధీనమున కలదు. కాని పుట్టినప్పటినుండి నేనెవ్వరింటికి గాని, గ్రామమునకు గాని పోలేదు. కావున నేను నీ నగరమునకు రాలేను. అయిననూ నీవు నా భక్తుడవు. నా తపశ్శక్తిచే నేను నీ పురోహితుని అపహరించెదను. అతని వేషములో మీ నగరమునకు వచ్చి నేను వంట చేసెదను. నీవు దానిని ప్రతి దినము ఒక లక్షమంది బ్రాహ్మణులను వారి కుటుంబములతో సహా ఆహ్వానించి వడ్డించుము. ఈ వ్రతమును ఒక సంవత్సరము ఆచరించిన బ్రాహ్మణ జాతి అంతయు నీకు వశము అగును. అపుడు నీ కోరిక నెరవేరును. రాజా! చాల రాత్రి అయినది. ఇక నిద్రించుము. నా తపోబలము వలన నిన్ను నీ గుఱ్ఱముతో సహా నీ ఇల్లు చేర్చెదను. మరల మూడవ రోజు నీకు నా దర్శనమగును. పురోహితుని వేషములో మీ ఇంటికి వచ్చి నిన్ను ప్రక్కకు పిలిచి ఈ విషయమంతయు మరల చెప్పెదను. అప్పుడు నీవు నన్ను గుర్తించెదవు."

ఆ సన్యాసి ఆజ్ఞ ప్రకారము రాజు నిద్రపోయెను. బాగా అలసిపోవుటచే గాఢ నిద్రలోకి మునిగిపోయెను. కపట సన్యాసి నిద్రించక తమ యుక్తి ఎట్లు ఫలించునో ఆలోచించుచుండెను. అపుడు పంది రూపములో రాజును దారిమళ్ళించిన కాలకేతువు అను రాక్షసుడు అక్కడికి వచ్చెను. వాడు ఈ కపట సన్యాసి మిత్రుడు. అనేక మాయోపాయములు తెలిసినవాడు. వానికి పదిమంది సోదరులు, నూరుగురు కుమారులు ఉండిరి. వారు దుష్టులు, అజేయులు. వారి వలన బ్రాహ్మణులు, సజ్జనులు, దేవతలు దుఃఖితులగుట చూచి ప్రతాపభాను వారందరినీ యుద్ధములో చంపియుండెను. దుష్టుడైన

కాలకేతువు, కపట సన్యాసితో కలిసి తన ఉమ్మడి శత్రువైన ప్రతాపభాను నాశమునకు కుట్రపన్ని యుండెను. విధి వైపరీత్యము వలన రాజునకు ఈ విషయము తెలియదు. కాలకేతువును చూచి ఆ కపటముని అతనికి కథనంతయు వినిపించెను. రాక్షసుడు ఆనందించి, "రాజా! నీవు నా ఉపదేశానుసారము చేసితివి, నేను శత్రువును వశపరుచుకొని సమూలముగా నాశనము చేసి నాలుగవరోజు నిన్ను కలిసెదను" అని చెప్పి ప్రతాపభానుని గుఱ్ఱముతో సహా అతని మందిరమున చేర్చెను. రాజపురోహితుని అపహరించి తన మాయాశక్తితో వానికి బుద్ధిమాంద్యము కలిగించి ఒక పర్వత గుహలో దాచెను. రాక్షసుడు స్వయముగా పురోహితుని రూపమును దాల్చెను.

ప్రాతఃకాలమున రాజు నిద్రలేచి తన ఇంటిలో నుండుటను చూచి ఆశ్చర్యపోయెను. ఇది అంతయు ఆ మహర్షి తపోప్రభావమని భావించి, ఎవ్వరికీ తెలియకుండా మరల గుఱ్ఱమును ఎక్కి పోయి మధ్యాహ్నమునకు తిరిగి వచ్చెను. రాజుగారి ఆగమనమునకు సంతోషించి పురప్రజలు ఉత్సవములు చేసికొనిరి. పురోహితుని వేషములోనున్న రాక్షసుని చూచి జరిగినదంతయు రాజు ఒకసారి గుర్తుకు తెచ్చుకొనెను. ఒక లక్షమంది బ్రాహ్మణులను వారి కుటుంబములతో సహా భోజనమునకు ఆహ్వానించెను. పురోహితుడు నాలుగు రకముల వంటను షడ్రసోపేతముగా వండి, అందు అనేక జంతువుల మాంసముతోపాటు బ్రాహ్మణుల మాంసము కూడ వండి, అందులో కలిపెను. రాజు బ్రాహ్మణులందరిని భోజనమునకై పిలిచి సాదరముగా కూర్చుండబెట్టి వడ్డించగనే ఆకాశవాణి "ఓ బ్రాహ్మణులారా! లెండి, మీ ఇండ్లకు పొండి. ఈ భోజనము హానికరము. ఈ వంటలో జంతువుల, మనుష్యుల మాంసము కలుపబడినది. దీనిని తినవద్దండి", అని పల్కెను. ఆకాశవాణిని వినగానే బ్రాహ్మణులందరు లేచి నిలబడిరి. రాజు వ్యాకులుడాయెను. అతని బుద్ధి పనిచేయలేదు.

నోటమాట రాలేదు. బ్రాహ్మణులందరూ "ఓ నీచ క్షత్రియుడా! నీవు బ్రాహ్మణజాతిని సపరివారముగా నష్టపరచ జూచితివి. భగవంతుడు ధర్మమును రక్షించినాడు. నీవు సపరివారముగా నాశనము అయ్యెదవు. పరివార సహితముగా రాక్షసుడవై జన్మించెదవు" అని శపించిరి. పిదప రాజు వెంటనే వంటశాలలోనికి పోయి చూడగా అక్కడ వంటవాడుగాని, భోజన పదార్థములుగాని కనబడలేదు. అతడు జరిగిన వృత్తాంతము నంతయూ బ్రాహ్మణులతో నివేదించెను. వారు "నీవు నిర్దోషివైననూ, మా శాపము అప్రతిహతము" అని పల్కి వెళ్ళిపోయిరి.

నగరవాసులు ఈ సమాచారమును విని చాల చింతించి, విధాతను నిందించిరి. కాలకేతువు అసలు పురోహితుని ఇల్లు చేర్చి కపట సన్యాసికి ఆ విషయమంతయు తెలిపెను. ఆ కపట సన్యాసి శత్రురాజులందరినీ కూడగట్టుకొని ప్రతాపభానునిపై యుద్ధము ప్రకటించెను. ప్రతాపభాను, అతని సోదరుడు సైన్యములతో సహా చనిపోయిరి.

## 14. రావణుని జననము

భరద్వాజా! భగవంతుని అనుగ్రహము తప్పినవారికి ధూళి కూడ మేరు పర్వతముగా, తండ్రి యముడుగా, త్రాడు పాముగా భాసించును. కొద్దికాలము తర్వాత ఆ రాజే తన పరివారముతో సహా రాక్షసుడై జన్మించెను. అతనికి పది తలలు, ఇరవై భుజములు. అతని పేరు రావణుడు. అతడు ప్రచండుడు, శూరుడు, వీరుడు. ప్రతాపభాను తమ్ముడైన అరిమర్దనుడు మహాబలశాలియగు కుంభకర్ణుడుగా జన్మించెను. మంత్రియైన ధర్మరుచి రావణునికి తమ్ముడైన విభీషణుడుగా జన్మించెను. అతడు విష్ణుభక్తుడు, విజ్ఞానఖని. రాజ కుమారులు, సేవకులు, ఇతర పరివారమంతయు భయంకరమైన

రాక్షసులుగా జన్మించిరి. వారు కామరూపులు, దుష్టులు, వివేకహీనులు, నిర్దయులు, హింసాపరులు, పాపులు, ప్రపంచమును పీడించువారు.

ఈ ముగ్గురు సోదరులు అతి కఠోరమైన తపస్సు చేసిరి. వారి ముగ్గురి తపస్సును చూచి బ్రహ్మ ప్రత్యక్షమై "నాయనలారా! నేను ప్రసన్నుడనైతిని. వరమును కోరుడు" అనెను. రావణుడు సవినయముగా పాదాభివందనము చేసి "ప్రభూ! మనుష్య, వానరజాతి తప్ప, మరి ఎవరి వలన కూడ నాకు చావు లేకుండా వరమునిమ్ము" అనెను. "బ్రహ్మ అట్లే కానిమ్ము" అని పలికి కుంభకర్ణుని వద్దకు వచ్చెను. వానిని చూచి బ్రహ్మకు ఆశ్చర్యము వేసెను. "ఈ దుష్టుడు నిత్యము భుజించినచో ప్రపంచము కరువుతో మాడును" అని తలచి, శారదా మాతను వాని తలలో ప్రవేశించమని ప్రార్థించెను. ఆమె ప్రభావమువలన కుంభకర్ణుడు తనకు ఆరు మాసములు నిద్రను ప్రసాదింపుమనెను. చివరకు బ్రహ్మ విభీషణుని వద్దకు వచ్చెను. అతడు విష్ణుపాదపద్మములయందు పవిత్ర ప్రేమను వరముగా నడిగెను. వారికి వరములిచ్చి బ్రహ్మ సత్యలోకమునకు పోయెను. ముగ్గురు సోదరులు సంతుష్టులై గృహోన్ముఖులైరి.

మయుడు అను దానవునికి మందోదరి అను సౌందర్యవతియైన కూతురుండెను. రావణుడు రాక్షసరాజు అగునది తెలిసి మయుడు ఆమెను రావణుని వద్దకు పిలుచుకొని వచ్చి వివాహము చేసెను. సముద్రమధ్యములో బ్రహ్మ నిర్మితమైన అతి విశాలమైన, దుర్గమమయిన త్రికూట పర్వతముండెను. మయుడు గొప్ప మాయావి, మరియు శిల్పి. ఆ పర్వతముపై రత్నఖచితమైన బంగారు భవనములను నిర్మించెను. అది అమరావతికన్న మిన్నయై లంకయని ప్రసిద్ధిగాంచెను. నాలుగు వైపుల సముద్రము దానికి సహజమైన కందకములుగా నుండెను. మణులు చెక్కిన బలిష్ఠమయిన ప్రహరీ గోడలతో ఆ నగరము శోభిల్లెను. శ్రీహరి సంకల్పముగా ఎవడు ప్రతి కల్పములో

రాక్షసరాజగునో వాడు శూరుడు, ధీరుడు, ప్రతాపి, బలశాలి - తన సేనతో సహా అక్కడ నివసించును. మొదట అక్కడ గొప్ప రాక్షస యోధులు నివసించుచుండిరి. దేవతలు వారినందరినీ యుద్ధములో హతమార్చిరి. ఇంద్రుని ఆజ్ఞచే ఒక కోటిమంది కుబేర భటులు యక్షులు దానిని రక్షించుచుండిరి. రావణునికి ఈ వార్త తెలిసినంతనే సైన్యముతో ఆ కోటను ముట్టడించెను. ఆ సైన్యమును జూచి యక్షులు ప్రాణభయముతో పారిపోయిరి. విజేత అయిన దశకంఠుడు స్వాభావికముగా అందమైన, దుర్గమమయిన ఆ నగరమును చూచి, ఆనందించి దానిని తన రాజధానిగా చేసుకొనెను. రాక్షసులకు వారి యోగ్యతానుసారము గృహములను ఇచ్చెను. ఒకసారి కుబేరునిపై దండెత్తి అతని నుండి పుష్పకమును విమానమును జయించి తీసుకొనెను. మరొక సమయమున కైలాస పర్వతమును అవలీలగానెత్తి తన భుజబలమును పరీక్షించుకొని సంతోషముతో తిరిగి వచ్చెను.

రావణుని సుఖసంపదలు, పుత్రులు, సైన్యము, ప్రతాపము, బలము, బుద్ధి, కీర్తి, నిత్యనూతనమాయెను. అతిబలుడైన కుంభకర్ణుడు అతని సోదరుడు. మేఘనాథుడు అతని పెద్ద కుమారుడు. యుద్ధములో అతనిని ఎదిరించువారు ఎవ్వరు లేరు. అతని పేరు వినినంతనే దేవతలు గడగడ వణకుచుండిరి. రావణునికి ఇంకను అనేక కుమారులుండిరి. వారందరు యోధులు, ఈ రాక్షసులందరు కామరూపులు, రాక్షస మాయలో ప్రవీణులు. వారి హృదయముల దయాధర్మములు స్వప్నములందు కూడ కానరా.

ఒకసారి రావణుడు సభలో కూర్చొని అపరిమితమయిన తన పరివారమును చూచెను. అతని కుమారులు, మనుమలు, బంధువులు, సేవకులు రాక్షసయోధులు లెక్కించవీలులేనంతమంది యుండిరి. తన సేనను జూచి స్వాభావికముగా అభిమానియైన రావణుడు క్రోధము, గర్వములతో నిట్లనెను: "ఓ రాక్షసవీరులారా! వినుడు. దేవతలు మన

శత్రువులు, వారు మన ఎదుటపడి యుద్ధము చేయరు. బలశాలియైన శత్రువును జూచి వారు పారిపోవుదురు. వారు అందరి మృత్యువునకు ఒకే ఉపాయము ఉన్నది. వారి బలమును వృద్ధిచేయు బ్రాహ్మణభోజనములు, యజ్ఞములు, హవనములు, శ్రాద్ధములు, ధ్వంసము చేయండి. ఆకలితో చిక్కి, కృశించి సహజముగా చచ్చెదరు లేదా మనకు అధీనులయ్యెదరు."

పిమ్మట మేఘనాధుని పిలిచి అతని పరాక్రమమును దేవతలయెడ అతనికి గల వైరమును ఎక్కువగునట్లు ప్రేరేపించి, "కుమారా! దేవతలు రణధీరులు, బలశాలులు. నీవు వారిని యుద్ధములో జయించి బందీలుగా తీసుకొనిరమ్ము" అని ఆజ్ఞాపించెను, కుమారుడు లేచి తండ్రికి నమస్కరించి ఆయన ఆజ్ఞను పాలించెను.

ఈ విధముగా రావణుడు ఎల్లరకు ఆజ్ఞలనిచ్చి తాను స్వయముగా గదాధారియై బయలుదేరెను. అతడు నడిచిన భూమి కంపించెను. వాని గర్జనలచే దేవతా స్త్రీలు మూర్ఛిల్లిరి. దేవతలు పారిపోయి మేరు పర్వతగుహలలో దాచుకొనిరి. దిక్పాలకుల లోకములన్నియు రావణునికి శూన్యముగా కనిపించెను. యుద్ధోన్మాదముతో తనకు దీటయిన యుద్ధవీరునకై వెదకుచూ విశ్వమంతయు తిరిగెను. కాని అట్టి యోధుడు ఎవ్వడూ దొరకలేదు. సూర్యచంద్రులు, వాయువు, వరుణుడు, అగ్ని, కుబేరుడు, యముడు మొదలగు దిక్పాలకులను, మనుష్య, సిద్ధ, కిన్నర, కింపురుషులందరిని బుద్ధిపూర్వకముగా హింసించెను. భయభీతులై అందరూ సవినయముగా పాదాభివందనము ఆచరించి అతని ఆజ్ఞలు పాలించిరి. ఇంద్రజిత్తునకు ఇచ్చిన యాజ్ఞలను అతడు వెంటనే చేయుచుండెను. అతని ఆజ్ఞ ననుసరించి రాక్షసులందరు కలిసి దేవతలను హింసించుచుండిరి. ఉపద్రవములు, మాయాప్రయోగములు, కామరూపధారణలచే భయపెట్టుచుండిరి. ధర్మవిరుద్ధముగా వేదోక్తకర్మలకు వ్యతిరేకముగా చేయుచుండిరి. గోవులు, బ్రాహ్మణులు

ఉన్న నగరములను అగ్నికి ఆహుతి చేయుచుండిరి. వారి భయము వలన శుభకార్యములెచ్చట కూడ జరుగుటలేదు. దేవతలు, బ్రాహ్మణులు, గురువులను ఎవ్వరూ గౌరవించుట లేదు. హరిభక్తి, యజ్ఞము, తపస్సు, జ్ఞానము, వేదపురాణములు స్వప్నములో కూడ వినపడకుండెను. జపము, యోగము, వైరాగ్యము మొదలగు మాటలు వినిన తోడనే రావణుడు స్వయముగా వాటిని ధ్వంసము చేయుచుండెను. ధర్మము అను మాట చెవికి కూడ సోకనంత భ్రష్టాచారము వ్యాపించెను. పరధనమును, పరస్త్రీలను అపహరించువారు, దుష్టులు, చోరులు, జూదరుల సంఖ్య ఎక్కువాయెను. తల్లిదండ్రులను, గురువులను, దేవతలను ఎవ్వరు గౌరవించుట లేదు. పైగా వారితోనే సేవలు చేయించుకొనుచుండిరి.

## 15. శ్రీరామ జననము, బాల్యము

భవానీ! ఈ విధముగా ప్రవర్తించువారినందరినీ నీవు రాక్షసులుగానే భావించుము. ధర్మముయెడ సంభవించిన ఈ శైథిల్యమును (శిథిలావస్థను) చూచి భూదేవి అతి వ్యాకులత నొందెను. "పర్వతములు, నదులు, సముద్రములు నాకు బరువు కావు. కాని ఈ దుష్టులు, పరద్రోహులు మిక్కిలి బరువైనవారు" అని తలచి భూదేవి రావణుని అధర్మకార్యములను చూచి గోరూపము ధరించి దేవతలు మునులు ఉన్న చోటికి పోయి విలపించుచూ తన దుఃఖమును వినిపించెను. కాని ఎవరునూ ఆమెకు సహాయపడలేదు. దేవతలు, మునులు, గంధర్వులు, అందరు కలసి భూమాతతో సహా బ్రహ్మలోకమునకు పోయిరి. బ్రహ్మదేవుడు అంతయు తెలిసికొన్న తర్వాత తన అశక్తతను ప్రకటించి యిట్లనెను : "ఓ ధరణీ! ఎవరికయితే నీవు దాసివో ఆ అవినాశి పరమాత్మయే మనకు సహాయపడును. మనస్సు పదిలపరచుకొని శ్రీహరి చరణములను స్మరించుము. ప్రభువు తన భక్తుల కష్టములను తొలగించును" అని పల్కెను.

ఆ సమయమున అచటనే ఉన్న పరమేశ్వరుడు ఇట్లు పలికెను: "శ్రీహరి సర్వవ్యాపి, ప్రేమతో తన్ను తాను ప్రకటించుకొనును. ప్రభువులేని దేశము, కాలము, దిక్కు లేనేలేదు, అతను చరాచరజగత్తులో వ్యాపించినవాడు." ఈ మాటలు విని బ్రహ్మదేవుడు చేతులు జోడించి ప్రార్థించసాగెను:

"ఓ దేవతల స్వామీ! భక్తులకు సుఖప్రదుడా! శరణాగతరక్షకా! మీకు జయము జయము. గోబ్రాహ్మణ హితకారీ, అసురవినాశకారీ, సింధుకన్యాపతీ, నీకు జయము జయము. మీ లీలలు అద్భుతము. వాని రహస్యము ఎవ్వరికీ తెలియదు. అవినాశి, సకల హృదయవాసి, సర్వ వ్యాపి, పరమానందస్వరూప, మోక్షప్రదాత మీకు జయము జయము. విరక్తులై, మోహరహితులై మును లెవ్వరిని అత్యంతానురాగముతో సదా ధ్యానము చేయుదురో, ఎవ్వరి గుణగానము చేయుదురో అట్టి సచ్చిదానంద స్వరూపుడగు భగవంతునికి జయమగుగాక! ఎవ్వడు సత్త్వరజస్తమమయిన సృష్టిని చేసెనో, తానే బ్రహ్మవిష్ణుమహేశ్వర రూపములలో సృష్టిస్థితిలయలకు కారణమాయెనో, అట్టి భగవానుడు మా ప్రార్థనలు వినుగాక! ఎవరిని సరస్వతీదేవి, వేదములు, శేషుడు, ఋషులు కూడా సంపూర్ణముగా తెలిసికొనలేరో, అట్టి భగవంతుడు మాపై కృపచూపు గాక! సంసారసముద్రమునకు మందరాచలరూపుడవై, సుందరసుగుణాల రాశివైన ఓ ప్రభూ! మునులు, సిద్ధులు, దేవతలు అందరూ అత్యంత వ్యాకులతతో మీ చరణకమలములకు ప్రణామము చేయుచున్నారు." బ్రహ్మదేవుని ప్రార్థనను విని, దేవతలను, పృథ్వీదేవిని భయభీతులుగా తెలుసుకొని వారి శోకమును పరిహరించు గంభీరమయిన ఆకాశవాణి ఇట్లు పలికెను:

"ఓ మునులారా, సిద్ధులారా, దేవతలారా! భయపడకుడు. మీ కొరకై నేను మానవరూపమును ధరించి శ్రేష్ఠమైన సూర్యవంశములో అవతారము దాల్చెదను. అదితి కశ్యపులు తపస్సు చేయగా వారికి ఇదివరకే

వరము నిచ్చినాను. వారు అయోధ్యానగరమున కౌసల్యాదశరథులుగా జన్మించినారు. వారి గృహములో నేను నా అంశలతోసహా నలుగురు సోదరులుగా అవతారము దాల్చగలను. ఆదిశక్తి కూడ భూమిపై జన్మించును. భూభారమును బాపెదను. మీరు నిర్భయులై పొండు." ఆకాశవాణి పల్కులను వినిన దేవతల హృదయములు చల్లపడెను. బ్రహ్మదేవుడు వారితో "మీరు వానర శరీరములను ధరించి భూమిపై భగవంతుని సేవ చేయండి" అని చెప్పి పంపెను. బ్రహ్మదేవుడు భూదేవిని ఓదార్చి ఆమె భయమును మాన్పి మనస్సును పదిలపరచెను. బ్రహ్మదేవుని ఆజ్ఞలను ఆచరణలో చూచుటకు దేవతలు మిక్కిలి బలపరాక్రమములతో వానర శరీరములను ధరించి పృథ్విపై జన్మించిరి. వారు శూరులు, వీరులు, బుద్ధిమంతులు. భగవంతుని ఆగమనమునకు ఎదురు చూచుచుండిరి. పర్వతములలో అడవులలో ఉత్తమమయిన సేనగా ఏర్పడి అన్నిచోట్ల నివాసములు ఏర్పరుచుకొనిరి.

అయోధ్యానగరమునకు రఘుకుల శిరోమణి అయిన దశరథుడు రాజాయెను. అతడు ధర్మాత్ముడు, జ్ఞాని, సుగుణాలరాశి. అతని మనస్సు ఎల్లప్పుడూ హరిస్మరణలోనేయుండును. అతనికి కౌసల్యా, కైకేయి, సుమిత్ర అను భార్యలుండిరి. వారు పవిత్ర జీవనముగలవారు. పతియాజ్ఞను జవదాటరు. శ్రీహరి చరణకమలములపై అత్యంత భక్తి గలవారు.

దశరథ మహారాజు తనకు సంతానము లేదని విచారముతో ఒకసారి గురువైన వశిష్ఠుని వద్దకు పోయి, అతని పాదములకు నమస్కరించి తన సుఖదుఃఖములన్నియూ అతనికి విన్నవించెను. వశిష్ఠుడు అతనిని ఓదార్చి "ధైర్యము వహించుము. నీకు నలుగురు కుమారులు కలిగెదరు. వారు ముల్లోకములలో ప్రసిద్ధిగాంచెదురు. భక్తుల భయమును హరించెదరు" అని పలికెను. తరువాత వశిష్ఠుడు ఋష్యశృంగ మహర్షిని పిలిపించి అతనిచే పుత్రకామేష్టి

యాగమును చేయించెను. మహర్షి భక్తితో ఆహుతినివ్వగా హవిష్యాన్న పాయసముతో అగ్నిదేవుడు ప్రత్యక్షమై దశరథునితోనిట్లు పలికెను: "వశిష్ఠుడు చెప్పినట్లు నీ మనోభీష్టములన్నియూ సిద్ధించును. రాజా! నీవీపాయసమును గొనిపోయి ఉచిత రీతిని నీ భార్యలకు పంచుము." అగ్నిదేవుని పలుకులకు రాజు పరమానందభరితుడాయెను. వెంటనే తన పత్నులను పిలిపించి ఆ పాయసమును పంచెను. రాణులు ముగ్గురు గర్భవతులైరి. వారి హృదయములలో ఆనందము, సుఖము ఇనుమడించెను. శ్రీహరి గర్భస్థుడు అయిన దినమునుండి లోకములలో సుఖసంపదలు ఎక్కువాయెను. సౌందర్యశీల, తేజోరాశులైన రాణులు రాజమందిరమును సుశోభితమొనర్చిరి.

ఆనందముగా కొంత సమయము గడిచెను. భగవంతుడు అవతరించు సమయము ఆసన్నమాయెను. యోగ, లగ్న, తిథి వారములన్నియు అనుకూలములు ఆయెను. చైత్ర శుద్ధ నవమి తిథియందు అభిజిత్ లగ్నమున మధ్యాహ్నసమయమున ఎక్కువ చలిగాని, వేడిగాని లేకుండా సర్వలోకములలో శాంతిని చేకూర్చు సమయము ఆసన్నమాయెను. చల్లని, మెల్లని, సువాసనా భరితమయిన గాలి వీచుచుండెను. దేవతలు ఆనందించుచుండిరి. సజ్జనుల మనస్సులు ఉత్సాహభరితములు ఆయెను. వనములు పుష్పించినవి. పర్వతములు మణిమయములు ఆయెను. నదులు అమృత ప్రవాహముతో నిండియుండెను. "భగవంతుడు అవతారము దాల్చు సమయము ఆసన్నమయినది" అని బ్రహ్మ, ఇతర దేవతలు తమ విమానములలో బయలుదేరిరి. నిర్మలాకాశము దేవతాసమూహముతో నిండెను. గంధర్వులు గుణగానము చేయుచూ అంజలిఘటించి పూలవర్షమును కురిపించిరి. ఆకాశమున నగారాలు మ్రోగెను. అపుడు లోక కళ్యాణమును చేకూర్చుటకై జగదాధారుడైన ప్రభువు అవతరించెను.....

కృపాళువు, పరమదయానిధి, కౌసల్యహితకారియైన ప్రభువు

ఉదయించెను. మునిమనోహరుడైన ప్రభు రూపమును చూచి మాత కౌసల్య పరమానందము పొందెను. సకల జనులకు నేత్రా నందకరమయిన నీలమేఘచ్ఛాయ కలిగియుండెను. ఆయుధములను ధరించిన నాలుగు భుజములు, మెడలో మణిహారములు, వనమాల కలిగి విశాలనేత్రుడు సౌందర్యమహోదధి రాక్షస సంహారమునకై అవతరించెను. కౌసల్యాదేవి చేతులు జోడించి ఇట్లు పలికెను: "ప్రభూ, నీవు అనంతుడవు. నిన్నేవిధముగా స్తుతించవలెను? వేదపురాణములు నిన్ను మాయాగుణజ్ఞానములకు అతీతుడవని పొగిడినవి. శ్రుతులు, సజ్జనులు కరుణాసముద్రుడవని, సద్గుణరాశియని ఎవనిని స్తుతించెదరో అట్టి భక్తపరాధీనుడు లక్ష్మీపతి నేడు ప్రత్యక్షమాయెను. నీదు ప్రతి రోమమందు మాయావిరచిత విశ్వమున్నదని వేదములు పలుకుచున్నది. అట్టి నీవు నా గర్భములో ప్రవేశించినావు. ఇది వినినచో ధీరపురుషుల బుద్ధి కూడ చలించిపోవును." ఇట్లు మాతకు జ్ఞానోదమయిన వెంటనే భగవంతుడు చిరునవ్వు నవ్వెను. ప్రభువు అనేక లీలలు చేయసంకల్పించెను. పూర్వజన్మవృత్తాంతములు అన్నియు ఆమెకు ఎఱిగించెను. దాని వలన ఆమెకు భగవంతునిపై పుత్రవాత్సల్యము అధికమాయెను. మరల మాత కౌసల్య పల్కెను: "నాయనా! ఈ రూపమును వదిలివేసి అతి ప్రియమైన శిశురూపముతో లీలలు చేయుము. నాకా సుఖమే సాటిలేనిది." తల్లి మాటలు విని దేవదేవుడు చిన్న శిశురూపముతో ఏడవసాగెను. [ఈ చరిత్రను గానము చేసినవారు శ్రీహరి పాదపద్మములను చేరి సంసారకూపమునకు తిరిగిరారు అని తులసీదాసు చెప్పుచున్నాడు.]

అత్యంత మధురము ప్రియము అయిన శిశురోదమును విని రాణులందరు పరుగెత్తి వచ్చిరి. దాసీలు సంతోషముతో ఇటునటు తిరగసాగిరి. పురజనులు ఆనందమగ్నులైరి. దశరథుడు పుత్రజనన వార్తవిని బ్రహ్మానంద భరితుడాయెను. అతిశయ ప్రేమతో శరీరము

పులకరించెను. ఎవని పేరు వింటేనే శుభములు కలుగునో అట్టి ప్రభువు తన ఇంట జన్మించినాడని పరమానందభరితుడాయెను. మంగళవాద్యములు వాయించుడని ఆజ్ఞాపించెను. గురువైన వశిష్ఠుని పిలిపించెను. అతడు బ్రాహ్మణులతో సహా వచ్చెను. వారు అందాలరాశి అగణితగుణఖని అయిన అపురూప బాలుని గనిరి. జాత కర్మసంస్కారములన్నియు చేసి రాజు బ్రాహ్మణులకు బంగారము, ఆవులు, వస్త్రములు, మణులు దానముగా నిచ్చెను. నగరము ధ్వజ పతాక తోరణములతో వర్ణించుటకు వీలులేనంత అలంకరించబడెను. ఆకాశమునుండి పుష్పవర్షము కురిసెను. జనులందరూ బ్రహ్మానంద భరితులు అయిరి. స్త్రీలు గుంపుగుంపులుగా సహజశృంగారమును చేసికోకుండగనే ఎట్లున్నవారు అట్లే వచ్చిరి. బంగారు కళశములు, పళ్ళెములతో మంగళద్రవ్యములు తీసుకొని వారు మంగళగీతములు పాడుచూ రాజద్వారమును ప్రవేశించిరి. బాలుని చుట్టు దీపములతో హారతిని, దృష్టిని తీసిరి. వందిమాగధులు, సూతులు, గాయకులు రఘుకులస్వామి గుణములను గానము చేసిరి. నగర వీధులన్నియూ కస్తూరి చందనములతో తడిసిపోయెను. ఇంటింట మంగళవాద్యములు మ్రోగెను.

కైకేయి ఒక కుమారుని, సుమిత్ర ఇద్దరు కుమారులను ప్రసవించిరి. ఆ సుఖసంపదలు, సమయము, సమాజమును వర్ణించుటకు శారదాశే షులకు కూడ శక్యము కాదు. నిశాదేవి తన ప్రభువును జూచుటకు వచ్చి సూర్యుని చూసి లజ్జతో వెనుకకు మళ్ళి ఉషస్సుగా మారినట్లు అయోధ్యానగర శోభ కనిపించుచుండెను. అగరుధూపములయొక్క పొగ సంధ్యాకాలపు చీకటివలె, ఒకరిపై నొకరు చల్లుకొను ఎర్రనిరంగు సూర్యాస్తమయము వలె, మందిరములపై ఉన్న మణులు నక్షత్రముల వలె, రాజప్రసాదముపై గల కళశము చంద్రునివలె ప్రకాశించెను. రాజభవనములో అత్యంతకోమలవాణితో సాగు వేదధ్వనులు, సమయా

నుసారము చేయు పక్షుల కలకలస్వనములతో వాతావరణము అతి మనోహరమాయెను. ఈ ఉత్సాహమును చూచి సూర్యుడు కూడ తన వేగమును మరచిపోయెను. ఒక నెల గడిచినది. సూర్యునికి కూడ తెలియలేదు. సంతోషభరితులయిన నగరవాసులందరూ నలుగురు కుమారులు చిరంజీవులుగా నుండవలెనని ఆశీర్వదించిరి.

ఈ విధముగా కొన్ని దినములు గడిచెను. రాత్రింబవళ్ళు గడిచినట్లు అనిపించలేదు. నామకరణ సంస్కార సమయము వచ్చినదని రాజు వశిష్ఠుని పిలిపించి, పూజించి "మునీశ్వరా! మీరు నిర్ణయించిన పేర్లను వీరికి పెట్టండి" అని పల్కెను. వశిష్ఠుడు ఇట్లు పలికెను: "రాజా! వీరికి అనేక అపూర్వనామములు గలవు. కాని నా బుద్ధి అనుసారము చెప్పెదను. ఈ ఆనందసింధువుయొక్క ఒక కణముతోనే ముల్లోకములు సుఖమయములు అగును. ఇట్టి సుఖరాశి పేరు శ్రీరాముడు. ఇతడు లోకములకు శాంతిని చేకూర్చువాడు. రెండవ బాలుడు జగత్తును భరించి పోషించువాడు. కావున అతని పేరు భరతుడు. ఎవని నామస్మరణచేతనే శత్రువులు హతము అగుదురో అతడు శత్రుఘ్నుడు. సర్వసులక్షణ సంపన్నుడు శ్రీరామునికి ప్రీతిపాత్రుడు జగదాధారుడు అయిన బాలకుడు లక్ష్మణుడు" అని నామకరణము చేసెను. వశిష్ఠ మహర్షి నలుగురి పేర్లను బాగా ఆలోచించి పెట్టిన పిదప ఇట్లు పలికెను:

"రాజా! ఈ నలుగురు కుమారులు వేదస్వరూపులు. వారిలో శ్రీరాముడు మునులకు, భక్తులకు సకల కోరికలను ఇచ్చువాడు. శివునికి ప్రాణము. ఇప్పుడితడు బాల్యచేష్టలతో ఆనందమును పొందును. లక్ష్మణుడు బాల్యమునుండియు శ్రీరాముని తన హితైషి అనియు యజమాని అనియు భావించి శ్రీరాముని చరణములను ఆశ్రయించును. స్వామి, సేవకులమధ్య ఎట్టి ప్రేమయుండునో అట్టి ప్రేమ భరత, శత్రుఘ్నుల మధ్యయుండును. శ్రీరాముడు, భరతుడు

శ్యామలవర్ణులు కాగా, లక్ష్మణ శత్రఘ్నులు గౌరవర్ణులు. నలుగురు సోదరులు రూపశీలగుణ నిలయములు. అందులో శ్రీరాముడు అత్యంత సుఖప్రదుడు అతని హృదయమున కృపయనెడి చంద్రుడు ఉండగా మనోహరమైన నవ్వులో ఆ చంద్రుని కిరణములు యుండును. ఒకసారి తన ఒడిలో, మరొక సారి ఊయలలో తల్లి కౌసల్య అతనికి జోలపాడుచుండును. సర్వవ్యాపి, నిరంజనుడు, నిర్గుణుడు, అజుడు, వినోదభరితుడు అయిన ఆ పరబ్రహ్మ కౌసల్యాదేవి ప్రేమకు పాత్రుడై ఆమె వడిలో ఆడుచుండును."

నీలకమలము, గంభీరమేఘములను పోలిన శ్రీరాముని నల్లని శరీరము కోటిమన్మథుల శోభచే వెలుగొంచుచుండెను. ఎఱ్ఱని చరణకమలములపై తెల్లని నఖముల కాంతి ఎఱ్ఱకమలపత్రముపై ముత్యములవలె ప్రకాశించుచుండెను. ఆయన పాదముల అడుగున వజ్ర, ధ్వజ, అంకుశ చిహ్నములు ఉండెను. కాలినూపురముల శబ్దము, నడుముచుట్టు మొలనూలు గజ్జల సవ్వడి మనోహరమైయుండెను. ఉదరము త్రివళులతో, విశాలభుజములు భూషణములతో శోభిల్లుచుండెను. ఎదపై పులిగోళ్లు అందమును ఇనుమడింపచేసెను. హృదయముపై మణిమయహారములు, భృగుమహర్షి పాదముద్రలు చూచినవారిని ముగ్ధులుగా చేయుచుండెను. సుందరమయిన కంఠము, పండ్లవరుస, ఎఱ్ఱని పెదవులు, నాసిక, తిలకమును దిద్దిన ఫాలము, రత్నకుండలములు గల చెవులు, చూపరుల మనస్సును దోచుచుండెను. మధురమయిన చిలుకపలుకులు వినుటకు ఇంపుగా నుండెను. దట్టమయిన ఉంగరాల జుట్టును తల్లి అనేక రకముల సింగారించుచుండెను. ఆనందస్వరూపుడు, మాయాతీతుడు, వాక్కునకు జ్ఞానేంద్రియములకు గూడ గోచరముకాని ప్రభువు, కౌసల్యాదశరథుల వాత్సల్యమునకు వశుడై బాల్యచేష్టలు చేయుచుండెను. కౌసల్యాదేవి పుత్రప్రేమతో నిమగ్నమై రాత్రింబవళ్ళు గడిచిపోవుటగూడ గమనించకుండెను. శ్రీరామచంద్రుడు తన బాల్యక్రీడలచే నగరవాసులందరినీ సంతోషపరుచుచుండెను.

ఒకరోజు కౌసల్యాదేవి కుమారునికి స్నానముచేయించి, అలంకరణచేసి తొట్లెలో పడుకోబెట్టెను. తాను స్నానము చేసి, తమ ఇష్టదేవతారాధనకు సిద్ధపరుచుచుండెను. దేవతాపూజ అయిన పిమ్మట నైవేద్యమునుంచి వంట ఇంటిలోనికి పోయెను. తిరిగి వచ్చుసరికి భగవంతునికి వుంచిన నైవేద్యమును శ్రీరాముడు భుజించుచుండుటను చూచెను. భయపడి, గృహములోకి పోయి చూడగా అచ్చట తొట్లెలో తన కుమారుడు నిద్రించుచుండెను. మరల పూజాగృహములో చూడగా అచ్చట కూడ తన కుమారుడు ఉండెను. ఆమె హృదయము కంపించెను. మనశ్శాంతి కోల్పోయెను. రెండు చోట్ల తన కుమారుడు ఉండుట ఎట్లు సంభవము? ఇది నా భ్రమయా అని ఆలోచించెను. శ్రీరాముడు తన తల్లి వ్యాకులతను చూచి బిగ్గరగా నవ్వెను. ప్రభువు తన తల్లికి అద్భుతమైన విశ్వరూపమును చూపెను. ఆ శరీరములో ఆమె కోటానుకోట్ల విశ్వములను చూచెను. అసంఖ్యాకములయిన సూర్యచంద్రులను, బ్రహ్మలను, పరమేశ్వరులను, అనేక పర్వతములు, నదులు, సముద్రములు, భూగోళములు, వనములు, తాను ఇంతవరకు చూడని, వినని అనేక వింతలను చూచెను. సర్వశక్తి స్వరూపిణి అయిన మాయ చేతులు జోడించి నిలబడి యుండెను. మాయకు వశులైన జీవాత్మలను, జీవుని మాయా విముక్తుని చేయు భక్తిని కూడ చూచెను. కౌసల్య శరీరము పులకరించెను. ఆమె నోట మాట రాలేదు. కళ్ళు మూసికొని శ్రీరాముల పాదములపై పడెను. విస్మితురాలైన తల్లిని చూచి శ్రీరాముడు మరల బాలుడాయెను. "జగత్పిత అయిన పరమాత్ముని నా కుమారుడని భావించితిని" అని విచారించెను. కౌసల్య చేతులు జోడించి మాటిమాటికి ప్రార్థించెను. శ్రీహరి తన బాల్యచేష్టలచే తన దాసులను అనేవిధముల ఆనందపరిచెను. నలుగురు సోదరులు కూడ ఇంటిలోనివారందరిని, నగరవాసులను తమ బాల్యక్రీడలచే సంతోషపరచిరి.

కొద్దికాలము తర్వాత గురువు వారి చూడాకర్మ సంస్కారములు చేసెను. నలుగురు రాజకుమారులు అపార క్రీడలలో పారంగతులైరి. మనోవాక్కర్మలకు అగోచరుడైన ప్రభువు దశరథుని ప్రాంగణములో ఆడుచుండెను. భోజనసమయమున రాజు పిలిచినా తన సఖులను వదలి రాకుండెను. కౌసల్య పిలువడానికి పోతే పారిపోయేవాడు. తల్లి బలవంతముగా పట్టుకొని రాజుగారి దగ్గరికి పిలుచుకొని వచ్చేది. ధూళిధూసరిత దేహముతోనున్న కుమారులను రాజు తన వడిలో కూర్చుండబెట్టుకొనెడివాడు.

శ్రీరామచంద్రుని బాల్యలీలలు మిక్కిలి సరళమయినవి. సుందర మయినవి. నలుగురు సోదరులు కౌమారదశకు రాగానే తల్లిదండ్రులు వారికి ఉపనయన సంస్కార మొనరించిరి. శ్రీరఘునాథుడు సోదరులతో సహా గుర్వాశ్రమమునకు విద్యాభ్యాసమునకై పోయెను. కొద్ది సమయములోనే వారు అన్ని విద్యలు చక్కగా నేర్చిరి. నాలుగు వేదములకు శ్వాసయైన శ్రీహరి వానిని అభ్యసించుటకు గురువు వద్దకు పోవుట ఆశ్చర్యకరము. నలుగురు విద్యావినయగుణశీలసంపన్నులైరి. రాజోచిత విద్యలను కూడ వారు అభ్యసించిరి. ధనుర్బాణములు వారి చేతులలో మిక్కిలి శోభిల్లుచుండెను. చరాచర సృష్టి అంతయు వారి రూపమునకు ముగ్ధమగుచుండెను. వారు విహరించు వీధులలో జనులు వారిని చూచి ముగ్ధులై నిలిచిపోవుచుండిరి. అయోధ్యలోని స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు, అందరూ శ్రీరాముని తమ ప్రాణములకన్న ఎక్కువగా ప్రేమించుచుండిరి. శ్రీరాముడు తన తమ్ములతో స్నేహితులతో కూర్చొని భుజించుచుండెను. మాతాపితరుల ఆజ్ఞను పాలించుచుండెను. అయోధ్యావాసుల సుఖమునకే ఎల్లప్పుడు పాటుపడెడివాడు. వేదపురాణములను శ్రద్ధగా విని వాని అంతరార్థ మును సోదరులకు, స్నేహితులకు విశదీకరించువాడు. ప్రాతఃకాలముననే లేచి శ్రీరఘునాథుడు తల్లిదండ్రులకు, గురువునకు ప్రణామమును

ఆచరించి, వారి ఆజ్ఞతో నగర కార్యకలాపములలో పాల్గొనెడివాడు. అతని జీవిత విధానమును చూచి రాజు మిక్కిలి సంతోషించుచుండెను.

## 16. విశ్వామిత్రుని యాగరక్షణ

జ్ఞాని అయిన విశ్వామిత్ర మహాముని అడవిలో ఒక శుభప్రదమయిన ఆశ్రమములో నివసించుచుండెను. అచ్చట అతడు జప, యోగ, యజ్ఞములను ఆచరించువాడు. కాని అతనికి మారీచసుబాహులను రాక్షసులవలన భీతి కలుగుచుండెను. ఏలయన, యజ్ఞమును చేసినంతనే వారు దానిని అపవిత్రము చేసి ఉపద్రవమును సృష్టించుచుండిరి. ముని చాల దుఃఖితుడాయెను. శ్రీహరి సహాయము లేకుండా ఈ క్రూరరాక్షసులను సంహరించుట కష్టమని భావించెను. అతడు తనలోతాను ఇట్లు ఆలోచించెను: "శ్రీహరి భూభారమును బాపుటకు ఇదివరకే అవతరించినాడు. ఈ రాక్షసులను చంపునెపముతో పోయి ప్రభుపాదకమలముల దర్శనము చేసుకొందును. రాజునకు విన్నపము చేసి రామలక్ష్మణులను ఇక్కడకు పిలుచుకొని వచ్చెదను. జ్ఞాన, వైరాగ్య, సద్గుణరాశియైన ప్రభువును కనులారా దర్శనము గావించుకొందును." ఇట్లు ఆలోచించి ఏ మాత్రము జాగు చేయక విశ్వామిత్రుడు అయోధ్యకు బయలుదేరెను. సరయూనదిలో స్నానమాడి దశరథ మహారాజు సభలో ప్రవేశించెను.

మునీశ్వరుని ఆగమనమును విని రాజు బ్రాహ్మణులతో సహా వెళ్ళి అతనిని కలిసి దండప్రణామములు ఆచరించి అతి గౌరవముతో పిలుచుకవచ్చి సింహాసనమున కూర్చుండబెట్టెను. మునికి పాదపూజ చేసి అనేక సత్కారములతో అతనిని సంతృప్తిపరచెను. తర్వాత రాజు తన నలుగురు కుమారులను తోడుకొని వచ్చి మునికి నమస్కరింపజేసెను. శ్రీరామచంద్రుని చూడగనే ముని తనను తాను మరచిపోయెను. చంద్రుని చూచిన చకోరపక్షివలె శ్రీరాముని సౌందర్యమునకు అతడు

ముగ్ధుడాయెను. మిక్కిలి సంతోషించిన రాజు ఇట్లనెను:

"మునీశ్వరా! మీ రాకతో నా జన్మ ధన్యమయినది. మీరెప్పుడు ఇలా దయచేయలేదు. నేడు మీ రాకకు కారణ మేమిటో చెప్పండి. మీ ఆజ్ఞను తక్షణమే శిరసావహించెదను." అపుడు ముని ప్రత్యుత్తరమిచ్చెను: "రాజా, రాక్షసులు నా యజ్ఞ యాగాదులను ధ్వంసము చేసి నన్ను చాలా బాధించుచున్నారు. శ్రీరాముని, అతని తమ్ముని లక్ష్మణుని నాతో పంపుము. వారి సహాయమున రాక్షసులను చంపి, నేను రక్షణ పొందగలను. మోహము, అజ్ఞానము వదలి వారిని నాకు అప్పగించుము. దీనివలన నీకు ధర్మము, యశము ప్రాప్తించును. వారికి నా ఆశీస్సులుండును." విశ్వామిత్రుని వచనములు విని రాజు హృదయము కంపించెను. ముఖము కళావిహీనమయ్యెను. అతడు ఇలా పలికెను: "మునీశ్వరా! నాకు వృద్ధాప్యమునందు ఈ నలుగురు కుమారులు కలిగినారు. భూములు, గోవులు, ధన ధాన్యములు కోరండి. సంతోషముతో సర్వమును ఇవ్వగలను. మనిషికి ప్రాణమునకన్న ప్రియమైనది ఏదీలేదు. వాటిని కూడ ఈ క్షణమే ఇవ్వగలను. నా కుమారులందరు నాకు ప్రాణసములు. కాన శ్రీరాముని ఎట్టి పరిస్థితులలోను వదిలి వుండలేను. అతి భయంకరులైన ఆ రాక్షసులెక్కడ? సుకుమారులు అయిన నా పుత్రులు ఎక్కడ?" ప్రేమపూరితమయిన రాజు పలుకులను విని జ్ఞాని అయిన ముని సంతోషించెను. పిమ్మట వశిష్ఠుడు రాజునకు అనేక విధముల నచ్చచెప్పి అతని సందేహములను దూరము చేసెను. సాదరముగా రాజు అనేక విధముల కుమారులకు ఉపదేశములను ఇచ్చి హృదయమునకు హత్తుకొనెను. మునితో "ప్రభూ! ఈ నా కుమారులు నాకు ప్రాణము. ఇప్పుడు మీరే వారికి తండ్రి, మరెవరు కాదు," అని పలికి వారిని ఆశీర్వదించి ఋషికి అప్పగించెను. శ్రీరామచంద్రుడు తన తల్లి మందిరమునకు పోయి ఆమె పాదములకు నమస్కరించి

ఆశీస్సులను పొందెను. కృపాసాగరులు, ధీరబుద్ధులు చరాచర సృష్టికి కారణభూతులయిన ఆ పురుషసింహములు మునిని భయవిముక్తుని చేయుటకు బయలుదేరిరి.

అరుణనయనుడు, విశాలవక్షుడు, ఆజానుబాహుడు, నీలకమల సదృశశ్యామశరీరుడైన శ్రీరామచంద్రుడు పీతాంబరధారియై చేతులందు ధనుర్బాణములను, భుజముపై అంబులపొదితో ఉండెను. శ్యామగౌరవర్ణములు గల ఆ సోదరులు విశ్వామిత్రునికి అమూల్య ధనరాశులు. మార్గమధ్యమున తాటకయను రాక్షసి వీరి అలికిడి విని కోపముతో వీరిపై విరుచుకపడెను. శ్రీరాముడు ఆమెను ఒకే బాణముతో సంహరించి వైకుంఠమును జేర్చెను. ప్రభువు విజ్ఞానఖని యని తెలిసినప్పటికి విశ్వామిత్రుడు వారికి బల, అతిబల అను మంత్రములను ఉపదేశించెను. వాని వలన వారికి క్షుత్పిపాసబాధలు ఉండవు. పైగా బలము, శక్తి ప్రసాదించును. అస్త్రశస్త్రములన్నిటినీ సమర్పించి మునీశ్వరుడు వారిని తన ఆశ్రమమునకు తీసుకొని వచ్చెను. భక్తహితకారులైన వారికి కందమూల ఫలములతో విందు చేసెను.

ప్రాతఃకాలమున శ్రీరాముడు మునితో "మునివరేణ్యా! పోయి యజ్ఞమును ఆచరించుడు. భయము వలదు," అని పలికెను. మునులందరూ హోమమును చేయసాగిరి. శ్రీరాముడు వారికి రక్షకుడుగా నుండెను. 'స్వాహా' అను శబ్దమును వినగానే మునులకు శత్రువు అగు మారీచుడు అను రాక్షసుడు తన పరివారముతో విజృంభించెను. శ్రీరాముడు ఒకే బాణముతో వానిని శతయోజన విస్తీర్ణముగల సముద్రమునకు ఆవల పడునట్లు కొట్టెను. ఆగ్నేయాస్త్రముతో సుబాహువును వధించెను. సోదరుడైన లక్ష్మణుడు రాక్షససైన్యము నంతటినీ సంహరించెను. ఈ విధముగా శ్రీరామలక్ష్మణులు రాక్షసులను సంహరించి ధర్మమును కాపాడిరి. దేవతలు, మునులు వారిని ప్రశంసించిరి.

## 17. అహల్యా శాపవిమోచనము

శ్రీరఘునాథుడు అక్కడ కొద్దిరోజులుండి మునులను అనుగ్రహించెను. ప్రభువు సర్వజ్ఞుడు. అయినను వారతనికి ప్రేమతో అనేక పురాణ కథలను వినిపించిరి. తరువాత విశ్వామిత్రముని శ్రీరామునితో సాదరముగా, "ప్రభూ! ఒక ధనుర్యజ్ఞమహోత్సమును తిలకింతము రండు" అని పలికెను. ఆ మాట వినగానే రఘురాముడు మునివెంట సంతోషముతో బయలుదేరెను.

మార్గములో వారు పశుపక్ష్యాదులు ఎట్టి ప్రాణులు లేని ఒక ఆశ్రమమును చూచిరి. అచట ఒక రాయి మాత్రము పడి ఉండెను. విశ్వామిత్రముని "రఘువీరా! గౌతమ మహర్షి పత్ని అహల్య శాపవశమున శిలగా మారి నీ పాదకమలరేణువులను కాంక్షించుచున్నది. ఆమెపై కృపజూపుడు," అని ఆ కథను సవిస్తరముగా వినిపించెను. పవిత్రమయిన శోకనాశకారియైన శ్రీరాముని పాదము సోకినంతనే తపోమూర్తియైన అహల్య లేచి నిలుచుని అంజలి ఘటించెను. భక్తపరాధీనుడయిన శ్రీరాముని చూచి ఆమె శరీరము పులకరించి నోటమాట రాలేదు. ప్రభుచరణములపై వ్రాలెను. కన్నీరు సంతతధారగా ప్రవహించెను. ఆమె మనస్సులో ధైర్యమును కూడగట్టుకొని శ్రీరామచంద్రుని భక్తిపారవశ్యముతో స్తుతించి ప్రార్థించెను. "బ్రహ్మజ్ఞానులకే గోచరమగు రామచంద్ర ప్రభూ! మీకు జయము. నేను అపవిత్రురాలను. మీరు లోకపావనులు, భక్తసుఖదులు, జనన మరణ భయమును తొలగించువారు. నేను మీ శరణుజొచ్చితిని. నన్ను రక్షింపుడు. గౌతమముని నాకు శాపమిచ్చి మేలే చేసెను. దానివలన మోక్షప్రదాత అయిన శ్రీహరిని దర్శించుకోగలిగితిని. ఏ చరణములనుండి గంగానది ఉద్భవించి శివుని జటాజూటమును అలంకరించెనో, ఏ పాదమును బ్రహ్మకడిగెనో అట్టి శ్రీహరి పాదము నాపై మోపబడినది. నేను ధన్యురాలిని! ఒక వరమును ప్రసాదింపుడు, మీ పాదకమల రసాస్వా

దనను సదా చేయునట్లు అనుగ్రహింపుడు" అని పల్కుచూ అహల్య మాటిమాటికి భగవంతునికి ప్రణమిల్లి తానడిగిన వరమును పొంది మహదానందముతో తన పతిగృహమును చేరెను. "శ్రీరామచంద్ర ప్రభువు దీనబంధువు, అవ్యాజకరుణాపారీణుడు. మూఢమనసా! ఈ కపట జంజాటమును వదలి అతనిని భజింపుము" అని తులసీదాసు చెప్పుచున్నాడు.

## 18. శివధనుర్భంగము

శ్రీరామచంద్రుడు, లక్ష్మణుడు, విశ్వామిత్రునితో పాటు బయలుదేరి పవిత్ర గంగానదీ తీరమునకు చేరిరి. అచట మునిశ్రేష్ఠుడు వారికి గంగావతరణ కథను వినిపించెను. ప్రభువు మునులతో కలిసి గంగానదిలో స్నానమాడి విదేహ రాజ్యమును సమీపించెను. శ్రీరామలక్ష్మణులు జనకపురి శోభను తిలకించి సంతోషించిరి. వాపీకూపతటాకములలోని అమృతతుల్యమగు నీరు, మణిమయ సోపానములు వారినెంతో ఆశ్చర్యమున ముంచెను. పుష్ప రసాస్వాదన మైకమున తుమ్మెదలు ఝుంకారము చేయుచుండెను. వివిధ వర్ణములు గల పక్షులు మధురారావములు చేయుచుండెను. చిత్రవిచిత్రములైన కమలములు వికసించియుండెను. శీతల మందసుగంధిత పవనములు వీచుచుండెను. నగరమునకు నలువైపుల, ఉద్యానవనములు, పుష్ప వాటికలు పక్షులకు ఆవాసములై ఫలపుష్పములచే శోభిల్లుచుండెను. జనకపురిశోభ అవర్ణనీయము. ఎటు చూచిననూ మనోహరమైన పురవీధులు, మణిమయములైన అంగళ్ళు, అందులో వ్యాపారులు వివిధ వస్తువులను ప్రదర్శించి అమ్ముచుండిరి. వీధి కూడళ్ళు సుగంధ జలముచే తడుపబడియుండెను. ఆ నగరములోని స్త్రీ పురుషులు సుందరులు, పవిత్రులు, సాధుస్వభావము కలవారు. రాజప్రాసాదము మనోహరమై సమస్త లోకముల శోభను అధఃకరించుచుండెను. తెల్లని రాజభవనములలో రత్నఖచితమైన బంగారు జరీ తెరలు వ్రేలాడదీయ

బడియుండెను. రాజభవనద్వారములు వజ్రఖచితమైయుండెను. అచ్చట సామంత నటభటవందిమాగధ సమూహములుండెను. విశాలములైన అశ్వశాలలు, గజశాలలు, రథశాలలు ఉండెను. అనేక వీరులు, మంత్రులు, సేనాపతులు, అందమైన గృహములందు వసించుచుండిరి. నగరమునకు వెలుపల నదీతటాకముల సమీపమున చాలమంది రాజకుమారులు గుడారములు వేసుకొని ఉండిరి. విశ్వామిత్రుడు అన్ని వసతులు గల ఒక అందమైన మామిడితోపును చూచి, "రఘువీరా! ఈ స్థానము నాకు నచ్చినది. మనము ఇక్కడనే ఉందము," అనెను. కృపానిధి అయిన శ్రీరాముడు "అట్లే స్వామీ!" అని మునులతో పాటు అక్కడనే ఉండెను.

విశ్వామిత్రుని ఆగమన విషయము జనకరాజునకు తెలిసెను. అతడు తనకు విశ్వాసపాత్రులైన మంత్రులను, యోధులను, బ్రాహ్మణులను, గురువైన శతానందుని, రాజబంధువులను వెంటనిడుకొని వచ్చి విశ్వామిత్రుని కలిసి, అతని పాదములకు శిరసా నమస్కరించెను. ముని ప్రసన్నుడై అతనిని ఆశీర్వదించెను. కుశలప్రశ్నల పిదప రాజు విశ్వామిత్రుని సుఖాసీనుని గావించెను. అదే సమయమున ఉద్యానవన శోభను చూచుటకు వెళ్ళిన సోదరులు అచటికి వచ్చిరి. శ్యామగౌరవర్ణములు కలిగి కౌమారావస్థలోనున్న వారి అందము నేత్రపర్వమై అందరి హృదయములను దొంగలించెను. శ్రీరాముని మనోహరమైన మూర్తిని చూచి విదేహరాజు నిజముగా విదేహుడాయెను. అతడు గంభీరస్వరముతో ఇట్లనెను:

"ప్రభూ! ఈ బాలకులు ఎవరో చెప్పండి. మునికులభూషణులా లేక రాజకులశ్రేష్ఠులా? లేక పరబ్రహ్మయొక్క రెండు రూపములా? సహజముగా వైరాగ్యపూర్ణమయిన నా మనస్సు కూడ వీరిని చూచి ముగ్ధమగుచున్నది." మునీశ్వరుడు పలికెను: "రాజా! మీరు నిక్కము వచించితిరి. ప్రపంచములోని సర్వప్రాణులకు వీరు ప్రియతములు.

వీరు రఘుకుల శ్రేష్ఠుడైన దశరథరాజ కుమారులు. రామలక్ష్మణులు. ఈ సోదరులు రూపశీలబలసంపన్నులు. వీరు రాక్షసులను యుద్ధములో సంహరించి, నా యజ్ఞమును కాపాడిరి." జనకరాజు హృదయము భక్తిప్రపూర్ణమాయెను. మునిని ప్రశంసించుచూ రాజు వారిని తన నగరమునకు తోడుకొని పోయెను. అన్ని ఋతువులందునూ సుఖప్రదమైన భవనములో వారిని నివసింపచేసెను.

రఘువంశశిరోమణియైన శ్రీరాముడు, ఋషులతో కూడి భోజనమాచరించి విశ్రమించి లక్ష్మణునితో పాటు కూర్చొని యుండెను. అప్పుడు సూర్యాస్తమయమునకు ఇంకనూ జాము ప్రొద్దు ఉండెను. జనకపురి శోభను తిలకించవలెనని లక్ష్మణునికి గాఢమైన కోరిక యుండెను. లక్ష్మణుని మానసిక స్థితిని గ్రహించి భక్తవత్సలుడైన శ్రీరాముడు విశ్వామిత్రుని ఆజ్ఞ బడసి నగరశోభను తిలకించుటకు బయలుదేరిరి. బాలబాలికలు వారి సౌందర్యమునకు ఆకర్షితులై వారి వెంట నడిచిరి. పీతాంబరమును ధరించి, చేత ధనుర్బాణములను పూని, చందనములో అలంకరించిన కనుబొమలలో, శ్యామగౌరవర్ణ శరీరములతో చూపరులకు ఆనందము కూర్చిరి. సింహసమానకంధరములలో, ఆజానుబాహువులతో, విశాలవక్షములపై గజముక్త సుందరమాలలతో, పద్మనయనములతో, తాపత్రయములను హరించెడి సుందరముఖములతో శోభిల్లుచుండిరి. సువర్ణమయకుండలములు, సుందరమైన దృక్కులు, వంకర తిరిగిన శ్రేష్ఠమైన కనుబొమలు, ముఖముపై తిలకము అత్యంత మనోహరమైయుండెను. శిరములపై చతురస్రాకారపు కిరీటములు ధరించి, నల్లని ఉంగరములు తిరిగిన జుట్టుతో నఖశిఖపర్యంతము సౌందర్యరాశులుగా నుండిరి.

జనకపురి నివాసులు ఇద్దరు రాజకుమారులు నగరము చూచుటకు బయలుదేరినారని తెలుసుకొని తమ పనులన్నియు ఎక్కడివక్కడ వదిలేసి పరుగెత్తుకొని వచ్చిరి. వారిని చూచి తమ నేత్రములు

సఫలమయినవని తలంచిరి. యువతులు కిటికీల ద్వారా శ్రీరాముని సౌందర్యమును అనురాగముతో పానము చేసిరి. వారిలో వారు ఇట్లు సంభాషించుకొనసాగిరి: "బాలరాజహంసలవలెనున్న వీరు దశరథ రాజకుమారులు. విశ్వామిత్రముని యాగమును రక్షించినారు. యుద్ధములో రాక్షసులను సంహరించినారు. శ్యామలవర్ణుడు, కమలనేత్రుడు; మారీచసుబాహుల మదమణచినవాడు, చేతిలో ధనుర్బాణములను ధరించినవాడు, కౌసల్యాదేవి కుమారుడు శ్రీరాముడు. గౌరవర్ణము కలవాడు, సందరవేషభూషణములలో విల్లంబులతో శ్రీరాముని వెంట నడుచువాడు అతడి సోదరుడు, సుమిత్రానందనుడు లక్ష్మణుడు. విశ్వామిత్రముని కార్యమును నెరవేర్చి మార్గములో గౌతమ పత్నియైన అహల్యనుద్ధరించి ఇక్కడ ధనుర్యాగమును చూడవచ్చినారు."

వేరొక యువతీసమూహములో సంభాషణ ఈ విధముగా నుండెను: "ఈ వరుడు జానకీదేవికి తగినవాడు. జనక మహారాజు ఇతనిని చూచినచో తన ప్రతిజ్ఞను వదిలి ఇతనితోనే జానకి వివాహము జరిపించగలడు. ఒకవేళ దైవికముగా ఇట్టి వివాహము జరిగినచో మనమందరము కృతార్థులము. ఎందుకనగా, ఇతడు మరల మన నగరమునకు రాగలడు. మనము ఇతనిని చూచుటకు వీలగును. కాని శంకరుని ధనుస్సు చాలా కఠినమయినది. ఈ రాజకుమారుడు కోమల శరీరుడు. అయినను గొప్ప బలముగలవాడు. రాక్షసులను సంహరించిన ఈ బాలుడు శివధనుస్సును విరచలేడా? సీతాదేవిని సృష్టించిన ఆ బ్రహ్మయే ఆమెకు తగిన ఈ శ్యామలాంగుని వరునిగా నిశ్చయించెను." ఇట్లు పరమానందముతో ఆ సులోచనలు వారిపై పుష్పవృష్టిని కురిపించిరి.

రామలక్ష్మణులు తూర్పుదిశగా పోయిరి. అచట ధనుర్యాగమునకై రంగము సిద్ధపరచబడియుండెను. అతివిశాలప్రాంగణము మధ్య ఒక అందమైన వేదిక కట్టబడి యుండెను. ఆ వేదికకు నాలుగువైపుల ఎత్తైన

బంగారు అరుగులు రాజకుమారులు కూర్చొనుటకు నిర్మింపబడినవి. వాటి చుట్టూ వలయాకారమున నిర్మించబడిన ఎత్తైన మెట్లపై నగరవాసులు కూర్చొందురు. వాటి వెనుక తెల్లని మందిరములు నిర్మించబడెను. వాటిలో స్త్రీలు తమ యోగ్యతానుసారము కూర్చొని ధనుర్యాగమును చూచెదరు. నగరములోని బాలకులు కోమల వచనములతో శ్రీరామచంద్ర ప్రభువునకు వానిని చూపుచూ వివరించుచుండిరి. ఆ నెపముతో శ్రీరాముని శరీరమును తాకి పులకితులు అగుచుండిరి. శ్రీరాముడు వారు చూపిన స్థలమున్నిటినీ ప్రశంసించెను. మధురవచనములతో బాలురను వీడ్కొలిపి సోదరు లిద్దరూ భయము, ప్రేమ, వినయము, సంకోచములతో గురువుగారి వద్దకు వచ్చి పాదాభివందనము చేసి కూర్చొనిరి.

సాయంసంధ్యావందనము ఆచరించిన పిదప రాత్రి రెండు జాముల వరకు ముని వారికి ప్రాచీన కథలు, ఇతిహాసములు చెప్పెను. విశ్వామిత్రుడు శయనించగా రామలక్ష్మణులు ఆయన పాదములు వత్తిరి. ఎవరి పాదకమలములకై విరాగులు జపము, యోగము చేయుదురో, వారే తమ గురువునకు సేవ చేయుచుండిరి. గురువు మాటిమాటికి చెప్పిన పిదప రఘురాముడు శయనించెను. లక్ష్మణుడు అన్నగారి పాదసంవాహనము చేసెను. ప్రభువు మాటిమాటికి ఇక వెళ్ళి విశ్రమించుమని చెప్పిన తరువాత లక్ష్మణుడు వెళ్ళి ప్రభు పాదములను ధ్యానించుచూ నిద్రించెను.

తెల్లవారగనే ముందుగా లక్ష్మణుడు మేల్కొనెను. జగత్పతి అయిన శ్రీరాముడు కూడ గురువుగారికన్న ముందే నిద్రలేచెను. అందరూ శౌచక్రియలు ఆచరించిన పిదప స్నానముచేసి నిత్యానుష్ఠానములు నెరవేర్చి మునికి నమస్కరించిరి. పూజా సమయము అగుటచే గురువాజ్ఞ బడసి పూలు తెచ్చుటకు రామలక్ష్మణులు బయలుదేరిరి. వారు జనకరాజు ఉద్యానవనమున వసంతఋతుశోభను

తిలకించిరి. రకరకములైన మనోహర వృక్షములు, లతామండపములు, నూతనఫలపుష్పములతో ఆ వృక్షములు కల్పతరువును కూడ తలద న్నుచుండెను. చాతక పక్షులు, కోయిలలు, చిలుకలు, చకోరములు, మధురస్వరములు పలుకుచుండెను. నెమళ్ళు నాట్యమాడుచుండెను. ఆ తోట మధ్యభాగమున ఒక రమణీయమైన సరోవరము కలదు. మణిమయ సోపానములు, నిర్మలజలములతో, కమలములతో నిండిన ఆ సరస్సునందు జలపక్షుల కలరవములు, తుమ్మెదల ఝుంకారములు మనోహరముగా నుండెను. ఆ తోటను, సరోవరమును చూచి ప్రభువు సోదరునితో సహా ప్రసన్నుడాయెను. సర్వులకు సుఖప్రదుడైన శ్రీరామునికే సుఖమును చేకూర్చు ఆ తోట ఎంత అందముగా నున్నదో! నాలుగు వైపుల ఉద్యానవన శోభచూచిన పిదప తోటమాలి అనుజ్ఞతో వారు ప్రశాంతచిత్తులై పత్రపుష్పములను ఏరుచుండిరి.

అదే సమయమున సీతాదేవి గిరిజాదేవిని పూజించుటకై తల్లి ఆజ్ఞతో అచటికి వచ్చెను. ఆమెతోపాటు అందమైన ఆమె సఖులుండిరి. వారు మధురముగా పాటలు పాడుచుండిరి. సరోవర సమీపముననే గిరిజాదేవి మందిరము కలదు. సఖులతోపాటు సరోవరమున స్నానమాడి సీతాదేవి ప్రశాంతచిత్తముతో గిరిజాదేవి మందిరమునకు పోయెను. మిక్కిలి అనురాగముతో పూజించి తనకు తగిన సుందరుడైన వరుని కోరెను. వారిలో ఒక సఖి సీతాదేవిని వదలి తోటను చూచుటకు బయలుదేరెను. ఆమె రామలక్ష్మణులను చూచి, ప్రేమవిహ్వలయై సీతాదేవి వద్దకు వచ్చెను. ఆమె శరీరము పులకించుటను, ఆమె కంట నీరు వచ్చుటను చూచిన సఖులు ఆమె సంతోషమునకు కారణము అడుగజొచ్చిరి. ఆ సఖి ఇలా పలికెను:

"కౌమారదశలోనున్న ఇద్దరు రాజకుమారులు తోటను చూడవ చ్చిరి. వారు అతిసుందరులు, ఒకడు నీలవర్ణుడు, మరొకడు గౌరవర్ణుడు. వారిని ఎట్లు వర్ణించగలను? వాక్కు గుడ్డిది, కళ్ళు మూగవి." అది

విని చతురలయిన సఖులు సంతోషించిరి. సీతాదేవి ఉత్కంఠతను చూచి ఒక చెలికత్తె ఇట్లనెను: "విశ్వామిత్రముని వెంట నిన్న ఇద్దరు రాజకుమారులు వచ్చినారని విన్నాను. బహుశా వారే వీరు కావచ్చును. వారు తమ సౌందర్యముతో మన నగరములోని స్త్రీ పురుషుల మనస్సులను దోచినారు. ఎక్కడ చూచిననూ వారి అందమును గూర్చిన చర్చయే. వారిని తప్పక చూడవలె." ఆ సఖి వచనములు సీతాదేవికి అత్యంత ప్రియములాయెను. వారి దర్శనము కొరకు కన్నులు ఆరాటపడెను. ఆ సఖిని ముందుంచి తాను వెంట నడిచెను. (అది పూర్వప్రేమానుబంధమని ఎవ్వరూ యెరుగరు.)

చేతికంకణముల, వడ్డాణపు గంటల, కాలియందెల శబ్దములను విని శ్రీరామచంద్రుడు ఆ వైపు చూచెను. సీతాదేవి సౌందర్యమును చూచి అతడు ముగ్ధుడాయెను. రెప్పలు ఆర్పక చూచుచూ మనస్సులోనే ప్రశంసించెను. కాని నోట మాట రాకపోయెను. బ్రహ్మదేవుడు తన నైపుణ్యమునకు రూపమునిచ్చి ప్రపంచములోని అందమునంతయు ఒకేచోట చేర్చినట్లుండెను. కవుల ఉపమాలంకారములన్నియు ఆమె సౌందర్యము ముందు పేలవమగును.

ఈ విధముగా సీతాదేవి సౌందర్యమును మనస్సులోనే ప్రశంసించుచూ, ప్రభువు తన తమ్మునితో సందర్భానుసారముగా ఇట్లు పలికెను: "తమ్ముడా! ఈమె జనకుని కూతురు. ఈమె కొరకే ధనుర్యాగము జరుపబడుచున్నది. ఈమె సఖులతో పాటు గౌరీపూజకై వచ్చినది. సహజముగా పవిత్రమైన నా మనస్సు ఈమె అపూర్వ సౌందర్యమును చూచి వికలమగుచున్నది. కాని నా కుడికన్ను అదరుట శుభమును సూచించుచున్నది." ఈ ప్రకారము శ్రీరాముడు తన తమ్మునితో మాటాడుచున్ననూ ఆయన మనస్సు సీతాదేవి సౌందర్యమునే చూచుచుండెను.

సీతాదేవి చకితురాలై నలుదిశల పరికించెను. ఆ రాజకుమారులు

ఎక్కడికి పోయినారని మనస్సులో చింతించినది. అప్పుడొక లతాకుంజము వెనకనున్న శ్యామ, గౌరవర్ణములు గల రాకుమారులను సఖులు ఆమెకు చూపిరి. శ్రీరాముని సౌందర్యమును చూచిన ఆమె కనులు నిశ్చలములు అయెను. ఆమె శరీరముపై ధ్యాసను కోల్పోయెను. నేత్రములద్వారా శ్రీరాముని రూపమును హృదయములో బంధించి తెలివిగల జానకి కనురెప్పలు అను కవాటములను మూసుకొనెను. సఖులు ఆమె తాదాత్మ్యస్థితిని జూచిననూ ఏమియు పలుకకపోయిరి. ఆ సమయమున మేఘములను తెరను తొలగించి వచ్చు చంద్రునివలె సోదరు లిరువురును లతాకుంజములనుండి బయటికి వచ్చిరి. ఈ సుందరవీరులను చూచిన ఒక యువతి "ఎడమ చేతిలో పుష్పములతో నిండిన గిన్నెగల ఆ శ్యామవర్ణుడు మిక్కిలి అందగాడు" అనెను. శ్రీరామచంద్రుని చూచి సఖులు తమనుతాము మరచిపోయినారు. ఒక సఖి సీతాదేవితో నిట్లనెను: "గిరిజాదేవిని తర్వాత ధ్యానించవచ్చును. ఇప్పుడు ఈ రాజకుమారులను యేల చూడవు?" అపుడు సీతాదేవి సంకోచముతో కన్నులు తెరచి రెండు రఘుకుల సింహములను చూచెను. శ్రీరాముని అందమును నఖశిఖపర్యంతము చూచెను. కాని తన తండ్రి ప్రతిజ్ఞ జ్ఞప్తికి రాగానే క్షోభించెను. సీతాదేవి ప్రేమపరవశ అయినది. అది చూచి సఖులు భయపడి "చాల ప్రొద్దు పోయినది. రేపు ఇదే సమయానికి వద్దాము" అనిరి. అది విని సీతాదేవి సిగ్గుపడి ప్రొద్దుపోయినదని తల్లికి భయపడుచూ సఖులవెంట వెళ్ళెను. శ్రీరామచంద్రుడు కూడ సుఖస్నేహశోభగుణముల ఖనియగు జానకిదేవి రూపమును చిత్తమున చిత్రించుకొని సోదరునితోసహా పోయెను.

సీతాదేవి మరల భవానీదేవి మందిరమునకు పోయి చేతులు జోడించి ప్రార్థించెను: "ఓ గిరిరాజసుతా! నీకు జయము. గజాస్యుడు అయిన గణేశునికి, షణ్ముఖుడైన కార్తికేయునికి మాతవు. జగజ్జననీ! విద్యుల్లతవంటి శరీరముగల దానవు. నీకు ఆద్యంతములు

లేవు. నీ ప్రభావము అపరిమితము, సృష్టి స్థితిలయకారిణివి, మాతా! ఉత్తమ పతివ్రతలలో నీవు మొదటిదానివి. నీ సేవ చేయుటవలన ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములు సులభమగును. నీ చరణ కమలములను పూజించుటచే దేవతలు, మనుష్యులు, మునులుకూడ సుఖులయ్యెదరు. నీవు అందరి హృదయములలో నివసించెదవు. నా మనోరథమేమో బాగా ఎరుగుదువు. కావున నేను దానిని ప్రకటించుటలేదు" అని సీతాదేవి భవాని పాదములను ఆశ్రయించెను.

సీతాదేవి భక్తికి, వినయమునకు గిరిజాదేవి ప్రసన్నురాలాయెను. ఆమె కంఠసీమను అలంకరించిన మాల క్రిందపడెను. విగ్రహము దరహాసము చేసెను. సీతాదేవి ఆ మాలను తన శిరస్సున ధరించెను. గిరిజాదేవి ఆనందముతో ఇట్లు పలికెను: "ఓ సీతా! వినుము. నా ఆశీర్వచనము సత్యము. నీ అభిలాష నెరవేరును. నీవు మనస్సు పడినవాడే నీకు లభించును. ఎవరియందు నీవు అనురక్తురాలవో ఆ సహజ సుందరుడు, శ్యామలవర్ణుడు నీకు పతియగును. అతడు దయానిధి, సర్వజ్ఞుడు. నీ శీలమును, స్నేహమును అతడు ఎరుగును." గౌరీదేవి ఆశీర్వాదమును విని జానకీదేవితో పాటు ఇతర సఖులు కూడ హర్షితులైరి. సీతాదేవి మాటిమాటికి భవానిని పూజించి ప్రసన్నచిత్తముతో తన భవనము చేరెను.

సీతాదేవి లావణ్యమును పొగడుచూ సోదరులిద్దరూ గురువు వద్దకు వచ్చిరి. సరళస్వభావుడు నిష్కపటి అయిన శ్రీరామచంద్రుడు విషయమునంతయూ విశ్వామిత్రునికి నివేదించెను. పూలు తీసుకొని మునీశ్వరుడు పూజించిన పిదప సోదరులిద్దరినీ "మీ మనోరథములు నెరవేరుగాక!" అని ఆశీర్వదించెను. విజ్ఞానియైన విశ్వామిత్రముని భోజనానంతరము వారికి పౌరాణిక కథలను వినిపించెను. ఆ విధముగా దినమును గడిపి సాయం సమయమున గురువాజ్ఞను బడసి ఇద్దరు సంధ్యోపాసనకై వెళ్ళిరి. పూర్వదిశయందు చంద్రోదయంబాయెను.

సీతాదేవి ముఖమును పోలిన చంద్రబింబమును చూచి శ్రీరాముడు సంతసించెను. కొద్దిగా ఆలోచించిన పిదప ఈ చంద్రుడు సీతాదేవి ముఖముతో సమానుడు కాడని భావించెను. "సముద్రము ఇతని జన్మస్థానము. అదే సముద్రములో పుట్టిన విషము ఇతని సోదరుడు. ఇతడు కలంకితుడు, పగలంతయు శోభాహీనుడు. అదియుగాక ఇతనికి వృద్ధిక్షీణములు ఉండును. రాహువుచే పట్టుబడును. చక్రవాక పక్షులకు శోకప్రదుడు. కమలములకు ద్రోహి" ఈ విధముగా చంద్రుని నెపముతో సీతాదేవి ముఖమును వర్ణించుచూ చాలా రాత్రి అయినది అని గమనించి గురువు వద్దకు వెళ్ళెను. ముని చరణములకు నమస్కరించి అతని ఆజ్ఞ బడసి తాను విశ్రమించెను. అరుణోదయముతో రామలక్ష్మణులు మేల్కొని శౌచస్నానాదుల అనంతరము దైవప్రార్థన చేసి గురువును సమీపించి, అతనికి ప్రణమిల్లిరి.

జనకరాజు తన పురోహితుడైన శతానందుని విశ్వామిత్రుని వద్దకు పంపెను. విశ్వామిత్రుడు శ్రీరామునితో "నాయనా! జనకరాజు పిలవనంపినాడు, పోయి మనము సీతాస్వయంవరమును చూడాలి. భగవంతుడు ఎవరికి ఈ అదృష్టమును కలిగిస్తాడో చూద్దాము" అని పలికెను. లక్ష్మణుడు "ప్రభూ! మీ కృప ఎవ్వరిపైనుండునో వారే ఈ అదృష్టానికి పాత్రులు" అని చెప్పెను. లక్ష్మణుని మాట విని మునులందరు సంతసించిరి. కృపాళువైన శ్రీరామచంద్రమూర్తి మునులతోపాటు ధనుర్యాగశాలను చూచుటకు వెళ్ళెను. సోదరు లిద్దరూ రంగభూమికి వచ్చినారని తెలియగనే నగరములోని స్త్రీ పురుషులు, బాలురు, యువకులు, వృద్ధులు అందరూ తమ పనులన్ని వదలివేసి వచ్చిరి. వారికి ఉచితాసనములు ఏర్పాటు చేయబడినవి. మూర్తీభవించిన సౌందర్యమా అన్నట్లు రాజకుమారు లిద్దరు అచ్చటికి వచ్చిరి, తారాగణముల మధ్య ఇద్దరు చంద్రులున్నట్లు వారు ఆ రాజసమూహములో ప్రకాశించిరి. ప్రతి ఒక్కరూ తమ

హృదయములో ఎట్టి భావము ఉండునో అట్లే ప్రభువును చూచిరి. రణధీరులయిన రాకుమారులు శ్రీరామచంద్రుని మూర్తీభవించిన వీరరసముగా, కుటిలురు భయంకరమూర్తిగా చూచిరి. రాజకుమారుల వేషములతో కూర్చొనిన రాక్షసులు ప్రభువును యమునిగా చూచిరి. నగరవాసులు నేత్రానందకరమయిన మానవోత్తమునిగా చూచిరి. స్త్రీలు హర్షిత హృదయులై శరీరధారణ చేసిన శృంగారరసమును చూచిరి. పండితులు, ప్రభువులు అనేక ముఖములు, చేతులు, పాదములు, నేత్రములు, శిరస్సులుగల విరాట్ స్వరూపముగా చూచిరి. జనకరాజు బాంధవులు తమ ఆత్మీయుడైన బంధువునిగా చూచిరి. జనకుని రాణులు అతనిని వాత్సల్యభావముతో బాలునిగా చూచిరి, యోగులు శుద్ధ శాంతస్వరూపుడైన పరబ్రహ్మగా కనుగొనిరి. భక్తులు వారిని సుఖప్రదులైన తమ ఇష్టదైవముగా భావించిరి. సీతాదేవి ప్రభువును అనిర్వచనీయమైన ప్రేమ, ఆనందములతో చూచెను. ఈ విధముగా కోసలాధిపతిని ప్రతియొక్కరూ తమ హృదయములోని భావాను గుణముగా చూచిరి. శ్యామలగౌరశరీరులు, అయోధ్యారాజకుమారులు అందరి చూపులను దొంగలించి సభలో సుశోభితులైరి.

జనక మహారాజు కూడ వారిని చూచి సంతసించి విశ్వామిత్ర మునికి పాదాభివందనము చేసెను. జనకుడు మునికి శివధనుస్సు కథను తన ప్రతిజ్ఞను వినిపించి రంగభూమిని చూపించెను. శ్రేష్ఠరాజకుమారులు వెళ్ళిన ప్రతిచోట జనులు ఆశ్చర్యచకితులైరి. శ్రీరాముడు తమ వైపు తిరిగి తమనే చూస్తున్నట్టు ప్రతిఒక్కరూ భావించిరి. దీని రహస్యము ఎవ్వరికీ బోధపడలేదు. మునీశ్వరుడు రంగభూమిని మెచ్చుకొనెను. మహారాజు సంతృప్తుడై ఎత్తైన సుందరమైన ఆసనములపై మునిని, రామలక్ష్మణులను ఆసీనులుగా చేసెను.

శ్రీరామచంద్రుని చూచిన రాజులందరు చంద్రోదయమును చూచిన తారలవలె తేజోహీనులైరి. శ్రీరాముడే ధనుర్భంగము

గావించునని అందరూ విశ్వసించిరి. కొందరు "శివుని ధనుస్సును ఎక్కుపెట్టక పోయినను శ్రీరాముని కంఠసీమయందు సీతాదేవి జయమాలను వేయును. కావున మన కీర్తి ప్రతాపము, బలము, తేజస్సు అన్నింటినీ మరచిపోయి ఇంటికి పోవుదము రండు" అని పల్కిరి. కొందరు అవివేకులు, అజ్ఞానులు, అభిమానులైన రాజులు "ధనుస్సును విరిచిననూ శ్రీరాముని వివాహము సీతతో జరుగుట అసంభవము. యముడే వచ్చి ఎదిరించిననూ మేము సీతకొరకు యుద్ధము చేయుదుము" అని పల్కిరి. ఈ మూర్ఖులమాటలు విని కొందరు ధర్మశీలురు హరిభక్తులు అయిన రాకుమారులు నవ్వి ఇట్లనిరి: "ఈ రాజుల గర్వమును అణచి శ్రీరాముడు తప్పక సీతను పెండ్లియాడును. దశరథుని కుమారులను యుద్ధములో ఎవ్వరు ఎదుర్కొని జయించెదరు? వ్యర్థప్రేలాపనలతో ప్రాణములు పోగొట్టుకొనవద్దు. సీతాదేవిని లోకమాతగా, శ్రీరాముని జగత్పితగా ఎరుంగుడు. సుఖప్రదులు, సద్గుణసంపన్నులైన రామలక్ష్మణులు ఎల్లప్పుడు శివుని హృదయములో నివసింతురు. కనులారా వారి సౌందర్యమును ఆస్వాదించుడు. సమీపమునగల అమృతసాగరమును వదిలి ఎండమావులకై ఏల పరుగెత్తెదరు? మా సలహా రుచించనిచో మీ ఇష్టము వచ్చినట్లు చేయుడు. మేము మాత్రము మా జన్మధన్యమయినది అని తలచెదము." ఈ విధముగా పలికి సుజనులైన రాజులు రాముని సౌందర్యమును మనసారా గ్రోలిరి. దేవతలు ఆకాశమున విమానములలో ఈ దృశ్యమును చూచుచూ పుష్పవృష్టి కురిపించిరి. మధుర గానములు వినిపించిరి.

ఇదియే సరియైన సమయమని భావించి జనకుడు సీతాదేవిని పిలువనంపెను. అందమైన సఖులు ఆమెను స్వయంవరరంగమునకు పిలుచుకొని వచ్చిరి. జగజ్జనని అయిన సీతాదేవి సౌందర్యము వర్ణనాతీతము. ఆమె సద్గుణ సౌందర్యరాశి. చతురలయిన

ఆమె సఖులు మధురగీతములను పాడుచూ ఆమె వెంట వచ్చిరి. అందమైన క్రొత్త చీరతో ప్రత్యంగమునందు వివిధాభరణములతో సుశోభితురాలైన సీతాదేవి రంగభూమిలో కాలుమోపగానే స్త్రీ, పురుషులందరూ ముగ్ధులయిరి. రాజులందరూ మోహవశులైరి. కాని సీతాదేవి మాత్రము చకితచిత్తముతో శ్రీరాముని చూచుటకై తహతహలాడెను. మునివద్ద కూర్చున్న సోదరులను చూచి ఆమె ఆనందపరవశురాలాయెను. కాని గురుజనులు, ఇతర సభాసదుల సమ్ముఖమున సిగ్గుపడినదియై సంకోచముతో సఖులవైపు తిరిగెను. స్త్రీ, పురుషులందరు శ్రీరాముని రూపమును సీతాదేవి అందమును రెప్పలార్పక చూడసాగిరి. వారు బ్రహ్మదేవుని ఇట్లు ప్రార్థించసాగిరి: "ఓ విధాతా! జనకుడు తన ప్రతిజ్ఞను వదలి వివేకముతో ప్రవర్తించుగాక! ఎట్టి ఆలోచనలేకుండా సీతాదేవిని శ్రీరామునికిచ్చి వివాహము చేయుగాక! అప్పుడు అందరూ జనకుని ప్రశంసించెదరు. లేక అతడు పట్టుదల వహించినచో ఫలితమును అనుభవించును."

ఇంతలో రాజు భట్రాజులను పిలిచి "నా ప్రతిజ్ఞను చాటండి" అని ఆజ్ఞాపించగా వారు ఈ విధముగా పల్కిరి: "ఓ రాజులారా! వినుడు, మేము జనక మహారాజు గారి ప్రతిజ్ఞను తెలుపుచున్నాము. ఈ శివధనుస్సు బరువైనది, కఠినమైనది. మహాబలశాలులు అయిన రావణుడు, బాణాసురుడు కూడ దీనిని చూచి వెళ్ళిపోయిరి. ఎవరీ శివధనుస్సును ఈ రాజసభలో భంగము చేయుదురో వారిని జనకసుత వరించును. అతడు ముల్లోకములను జయించగల్గును." ఈ ప్రతిజ్ఞను విని కొందరు స్వాభిమానులు క్రోధావేశులై నడుము బిగించి తమ ఇష్టదేవతలను ప్రార్థించి ముందుకు వచ్చిరి. తమ బలమంతయు ఉపయోగించి శివధనుస్సును ఎత్తుటకు ప్రయత్నించిరి. కాని దాన్ని కదలించలేక సిగ్గుతో వెనుకకు మరలుచుండిరి. ఆ యోధుల బలమును గ్రహించి ధనుస్సు ఇంకనూ బరువెక్కుచుండెను. పిదప పదివేలమంది

రాకుమారులు ఒక్కటిగా ఆ ధనుస్సును కదలించ ప్రయత్నించిరి. కాని శివధనుస్సు చలించలేదు. వారందరూ అపహాస్యముపాలై నిస్పృహాయస్థితిలో తమ కీర్తి, విజయము, వీరత్వము ధనుస్సునకు అప్పగించి వెనుకకు మరలిరి. వారిని చూచి జనకరాజు వ్యాకులపడి, కోపముతో నిట్లు పలికెను: "మేము చేసిన ప్రతిజ్ఞను విని ప్రపంచపు నలుమూలలనుండి అనేక రాజులు, వీరులు, యోధులు వచ్చినారు. ధనుర్భంగము చేసినవారికి మనోహారిణియైన కన్య, విజయము, కీర్తి కానుకలుగా సమర్పించబడును. కాని వీనిని పొందుటకు అర్హతగల వీరుని బ్రహ్మ ఇంతవరకు సృష్టించలేదు. ఎవ్వరూ ధనుస్సును ఒక అంగుళమయినా కదలించలేకపోయినారు. పృథ్విలో వీరుడొక్కడు లేడని నేను భావించితే అభిమానమున్నవాడు ఎవ్వడు తప్పుగా తలచవద్దు. మీ ఆశలన్నీ వదలుకొని గృహోన్ముఖులు కండు. సీతాకళ్యాణము జరుగుట విధాతకు ఇష్టము లేదు. రాజకుమారి కన్యగనే వుండును. సోదరులారా! పృథ్విలో వీరులే లేరని తెలిసివుంటే నేనీప్రతిజ్ఞను చేయకపోవుదును. అపహాస్యము పాలు కాకపోవుదుము."

జనకుని మాటలు విన్నవారందరూ జనకుని వైపు చూచి విచారగ్రస్తులయిరి. కాని లక్ష్మణుడు మాత్రము కోపమును ఆపుకొనలేకపోయెను. అతని భృకుటి ముడిపడెను, పెదవులు వణకసాగెను, కన్నులు నిప్పులు చిమ్మెను. జనకుని మాటలు బాణములవలె అతనికి హృదయములో గ్రుచ్చుకొనెను. చివరకు రాముని పాదములకు నమస్కరించి దృఢముగా ఇట్లు పలికెను: "రఘువంశమణి అయిన శ్రీరాముడు ఇచ్చట విరాజిల్లుచున్నాడని తెలిసి కూడ జనకుడు ఈ అనుచిత వచనములు పల్కుట తగదు. ఓ సూర్యవంశ తిలకా! మీ అనుజ్ఞ అయినచో ఈ బ్రహ్మాండమునే బంతివలె ఎత్తగలను. దానిని కుండవలె పగలకొట్టగలను. మీ ప్రతాప మహిమచే మేరు పర్వతమును కూడ పెకలించగలను. ఈ పాతధనుస్సు ఒక లెక్కనా?

ప్రభూ! నాకు ఆజ్ఞ ఇవ్వండి. నేను చేయు వింతలు తిలకించండి. మీ శౌర్యప్రతాపములవలన ఈ ధనుస్సును వంచి దానితో బాటు శతయోజనములు పరుగెత్తగలరు. అట్లు చేయనిచో నేను మరల విల్లంబులు ధరించనని మీ పాదములపై ప్రతిజ్ఞ చేయుచున్నాను."

లక్ష్మణుడు కోపముతో ఈ మాటలు పల్కగనే పృథ్వి అంతయూ కంపించెను. దిగ్గజములు వణకెను. రాకుమారులతో సహా అక్కడ వున్నవారందరూ భయపడిరి. సీతాదేవి సంతోషించెను. జనకమహారాజు సంకోచించెను. విశ్వామిత్రముని శ్రీరామచంద్రుడు, మునీశ్వరులు ప్రసన్నులైరి. శ్రీరాముడు లక్ష్మణుని సౌజ్ఞ చేసి కూర్చోబెట్టెను. ఇది మంచి సమయమని గ్రహించి విశ్వామిత్రుడు "రామా! లెమ్ము. శివధనుర్భంగము గావించుము. జనకరాజు విచారమును మాన్పుము" అని పల్కెను. గురువాజ్ఞ వినినంతనే శ్రీరాముడతని పాదాభివందనము చేసి హర్షశోకరహితుడై సహజ శాంతస్వభావముతో సింహకిశోరమువలె లేచి నిలుచుండెను. ప్రభాత సూర్యుడు పర్వతమును ఎక్కినట్లు శ్రీరాముడు ఎత్తయిన పీఠమున ఎక్కగానే సజ్జనులను కమలములు వికసించినవి. వారి నేత్రములనెడి తుమ్మెదలు హర్షించినవి. రాజుల ఆశ రాత్రివలె నశించెను. వారి వచనములు నక్షత్రముల వలె నిస్తేజములు ఆయెను. గర్విష్ఠులు అయిన రాజులు కలువలవలె ముడుచుకొని పోయిరి. కపటులు అయిన రాజులు గుడ్లగూబల వలె దాక్కొనిరి. మునులు, దేవతలు చకోరపక్షులవలె సంతోషించిరి. ప్రేమపూర్వకముగా జగన్నాథుడైన శ్రీరామచంద్రుడు, గురువునకు నమస్కరించి మునుల ఆజ్ఞను ప్రార్థించి శ్రేష్ఠమైన మదించిన ఏనుగువలె తన సహజగమనముతో ముందుకు నడిచెను.

శ్రీరామచంద్రుని ప్రేమపూర్వకముగా చూచుచూ సఖీజనమును తన వద్దకు పిలిచి సీతాదేవి తల్లి అయిన సునయినాదేవి వికలమనస్కురాలై ఇలా పలికెను: "సఖులారా! అందరూ వినోదమును

చూచుచున్నారు. మన మేలు కోరువారు ఎవరయినా విశ్వామిత్రునికి చెప్పిన బావుండును. ఈ పసిబాలుని ఘోరమైన శివధనుస్సును ఎక్కుపెట్టమని ఆజ్ఞాపించుట వాంఛనీయముకాదు. ధీరములు పలికిన రాజులెల్లరూ ఓడిపోయిరి. అట్టి ధనుస్సును ఈ రాజకుమారుని చేతులలో పెట్టుచున్నారు. బాలమరాళము మందరిగిరిని మోయ గలదా? విధాత సంకల్పము ఎట్లు వున్నదో?" తెలివిగల ఒక సఖి ఇట్లు పలికెను: "రాణీ! తేజోవంతుల విషయములో వయస్సును చూడరాదు. కుంభసంభవుడైన అగస్త్యుడు మహాసముద్రమును పూర్తిగా పానము చేసి లోకములో కీర్తిని ప్రసాదించెను. సూర్యమండలము చూచుటకు చిన్నది అయినను ముల్లోకములలోని అంధకారమును దూరము చేయును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఇతర దేవతలు కూడ చిన్న మంత్రమునకు బద్ధులయ్యెదరు. మదించిన ఏనుగు చిన్న అంకుశమునకు వశమగును. పుష్పముల ధనుర్బాణములతోనే మదనుడు సర్వలోకములను వశపరుచుకొనును. దేవీ! సందేహము వదలండి. శ్రీరామచంద్రుడు తప్పక ధనుర్భంగము గావించును." సఖీజనవచనములు విని రాణికి రామచంద్రుని సామర్థ్యముపై నమ్మకము ఏర్పడెను. విషాదము తొలగిపోయెను. రామునిపై ప్రేమ అధికమాయెను. ఆ సమయమున సీతాదేవి రామచంద్రుని చూచుచూ వ్యాకులచిత్తయై ఇట్లు ప్రార్థించెను: "ఓ మహేశా! ఓ భవానీ! నా సేవలను సఫలము చేయండి. నాపై కృపచూపి ధనుస్సు బరువును తగ్గించండి. ఓ గణాధిపా! వరదాయకా! ఈ రోజు కొరకే మీ సేవలు చేయుచుంటిని. ధనస్సును అతి తేలికగా చేయండి." రఘునాథుని రెప్పవాల్చకుండా చూచుచూ సీతాదేవి ధైర్యమును చిక్కబట్టుకొని దేవతలను ప్రార్థించెను. ఆమె కన్నులు నీటితో నిండెను. శరీరము రోమాంచమాయెను. తన తండ్రి ప్రతిజ్ఞను తలంచుకొని ఆమె మనస్సు క్షోభించెను. తనలోతాను ఇట్లు అనుకొనెను: "మా తండ్రిగారు ఎంత కఠిన ప్రతిజ్ఞ చేసినారు? దాని మంచి చెడు ఫలితములను ఆలోచించనే

లేదు. అతని మంత్రులు బుద్ధిమంతులు అయికూడ సరియైన సలహాలు ఇవ్వలేదు. వజ్రసమానమైన ధనుస్సెక్కడ? కిశోరావస్థలోనున్న ఈ శ్యామసుందరుడు ఎక్కడ? ఓ శంభుని చాపమా! నీవే నన్ను కాపాడవలెను. శ్రీరఘునాథుని కోమలత్వమును చూచి తేలికగా మారుము." ఆ విధముగా సీతాదేవి మనస్సు క్షోభించెను. ప్రతిక్షణము నూరు యుగములవలె గడుచుచుండెను. ధైర్యము కూడగట్టుకొని తనలో తాను అనుకొనెను: "నిజముగా నా మనస్సు రామచంద్రుని పాదపద్మములకే అంకితము అయినచో, అందరి హృదయములలో వసించు భగవంతుడు నన్ను రఘుకుల స్వామికి దాసిగా చేయును. ఈ శరీరము అతనిది కానిచో ఇందులో ప్రాణముండదు అని భావించెను."

కృపానిధి అయిన శ్రీరాముడు, సీతాదేవి మనస్సును గ్రహించి శివధనుస్సు వైపు తదేకదృష్టితో చూచెను. అప్పుడు సభలోని దర్శకులందరు చిత్రములోని బొమ్మలవలె నిశ్చలముగా నుండిరి. శ్రీరామచంద్రుడు మనస్సులోనే గురువునకు ప్రణమిల్లి అతి లాఘవముగా ధనుస్సును లేవనెత్తెను. ధనుస్సు మెరుపువలె ప్రకాశించెను. ఆకాశమున విద్యుత్ వలయము ఏర్పడెను. శ్రీరాముడు ధనుస్సును ఎప్పుడు చేతిలో తీసుకున్నాడో, ఎప్పుడు వింటినారిని ఎక్కుపెట్టినాడో, ఎప్పుడు లాగినాడో ఇవి ఎవ్వరూ చూడలేదు. క్షణకాలములోనే శ్రీరాముడు విల్లు ఎక్కుపెట్టి రెండుగా విరిచెను. ధనుర్భంగము వలన కలిగిన కఠోర శబ్దము అన్ని లోకములలో ప్రతిధ్వనించెను. సూర్యాశ్వములు తమ విహితమార్గములను వదలి ప్రక్కకు తిరిగెను. దిగ్గజములు ఘీంకరించెను, భూమి ఊయలలూగెను. శేషవరాహకచ్ఛపములు శాంతము గోల్పోయెను. దేవతలు, రాక్షసులు, మునులు చెవులు మూసుకొనిరి. శ్రీరామచంద్రుడు శివుని విల్లు విరిచెనని అందరూ విశ్వసించిరి. జయ జయ ధ్వానములు చేసిరి. ఆకసమున దుందుభులు మ్రోగెను. దేవాంగనల పాటలు, నృత్యములు అధికమాయెను,

బ్రహ్మాది దేవతలు, సిద్ధులు, మునీశ్వరులు శ్రీరాముని ప్రశంసించి ఆశీర్వదించిరి. చిత్రవిచిత్రమైన పుష్పములను వర్షించిరి. చతుర్దశ భువనములు జయ జయ ధ్వనులతో నిండిపోయెను. వానిలో శివధనుర్భంగ ధ్వని మరుగున పడిపోయెను.

శ్రీరామచంద్ర ప్రభువు ధనుస్సు రెండుముక్కలను నేలపై పడవేసెను. ఇది చూచిన జనులందరూ సంతసించిరి. విశ్వామిత్రుని ఆనందమునకు అవధిలేదు. వందిమాగధులు శ్రీరాముని పొగడ్తలతో ముంచివేసిరి. జనులు విశేషమైన కానుకలను సమర్పించిరి. వివిధ వాద్యముల గోష్ఠి జరిగెను. యువతులు మంగళగీతములు పాడిరి. రాణి తన సఖులతో పాటు మిక్కిలి సంతసించెను. జనకుడు విచారమును మాని సంతృప్తి చెందెను. స్వాతికార్తిలో కురిసిన వానకు ఆడ చాతక పక్షివలె సీతాదేవి సంతోషముతో పొంగిపోయెను. శతానందుని ఆజ్ఞతో వెంట రూపవతులు, చతురలు అయిన సఖులు నడుచుచూ మంగళగీతములు పాడుచుండగా సీతాదేవి శ్రీరాముని సమీపించెను. ఆమె కరకమలములందలి జయమాల విశ్వవిజయశోభను వెదజల్లెను. ఆమె శరీరము సిగ్గుతో నున్ననూ మనస్సు మహదానందమగ్నమాయెను. శ్రీరాముని సమీపించి అతని సౌందర్యమును గాంచి చిత్రించిన బొమ్మవలె నిశ్చలముగా నిలిచిపోయెను. ఆమె పరిస్థితిని గమనించిన ఒక సఖి "శ్రీరామచంద్రునికి మనోహరమైన జయమాలను వేయుము" అని పల్కెను. అది విని సీతాదేవి చేతులతో జయమాలను ఎత్తెను. కాని ప్రేమవివశయై అతని కంఠసీమలో వేయలేకపోయెను. రెండు కమలములు తమ కాండములపై నిలబడి చంద్రునికి జయమాలను సమర్పించుచున్నట్లు, సీతాదేవి కరకమలములందు జయమాల శోభించెను. కనువిందొసగు ఆ దృశ్యమును చూచి చెలులు మరల పాట పాడిరి. వెంటనే సీతాదేవి జయమాలను శ్రీరాముని కంఠసీమను అలంకరింపచేసెను.

నగరమునందు, సభయందు వాద్యములు మ్రోగెను. సాధుజనులు సంతోషించిరి. దుష్టులు ఉదాసీనులైరి. దేవత, కిన్నర, మానవ, నాగ మునీశ్వరులు జయము జయమని ఆశీర్వదించిరి. అప్సరసలు పాడుచూ, నాట్యమాడుచూ పూలు కురిపించిరి. బ్రాహ్మణులు వేదమంత్రములు పఠించిరి. శ్రీరాముడు శివధనుర్భంగమును గావించి సీతను వరించెనను శుభవార్త సకల లోకములందు వ్యాపించెను. నగర ప్రజలు కానుకలు సమర్పించి మంగళహారతులు ఎత్తిరి. సఖులు "సీతా! నీ ప్రభు పాదములకు ప్రణమిల్లుము" అని పల్కిరి. కాని గౌతమ పత్నియగు అహల్య గతిని స్మరించి సీతాదేవి శ్రీరాముని పాదములను స్పృశించుటకు భయపడెను. ఈ అలౌకిక ప్రేమను చూచి శ్రీరాముడు తనలోతాను నవ్వుకొనెను.

## 19. పరశురాము గర్వభంగము

[illegible] రాజులకు ఆమెపై మోహము [illegible] దుష్టులు, మూర్ఖులయిన రాజులు కోపముతో కవచములను ధరించి యుద్ధోన్ముఖులైరి. ఒకడు చెప్పసాగెను: "సీతను బలవంతముగా ఎత్తుకొనిపొండి. ఆ రాకుమారు లిద్దరినీ బంధించండి. ధనుస్సు విరుచుట వలన పని పూర్తి కాలేదు. మేము బ్రతికి ఉండగా రాకుమారిని ఎవరు పెండ్లి ఆడెదరో చూచెదముగాక!" మరొకడు పలికెను: "జనకరాజు మాకు సహాయపడకపోతే వారిద్దరితోపాటు అతనిని కూడ యుద్ధములో ఓడించెదము." సజ్జనులైన రాజులు న్నియున్న ఆ మూర్ఖులను చూచి ఇట్లనిరి. "మీ బలపరాక్రమముల ఎక్కడనుండియైన తెచ్చుకొన్నారా? పోయినవి. మళ్ళీ మీ వీరత్వమును క్రొత్తగా విధాత మీ ముఖములను నల్లగా మార్చినాడు. దుష్టత్వము ఉన్నందులకే ఈర్ష్య, గర్వము, క్రోధములను వదలి శ్రీరాముని కనులారా చూడండి. లక్ష్మణుని కోపాగ్నికి శలభములు కావద్దండి." ఈ కోలాహలమునంతయు విని

సీతాదేవి భయపడెను. సఖులామెను అక్కడ నుండి రాణివద్దకు తీసుకొనిపోయిరి. రాజుల మాటలు విని లక్ష్మణుని నేత్రములు ఎఱ్ఱబడెను. భృకుటి ముడిపడెను సింహకిశోరము ఏనుగుల గుంపుపై లంఘించుటకు ఉత్సాహమును చూపునట్లు లక్ష్మణుడు రాజులవైపు కోపముతో చూచెను. కాని శ్రీరామునికి వెరచి ఊరకుండెను.

అదే సమయమున భృగు వంశజుడైన పరశురాముడు శివధనుర్భంగ వార్త విని అచటికి ఏతెంచెను. అతనిని చూడగానే రాజులందరూ భయముతో వణకసాగిరి. అతని శరీరముపై భస్మము, లలాటమున త్రిపుండ్రములు, శిరమున జటాజూటము శోభిల్లుచుండెను. కనులు ఎరుపెక్కి, కనుబొమలు ముడిపడి ఉండెను. చూచిన వారికి అతడు మూర్తీభవించిన క్రోధమువలె నుండెను. భుజములు ఎత్తుగా, రొమ్ము విశాలముగా, బాహువులు పొడవుగా నుండెను. యజ్ఞోపవీతము, మాల, జింకచర్మమును ధరించెను. వల్కలధారియై చేతులలో ధనుర్బాణములు, [illegible] గండ్రగొడ్డలి కలిగి ఉండెను. అతడు మునివేషధారియైనను అతని పనులన్నియు [illegible] [illegible]గాముని భయంకర వేషమును చూచి రాజులెల్లరు వికలమనస్కులై లేచి నిలుచుండిరి. తమ పేరు, తమ తండ్రిపేరు చెప్పుకొని దండప్రణామములు ఆచరించిరి. జనకుడు అతనికి ప్రణమిల్లి సీతాదేవిని పిలిచి ఆమెతో నమస్కరింపచేసెను. పరశురాముడు సీతాదేవిని ఆశీర్వదించెను. తర్వాత విశ్వామిత్రుడు వచ్చి సోదరు లిద్దరినీ అతని పాద పద్మములకు నమస్కరింపచేసెను. "వీరు రామలక్ష్మణులు దశరథ మహారాజపుత్రులు," అని వారిని పరిచయము చేసెను. అట్టి అందమైన జంటను చూచి పరశురాముడు ఆశీర్వదించెను, "ఈ జనసమూహము ఇచ్చటికి రా కారణమేమి?" అని జనకుని ప్రశ్నించెను. రాజులందరూ అక్కడ సమావేశమైన [illegible] జనకుడు వినిపించెను. పరశురాముడు అక్కడ నేలమీద పడియున్న ముక్కలను చూ[illegible]

ధనస్సును విరిచినది ఎవరు? వెంటనే తెలుపుము. లేనిచో నీ రాజ్యమును తలక్రిందులుగా చేసెదను" అని కఠినముగా పలికెను. భయము వలన జనకుడు సమాధానము ఇవ్వలేదు. కుటిలురు అయిన రాజులు సంతోషించిరి. సీతాదేవి తల్లి విచారించెను. సీతాదేవి, ఇతర జనులు భయభ్రాంతులగుట చూచి పరమశాంతస్వభావుడైన శ్రీరాముడు ఇలా పలికెను: "ప్రభూ! ఎవడో మీ దాసుడే శివధనుస్సును విరిచి ఉంటాడు. మీ ఆజ్ఞ ఏమి? నాతో చెప్పండి." ఆ మాటలు విని ముని ఇంకను కోపోద్రిక్తుడు ఆయెను. "సేవకుడు సేవ చేస్తాడు. శత్రువు పని యుద్ధము చేయుటయే. రామా! వినుము– ఈ శివధనుస్సును విరిచినవాడు సహస్రబాహువువలె నాకు శత్రువు. ఈ సమూహములోనుండి అతనిని బయటికి రానిమ్ము. లేదా ఈ రాజులందరూ వధింపబడుదురు" అని పలికెను.

పరశురాముని బెదిరింపు విని లక్ష్మణుడు చిరునవ్వుతో నిరాదరముగా నిట్లనెను: "నా బాల్యమున నేను అనేక చాపములు విరిచితిని. కాని మీరెప్పుడు కోపగించలేదు. ఈ చాపముపై మీకింత ప్రీతియేలనో?" పిదప కుపితుడైన భార్గవరాముడికి, లక్ష్మణునికి ఈ క్రింది విధముగా సంభాషణ జరిగెను:

పరశురాముడు : అరే రాకుమారా! నీకు చావు మూడినది లోక విదితమైన శివధనుస్సును ఇతర చాపములతో పోల్చదగునా?

లక్ష్మణుడు : మునీశ్వరా! మా దృష్టిలో చాపములన్నియూ సమానమే. త్రుప్పుపట్టిన ఈ పాత చాపమును విరుచుటవలన నష్టము ఏమి? శ్రీరామచంద్రుడు దానిని క్రొత్త చాపమని భావించియుండెను. కాని అది తాకినంతనే విరిగినది. ఇందులో శ్రీరాముని దోషము లేదు. మీరేల వ్యర్థముగా కోపగించెదరు?

పరశురాముడు : అరే దుష్టుడా! నీవు నా స్వభావమును వినలేదు. నీవు బాలుడవు గాన నిన్ను చంపదలుచుకోలేదు. మూర్ఖుడా! నన్ను కేవలము ఒక మునిగా భావించి నావా? నేను బాల బ్రహ్మచారిని, కోపిష్ఠిని, నా బాహుబలముచే పృథ్వీలో రాజులు లేకుండా చేసినాను. నా పరశును చూడుము. ఇది చాల భయంకరమైనది. దీనితో సహస్రబాహూభుజములను నలిపివేసినాను. నీ తల్లిదండ్రులను చింతాక్రాంతులుగా చేయవద్దు.

లక్ష్మణుడు : అహో! ఈ మునీశ్వరుడు తానొక అసాధారణ యోధుడనని భావించుచున్నాడు. మాటిమాటికి తన గొడ్డలిని చూపించుచున్నాడు. చూపుడువే లును చూడగనే వాడిపోవుటకు గుమ్మడిపూలు లేవు. మీ గొడ్డలి, ధనుర్బాణములు చూచిన తర్వాతనే నేను కొంచెం అభిమానముతో మాట్లా డినాను. మీరు భృగువంశస్థులని తెలుసుకొని, మీ యజ్ఞోపవీతమును చూచి కోపము తగ్గించుకొని మీ మాటలను సహించినాను. మా వంశములో ఎవ్వరూ దేవతలు, బ్రాహ్మణులు, గోవులు, శ్రీహరి భక్తులపై తమ ప్రతాపమును చూపరు. మీరు మమ్మలను కొట్టిననూ మేము మీకు పాదాభివం దనము చేయాలి. కావున ధనుర్బాణములు, గొడ్డలి మీకు అనవసరమైన బరువు. ఓ ధీర మహామునీ! వీటిని చూచి నేను ఏదైన అనుచిత వాక్యములు పలికినచో నన్ను క్షమింపుడు.

పరశురాముడు : ఓ విశ్వామిత్రా! ఈ బాలుడు మిక్కిలి మందమతి. కుటిల స్వభావుడు. తాను యమునికి వశమగుట యేగాక తన సూర్యవంశమునకు కూడ కలంకము తెచ్చుచున్నాడు. నేను బిగ్గరగా చెప్పుచున్నాను. ఎవ్వరు నన్ను నిందించరాదు. ఇప్పుడే ఒక్క క్షణములో ఇతనిని యముని వద్దకు పంపగలను. మీరితనిని రక్షించదలచినచో మా బలపరాక్రమములు అతనికి చెప్పి అతనిని ఆపండి.

లక్ష్మణుడు : ఓ మునీ! మీరుండగా మీ కీర్తిని ఇతరులు ఏల పొగడగలరు? మీ నోటితోనే మీ ఘనకార్యములను గూర్చి అనేక మార్లు వర్ణించినారు. ... వారు యుద్ధములో తమ శౌర్యమును చూపె శత్రువును జూచి పిరికివాడు కూడ తన ప్రతాపమును గూర్చి ప్రగల్భాలు పలుకుతాడు. ఓ మునీ! బహుశా మీరు పిలువగానే వచ్చుటకు యముడు సిద్ధముగా నున్నాడేమో మాటిమాటికి నా కొరకు అతనిని పిలుస్తున్నారు.

లక్ష్మణుని కఠోరవచనములు విని పరశురాముడు గండ్రగొడ్డలిని తన చేతిలోనికి తీసుకొని ఇలా పలికెను:

పరశురాముడు : ఈ పరుషవాది బాలుడు చంపబడుటకు యోగ్యుడు. ఇతడు బాలుడని భావించి నేను ఇతనిని రక్షించినాను. కేవలము బెదిరించినాను. ఇప్పుడిక వదలను.

ఆ సమయమున విశ్వామిత్రుడు ఇలా పలికెను: "ఇతని అపరాధమును క్షమించండి. ఎందుకనగా, సజ్జనులు బాలురగుణదోషములను లెక్క చేయరు.

పరశురాముడు : నా కుఠారము చాలా పదునైనది. నేను దయార్ద్ర హితుడను. కోపిష్ఠిని. ఈ గురుద్రోహి, అపరాధి నా ఎదుట గలడు అయినను నాకు సమాధానము ఇస్తున్నాడు. విశ్వామిత్రా! కేవలము మీ మీద గౌరవముతో నేను ఇతనిని వదిలి వేస్తున్నాను. లేనిచో ఈ గొడ్డలితో ఇతని తల నరికి నా గురువుగారి ఋణమును తీర్చుకొని ఉండెడివాడను.

లక్ష్మణుడు : ఓ మునీ! నీ శీలము గూర్చి ఎవరికి తెలియదు. అది ప్రపంచ విఖ్యాతి గాంచినది. మాతాపితరుల ఋణమును తీర్చినావు. ఇంక గురుఋణము తీర్చవలసి ఉన్నది. బహూశా అది మా ద్వారా తీరవలసియున్నది. చాలా ధినములు గడిచినది వడ్డీ గూడ పెరిగి ఉండవచ్చు. ఎవరినైన గణికుని పిటుచుకరండి. ఇప్పుడు నేను ఋణము తీర్చగలను.

ఆ మాటలు విని పరశురాముడు తన గొడ్డలిని పైకెత్తెను. సభలో హాహాకారములు చెలరేగెను.

లక్ష్మణుడు : పరశురామా! మీరు నాపై గొడ్డలిని ఎత్తినారు. బ్రాహ్మణుడవని నిన్ను క్షమించినాను. నిన్ను ఇంతవరకు సరియైన యోధుడెవరు యుద్ధములో ఎదురించలేదు.

అది విని అందరూ అనుచితము అని పలికి లేచిరి. శ్రీరామచంద్రుడు లక్ష్మణుని ఊరుకుండమని సైగ చేసెను. మరియు ఇట్లు పలికెను: "ఓ ప్రభూ! ఈ బాలునిపై దయచూపుడు మీ ప్రతాపమును గూర్చి ఏ మాత్రము తెలిసిననూ ఈ విధముగా మిమ్ములను ఎదురించడు. పిల్లలు అల్లరి చేస్తే తల్లిదండ్రులు, గురువు

మనస్సులో సంతోషిస్తారు. మీరు సమదర్శులు, ధీరులు, జ్ఞానులు ఇతనిని సేవకునిగా భావించి కృప చూపండి."

శ్రీరామచంద్రుని వచనములు విని చల్లబడుచున్న పరశురామునికి లక్ష్మణుడు నవ్వగానే నఖశిఖపర్యంతము కోపము గలిగి ఇట్లు పలికెను: "ఓ రామా! నీ తమ్ముడు గొప్ప పాపి. శరీరము ఎఱ్ఱగా నున్ననూ ఇతని మనస్సు నల్లనిది. ఈ నీచుడు నన్ను మృత్యుదేవతగా ఎరుగడు." లక్ష్మణుడు నవ్వి ఇట్లనెను: "ఓ మునీ! వినుము, కోపమే పాపానికి మూలము. దానికి అధీనుడై మనుష్యుడు దుష్కర్మలను ఆచరించును. ప్రపంచానికి శత్రువు అగును. నేను మీ సేవకుడను. కోపము పరిత్యజించి నాపై దయచూపుము. కోపము వలన విరిగిన ధనుస్సు అతకదు. ఈ ధనుస్సు మీకంత ప్రియమైనచో ఎవరినైనా నిపుణుని పిలిపించి అతికించండి."

లక్ష్మణుని ఆ మాటలకు భీతిల్లి జనకమహారాజు "దయచేసి చాలించండి, హద్దులు దాటుట ఉచితము కాదు" అనెను. లక్ష్మణుని నిర్భయత్వమును చూచి పరశురాముడు క్రోధాగ్నిలో మండుచున్ననూ అతని శక్తి క్షీణించుచుండెను. శ్రీరామునిపై దయచూపునట్లుగా ఇట్లు పలికెను: "ఇతడు నీ తమ్ముడు కాబట్టి వదలివేయుచున్నాను. ఇతడు విషపూరితమైన బంగారు పాత్ర లాంటివాడు." అది వినగానే లక్ష్మణుడు మరల నవ్వెను. అప్పుడు శ్రీరాముడు అతనిని కోపదృష్టితో చూచెను. లక్ష్మణుడు తన వ్యంగ్య ధోరణిని మానివేసి గురుసమీపమున కూర్చొనెను. శ్రీరామచంద్రుడు చేతులు జోడించి అత్యంత వినయముతో మధుర శీతల వచనములను పలికెను: "ప్రభూ! వినండి, మీరు సహజముగా తెలివిగలవారు. బాలుని పలుకులను పట్టించుకోకండి. అతడు మీకెట్టి హాని చేయలేదు. నేను మీ అపరాధిని. దయా, క్రోధము, వధ, బంధనములు వీనిలో దేనినైనా సరే మీ సేవకుడని భావించి నాపై చేయండి. ఏ ఉపాయము చేత

మీ కోపము దూరమగునో చెప్పండి, నేను దానిని చేస్తాను." ముని సమాధానము ఇచ్చెను: "రామా! నా హృదయములో కోపమున్ననూ చేయి కదలుట లేదు. అసంఖ్యాకులైన రాజులను వధించిన ఈ గొడ్డలి మొద్దుబారిపోయినది. విధి నాకు వ్యతిరేకమయినది. నా స్వభావము మారినది. ఎప్పుడు లేని కృప నా హృదయములో కలిగి దుస్సహమయిన దుఃఖమును కలిగించుచున్నది. శివధనుస్సును విరిచినది చాలక తిరిగి నాకే జ్ఞానోపదేశము చేస్తున్నావా? నీ కపటమును మాని యుద్ధము చేయుము. లేనిచో నీ సోదరునితో సహా నిన్ను వధించెదను." శ్రీరాముడు శిరస్సు వంచి "మునీశ్వరా! కోపమును వదలండి. మీ చేతిలో గొడ్డలియున్నది. ఎదురుగా తలయున్నది. మీ కోపము ఎట్లు చల్లారునో అట్లు చేయండి. నేను మీ దాసుడను. మీ చేతిలో కుఠారము ధనుర్బాణములను చూచి నా తమ్ముడు అట్లు పలికినాడు. మీరు ముని వేషధారియై వచ్చి యుండినచో మీ పాదధూళి తన శిరస్సుపై వుంచుకొనెడివాడు. తెలియక చేసిన తప్పును క్షమించవలె. బ్రాహ్మణ హృదయములో అత్యంత కృపయుండవలెను." పరశురాముడు ఈ విధముగా పలికెను: "నీవు నన్ను కేవలము ఒక సాధార్ణ బ్రాహ్మణునిగా భావించుచున్నాను. నేను ఎటువంటి బ్రాహ్మణుడనో తెలుపుతాను. నా ధనుస్సు హోమపు గరిట, బాణములు ఆజ్యము. నా కోపము మండుచున్న అగ్ని, చతురంగ బలము సమిధలు, గొప్పరాజులు దీనికి బలిపశువులు అయినారు. ఇట్లు అనేక కోట్ల రణయజ్ఞములను నేను గెలిచినాను. నా ప్రభావము నీకు తెలియదు. ధనుస్సు విరచినానని విశ్వమే జయించిన వానివలె అభిమాన పడుచున్నావు." శ్రీరాముడు బదులు పలికెను: "మునీశ్వరా! మీ కోపము చాల గొప్పది. నా అపరాధము చాలా చిన్నది. ధనుస్సు చాల పాతది. తాకగానే విరిగిపోయినది. ఏ కారణమున గర్వించవలెను. రఘువంశములో జన్మించిన వాడెవ్వడూ యుద్ధములో యమునికైన భయపడడు. కాని

పరచిరి. అద్భుతమైన మామిడి ఆకులను మణులతోను బంగారు పచ్చలు పొదగిన మామిడి పండ్లను పట్టుదారముతో వ్రేలాడునట్లు చేసిరి. ద్వారతోరణములు, మంగళకరములైన కలశములు, సుందరమైన ధ్వజములు, పతాకములు, తెరలు అలంకరించబడినవి. మణులతో కూర్చిన అనేక దీపములు కలిగిన ఆ మండపమును వర్ణించుటకు ఏ కవికి కూడ సాధ్యముకాదు. శ్రీ జానకీదేవి పెండ్లికూతురుగా, శ్రీరామచంద్రుడు పెండ్లికుమారుడుగా కూర్చొను ఆ మండపము ముల్లోకములలో ప్రసిద్ధిగాంచినది. జనకమహారాజు భవనము ఏ రీతిగా అలంకరించబడినదో అట్లే నగరములోని అన్ని గృహములు శోభిల్లెను.

జనకుని దూతలు అయోధ్యా పట్టణమును చేరి రాజభవనద్వారమును చేరి రాజునకు తమ రాకను తెలిపిరి. రాజాజ్ఞచే లోనికి వచ్చి నమస్కరించి ఉత్తరమును ఇచ్చిరి. ఉత్తరమును చదువగానే రాజు కన్నులలో నీరు నిండెను. హృదయ మానందముతో నిండెను. శరీరము కంపించెను. ఒక్కమాట కూడ మాట్లాడలేకపోయెను. తరువాత మనస్సును కుదుటపరచుకొని ఉత్తరమును బిగ్గరగా చదివెను. సభాసదులు విని ఆనందమును పట్టలేకపోయిరి. రాజు దూతలను తన వద్ద కూర్చుండ బెట్టుకొని "మిత్రులారా! బాలురిద్దరు కుశలమా? వారిని మీరు స్వయముగా చూచినారా? వారు ఎట్లున్నారో చెప్పండి. ముని వారిని తన వెంట తీసుకొని పోయిన తరువాత నేటివరకు వారి సమాచారమే నాకు తెలియలేదు. జనకుడు వారిని ఎట్లు గుర్తించెనో చెప్పండి." ఆ ప్రియవాక్యములను విని దూతలు సీతాస్వయంవర వృత్తాంతము, శివధనుర్భంగము, పరశురామగర్వభంగము అనేక విధములుగా వర్ణించుచూ రామలక్ష్మణుల ప్రతాపములను ప్రశంసించిరి. సభికులు సంతోషించిరి. దశరథుడు ఆనందమగ్నుడై వారికి అనేక కానుకలను సమర్పించెను. కాని "ఇది నీతికి విరుద్ధము" అనుచూ వారు ఆ కానుకలను తీసుకొనలేదు. పిదప రాజు వశిష్ఠునికి

ఉత్తరమునిచ్చి విషయమంతయునూ తెలిపెను. వశిష్ఠుడు ప్రసన్నుడై ఇట్లనెను: "పుణ్యపురుషులకు పృథ్వియందు సుఖమే ఉండును. సముద్రము నదులను కోరకున్ననూ నదులన్నియూ సముద్రములోనే కలియును. అట్లే సుఖసంపదలు కూడ ధర్మాత్ములవద్దకు వచ్చిచేరును. మీతో సమానమైన పుణ్యాత్ముడు ఈ జగత్తులో "న భూతో న భవిష్యతి." రాజా! రాముని వంటి పుత్రునిగన్న మీకంటే పుణ్యాత్ములు ఎవరుందురు? మీ నలుగురు కుమారులు వీరులు, వినయశీలురు, ధర్మవ్రతులు, గుణసముద్రులు. మీకెల్లప్పుడు శుభమే జరుగును. కావున దుందుభులు మ్రోగించి వివాహపు ఊరేగింపునకు సిద్ధముకండు. శీఘ్రముగా బయలుదేరుడు" గురు వచనములను విని, "ప్రభూ! అట్లే కానియ్యండి" అని పలికి రాజు నమస్కరించి దూతలకు ఆవాసములను ఏర్పరిచి నిజమందిరమునకు ఏగెను.

దశరథుడు రాణులందరినీ పిలిచి జనకుని జాబును చదివి వినిపించెను. ఆ వార్త విని వారు అమితానందమును పొందిరి. గురుపత్ని, ఇతర పెద్ద ముత్తయిదువలు ఆశీర్వచనములు పలికిరి. తల్లులు ఆనందభరితలై ఒకరి తరువాతనొకరు ఉత్తరమును తీసుకొని తమ హృదయములకు హత్తుకొనిరి. దశరథుడు రామలక్ష్మణుల కీర్తిని మాటిమాటికి వర్ణించి "ఇదంతయు మునీశ్వరుని కృప" అని పలికి తన మందిరమునకు పోయెను. ఈ వార్త ప్రజలకు తెలియగానే ప్రతి ఇంటిలో మంగళాచారకార్యములు చేయసాగిరి. శ్రీసీతారాముల వివాహవార్త పదునాలుగు లోకములందు ఉత్సాహమును నింపెను. అయోధ్య మనోహరమైన నగరము. అయినను ప్రజలు తమ ప్రీతిచే దానివి ఇంకను అందముగా అలంకరించిరి. వీధులు ధ్వజ పతాకములు, తోరణములు, తెరలతో శోభిల్లెను. బంగారు కలశములు, విజయ ద్వారములు, మణుల తోరణములు, పూలమాలలతో ప్రజలు తమ గృహములను అలంకరించిరి.

విద్యుల్లతవలె ప్రకాశించువారు, చంద్రముఖులు, హరిణేక్షణలు, అందములో రతీదేవిని కూడ అధఃకరించువారైన యువతులు సమూహములుగా మంజుల మనోహరవాణితో మంగళ గీతములు పాడుచుండిరి. నగారాలు మ్రోగించబడెను. భట్రాజులు బిరుదావళు లను ఉచ్ఛరించుచుండిరి. బ్రాహ్మణులు వేదములను పఠించుచుండిరి. రూపవతులయిన స్త్రీలు సీతారాముల పేర్లతో మంగళగీతములు పాడుచుండిరి. భవనము చిన్నదై, ఉత్సాహము అధికమై నాలుగు దిశలకు పొంగిప్రవహించుచుండెను. సమస్త దేవతాశిరోమణి అయిన శ్రీరామచంద్రుడు అవతారమెత్తిన ఆ దశరథ మహారాజు భవన శోభను ఏ కవి వర్ణించగలుగును?

రాజు భరతుని పిలిచి, "వెళ్ళి గుఱ్ఱములు, ఏనుగులు, రథములను అలంకరించుము. శీఘ్రముగా శ్రీరాముని వివాహపు ఊరేగిం పులో వెళ్ళుము" అని ఆజ్ఞాపించెను. అది విని భరతశత్రుఘ్నులు పులకించిపోయిరి. భరతుడు సర్వసేనాధిపతులను పిలిచి వారికి సూచనలు ఇచ్చెను. వారు అనేక వర్ణములు గల సుందరమయిన, చంచలమయిన వేగముగా పరుగెత్తగల మంచి జాతి గుఱ్ఱములను జీనులతో అలంకరించిరి. యువకులైన రాకుమారులు, భూషణములు ధరించి విల్లంబులతో గుఱ్ఱములను ఎక్కిరి. రథసారథులు తమ రథములను ధ్వజ పతాకములతోను, భూషణములతోను అలంకరిం చిరి. ఛత్రచామరములు, గంటలతో అలంకరింపబడిన రథములకు శ్యామకర్ణములుగల గుఱ్ఱములు కట్టబడెను. రథములపై సారథులు, యుద్ధవీరులయిన రథికులు కూర్చొనిరి. శ్రేష్ఠమైన ఏనుగులు అంబారీలతో, గంటలతో శోభిల్లుచూ శ్రావణమేఘములవలె కదలు చుండెను. పల్లకీలు, చిన్నరథములు మరియు అనేక వాహనములలో వేదమూర్తులయిన బ్రాహ్మణులు ప్రయాణమయిరి. వందిమాగధులు, సూతులు, భట్రాజులు తమకు తగిన వాహనములను ఎక్కిరి. భటులు

అసంఖ్యాకములయిన వస్తువులను కంచర గాడిదలు, ఒంటెలు, ఎద్దులపై వేసి ప్రయాణమయిరి. పాదచారులు వివిధ వస్తువులను తమ భుజములపై ఎత్తుకొనిరి. అందరి హృదయములు అపారమయిన ఆనందముతో నిండెను. శ్రీరామలక్ష్మణులను ఎప్పుడు నేత్రానందముగా చూడగలము అని అందరి మనస్సులలో కోరిక ఉండెను. వీరందరూ పెండ్లి ఊరేగింపునకై నగరము వెలుపల గుమిగూడిరి.

ఏనుగుల ఘీంకార ధ్వనులు, వాటి గంటలశబ్దములు, రథచక్రాల సవ్వడులు, గుఱ్ఱముల సకిలింపులు, నగారాల మ్రోతలు ఇవన్నియూ మేఘగర్జనలను కూడ అధిగమించెను. రాజభవన ద్వారము ముందర జనులు గుమిగూడి యుండిరి. స్త్రీలు ఇండ్ల పైభాగము నుండి హారతి పళ్ళెములను చేబూని పాటలు పాడుచుండిరి. దశరథుని మంత్రి రథసారథి వడిగల గుఱ్ఱములను పూన్చి రెండు రథములను సిద్ధపరచెను. ఒక రథముపై వశిష్ఠుని ఆసీనునిగా చేసి, దశరథుడు మరొక రథమును ఎక్కెను. వంశానుగతమైన వేదోక్తవిధులన్నియూ నెరవేర్చి, దశరథుడు వశిష్ఠుని ఆజ్ఞతో శంఖనాదములతో బయలుదేరెను. ఆ ఊరేగింపును చూచి దేవతలు కూడ ప్రసన్నులై పూలను వర్షించిరి. మంగళవాద్యములు మ్రోగెను. పాదచారులు కొందరు గాలిలోకి ఎగిరి అనేక విన్యాసములు, నృత్యములు చేసిరి. విదూషకులు అనేక హాస్యప్రసంగములు చేయుచుండిరి. సుందర రాజకుమారులు మృదంగ, నగారా, తాళములను అనుసరించుచూ గుఱ్ఱములు నాట్యామాడేటట్లు చేసిరి. మంగళమయము, కళ్యాణప్రదము, వాంఛితఫలప్రదములైన శకునములన్నియూ ఒక్కసారిగా ప్రకటితమాయెను.

ఆ విధముగా గుఱ్ఱముల సకిలింపులు, ఏనుగుల ఘీంకారములు, నగారాల మ్రోతలమధ్య ఊరేగింపు ముందుకు సాగెను. సూర్యవంశ శ్రేష్ఠుడైన దశరథుడు వచ్చు దారిలోని నదులన్నిటికీ జనకుడు వంతెనలను నిర్మింపచేసెను. త్రోవలో విడిదికి విశ్రాంతి గృహములనుఏర్పాటుచేసెను

అందులో వరుని పక్షమువారికి మనోవాంఛితములైన భోజనపదార్థములు, పరుపులు, వస్త్రములు సమకూర్చబడెను. ఆ నూతన సుఖములను చూచి వారు తమ ఇండ్లను కూడ మరచిరి. నగారాల మ్రోతలు విని వరుని పక్షమువారి ఊరేగింపు తమ నగరమును సమీపించుచున్నదని తెలుసుకొని వారి స్వాగతమునకు రథగజతురగపదాతులతో ఆహ్వానసంఘ సభ్యులు వచ్చిరి. ఇరుపక్షములనుండి కొందరు సంతోషమును పట్టలేక ఎదుటివారిని కలుసుకొనుటకు రెండు ఆనంద సముద్రములు తమ హద్దులు దాటి కలియునట్లు ముందుకు పరుగెత్తిరి. ఆహ్వానసంఘము వారు అన్ని వస్తువులను దశరథుని ముందరనుంచి ప్రేమతో వినతి చేసిరి. రాజు సాదరముగా వానిని స్వీకరించి తన ప్రజలకు కానుకలుగా నిచ్చెను. బీదవారికి కూడ పంచెను. పిదప పూజాసన్మానములతో ఆహ్వానసభ్యులు వారి వెంట నడిచి వారి కేర్పాటు చేసిన విడిది గృహములలో దించిరి. వరపక్షము వారు జనకపురికి వచ్చినారని తెలిసి సీతాదేవి తన మహిమలను చూపదలచి తన సిద్ధులను స్మరించెను. వారు ఆమె ఆజ్ఞతో అతిథిగృహమున ప్రవేశించిన వారికి స్వర్గసుఖము నందించిరి. అందరు జనకుని ప్రశంసించిరి. అది సీతాదేవి మహిమ అని శ్రీరామునికి మాత్రమే తెలియును.

శ్రీరామలక్ష్మణులు తమ తండ్రిరాక తెలియగనే పట్టరాని ఆనందముతో విశ్వామిత్రుని ఆజ్ఞపొంది దశరథుని అతిథి గృహమునకు పోయిరి. దప్పికగొన్న వాని వద్దకు సరస్సే నడిచి వచ్చినట్లు, మిక్కిలి హర్షముతో దశరథుడు విశ్వామిత్రునితో సహా వచ్చిన రామలక్ష్మణులను చూచి ఆనంద సముద్రమున నోలలాడెను. విశ్వామిత్రునికి సాష్టాంగ ప్రణామములు ఆచరించెను. మునీశ్వరుడు అతని నాశీర్వదించి కుశలప్రశ్నలు వేసెను. తనకు దండప్రణామములు ఆచరించిన కుమారులను దశరథుడు ఆనందములో హృదయమునకు హత్తుకొనెను. పిదప రామలక్ష్మణులు వశిష్ఠునికి ఇతర బ్రాహ్మ

ణులకు నమస్కరించి వారి ఆశీస్సులు పొందిరి. భరతశత్రఘ్నులు వచ్చి నమస్కరించగా శ్రీరాముడు వారిని లేపి హృదయమునకు హత్తుకొనెను. సోదరులిద్దరినీ చూచి లక్ష్మణుడు కూడ ఆలింగనము చేసికొనెను. పిదప పరమ కృపాళువు, వినయశీలి శ్రీరామచంద్రుడు పురజనులను, కుటుంబసభ్యులను, మంత్రులను, మిత్రులను అందరినీ యథావిధిగా కలిసెను. శ్రీరామచంద్రుని చూచిన అయోధ్యావాసుల విరహాగ్ని ఒక్కసారిగా చల్లారెను. రాజుతో పాటు నలుగురు సోదరులు మూర్తీభవించిన పురుషార్థములవలె శోభిల్లిరి. ఆహ్వాన సంఘ సభ్యులయిన గురు శతానందుడు, ఇతర బ్రాహ్మణులు, మంత్రులు, మాగధులు, సూతులు, విద్వాంసులు, భట్రాజులు మొదలగువారందరు దశరథుని యథోచితముగా సన్మానించి అతని ఆజ్ఞతో వెనుకకు మరలిపోయిరి. జనులందరు బ్రహ్మానందమును అనుభవించిరి. సీతాదేవి స్వయంవరమునకు వచ్చిన ఇతర రాజకుమారులు కూడ నలుగురు సోదరులను చూచి మిక్కిలి సంతసించిరి. ఆ విధముగా చాలరోజులు గడిచినవి. పురజనులు, అతిథులు ఆనందముగా నుండిరి.

మంగళకరమైన వివాహముహూర్తము రానే వచ్చెను. బ్రహ్మదేవుడు సరియైన గ్రహ, తిథి, నక్షత్ర, యోగ దినములను పరిశీలించి ముహూర్త సమయమును నిర్ణయించి నారదుని వెంట పంపెను. జనకుని జ్యోతిష్యులు కూడ అదే ముహూర్తమును నిర్ణయించిరి. మిక్కిలి శుభప్రదమైన గోధూళి సమయమున మంచి శకునములను చూచి బ్రాహ్మణులు జనకునికి సందేశము నంపిరి. జనక మహారాజు పురోహితుడైన శతానందుని చూచి "ఇక ఆలస్యమేల?" అనెను. శతానందుడు మంత్రులకు తగిన రీతిగా సూచనలను ఇచ్చెను. శంఖములు, నగారాలు, ఇతర వాద్యములు మ్రోగింపబడెను. మంగళ కలశములు, శుభశకునమును సూచించు వస్తువులు అలంకరించబడెను. సువాసినులు గీతములను పాడిరి. బ్రాహ్మణులు వేదములను పఠించిరి.

ఆ విధముగా జనులందరు సాదరముగా వరుని పక్షమువారు నివసించు అతిథిగృహమునకు పోయి వినయపూర్వకముగా "శుభముహూర్తము వచ్చినది. దయచేసి బయలుదేరండి" అని ఆహ్వానించిరి. గురువైన వశిష్ఠుని ఆజ్ఞతో కులాచార కార్యములు నిర్వర్తించి, దశరథ మహారాజు మునులతో, సాధువులతో బయలుదేరెను. బ్రహ్మ, శివుడు, ఇతర దేవతలు కూడ తమ విమానములను ఎక్కి శ్రీరాముని వివాహము చూడ అమితోత్సాహముతో నేతెంచిరి. దశరథుడు జనకుని భవనము వైపునకు అమితానందమున పులకితశరీరుడై పోవుట దేవతలు చూచిరి. వెంట నలుగురు కుమారులు మూర్తీభవించిన మోక్ష సామ్రాజ్యమువలె [సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము] శోభిల్లుచుండిరి. శ్రీరాముని సౌందర్యమును నఖశిఖపర్యంతము చూచి ఉమాశంకరులు హర్షవిహ్వలులు అయిరి. శ్రీరామునితో పాటు అతని తమ్ములు గుఱ్ఱములతో విన్యాసములు చేయించుచూ నడిపించుచుండిరి. శ్రీరాముడు ఎక్కిన గుఱ్ఱము మిక్కిలి శోభాయమానముగా నుండెను. ఇరుపక్షములవారు ఆనందోత్సాహములతో ఉండిరి. "రఘుకుల మణికి జయము జయము" అనుచూ దేవతలు పుష్పవృష్టి కురిపించిరి. అనేక వాద్యములు వాయించబడెను. సీతాదేవి తల్లిగారైన సునయనాదేవి ముత్తయిదువులను పిలుచుకొని అనేక రకములైన మంగళ ద్రవ్యములను హారతి పళ్ళెములను తీసుకొని స్వాగతమునకై వెళ్ళెను. ఆనందమయుడైన పెళ్ళికుమారుని చూచి స్త్రీలు హర్షోల్లాసులయిరి. కన్నులలో వచ్చు ఆనందాశ్రువులను ఆపుకొని సునయనాదేవి ప్రసన్నతతో స్వాగతము పలికెను. వేదోక్తవిధానముగా కులాచారవ్యవహారములను చక్కగా నెరవేర్చి, రాణి మంగళహారతిని అర్ఘ్యమును ఇచ్చెను. శ్రీరామచంద్రుడు మండపములో ప్రవేశించెను. బ్రాహ్మణులు శాంతి పాఠములు వల్లించుచుండగా ఉచితాసనమును అలంకరించెను. బ్రహ్మాది దేవతలు కూడ బ్రాహ్మణ వేషములతో వచ్చి ఈ వేడుకను చూచిరి. వైదిక, లౌకిక రీతులన్నియూ పూర్తిచేసిన

పిదప, జనకుడు దశరథుని ప్రేమతో ఆలింగనము చేసుకొని, అర్ఘ్యము నొసగి సకల మర్యాదలతో మండపమునకు పిలుచుకొని వచ్చెను. జనక మహారాజు వశిష్ఠుని, విశ్వామిత్రుని, వామదేవుడు మొదలగు ఋషులను గౌరవముతో పూజించి, వారికి దివ్యాసనములను ఇచ్చి ఆశీస్సులను పొందెను. పిదప దశరథుని పూజించి, చేతులు జోడించి వినయముతో ప్రార్థన చేసి తన అదృష్టమును పొగడుకొనెను. వరుని పక్షమువారందరినీ దశరథునితో సమానముగా పూజించి ఉచితాసనములను ఇచ్చెను. అందరి సుందర నేత్ర చకోరములు శ్రీరాముని ముఖమను చంద్రుని అపూర్వ అవర్ణనీయ శోభను త్రాగుచుండెను.

వివాహ శుభఘడియ వచ్చినదని తెలుసుకొని వశిష్ఠుడు శతానందుని పిలిచి "పోయి పెండ్లికూతురును పిలుచుకొని రండు" అని చెప్పెను. పురోహితుని సందేశమును విని రాణి, ఆమె సఖులు, బ్రాహ్మణ వధువులు, ఇతర వృద్ధ స్త్రీలు మంగళగీతములు పాడుచూ, సీతాదేవిని అలంకరించి మండపమునకు పిలుచుకొని వచ్చిరి. మంగళకరమైన సామగ్రులను తీసుకొని రాణివాసపు స్త్రీలు వచ్చిరి. వారి మధ్య సౌందర్యరాశిగా సీతాదేవి ప్రకాశించుచుండెను. జానకీదేవిని చూచి శ్రీరాముడు కృతార్థుడాయెను. దశరథుడు పుత్రులతో సహా సంతసించెను. దేవతలు ప్రణమిల్లి పూలు కురిపించిరి. మునులు మంగళకరమయిన ఆశీర్వచనములు పఠించిరి. స్త్రీల గీతములు, నగారాల మ్రోతలతో కలిసి గొప్ప కోలాహలము ఆయెను. అందరూ ఆనందమగ్నులైరి, మునీశ్వరులు శాంతి పాఠములు వల్లించుచుండగా సీతాదేవి మండపమున ప్రవేశించెను.

వంశ సాంప్రదాయములను పూర్తిచేసి గురువులు బ్రాహ్మణుల ద్వారా గౌరీగణేశుల పూజలు చేయించిరి. దేవతలు ప్రత్యక్షమై వారి పూజలందుకొని ఆశీర్వదించిరి. ఈ విధముగా సీతాదేవి

దేవతలను ఆరాధించిన పిదప, మునులు ఆమెను సింహాసనమున కూర్చోబెట్టిరి. శ్రీసీతారాములు పరస్పరము చూచునపుడు వారిలోని ప్రేమభావమును ఊహించుటకు శ్రేష్టమైన మనస్సు, బుద్ధి, వాక్కులకు కూడ నలవికాదు. హవన సమయమున అగ్నిదేవుడు స్వయముగా వచ్చి ఆహూతిని స్వీకరించెను. కీర్తి, సుకృతము, సుఖసౌందర్యములను కలబోసి బ్రహ్మ సృష్టించినట్టున్న సునయనాదేవిని సుముహూర్త సమయమునకు సువాసినులు పిలుచుకొని వచ్చిరి. జనక మహారాజు, సునయనాదేవి స్వహస్తములతో పవిత్ర సుగంధిత మంగళ జలముతో కూడిన స్వర్ణకలశమును, మణిఖచిత పళ్ళెములను తెచ్చి ఋషులు శుభంకర వాణితో వేదములు పఠించుచుండగా, అనురాగముతో శ్రీరాముని పావన చరణములను కడిగిరి. ఆకాశమున, నగరమున గీతములు, నగారా మ్రోతలు, జయజయ ధ్వనులు నలుదిశల వ్యాపించెను. కామారియైన శివుని హృదయమున సదావిరాజిల్లునవి, స్మరించినంతమాత్రముననే మనస్సును నిర్మలముగా చేయునవి, కలియుగ పాపతాపములను హరించునవి, గౌతమ పత్ని అహల్యను స్పృశించి పాపమును హరించి పావనము ఒనర్చినవి, శివుని మస్తకమున విరాజిల్లు గంగకు పుట్టుక స్థానమైనవి, దేవతలు పవిత్రతకు పరాకాష్ఠగా తలచునవి, మునులు, యోగులు సేవించి సద్గతిని పొందినవియునైన శ్రీరామచంద్రుని చరణకమలములను భాగ్యశాలియైన జనకుడు కడిగెను. అందరూ జయజయధ్వానములను చేసిరి.

కులగురువులిద్దరూ కన్యావరుల చేతులను కలిపి ఇద్దరి గోత్రనామములను పల్కిరి. పాణిగ్రహణ మహోత్సవమును చూచి బ్రహ్మాది దేవతలు, మునులు, పురజనులు ఆనందించిరి. సుఖనిధానమైన వరుని కని రాజు, రాణి శరీరములు పులకితమయ్యెను. ఈ విధముగా రాజశిరోమణి జనకుడు వేదోక్తముగా లోకాచారమును అనుసరించి హిమవంతుడు పార్వతీదేవిని శివునికి అర్పించినట్లు, సముద్రుడు

లక్ష్మీదేవిని విష్ణుమూర్తికి సమర్పించినట్టు సీతాదేవిని శ్రీరామునికి కన్యాదానము చేసెను. విదేహరాజును శ్యామలశరీరుడు శ్రీరాముడు నిజముగా విదేహునిగా చేసెను. విధిపూర్వకముగా హవనము చేసి వస్త్రపు టంచులను ముడివేసి సీతారాములు చూచువారలకు కన్నులపండుగగా అగ్నికి ప్రదక్షిణము నాచరించిరి. పిదప మునుల ఆదేశానుసారము సకల కార్యములు నిర్వర్తించి కానుకలు సమర్పించిరి. శ్రీరాముడు సీతాదేవి నుదుట కుంకుమనుంచు దృశ్యమును నేత్రానందముగా చూడవలెనే కాని వర్ణించుటకు వీలులేదు.

వశిష్ఠుని ఆజ్ఞతో శ్రీరాముడు, సీతాదేవి ఒకే సింహాసనముపై కూర్చొనియుండుటను చూచి దశరథుని మనస్సుతోపాటు పదునాలుగు లోకములు కూడ ఆనందముతో నిండెను. వశిష్ఠుని ఆజ్ఞతో జనకరాజు వివాహమునకు అవసరమైన సామగ్రులన్నిటినీ సమకూర్చెను.

జనకరాజు తమ్ముడైన కుశకేతువు పెద్దకూతురు గుణశీల సుఖ సౌందర్యఖని అయిన మాండవిని భరతునికిచ్చి యధారీతిగా వివాహము చేసెను. తర్వాత సీతాదేవి చెల్లెలు సౌందర్యరాశి అయిన ఊర్మిళను లక్ష్మణునికిచ్చి వివాహము చేసెను. తర్వాత సునయన సుముఖి, సుగుణరూపశీల సంపన్నయగు శృతకీర్తి అను కన్యను శత్రుఘ్నునితో వివాహము చేసెను. వధూవరుల ప్రతి జంట పరస్పరము చూచుకొని మనస్సులో ఆనందించిరి. బయటికి మాత్రము సిగ్గుతో కనబడిరి. శ్రీరామచంద్రుని వివాహము ఏరీతిగా జరిగినదో అట్లే మిగత రాజకుమారుల వివాహములు కూడ జరిగినవి. వరులకు ఇచ్చిన కట్నకానుకలతో, బంగారము మణులతో మండపము నిండిపోయెను. వస్త్రములు, రంగురంగుల పట్టుబట్టలు, ఏనుగులు, రథములు, గుఱ్ఱ ములు, కామధేనువులాంటి గోవులు ఇంకా అనేక వస్తువులు విరివిగా నొసంగబడెను. దశరథుడు వాటినన్నిటిని అంగీకరించి యాచకులకు వారడిగినవన్నియూ దానము చేసెను. వచ్చిన చుట్టములందరినీ

జనకుడు గౌరవము, దానము, విన్నపము, పొగడ్తలతో సత్కరించెను. జనకమహారాజు, అతని తమ్ముడైన కుశకేతువు చేతులు జోడించి దశరథునితో నిట్లనిరి: "రాజా! మీతో సంబంధము చేయుటవలన మేము అన్ని విధముల గొప్పవారమయితిమి. ఈ రాజ్యములతో సహా మమ్ములను సేవకులుగా భావించండి. ఈ బాలికలను దయతో మీ దాసీలుగా స్వీకరించండి. మిమ్ములను ఇంతదూరము పిలిపించి శ్రమ ఇచ్చినందుకు క్షమించండి." రఘుకులమణి అయిన దశరథుడు తన వియ్యంకుని గొప్పగా గౌరవించెను. పిదప మునీశ్వరుల ఆజ్ఞ బడసి సుందర సఖులు మంగళగీతములు పాడుచుండగా వధువులను తీసుకొని శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులు తమ విడిది గృహములకు వచ్చిరి.

శ్రీరామచంద్రుని శ్యామలశరీరము సహజసుందరమై, కోటి మన్మథులకు కూడ సిగ్గు కలిగించుచుండెను. మునుల మనస్సుల నెడి తుమ్మెదలకు శ్రీరామపాదకమలములు లత్తుకతో (పారాణితో) మనోహరముగా ఉండెను. పవిత్రమై మనోహరమైన పచ్చని ధోవతి ప్రాతఃకాలసూర్యునివలె ప్రకాశించుచుండెను. నడుమున మొలనూలు, గజ్జెలు మధురధ్వని చేయుచుండెను. విశాల భుజములకు భూషణములు, పచ్చని యజ్ఞోపవీతము వక్షస్థలమున ఆభరణములతో శ్రీరాముడు మిగుల ఆకర్షణీయముగా నుండెను. చేతికి ఉంగరములు, అంచులందు ముత్యములు, మణులు పొదగబడిన పచ్చని ఉత్తరీయము, చెవులకు అందమైన కుండలములు శోభాయమానంగా ఉండెను. కమలముల వంటి నేత్రములు, సుందరమైన కనుబొమలు, మనోహరమైన ముక్కు, లలాటమున తిలకము, శిరమున ముత్యములు, మణులు పొదిగిన కిరీటము, ముఖసౌందర్యమును ఇనుమడింపచేసెను. శ్రీరాముని ప్రత్యంగము దర్శకుల చిత్తమును హరించుచుండెను. నగర స్త్రీలు, దేవాంగనలు, వరునికి దృష్టి తగలకుండా నివారణ చేయుచుండిరి.

ముత్తయిదువలు వధూవరులను వారి గృహమునకు తీసుకొని వచ్చిరి. రాణీవాసము రాసవిలాసములలో మగ్నమాయెను. సీతారాములను చూచి తమ జన్మ సఫలమైనదని అందరూ భావించిరి. అందరూ ప్రసన్నమనస్కులై "నాలుగు జంటలు చిరంజీవులు అగుదురు గాక!" అని ఆశీర్వదించిరి. పిదప నలుగురు రాకుమారులు తమ వధువులతో సహా తండ్రిగారి వద్దకు వచ్చి నమస్కరించిరి. సౌందర్యము, శుభము, ఆనందములతో వసతిగృహములు నిండిపోయెను.

తరువాత రుచికరమైన వివిధ పక్వాన్నములతో విందు ఏర్పాటు చేయబడెను. జనకుడు స్వయముగా అతిథులనందరినీ ఆహ్వానించెను. దశరథుడు పుత్రులతో సహా పోయెను. సాదరముగా కాళ్ళు కడుగబడెను. యధోచిత ఆసనములపై ఆసీనులు అయిరి. జనకుడు స్వయముగా దశరథుని శ్రీరాముని అతని సోదరుల కాళ్ళను కడిగి యోగ్యమయిన ఆసనములపై కూర్చుండబెట్టెను. బంగారు పళ్ళెములలో రుచికరమైన భోజన పదార్థములు వడ్డింపబడెను. మంత్రయుక్తముగా ప్రాణాహుతులను స్వీకరించి, అందరు భోజనమునకు ఉపక్రమించిరి. అనేక రకములైన పక్వాన్నములు, వ్యంజనములు, భక్ష్యభోజ్యచోష్య లేహ్య పదార్థములు షడ్రుచులతో వడ్డింపబడెను. స్త్రీలు మధురముగా వ్యంగ్యహాస్యముల గీతములు పాడిరి. సమయానుకూలమైన హాస్యమును దశరథుడితో సహా అందరూ విని ఆనందించిరి. భోజనానంతరము సాదరముగా చేతులు కడుగబడెను. జనకుడు సపరివారముగా దశరథునికి తాంబూలములు ఇచ్చి యధోచిత సత్కారములు చేసెను. దశరథుడు సంతృప్తుడై తన గదికి వెళ్ళెను.

జనకపురియందు ప్రతిరోజు నిత్యనూతన మంగళోత్సవము లగుచుండెను. దశరథుడు ప్రాతఃకాలమున లేచి తన కార్యక్రమములను ముగించుకొని వశిష్ఠుని వద్దకుపోయి, చేతులు జోడించి నమస్కరించుచూ "మునీశ్వరా! మీ దయవలన నేటితో నా కోరికలన్నియూ తీరినవి"

అని మధురముగా పలికెను. వామదేవుడు, నారదుడు, వాల్మీకి, జాబాలి, విశ్వామిత్రుడు మొదలగు తపోనిధులైన మునిశ్రేష్ఠులు వచ్చిరి. రాజు వారికి దండప్రణామములు ఆచరించి సుఖాసీనులుగా చేసెను. అలంకరింపబడిన ఉత్తమ గోవులను బ్రాహ్మణులకు దానమిచ్చెను. వారు ఆశీర్వాదమును ఇచ్చిరి. పిదప యాచకులను పిలిచి వారి అభిరుచులకు తగినట్లుగా బంగారము, వస్త్రములు, మణులు, గుఱ్ఱములు అన్నియు దానమిచ్చెను. వారు అతనిని కీర్తించుచూ జయజయధ్వానములు చేయుచూ పోయిరి. దశరథుడు మాటిమాటికి విశ్వామిత్రునికి నమస్కరించి, "ఈ ఆనందమంతయు మీ కృపాకటాక్షము" అని పలుకుచుండెను.

దశరథ మహారాజు అనేక విధముల జనకుని స్నేహసౌశీల్యములను, ప్రభావ ఐశ్వర్యములను పొగడెను. ప్రతిదినము తాము గృహోన్ముఖులు అగుటకు అనుజ్ఞకై ప్రార్థించుచుండెను. కాని జనకుడు వారిని ప్రేమతో నిలుపుచుండెను. నిత్యనూతన ఆదరసత్కారములు, వినోదప్రదర్శనలు జరుగుచుండెను. ఆ విధముగా వివాహ అతిథులు ప్రేమపాశముతో బంధింపబడి అనేక దినములు గడిపిరి. పిదప విశ్వామిత్రుడు, శతానందుడు జనకుని వద్దకు పోయి "మీరు ప్రేమ వశమును వదలియుండుటకు ఇష్టపడకున్ననూ, దశరథరాజు అయోధ్యకు పోవుటకు అనుజ్ఞ నివ్వవలెను" అని పల్కిరి. జనకుడు అట్లే అని మంత్రులకు తగిన ఆదేశములు ఇచ్చెను. జనకుడు పెండ్లి వారు తిరిగి పోవుచున్నారని తెలియగానే జనకపుర వాసుల ముఖములు సంధ్యాకాలకమలములవలె వాడిపోయెను. జనకుడు పెండ్లివారు త్రోవలోనిలుచుటకు వసతులను కలిగించెను. గుఱ్ఱములు, రథములు, ఏనుగులు, బంగారము వస్త్రములు, రత్నములు, ఆవులు మరియు అనేక రకములైన కానుకలు వరకట్నముగా అయోధ్యకు తరలించెను. సీతాదేవి సఖులు మాటిమాటికి ఆమెను హృదయమునకు హత్తుకొని

ఆశీర్వదించిరి. "నీవు నీ పతికి అత్యంత ప్రియురాలవగుదువు, అతనితో సదా సుఖముతో జీవనము గడుపుము. అత్తమామలకు, గురువులకు సేవచేయుము," అనిరి. చతురలయిన సఖులు స్నేహవశమున సీతాదేవికి గృహిణి ధర్మములను ఉపదేశించిరి. రాణులు నలుగురు రాకుమార్తెలను హృదయములకు హత్తుకొని "బ్రహ్మదేవుడు స్త్రీలను ఎందుకు సృష్టించెను?" అని వాపోయిరి. శ్రీరామచంద్రుడు తన సోదరులతో సహా రాణుల వద్దకు సెలవుగైకొనుటకు వచ్చెను. అతిలోకసుందరులైన వారిని చూచి రాణివాసములోని వారందరు హర్షోల్లాసభరితులైరి. మంగళహారతులు ఇచ్చిరి. శ్రీరామునికి, అతని సోదరులకు సుగంధద్రవ్యములు పూసి స్నానము చేయించిరి. పిదప షడ్రసోపేతమయిన భోజనము చేయించిరి. అది తగిన సమయము అని తలచి శ్రీరామచంద్రుడు స్నేహ, సౌశీల్య, సంకోచమైన వాణితో ఇట్లనెను: "రాజుగారు అయోధ్యకు పోవుటకు ఇచ్ఛగించుచున్నారు. మీతో అనుజ్ఞ తీసుకొనుటకు మమ్ములను ఇక్కడికి పంపినారు. కావున జననీ! మమ్ములను మీ బాలకులవలె తలచి వాత్సల్యముతో మాకు అనుజ్ఞనిండు." ఆ మాటలు వినగానే రాణివాసము వారు ఆందోళన చెంది మాటలాడజాలక పోయిరి. వారు రాకుమార్తెలను హృదయమునకు హత్తుకొని వారి భర్తలకు అప్పగించిరి.

సీతాదేవి తల్లి ఆమెను శ్రీరామునికి అప్పగించి, చేతులు జోడించి ప్రార్థించి ఇట్లనెను. "నాయనా! నీవు సర్వజ్ఞుడవు. నాకెట్టి సందేహము లేదు. పూర్ణకాముడవు. భక్తుల గుణములనే గ్రహించి వారి దోషములను పరిహరించెదవు. సీత నాకు, రాజుగారికి, మా బంధువులకు, నగర ప్రజలకు కూడ ప్రాణములతో సమానము. ఆమె స్నేహసౌశీల్యములను తలచి ఆమెను మీ దాసీగా భావించుడు" అని పలికి శ్రీరాముని పాదములను పట్టుకొనెను. ప్రేమోద్వేగమున ఆమె కంఠము మూగపోయెను. స్నేహపూరితమైన ఆమె పలుకులు

విని శ్రీరాముడు మిక్కిలి గౌరవముతో చేతులు జోడించి అనుజ్ఞకై ప్రార్థించెను. ఆమె ఆశీర్వాదమును పొంది రఘురాముడు అవనతశిరస్కుడై తన తమ్ములతో సహా సెలవు గైకొనెను. రాణులు తమ కూతుళ్ళను మాటిమాటికి కౌగిలించుకొని కొంతదూరము సాగనంపిరి.

జనకపురియందు స్త్రీపురుషులందరు, దాసదాసీలు, రాణీవాసము వారు ప్రేమోద్వేగవివశులైరి. కరుణారసము, విరహవేదన జనకపురిలో స్థిరనివాసము ఏర్పరుచుకొనునట్లు ఆయెను. జానకీదేవిచే పెంచబడిన చిలుకలు, గోరువంకలు "వైదేహి ఎక్కడ?" అని పలుకసాగెను. పశుపక్ష్యాదులే ఆ విధముగా వ్యాకులమయిన, మనుష్యుల సంగతి చెప్పనేల? జనకుడు తన సోదరుడైన కుశధ్వజునితో పాటు వచ్చెను. ప్రేమోద్వేగముచే అతని కన్నులు చెమ్మగిల్లెను. విరాగియని పేరుగాంచిన జనకుడే సీతాదేవిని చూచి ధైర్యము, వైరాగ్యము కోల్పోయెను. అతని మంత్రులు, సలహాదారులు అనునయించిరి. ఇది శోకింప సమయము కాదని గ్రహించి జనకుడు కుమార్తెలను కౌగిలించుకొనెను. పల్లకీలను తెప్పించి శుభముహూర్తమున వధువులను పల్లకీలలో కూర్చుండబెట్టెను. జనక మహారాజు తన కుమార్తెలకు అనేక ఉపదేశములను ఇచ్చి, స్త్రీ ధర్మములను, కులసాంప్రదాయములను బోధించెను. సీతాదేవికి ఇష్టమయిన, విశ్వాసపాత్రులయిన దాసదాసీలను ఆమెతోపాటు పంపెను. బ్రాహ్మణులు, మంత్రులలో కలసి జనకుడు వారిని కొంతదూరము అనుసరించెను. భజంత్రీలు మ్రోగెను. రథగజతురగములు అలంకరింపబడెను. దశరథుడు బ్రాహ్మణులకు దానములిచ్చి వారికి ప్రణమిల్లి ఆశీర్వాదములను పొందెను. గణేశుని స్మరించి ప్రయాణమయ్యెను. దేవతలు హర్షముతో పుష్పములను వర్షించిరి. అప్సరసలు పాటలు పాడిరి. నగారా మ్రోతలతో దశరథుడు ఆనందముతో సపరివారముగా అయోధ్యానగరమునకు బయలుదేరెను.

దశరథ మహారాజు గౌరవనీయులైన నాగరికులను అనునయించి వినయముతో వెనుకకు పంపెను. మాటిమాటికీ జనకుని మరలిపొమ్మని చెప్పిననూ ప్రేమవశమున జనకుడు మరలుటకు ఇష్టపడలేదు. మరల దశరథుడు మర్యాదగా ఇట్లనెను: "రాజా! మీరు చాలా దూరము వచ్చినారు. ఇంక తిరిగిపొండు." జనకుడు చేతులు జోడించి ప్రేమామృత వచనములను ఇట్లు పలికెను: "నేను ఏ విధముగా మీకు విన్నవించవలెను? మహారాజా! మీరు నా పై అమిత గౌరవమును ఉంచితిరి." ఆ విధముగా పరస్పర మర్యాదలతో జనకుడు, దశరథుడు ఆలింగనము చేసుకొనిరి. జనకుడు మునులందరికి నమస్కరించి, వారి ఆశీర్వాదమును పొందెను. పిదప చేతులు జోడించి ప్రేమభరిత కంఠముతో శ్రీరామునిట్లు ప్రార్థించెను: "ఓ రామా! మిమ్ములను నేను ఏ విధముగా ప్రశంసించుదును? మీరు మునుల, మహాదేవుని మనస్సులనెడి సరోవరములందు సంచరించు హంసలు. మీ కొరకు యోగులు క్రోధము, మోహము, మమత, అహంకారము త్యజించి యోగ సాధన చేసెదరు. మీరు సర్వవ్యాపి, అవ్యక్తులు, అవినాశి, చిదానందులు, గుణనిధి మరియు నిర్గుణులు. మిమ్ములను మనస్సు వాక్కులతో గాని, హేతువాదముతో గాని తెలుసుకొనుటకు సాధ్యము కాదు. మీ మహిమను వేదములు "నేతి–నేతి" అని వర్ణించును. పరివర్తనాశీలమైన కాలమునకు మీరు అతీతులు. మీరు మీ స్వరూపమును నాకు ప్రకటించితిరి. మీ దాసునిగా నన్ను అనుగ్రహించితిరి. నేను మీ పాదపద్మములను మరువకుందునుగాక!" జనకుని వాక్యములను విని శ్రీరామచంద్రుడు అతి వినయముతో గౌరవించెను. పిదప జనకుడు లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను కూడ కౌగిలించుకొని ఆశీర్వదించెను. జనకుడు విశ్వామిత్రుని పాదములకు ప్రణమిల్లెను. ఆ విధముగా శ్రీరామచంద్రుడు సపరివారముగా అయోధ్యకు బయలుదేరెను. త్రోవలో అక్కడక్కడ మజిలీలు చేయుచూ, మార్గమున ప్రజలను సంతోషపరచుచూ ఒక

శుభదినమున పెండ్లివారు అయోధ్యను సమీపించిరి. నగారాల మ్రోతలు, శంఖనాదములు, ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, కరతాళధ్వనులు, మృదంగశబ్దములు, నాదస్వరముల మధ్య వచ్చు పెండ్లివారిని చూచి అయోధ్యానగరవాసులు అతి ప్రసన్నులైరి. గృహములు, వీధులు, అంగళ్ళు, రంగవల్లులతో, తోరణ ధ్వజపతాకములతో అలంకరింపబడెను. రాజభవనపు శోభ వర్ణనాతీతము. ఆనందోత్సాహములతో రాజభవనము నిండెను. శ్రీరామచంద్రుని, సీతాదేవిని దర్శించుటకు జనులు ఉబలాటబడిరి. కౌసల్యాదేవి మొదలగు రాణులు ప్రేమపరవశులైరి. బంగారు పళ్ళెములలో సుగంధ ద్రవ్యములను నిలిపి వారు మంగళహారతులు ఇచ్చిరి. శుభముహూర్తమున వశిష్ఠుని ఆజ్ఞతో దశరథ మహారాజు తమ పరివారముతో సహా శివపార్వతులను, గణేశుని స్మరించుచూ రాజభవనమును ప్రవేశించెను. మాగధులు, సూతులు, భట్రాజులు, శ్రీరామచంద్రుని కీర్తిని గానము చేసిరి. మంగళజయధ్వనులు వేదఘోషలు దశదిశల వ్యాపించెను.

పురస్త్రీలు హారతులు ఇచ్చుచూ నలుగురు రాకుమారులను చూచి హర్షితులు అగుచుండిరి. పల్లకీ తెరలను మాటిమాటికీ తొలగించి వధువులను చూచి వారు సుఖముననుభవించుచుండిరి. రాజమాతలు ఆనందముతో వధూవరులకు స్వాగతమును ఇచ్చిరి. వేదవిధానములు, కులసాంప్రదాయ పద్ధతులు సంపన్నమైన పిదప రాణులు, రాకుమారులకు, వారి భార్యలకు హారతులను అర్ఘ్యములను ఇచ్చి నూతన వస్త్రములపై నడిపించుచూ లోనికి గొని వచ్చిరి. అందమైన సింహాసనములపై వధూవరులను కూర్చుండబెట్టి వారి పవిత్రపాదములను కడిగిరి. తరువాత వేదవిధి ప్రకారము వారిని ధూప దీపనైవేద్యములతో పూజించిరి. రాజమాతలు హారతులు ఇచ్చుచూ వధూవరులను వింజామరములతో విసురుచుండిరి. అయోధ్యావాసులు అనేక కానుకలను వధూవరులకు సమర్పించిరి. దశరథుడు యాచకులకు

కోరిన వస్తువులన్నింటినీ దానము చేసేను. వశిష్ఠుని ఆదేశానుసారము రాజు లోకాచారమును వేదవిధులను చక్కగా ఆచరించెను. విశ్వామిత్రుని అతి వినయముగా పూజించి, ప్రశంసించి పాదములకు నమస్కరించెను. వశిష్ఠుని కూడ భక్తితో పూజించెను. బ్రాహ్మణులను, నగరములోని సువాసినులను, పూజనీయులైన అతిథులను కానుకలతో సన్మానించెను. ఆ విధముగా అందరికీ ఆదరసత్కారములు చేసిన పిదప దశరథుడు హర్షోల్లాసహృదయుడై రాణివాసమునకు యేగెను. అచ్చట రాజకుమారులను, వారి వధువులను చూచి సంతోషించెను. రాణివాసపు స్త్రీలకు వివాహము జరిగిన రీతిని దశరథుడు వర్ణించి చెప్పెను. తన పుత్రులతో సహా స్నానమాచరించి బ్రాహ్మణులను, గురువుగారిని, కుటుంబసభ్యులను పిలిచి విందుభోజనమును ఏర్పాటు చేసెను. భోజనానంతరము అతిథులు శ్రీరాముని తనవితీర చూచి, సెలవుగైకొని నమస్కరించి తమ నివాసములకు ఏగిరి. పిదప రాజు తన రాణులను పిలిచి ఇట్లు చెప్పెను: "వధువులు చిన్న పిల్లలు. వేరే ఇంటికి వచ్చినారు. వారిని కంటికి రెప్పవలె చూచుకోవలెను." పిదప తన శయనాగారమును ప్రవేశించెను. తర్వాత రాకుమారులు మణిఖచితమైన మంచములపై మెత్తని పరుపులపై రత్నకాంతుల దీపములతో అలంకరింపబడిన గదులందు పరుండిరి. శ్రీరాముని కోమలశరీరమును చూచి తల్లులు ప్రేమతో ఇట్లనిరి: "నాయనా! అతి భయంకరమైన తాటకను, దుష్టమారీచసుబాహువులను ఎట్లు చంపగలిగితివి? విశ్వామిత్రుని యాగమును రక్షించి నీ పాదధూళిచే అహల్యకు ముక్తిని ప్రసాదించితివి. వజ్రమువలె కఠినమైన శివధనుస్సును విరిచి విశ్వవిజయుడను కీర్తితో పాటు జానకిని పొందితివి. సోదరుల వివాహమును కూడ జరిపించి ఇంటికి తిరిగి వచ్చినావు. నీ పనులన్నియు అలౌకికములు, మానవాతీతములు. విశ్వామిత్రుని కృపవల్లనే ఇవి సాధ్యమయినవి. పూర్ణచంద్రుని బోలు నీ ముఖమును చూచి నేడు మా జన్మలు సఫలమయినవి." శ్రీరామచంద్రుడు

వినయముతో మధుర వచనములను చెప్పి తల్లులను ఆనందపరచెను. పిదప శివుని, గురువును ధ్యానించుచు నిద్రించెను.

ఆ రాత్రి ప్రతి ఇంటిలో స్త్రీలు పరస్పర హాస్యములతో జాగరణ చేయుచుండిరి. ప్రాతఃకాలమున శ్రీరామచంద్రుడు నిద్రలేచి దేవతలకు, గురువునకు, తల్లిదండ్రులకు నమస్కరించెను. నలుగురు సోదరులు పవిత్ర సరయూ జలముల స్నానమాడి ప్రాతఃసంధ్యావందనము నాచరించి, తండ్రి కడకు వచ్చిరి. వశిష్ఠుడు, విశ్వామిత్రుడు ఇతర సభాసదులున్న సభయందు దశరథుడు వారికి కుమారులతో సహా ప్రణమిల్లెను. విశ్వామిత్రుని మహిమను వశిష్ఠుడు ఆనందముతో వర్ణించి చెప్పెను. ఆ విధముగా ప్రతిరోజు మంగళకరమైన ప్రమోదములతో, ఉత్సవములతో గడిచెను. ఒక శుభముహూర్తమున వధూవరుల ముంజేతికి కట్టిన సూత్రబంధము విడువబడెను. విశ్వామిత్రుడు ప్రతిరోజు పోవుటకు సిద్ధమై, వినయపూర్వకమైన శ్రీరాముని ప్రార్థనలకు వశుడై నిలబడిపోయెను. చివరకు పోవుటకు అనుజ్ఞను అడుగగా రాజు తన కుమారులతో పాటు నిలుచుండి చేతులు జోడించి ఇట్లు పలికెను: "ప్రభూ! నా సంపద అంతయు మీదే. నేను నా భార్యాపుత్రులు మీ సేవకులము. ఈ బాలురపై అనుగ్రహము చూపి అప్పుడపుడు మీ దర్శనము కలుగనివ్వండి" అని పలికి దశరథుడు భార్యా, పుత్రులతో విశ్వామిత్రునికి పాదాభివందనము చేసెను. అనేక ఆశీర్వాదములను ఇచ్చి విశ్వామిత్రుడు బయలుదేరెను. శ్రీరాముడు అతని సోదరులు కొంతదూరము వరకు అతనిని అనుసరించిరి. ప్రతిచోట ప్రజలు శ్రీరాముని వివాహగాథను గానము చేసిరి. అతని పవిత్ర యశస్సు ముల్లోకములలో వ్యాపించెను.

ఎవరయితే శ్రీసీతారాముల కళ్యాణకథను ప్రేమపూర్వకముగా గానము చేయుదురో, వినెదరో వారి జీవితము ఎల్లప్పుడూ ఆనందోత్సాహములతో నిండును. శ్రీరామచంద్రుని యశము శుభములకు

స్థానము. కావున శ్రీసీతారామచంద్రుల అనుగ్రహముచే భక్తులు సుఖము ననుభవింతురు.

కలియుగ పాపములను పటాపంచలు చేయు
శ్రీరామచరితమానసమునందలి బాలకాండమను
మొదటి సోపానము సమాప్తము.

★ ★ ★

# ప్రార్థనా గీతము

## (శ్రీగోస్వామీ తులసీదాసు రచితము)

శ్రీరామచంద్ర కృపాళు భజు మన హరణ భవభయ దారుణం।
నవకంజ–లోచన, కంజ–ముఖ, కర–కంజ, పద కంజారుణం॥ (1)

కందర్ప అగణిత అమితఛవి, నవనీల నీరద సుందరం।
పట పీత మానహు తడిత రుచి శుచి నౌమి జనక సుతావరం॥ (2)

భజు దీనబంధు దినేశ దానవ–దైత్య–వంశ నికందనం।
రఘునంద ఆనందకంద కోశలచంద దశరథ నందనం॥ (3)

సిర ముకుట కుండల తిలక చారు ఉదారు అంగ విభూషణం।
ఆజానుభుజ శర–చాప–ధర, సంగ్రామ–జిత–ఖరదూషణం॥ (4)

ఇతి వదతి తులసీదాస శంకర–శేష–ముని–మన–రంజనం।
మమ హృదయ కంజ నివాస కరు, కామాది ఖల–దల–గంజనం॥ (5)

★ ★ ★

**భావార్థము:** ఓ మనసా! కృపాళువైన శ్రీరామచంద్రుని భజింతుము. అతడు జననమరణ రూపమైన దారుణ భయమును రూపుమాపువాడు. అతని కన్నులు అప్పుడే వికసించిన కమలములతో సమానము. అతని ముఖము, కరచరణములు కూడా ఎర్రని కమలములను బోలియున్నవి.

అతని సౌందర్యకాంతి అసంఖ్యాక మన్మథులను మించియున్నది. జలదములైన నీలమేఘసదృశమైన అతని శరీరముపై పీతాంబరము విద్యుల్లతవలె మెరయుచున్నది. ఇట్టి పవిత్రమూర్తి జానకీపతియగు శ్రీరామునికి నేను నమస్కరించుచున్నాను.

ఓ మనసా! దీనులకు బంధువు, సూర్యునితో సమానమగు తేజస్సుగలవాడు, దైత్య దానవ వంశములను సమూలముగా నాశము

చేయువాడు, ఆనందకందుడు, కోశలదేశమను ఆకాశమున ప్రకాశించు నిర్మలచంద్రుడు, దశరథనందనుడైన శ్రీరాముని భజించుము.

అతని శిరస్సుపై రత్నఖచితమైన కిరీటము, చెవులందు కుండలములు, ఫాలముపై మనోహరమగు తిలకము, ప్రతి అంగమునందు సుందరమైన ఆభరణములు శోభిల్లుచున్నవి. ధనుర్బాణములు ధరించిన అతని భుజములు మోకాళ్ళను తాకుచున్నవి. అతడు యుద్ధములో ఖరదూషణాది రాక్షసులను జయించెను.

అతడు శివుని, శేషుని, మునుల మనస్సులను రంజింపజేసెను. కామక్రోధలోభాది శత్రువులను నాశమొనరించువాడు. అట్టి శ్రీ రఘునాథుడు నా హృదయకమలమునందు సదా నివసించు గాక యని తులసీదాసుడనగు నేను ప్రార్థించుచున్నాను.

★ ★ ★

# రెండవ సోపానము

# అయోధ్యా కాండము

## 1. వందనము

వామాంకమున గిరిరాజసుత శోభిల్లుచుండగా, శిరమున గంగా దేవిని, లలాటమున విదియచంద్రుని, కంఠమున హాలాహలమును, వృక్షస్థలమున నాగరాజును ధరించిన భస్మవిభూషితుడు, దేవతలలో శ్రేష్ఠుడు, సర్వేశ్వరుడు భక్తుల పాపములను నాశనము చేయువాడు, సర్వవ్యాపకుడు, కళ్యాణరూపుడు, తెల్లని దేహకాంతిగలవాడైన శ్రీ శంకరుడు నన్ను రక్షించుగాక!

రాజ్యాభిషేక సమయమున పెరగనిదియు, వనవాసక్లేశమున తరగనిదియు, ఆనందప్రదమైన శ్రీరామచంద్రుని ముఖకమలశోభ నాకెల్లప్పుడు శుభములనిచ్చుగాక, నీలకమలములవలె శ్యామలము అతికోమలమైన శరీరము కలవాడు, వామాంకమున సీతాదేవితో శోభిల్లునట్టి వాడు, చేతులందు ధనుర్బాణములు ధరించినవాడు, రఘుకుల భూషణుడైన శ్రీరామచంద్రునికి నేను నమస్కరించెదను. శ్రీ గురుపాదకమల రేణువులచే నా మనోమాలిన్యములను కడిగివేసి ధర్మార్థకామమోక్ష ప్రదాతయగు శ్రీరామచంద్రుని నిర్మల కీర్తిని వర్ణించెదను.

## 2. పట్టాభిషేక నిర్ణయము

శ్రీరామచంద్రుడు వివాహితుడై ఇంటికి వచ్చినది మొదలు అయోధ్యయందు నిత్యనూతన సంగీతోత్సవములు జరుగుచుండెను.

అయోధ్యా ప్రజలు శ్రీరామచంద్రుని ముఖ సౌందర్యమును చూచి ముగ్ధులైరి. రాణులు తమ దాసీజనముతో, సఖులతోను సఫలమనోరథలైరి. దశరథ మహారాజు శ్రీరామచంద్రుని రూపగుణసౌశీల్య స్వభావాదులను తాను చూచి ఇతరుల వలన విని సంతుష్టాంతరంగుడాయెను. ఒకరోజు దశరథ మహారాజు తన సభాసదులతో సభయందు కూర్చొనియుండెను. అందరూ శ్రీరామచంద్రుని సద్గుణములను పొగడుచుండిరి. అద్దములో తన ముఖమును చూచుకొని కిరీటమును సరిజేసుకొనుచుండగా తలవెంద్రుకలు తెల్లనై అతని ముసలితనమును గుర్తుచేయుచుండెను. "రాజా! రాముని యువరాజుగా చేసి నీ జన్మను సార్థకము చేసుకొమ్ము" అని అవి సందేశమిచ్చుచుండెను. ఆ ఆలోచనను తన హృదయములో నిల్పుకొని ఒక శుభదినమున, శుభఘడియయందు తన కోరికను గురువైన వశిష్ఠునికి ప్రకటించెను: "ప్రభూ! శ్రీరామచంద్రుని యువరాజుగా చేయుటకు అనుజ్ఞనివ్వండి నా జీవితకాలముననే ఆ ఆనందోత్సవము ప్రజల నేత్రానందము కలుగ సేయుండి. శివుని అనుగ్రహముచే నా కోరికలన్నియూ నెరవేరినవి. ఈ కోరిక తీరినచో ఈ శరీరము ఉన్ననూ, పోయిననూ నాకు చింతలేదు." దశరథుని మాటలు విని వశిష్ఠుడు ప్రసన్నుడై యిట్లు పలికెను: "రాజా! వినుము. ఎవని శత్రువులు తమ తప్పులకు పశ్చాత్తాప పడెదరో, ఎవని స్మరణ మనస్సునకు ప్రశాంతతను యిచ్చునో అట్టి ప్రభువైన పవిత్ర ప్రేమ మూర్తి శ్రీరాముడు నీ కుమారుడుగా జన్మించినాడు. శ్రీరామచంద్రుడు యువరాజైన దినమే మంగళకరము సుందరము. ఆలస్యము చేయకుము. వెంటనే ఏర్పాట్లుచేయుము."

దశరథుడు ప్రసన్నుడై మంత్రియైన సుమంత్రుని, సేవకులను పిలిచి ఆ శుభవార్తను తెలిపెను. "పట్టాభిషేకమునకై మునిశ్రేష్ఠుడైన వశిష్ఠుడు ఇచ్చిన ఆజ్ఞలన్నిటినీ నెరవేర్చండి," అని ఆదేశించెను.

వసిష్ఠుడు వారితో "అన్ని తీర్థములనుండి నీరు తీసుకొనిరండు" అని పలికెను. తరువాత వివిధ ఓషధులు, వేర్లు, పుష్పములు, పండ్లు, ఆకులు, చామరములు, మృగచర్మములు అనేక రకములైన వస్త్రములు ఉన్ని, పట్టుబట్టలు, మణులు, మరియు రాజ్యాభిషేకమున కవసరమగు వివిధ మంగళకరమైన పదార్థములు తెమ్మని ఆజ్ఞాపించెను. వేదోక్త విధులన్నియూ తెలిపెను. మునీశ్వరుని ఆజ్ఞను అందరూ శిరసావహించి పనులలో నిమగ్నులైరి.

శ్రీరామచంద్రుని రాజ్యాభిషేక వార్త వినగానే అయోధ్యలో జయజయ ధ్వానములను మ్రోగెను. సీతారాముల శరీరమునందు శుభశకునములు కలిగెను. వారు తమలో "ఈ శుభ శకునములన్నియూ తన మామ యింటికి పోయిన భరతుని ఆగమనమును సూచించుచున్నవి" అని భావించిరి. రాణివాసపు స్త్రీలు ఈ సమాచారమును విని చంద్రుని వృద్ధి చూచి సముద్రములోని అలలు పొంగినట్లు అమితానందమును పొందిరి. రాణులు మంగళకళశములు అలంకరింపసాగిరి. సుమిత్రాదేవి మణులతో సుందరమైన రంగవల్లులను వేసెను. కౌసల్యాదేవి బ్రాహ్మణులకు దానములిచ్చి, దేవతలను పూజించి శ్రీరామునికి శుభము కలుగుటకు ప్రార్థించెను. స్త్రీ, పురుషులందరూ యువరాజ పట్టాభిషేకపు వార్తను విని ఆనందముతో శుభకార్యములు చేయసాగిరి. నగరములో ఫలవృక్షములు నాటబడెను. అనేక మండపములు నిర్మించబడెను. వీధులు ధ్వజపతాక తోరణములతో అలంకరించబడెను. దశరథుడు వశిష్ఠమహామునిని శ్రీరామచంద్రుని భవనమునకు తగిన ఉపదేశముల నిచ్చుటకై పంపెను. గురువుగారి రాకను విని శ్రీరాముడు ఎదురేగి పాదములకు నమస్కరించెను. సాదరముగా అర్ఘ్యము నిచ్చి లోపలికి పిలుచుకొని వచ్చి షోడశోపచార పూజలతో గౌరవించెను. సీతాదేవితో సహా పాదాభివందనము చేసి చేతులు జోడించి శ్రీరాముడు ,పలికెను: "సేవకుని ఇంటికి ప్రభువు

రాక శుభప్రదమైనది. మీరు స్వయముగా ఇచ్చటకు విచ్చేయుటచే ఈ గృహము పవిత్రమైనది. లోకాచారమును అనుసరించి సేవకుని మీ వద్దకు రమ్మని కబురుపంపవలసినది." ఆ స్నేహపూరిత వాక్యములను విని శ్రీరామచంద్రుని ప్రశంసించుచూ వశిష్ఠుడు పలికెను: "రామా! సూర్యవంశమణివైన నీవిట్టి వాక్యములు పలుకుట తగును. రాజుగారు నిన్ను యువరాజుగా చేయదలచినాడు. రాజ్యాభిషేకపు ఏర్పాట్లు చేయుచున్నాడు. ఈ రోజు నీవు ఉపవాసము, హవనము మొదలగు విధిపూర్వకమైన సంయమనమును పాటించుము. దాని వలన విధాత ఈ పనిని సఫలము చేయును" అని పలికి గురువు రాజు వద్దకు పోయెను.

శ్రీరాముని హృదయములో విచారము కలిగెను: "నేను నా సోదరులు ఒకే సమయమున జన్మించితిమి. బాల్యమున కలిసి తింటిమి, నిద్రించితిమి, ఆడుకొంటిమి. కర్ణభేదనములు, ఉపనయనములు, వివాహములు కూడా ఒకే సమయమున జరిగినవి. ఇప్పుడు సోదరులందరినీ వదలి పెద్దవానికి ఒక్కనికే రాజ్యాభిషేకము చేయుట ఉచితకార్యమా? అదే సమయమున లక్ష్మణుడు అచ్చటికి వచ్చెను. శ్రీరాముడు అతనిని ప్రియవచనములతో సమ్మానించెను.

అయోధ్యానగరపు హర్షాతిశయము వర్ణనాతీతము. అందరు భరతుని ఆగమనమును కాంక్షించు చుండిరి. "భరతుడు తొందరగా వచ్చి ఈ ఉత్సవమును చూచి తన నేత్రములను సఫలమొనర్చుకొనును." అని పలుకుచుండిరి. "దేవుడు మా కోరికను నెరవేర్చు శుభముహూర్తము రేపు ఎప్పుడు వచ్చును? బంగారు సింహాసనముపై సీతాదేవితోపాటు శ్రీరామచంద్రుడు విరాజిల్లును, మా మనోవాంఛలు పూర్తియగును" అని తమలో తాము అయోధ్యావాసులు మాట్లాడుకొనుచుండిరి.

## 3. దేవతల పన్నాగము

చోరులు వెన్నెలరాత్రిని ఇష్టపడనట్లు దుష్టదేవతలకు అయోధ్యలో ఆనందము రుచించలేదు. వారు సరస్వతీదేవిని పిలిచి పాదాభివందనము నాచరించి "అమ్మా! మా ఆపదలను చూచి శ్రీరాముడు రాజ్యమును వదలి అడవులకు పోవునట్లు చేయుము. దాని వలన దేవతల కార్యములు సిద్ధించును" అని ప్రార్థించిరి. సరస్వతీదేవి వారి ప్రార్థనను విని మౌనము వహించి "కమలవనమునకు హేమంతరాత్రిని ఎట్లు తేగలను?" అని విచారించెను. దేవతలు మరల వినయముతో ప్రార్థించిరి: "మాతా! ఇందులో మీ దోషము ఏ మాత్రముండదు, ఏలనన, శ్రీరఘునాథుడు హర్షవిషాదరహితుడు. కర్మవశులైన జీవులు సుఖదుఃఖములను అనుభవిస్తారు. కాని, శ్రీరాముడు జీవుడు కాడు, భగవంతుడు. కావున దేవతల మేలుకొరకు మీరు అయోధ్యకు పొండి" అని మాటిమాటికి పాదములను పట్టుకొని వేడిరి. సరస్వతీదేవి ఇట్లు తలపోసెను: "దేవతల బుద్ధి చాల నీచమైనది. వీరి నివాసము గొప్పదికాని వీరి కృత్యములు నీచమైనవి. ఇతరుల ఐశ్వర్యమును చూచి ఓర్వలేరు. శ్రీరాముడు అడవికి పోయిన రాక్షస వధ జరుగును. చతురులయిన కవులు నన్నాహ్వానించెదరు. వారి నాలుకలపై నిలచి శ్రీరాముని చరిత్రమును చెప్పెదను. నా ప్రతిష్ఠ ఎక్కువగును." ఆ విధముగా ఆలోచించి సరస్వతీదేవి సంతోషముతో అయోధ్యకు పోయెను.

భరతుని తల్లియైన కైకేయి వద్ద మంథర అని ఒక మందబుద్ధి దాసిగా ఉండెను. సరస్వతీ దేవి దాని బుద్ధిని వక్రీకరించి దానిని అపయశము పొల్లేయ సంకల్పించెను. మంథర సుందరమైన నగరాలంకారమును చూచి మంగళకర వాద్యగోష్టిని విని జనులతో విశేషమేమిటని అడిగెను. శ్రీరామచంద్రుని రాజ్యాభిషేక సమాచారమును వినగానే

ఆమె హృదయము అసూయతో నిండిపోయెను. "ఆ రాత్రిలోనే ఆ సన్నాహమును ఎట్లు నేలమట్టము చేయాలి?" అని ఆలోచించెను. వెక్కి వెక్కి ఏడ్చుచూ కైకేయి వద్దకు వచ్చెను. "ఎందుకు విచారముగా నున్నావు?" అని రాణి అడుగగా, ఏమియు పలుకక దీర్ఘనిశ్వాసము వదలి ఇంకనూ కన్నీటిని బొటబొట కార్చుచూ ఏడ్వసాగెను. కైకేయి నవ్వుచూ యిట్లనెను: "నీవు పొగరుబోతువు. లక్ష్మణుడు నీకేదో గుణపాఠము నేర్పినాడని నా నమ్మకము. రాజుగారు, రామలక్ష్మణ, భరతశత్రుఘ్నులు కుశలమే గదా?" ఆ మాటలు వినగానే ఆ దాసి ఇంకనూ పరితపించుచూ ఇట్లు పలికెను: "అమ్మా! ఎవ్వరు, ఎందుకు నాకు గుణపాఠం చెప్పాలి? యువరాజు పదవిని పొందుచున్న రాముడు తప్ప ఎవ్వరు నేడు సంతోషముతో ఉన్నారు? ఇప్పుడు దేవుడు కౌసల్యకు మిక్కిలి అనుకూలుడు. ఆమె గర్వమును చెప్పనలవి కాదు. నీవే స్వయముగా నగరశోభను తిలకించుము. నీ కుమారుడు పరాయి దేశములో ఉన్నాడు. నీకా విషయముపై ధ్యాసయే లేదు. నీ భర్త నీ వశములో నున్నాడని నీ వనుకుంటున్నావు. అతడు ఎంత కపటియో, చతురుడో, నీవెరుగవు." మంధర అప్రియ వచనములను విని, ఆమె మనస్సులోని కల్మషమును తెలుసుకొని కైకేయి మందలించుచూ యిట్లనెను: "చాలించు నీ అధిక ప్రసంగము. కుటుంబములో కలహములు పెట్టుటలో ప్రజ్ఞగలదానివి. మరల మాట్లాడినచో నీ నాలుకను బయటికి లాగి చీల్చెదరు. సూర్యవంశములో పెద్దకుమారుడు రాజ్యానికి ప్రభువు. చిన్నవాడు సేవకుడు. శ్రీరాముని స్వభావమును బట్టి కౌసల్య ఎంత ప్రియమైనదో మేమందరము అంతే ప్రేమాస్పదులము. అతడు నాకు నా ప్రాణములకన్నా ఎక్కువ ప్రీతిపాత్రుడు, అతని రాజ్యాభిషేకము నిన్ను ఎందుకు క్షోభ పెట్టుచున్నది: భరతుని మీద ఒట్టు. నీవు నీ కపట ప్రవర్తనను మాని నిజము చెప్పుము. సంతోషించవలసిన సమయమున దుఃఖించుటకు కారణమేమి?"

మంథర పలికెను: "అమ్మా! నిజాన్ని కప్పిపుచ్చి చెప్పినవారే మీకు ఇష్టమయినవారు. నేను చెప్పినది మీకు నచ్చదు. మంచి మాట చెప్పగా మీకు దుఃఖము కలిగింది. బ్రహ్మ నన్ను కురూపిగా సృష్టించి పరాధీనగా చేసినాడు. ఇందులో వేరే వారి దోషములేదు. ఎవ్వరు రాజైతే నాకేమి, నేను దాసిగా కాక రాణినవుతానా? నీ అవమానమును నేను చూడలేను. అందుకే ఒకటి రెండు మాటలు మాట్లాడినాను. నన్ను క్షమించు, నేను పొరపాటు చేసినాను."

కపటములో కూడిన ఆ తీయనిమాటలు విని కైకేయి దేవతల మాయకు వశమై శత్రువైన మంథరను స్నేహితురాలిగా తలపోసెను. కైకేయి మంథర మాటలకు ముగ్ధురాలై మరి మరి ప్రేమతో అడిగెను. దాసి తన పాచిక పారినదని లోలోన సంతోషించెను. "అమ్మా! నీవడుగుతున్నావు. కాని చెప్పాలంటే నాకు భయము వేస్తున్నది. సీతారాములు నీకత్యంత ప్రియులని నీవు చెప్పినావు. నీకు రాముడంటే ఇష్టము. ఇది సత్యము. కాని ఆ రోజులు గడిచిపోయినవి. కాలము మారితే మిత్రులు కూడా శత్రువులు అవుతారు. నీ సవతి కౌసల్య చతురురాలు, గంభీరురాలు. ఆమె ఏ అవకాశమును కూడా తనకు లాభమగునట్లు మలచుకొనును. నీవు అమాయకురాలివి. నీ భర్త తీయని మాటలను నమ్మెదవు. ఆయన మనసంత విషమే. కౌసల్య సలహాను పాటించి ఆయన భరతుని అమ్మమ్మ గారింటికి పంపినారని తెలుసుకో. రాజుగారికి నీ మీద ఎక్కువ ప్రేమ ఉండుటవలన కౌసల్యకు నీ మీద అసూయ. భరతుడు లేని సమయమును చూచి రాముని రాజ్యాభిషేకమునకు ముహూర్తమును నిర్ణయింపచేసినది. కులాచారము ప్రకారము శ్రీరాముడు యువరాజగుట సమంజసమే. కాని రాబోయే ఫలితములను గూర్చి ఆలోచించిన దైవము దీనిని కౌసల్యకు లాభదాయకముగా చేయునని నా భయము." ఆ విధముగా మంథర పెక్కు కుటిలమయిన మాటలను సవతి కలహములను గూర్చి చెప్పి కైకేయి మనస్సును మరలించెను. అమాయకురాలైన కైకేయికి

మంధరపై పూర్తి విశ్వాసము గలిగెను. మరల మంధర పలికెను: "నేను నీ రక్షణలో నున్నాను. కావున నిజము పలుకుచున్నాను. రేపు రాముడు యువరాజు అయినచో నీ కష్టములు ప్రారంభమగును. నిన్ను పాలలో ఈగలాగ అందరూ తీసివేస్తారు. కశ్యపుని భార్య అయిన కద్రువ తన సవతియైన వినతను ఎట్లు కష్టపెట్టినదో అట్లే కౌసల్య నిన్ను కష్టపెట్టును. భరతుడు చెరసాలలో నుండును. లక్ష్మణుడు రామునికి అంతరంగికుడు అగును." మంధర చేదు మాటలు వినగానే కైకేయి భయముతో వణికి పోయెను. నోట మాట రాలేదు. ఎండిన అరిటాకువలె వణికెను. కైకేయి గుండె ఆగిపోతే తన ఉపాయము ఫలించదని భయపడి మంధర అనేక కపటపు మాటలతో రాణిని అనునయించి ఆమె మనస్సును గట్టిపరిచెను. "మంధరా! నీవు చెప్పేది సత్యము. నా కుడి కన్ను అదురుచున్నది. ప్రతిరోజు నాకు చెడ్డస్వప్నములు వచ్చుచున్నవి. నేను ఏమి చేయాలి? అమాయకురాలిని. శత్రువులెవరో మిత్రులెవరో నేను గుర్తించలేను. నేను ఎవరికి అపకారము చేయలేదు. విధి ఎందుకు నాకీదుస్థితిని తెచ్చిపెట్టినాడో? నేను నా తండ్రిగారింటికి పోయి జీవితమంతా అక్కడే గడుపుతాను. కాని బ్రతికుండగా సవతి సేవను మాత్రము చేయను. పరాధీనపు బ్రతుకుకంటే చావు నయము." అట్లు అనేక దీనవచనములను పలికిన కైకేయితో మంధర యిట్లనెను: "అమ్మా! నిన్ను నీవు హీనపరచుకోవలదు. నీ వైవాహిక జీవితము రెండింతలు సుఖప్రదమగును. ఈ దుర్వార్త వినినప్పటి నుండి నాకు అన్నము సహించదు. నేను జ్యోతిష్యులను అడిగితే వారు నిశ్చయముగా తెలిపిరి.

## 4. రెండు వరములు

"భరతుడు రాజగుటకు నేను ఒక ఉపాయమును చెప్పెదను. అమ్మా! మీరు నాకొక కథను చెప్పియుంటిరి. ఒకసారి రాజుగారు

మీకు రెండు వరములను ఇచ్చుటకు వాగ్దానము చేసినారు. ఈ రోజు వాటినడిగి నీ మనస్సును చల్లబరుచుకో. భరతునికి రాజ్యము, రామునికి వనవాసము కోరుకో. శ్రీరాముని మీద ఒట్టు పెట్టుకున్న తర్వాతనే ఈ వరములు అడుగుము. లేనిచో రాజుగారు మాట తప్పవచ్చును. జాగ్రత్తగా పనిని సాధించుకో. ఈ రాత్రి గడచినచో మన పథకము ఫలించదు. ఇప్పుడే కోపగృహానికి పొమ్ము" మంధరను తన ప్రాణములతో సమానముగా కైకేయి భావించెను. రాబోవు ఆపదను గుర్తించక బలి పశువు బాగా గడ్డి మేసినట్లు, కైకెయి తనకు సంప్రాప్తించబోవు కళంకమును, వైధవ్యమును గుర్తించలేకపోయెను. మంధరను పొగుడుచూ "ప్రవాహములో కొట్టుకొని పోవుచున్న నాకు నీవు ఆధారముగా దొరికితివి. విధాత రేపు నా అభిలాషను పూర్తి చేసినచో నేను నిన్ను నా కంటి పాపగా భావించెదను" అని పల్కుచూ కోపగృహమునకు పోయెను. కోపప్రకటనకై సర్వాలంకారములను విసర్జించి నేలపై పరుండెను.

రాజభవనము, నగరము ఆనందోత్సాహములతో నిండెను. ఎవ్వరూ ఈ కుతంత్రమును పసికట్టలేదు. నగరవాసులు అత్యుత్సాహముతో రాజ్యాభిషేకపు ఏర్పాట్లు గావించుచుండిరి. శ్రీరామచంద్రుని చిన్ననాటి స్నేహితులు శ్రీరాముని వద్దకు వచ్చి తమ సంతోషమును ప్రకటించుచుండిరి. కాని కైకేయి హృదయము మాత్రము ఈర్ష్యాగ్నితో మండుచుండెను, సంధ్యాసమయమున దశరథుడు సంతోషముతో కైకేయి గృహమునకు వచ్చెను. కోపభవనము పేరు వినగానే దశరథుడు భీతిల్లెను. మెల్లగా కైకేయి వద్దకు పోయి ఆమె స్థితిని చూచి విచారించెను. కైకేయి తన ఆభరణములన్నిటినీ తీసివేసి, ఒక పాత ముతక వస్త్రమును ధరించి నేలపై పరుండియుండెను. రాజు ఆమె వద్దకు పోయి మధురస్వరముతో "రాణీ! కోపమేల!" అనుచూ చేతితో స్పృశించగానే ఆ చేతిని కైకేయి విదలించివేసి కోపోద్రిక్త

అయిన ఆడ త్రాచు వలె అతని వైపు చూచెను. దశరథుడు దానిని సరసముగా భావించి యిట్లు పలికెను: "నీ కోపకారణము యేమి? వినిపింపుము. ఎవరు నీకు అపకారము చేసిరి? నీ శత్రువు దేవత అయినా సరే వానిని వధించెదను. నా ప్రాణములు పుత్రులు, కుటుంబము, ప్రజలు సర్వస్వము నీ అధీనములు. రామునిపై ఒట్టు వేసి చెప్పుచున్నాను. ఇది సత్యము. నీ మనోరథమును నవ్వుతూ కోరుకొమ్ము. ఆభరణములను ధరించుము. ఈ కోపమును పరిత్యజించుము, సమయాసమయములను గుర్తించుము." ఆ మాటలు విని రాజుగారి వాగ్దానమహిమను మనస్సున తలచి మందబుద్ధి కైకేయి నవ్వుతూ లేచి ఆభరణములును ధరించెను. ఆమె కోపము శాంతించినదని తలచి రాజు ప్రేమతో మృదుమధురముగా ఇట్లు పలికెను: "ఓ భామినీ! నీ మనోరథము నెరవేరుచున్నది. రేపు రాముని యువరాజుగా చేయుచున్నాను. మంగళకర వస్తువులు ధరించి నీ కోరిక ఏమో తెలుపుము." అది వినగానే కైకేయి కఠిన హృదయము ముక్కలాయెను. కపట ప్రేమను నటించుచూ, "అడుగు అడుగు అని పల్కుతారు కాని ఎప్పుడు ఏమీ ఇవ్వలేదు. మీరు నాకు రెండు వరములు ఇచ్చియుంటిరి. వాటిని అడుగుటకు కూడా నాకు సందేహము అగుచున్నది" అని పలికెను.

రాజు నవ్వి "ఇప్పుడు నీ మనస్సు అర్థమైనది. నీకు కోపము అత్యంత ప్రియము. నీవే వరదానములను అడగలేదు. నేను వాటిని మరచిపోయినాను. నన్ను అసత్యవాదిగా భావించకు. రెండు వరముల బదులు నాలుగు వరములను కోరుకో. రఘువంశములోని రాజులు ప్రాణము పోయినా సరే మాటతప్పరు, శ్రీరామునిపై ప్రమాణము చేసి చెప్పుచున్నాను." ఆ విధముగా రాజు మాటలను ధృవపరచి దుష్టబుద్ధి కైకేయి నవ్వి తన దురాలోచనను కన్నులతో ప్రకటించుచూ పలికెను: "ప్రాణనాథా! వినుడు నా మనస్సులోని

మొదటి కోరిక భరతుడు యువరాజుగా కావలెను. దానిని వరముగా ప్రసాదించుడు. రెండవ వరము శ్రీరాముడు తాపసి వేషముదాల్చి వైభవ విలాసములను వదలి పదునాలుగు సంవత్సరములు మునులవలె వనవాసము చేయవలెను." కైకేయి మాటలు వినగానే రాజు శోకహృదయుడై మాట్లాడలేకపోయెను. ముఖము వివర్ణము అయెను. గ్రద్ద చేతిలో చిక్కిన పక్షివలె విలవిలలాడెను. తలపై చేతులు ఉంచుకొని కన్నులు మూసుకొని, "నా మనోరథరూపమగు కల్పవృక్షము ఇప్పుడే ఫలించుచుండగా కైకేయి అను ఏనుగు దానిని సమూలముగా నాశనము చేయుచున్నది" అని పరితపించెను.

అతని దుస్థితిని చూసి కైకేయి క్రుద్ధురాలై ఇట్లు పలికెను: "భరతుడు మీ కుమారుడు కాడా? నన్ను బానిసగా కొనుక్కొని వచ్చినారా? నా మాటలు చెవిన పడిన వెంటనే అవి బాణములవలె గ్రుచ్చుకొనినచో ముందుగానే ఎందుకు ఆలోచించలేదు? మీరు రఘువంశములో సత్యపాలనకు ప్రసిద్ధులు. మీరిచ్చిన వరమును మీరే నిరాకరించండి. సత్యమును వదలి అపకీర్తి పాలుకండి. సత్యపాలనను గూర్చి గట్టిగా చెప్పి నాకు వరములు యిచ్చినారు. శిబి, దధీచి, బలిచక్రవర్తులు తమ సంపదను, ప్రాణములను కూడా లెక్కచేయక ఇచ్చిన మాట నిలబెట్టుకున్నారు."

ధర్మాత్ముడైన రాజు ధైర్యము వహించి కన్నులు తెరచి దీర్ఘని శ్వాసము వదలెను. భయంకర క్రోధాగ్నిలో మండుచున్న కైకేయి అతని సమ్ముఖాన నిలబడెను. 'ఇది నిజముగా నా ప్రాణములు తీయునా?' అని రాజు భావించెను. పిదప నమ్రతాపూర్వకముగా పలికెను: "ప్రియా! నీవు భయము, విశ్వాసము, ప్రేమలను నష్టపరచి ఇట్టి అప్రియవచనములను ఏల పలుకుచుంటివి? భరతుడు, రాముడు నాకు రెండు కన్నులవంటివారు. ప్రాతఃకాలముననే దూతలను పంపి భరతశత్రుఘ్నులను రప్పించెదను. ఒక శుభముహూర్తమును నిర్ణయించి

భరతునికి రాజ్యము నప్పగించెదను. శ్రీరామచంద్రునికి రాజ్యకాంక్ష లేదు. అతనికి భరతునిపై అనన్య ప్రేమ కలదు. నీ కోపమును మాని మంగళకరమైన దుస్తులు ధరించుము. భరతుడు యువరాజగును. నీ రెండవ కోరికను మాత్రము మానుము. రాముడు లేనిదే నా జీవితము ఉండదు. బాగా ఆలోచించుకో." రాజుగారి కోమల వచనములు విని అగ్నిలో ఆజ్యము పడినట్లు కైకేయి క్రోధముతో మండిపోయెను. "మీ మాయమాటలు నడువవు. ఇష్టమయితే నేను కోరినవి ఇవ్వండి. లేకపోతే లేదనిచెప్పి అపకీర్తి పాలుకండి. తెల్లవారగనే రాముడు ముని వేషమును ధరించి వనమునకు పోనట్లయితే నేను చనిపోవుట, మీరు అపకీర్తి పాలగుట నిజము. గ్రహించండి."

ఆ మాటలు వినగానే దశరథుడు స్త్రీ రూపములో మృత్యువే నా నెత్తిపై నాట్యము ఆడుచున్నదని గ్రహించి, "నీవు సూర్యవంశమును నాశనము చేయవద్దు. నా శిరస్సునడుగుము, వెంటనే ఇస్తాను కాని, రాముని నానుండి వేరు చేసి నన్నుచంపవద్దు" అని ప్రార్థించుచూ కైకేయి హఠరోగమును నివారించుట అసాధ్యమని గ్రహించి దశరథుడు నెత్తి బాదుకొని నేలపై బడి "రామరామ" అని విలపించెను. అతని శరీరము పూర్తిగా శిథిలమయ్యెను. కంఠము ఎండిపోయెను. నోట మాట రాలేదు. నీరు దొరకని చేపవలె గిలగిలలాడెను. మరల కైకేయి కఠోర వచనములు పలికి విషము నింపెను. "చివరకు ఈ విధముగా చేయవలసి వుంటే మాటిమాటికి నన్ను 'అడుగు అడుగు' అని ఏల పలికితిరి? ప్రతిజ్ఞా భంగము అయినా చేయుడు. లేదా ధైర్యముతో ప్రవర్తించుడు. సత్య ప్రతిజ్ఞునికి శరీరము, భార్యాపుత్రులు, గృహము, సంపద అన్నియూ గడ్డిపోచతో సమానము" అని పలికెను.

కైకేయి పలికిన కర్ణకఠోరపు మాటలు విని దశరథుడు పలికెను: "నీకిష్టమయినట్లు మాట్లాడుము, ఇందులో నీ దోషము లేదు. నా మృత్యువే పిశాచమై నిన్నావహించి ఇట్లు మాట్లాడించుచున్నది.

విధివైపరీత్యము వలన నీకీ దుర్బుద్ధి కలిగినది. ఇది నా పాపఫలము, భరతుడు రాజగుటకు పొరపాటుగా నైన కోరడు. నీవల్ల నాశనమైన ఈ సుందరమైన అయోధ్య మళ్ళీ వికసించి శ్రీరాముని పరిపాలనలో శోభాన్వితమగును. సోదరులంతా కలిసి అతనికి సేవచేసెదరు. శ్రీరాముని కీర్తి ముల్లోకములలో వ్యాపించును. కాని నీకళంకము నా పశ్చాత్తాపము మన మరణానంతరము కూడా మాసిపోదు. ధౌర్భాగ్యురాలా! నా ఎదుటనుండి తొలగిపో. నీ ముఖము నాకు చూపవద్దు. నేను బ్రతికి ఉన్నంత వరకు నాతో మాట్లాడవద్దని చేతులెత్తి ప్రార్థిస్తున్నాను. అనేక విధముల నచ్చచెప్పిననూ వినక నీవు నన్ను సర్వనాశనము చేస్తున్నావు," అనుచూ విలపించుచూ రాజు నేలపైకి ఒరిగెను. కాని కపటి, చతురాలైన కైకేయి ఏమియూ మాట్లాడక నిలుచుండెను.

అంతలోనే తెల్లవారెను. రాజద్వారముకడ వీణ , వేణు, శంఖధ్వనులు ప్రతిధ్వనించెను. జనసమూహము శ్రీరాముని పట్టాభిషేకమును చూచుటకు గుమికూడిరి. "సూర్యోదయము అయినప్పటికీ దశరథ మహారాజు లేవని కారణము ఏమి?" అని సేవకులు, మంత్రులు అడుగుచుండిరి. సుమంత్రుడు రాజమహలులో ప్రవేశించి అచ్చటి భయానక దృశ్యమును చూచి భయపడెను. అడిగిననూ ఎవ్వరు ఏమియూ పలుకలేదు. కైకేయి మందిరమున రాజుగారి స్థితి చూచి భయభీతుడయ్యెను. భయముతో సుమంత్రుడు ఏమియూ అడగ జాలకపోయెను. అతనితో కైకేయి "రాజుగారు రాత్రంతయూ నిద్రించలేదు. తెల్లవారువరకూ రామా రామా అనుట తప్ప మరి ఏమియూ చేయలేదు. వెంటనే పోయి రాముని ఇచ్చటికి పిలుచుకొనిరమ్ము, వచ్చినతర్వాత విషయమేమిటో తెలుసుకొనవచ్చును" అనెను. "రాణి ఏదో కుతంత్రము పన్నినది" అని ఊహించి సుమంత్రుడు శ్రీరామచంద్రుని మందిరమునకు పోయెను.

రాజాజ్ఞను వినిపించి శ్రీరాముని వెంటనిడుకొని బయలుదేరెను. ఛత్రచామరములు లేకుండా కాలినడకన మంత్రితో వచ్చు శ్రీరాముని చూచి ప్రజలు మిక్కిలి వగచిరి. ఒక ఆడసింహమును చూచి భీతిల్లి పడిన ఏనుగువలె శోకసంప్తత హృదయుడై అస్తవ్యస్తముగా పడివున్న రాజును శ్రీరామచంద్రుడు చూచెను. సమీపముననే రాజుగారి అంతిమ ఘడియలను లెక్కపెట్టుచున్న మృత్యుదేవత వలె క్రోధమూర్తియైన కైకేయి నిలుచుండెను. శ్రీరామచంద్రుడు కోమల స్వభావుడు. అతడు ఎన్నడూ దుఃఖమును గూర్చి వినలేదు. మొదటిసారి అప్పుడు ఆ దుఃఖమును చూచెను. అయిననూ ధైర్యము వహించి కైకేయి నడిగెను: "మాతా! పితృదేవుల దుఃఖమునకు కారణమేమి? దుఃఖనివారణయత్నము చేయవచ్చును." అప్పుడు కైకేయి సమాధానము ఇచ్చెను: "రామా! రాజుగారి దుఃఖమునకు కారణము నీ మీద మిక్కిలి ప్రేమ. వీరు నాకు రెండు వరములను యిచ్చుటకు ప్రతిజ్ఞచేసియుండిరి. నేను ఆ వరములను అడుగగానే రాజుగారి హృదయము దుఃఖమయము అయినది. ఒకవైపు నీమీద మమకారము, మరొకవైపు ప్రతిజ్ఞాపాలనము. ఇదియే అతని ధర్మసంకటము. సాధ్యమయితే అతని ఆజ్ఞను శిరసావహించి దుఃఖమును రూపుమాపుము" అని పలికి కైకేయి కథనంతయూ శ్రీరామునికి వినిపించెను.

స్వభావతః ఆనందస్వరూపుడు శ్రీరామచంద్రుడు మనస్సులో నవ్వుకొని దోషరహితమైన మధుర వచనములను పలికెను: "మాతా! వినుడు. తల్లిదండ్రుల ఆజ్ఞలను పాలించుటయందు అనురాగముగల పుత్రుడే భాగ్యవంతుడు. అట్టివాడు ప్రపంచములో దుర్లభుడు. వనములో కూడా నాకన్నివిధముల మేలే జరుగును. అక్కడ మునులతో సమాగమము కాగలను. ఇది నా తండ్రిగారి ఆజ్ఞ మరియు మీ సమ్మతి. నా ప్రాణసమానుడైన భరతుడు రాజ్యమేలును. ఇంత చిన్న

విషయమునకై రాజుగారు దుఃఖితులు అయినారని నాకు విశ్వాసము కలుగుటలేదు. నిజముగా నా వల్ల ఏదో మహాపరాధము జరిగినది. మాతా! నిక్కము వచింపుడు." రఘునాధుని నిర్మల వాక్కులు విని, అతని వినయమును చూచి కైకేయి ప్రసన్నురాలై కపటప్రేమను చూపుచూ పలికెను: "నీ పైన, భరతుడిపైన ఒట్టు. రాజుగారి దుఃఖమునకు మరొక కారణము నేను ఎరుగను. నాయనా! నీవు తల్లిదండ్రులకు, సోదరులకు ఆనందము నిచ్చువాడవు. అపరాధము చేయుట అసంభవము. నీవు పితృవాక్యపరిపాలనా తత్పరుడవు. ఈ ముసలితనములో మీ తండ్రిగారికి అపకీర్తిరాకుండునట్లు చేయుము. ఏ పుణ్యఫలమువలననో నీ వంటి పుత్రుడు కలిగెను. దానిని నిరాదరణ చేయుట మంచిది కాదు." ఆమె కఠిన వాక్యములను కూడా శ్రీరాముడు శుభముగానే భావించెను.

శ్రీరామచంద్రుడు వచ్చిన విషయమును చెవి సోకగానే దశరథుడు మెల్లగా కన్నులు తెరిచెను. మంత్రి రాజుగారిని మెల్లగా కూర్చుండబెట్టెను. శ్రీరాముడు అతనికి పాదాభివందనము చేసెను. దశరథుడు కన్నీటితో ఏమియూ మాట్లాడలేక శ్రీరాముని హృదయమునకు హత్తుకొనెను. తండ్రి ప్రేమవశుడగుటచూచి శ్రీరాముడు సమాధానుకూలముగా పలికెను: "తండ్రిగారూ! ఒక విషయమును చెప్పుటకు సాహసించుచున్నాను. నన్ను క్షమింపుడు. ఇంత చిన్న విషయమునకై మీరింత కష్టపడుచున్నారు. ప్రేమవశులై విచారించకండి. ప్రసన్నచిత్తులై నన్ను ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞను పొంది నా జన్మమును సఫలము ఒనర్చుకొని శీఘ్రముగా తిరిగి రాగలను. ఈ పృధ్విపైన ఎవ్వని చరిత్రను విని తండ్రి పరమానందభరితుడు అగునో అట్టి కుమారుని జన్మ ధన్యమయినది. తల్లిదండ్రులను తన ప్రాణములతో సమానముగా ప్రేమించువానికి ధర్మార్థకామమోక్షములు కరతలామలకములు. నేను తల్లిగారి అనుజ్ఞ బడసి వస్తాను, అనుమతి నివ్వండి. మరల మీ

పాదములకు ప్రణమిల్లి వనమునకు పోయెదను." ఆ విధముగా పలికి శ్రీరామచంద్రుడు వెళ్ళిపోయెను. శోకతప్తుడైన రాజు ఏమియూ బదులు పలుకలేదు.

ఈ అప్రియవార్త నగరమంతయూ వ్యాపించెను. అందరూ ఎక్కడివారక్కడే కూలబడిపోయిరి. ముఖములు ఎండిపోయెను. కన్నులలో నీరు ప్రవహించసాగెను. ప్రజలు కైకేయిని తిట్టుచుండిరి. "ఏల ఈ పాపాత్మురాలు క్రొత్తగా నిర్మించిన భవనమును తగులబెట్ట ప్రయత్నించుచున్నది? తన వ్రేలితో తన కన్నులనే పొడుచుకొనుచున్నది. ఆనందోత్సాహాలమధ్య శోకమును నిర్మించుచున్నది. రాముడు ఈమెకు ప్రాణసమానుడు. మరి ఏ కారణమువలన ఈమె ఇంత కఠినత్వము వహించినది? స్త్రీల స్వభావము అగ్రాహ్యము, అగాధము. వారి మనసును తెలుసుకొనుట కష్టము." మరికొందరు రాజుగారిదే దోషమని భావించిరి. "దుర్బుద్ధి యగు కైకేయికి విచారణ లేకుండా ఇచ్చిన వరములు దుఃఖమునకు మూలమైనవి. స్త్రీకి వశమగుట వలన జ్ఞానము, గుణము నష్టపోయినాడు" అనుచుండిరి. మరికొందరు రాజును దోషిగా తలచలేదు. వారు విధాతను తిట్టిరి. వారి ఉత్సాహము అంతరించెను. దుస్సహమైన బాధ హృదయములో నిండెను. కొందరు బ్రాహ్మణ స్త్రీలు, కులములోని పెద్దలు కైకేయికి నచ్చచెప్పిరి: "నీకు శ్రీరామునిపై సహజముగా ప్రేమయున్నది కదా! మరి ఏ కారణముచే అతనిని వనమునకు పంపుచున్నావు? నీవు ఎప్పుడు కూడా సవతులపై ఈర్ష్యచెందలేదు. కౌసల్య నీకేమి అపకారము చేసినది? శ్రీరాముడు లేని అయోధ్యను భరతుడు ఏలునా? శ్రీరాముని విడిచి సీతాలక్ష్మణులు ఉందురా? శ్రీరాముడు లేకుండా రాజు బ్రతుకగలడా? నీ కోపమును మానుము. అవశ్యముగా భరతుని యువరాజుగా చేయుము. కాని శ్రీరాముని అడవులకు పంపుట ఎందుకు? అతడు ధర్మమూర్తి. అతనికి రాజ్యకాంక్షలేదు."

ఆ విధముగా చేసిన హితబోధలు కైకేయికి రుచించలేదు. కుటిలకుబ్జ మంథర చేసిన ఉపదేశము ఆమె మనస్సున బాగుగ నాటుట వలన వారి మాటలను పెడచెవిని పెట్టెను. వారామెను అనేక విధములుగా దూషించుచు వెళ్ళిపోయిరి.

## 5. తల్లి అనుమతి

శ్రీరామచంద్రుడు ప్రసన్నమైన ముఖముతో ఉల్లాసముగా కౌసల్యాదేవి వద్దకు పోయెను. తన రెండుచేతులు జోడించి తల్లి పాదములకు నమస్కరించెను. తల్లి అతనిని ఆశీర్వదించి ఆభరణములతో వస్త్రములతో కప్పివేసెను. కన్నులందు ఆనందబాష్పములు ప్రవహించెను. శరీరము పులకరించెను. అతనిని తన హృదయమునకు హత్తుకొని "నాయనా! ఆనందప్రదమైన శుభముహూర్తము ఎప్పుడు? ఎప్పుడు నా జీవితము సఫలమగును? త్వరగా స్నానము చేసి నీకిష్టమైన మధుర పదార్థములను తినుము. తర్వాత తండ్రిగారివద్దకు పొమ్ము, ఇప్పటికే చాలా ఆలస్యమయినది." తల్లిగారి ప్రేమపూరితమైన మధుర వచనములను విని ధర్మమార్గములు ఎరిగిన శ్రీరామచంద్రుడు ఇట్లు పలికెను: "అమ్మా! తండ్రిగారు నా కప్పగించిన వనరాజ్యమున నేను అనేక గొప్ప కార్యములను నెరవేర్చవలసి యున్నది. మీరు ప్రసన్నచిత్తముతో నాకు అనుమతి నిచ్చిన నా వనవాసము ఆనందమును శుభమును చేకూర్చును. పదునాలుగు సంవత్సరములు వనవాసముగా గడిపి తండ్రి గారి ఆజ్ఞను పాలించి పిదప మీ పాదములను దర్శించెదను." శ్రీరామచంద్రుని వినయపూర్వక వచనములు తల్లి హృదయములో బాణములవలె గుచ్చుకొనెను. గద్గద స్వరముతో "నాయనా! నీవు తండ్రిగారికి ప్రాణసముడవు. వారే నీ రాజ్యాభిషేక సుమూహూర్తమును నిర్ణయించిరి. ఇప్పుడే అపరాధమునకు నిన్ను వనములకు పంపుచున్నారు?" అని వాపోయెను. శ్రీరాముని కనుసన్నలాజ్ఞచే సుమంత్రుని

పుత్రుడు విషయమునంతయూ తెలిపెను. ఆ కథ విన్న కౌసల్య గొంతుక మూగబోయెను. కర్తవ్యము, మమతల సంఘర్షణల వలన కౌసల్యాదేవి శ్రీరాముని నిలుపలేదు. వనమునకు పొమ్మని చెప్పలేదు. ఆమె మనస్సులో యిట్లు ఆలోచించెను: "నేను పట్టుదల వహించి కుమారుని నిలిపినచో ధర్మమునకు విరుద్ధము. సోదరులలో పరస్పరము విరోధము కలుగును." అట్టి ధర్మసంకటముతో విచారగ్రస్తురాలయ్యెను. చివరకు కౌసల్య తన భర్తయెడల తన ధర్మమును తాను తెలుసుకొని రాముడు, భరతుడు ఇరువురు తనకు సమానము అని భావించి పలికెను: "కుమారా! పితృాజ్ఞా పరిపాలనము అన్ని ధర్మములలో పవిత్రమయినది. మీ తండ్రిగారు రాజ్యమునకు బదులు వనవాసమును ఇచ్చినారు. నేను ఇందులకు లేశమాత్రమైన దుఃఖించుటలేదు. కాని నీవు లేకున్నచో భరతునికి, రాజుగారికి, అయోధ్యవాసులకు అతి కష్టమగును. అడవులు వంద అయోధ్యలతో సమానము అని భావించుము. వనదేవతలే నీ తల్లిదండ్రులు, పశుపక్ష్యాదులు నీ సేవకులు, నీవు వెళ్ళు వనమే భాగ్యవంతమయినది, నీవు వదిలిన అయోధ్య భాగ్యహీనమైనది. నీ ప్రజలను కుటుంబ సభ్యులను అనాథలుగా చేసి వనములో సుఖించుము. నీ కష్టములనన్నింటినీ నేను భరించలేను. విధి మాకు వ్యతిరేకము అయినది." "అట్లు అనేక విధముల విలపించి కౌసల్యాదేవి శ్రీరామచంద్రుని పాదములకడ పడిపోయెను. శ్రీరామచంద్రుడు తల్లిని లేపి హృదయమునకు హత్తుకొని మధుర వచనములతో మరల నచ్చచెప్పెను.

## 6. సీతాదేవి అభిలాష

అదే సమయమున శ్రీరామచంద్రుని వనవాస వార్తను విని సీతాదేవి వ్యాకులచిత్తాయెను. ఆమె అత్తగారి వద్దకు వచ్చి ఆమె పాదములకు నమస్కరించి తలవంచుకొని కూర్చొని ఆలోచించసాగెను:

"ప్రాణనాథుడు అడవికి పోవుటకు సిద్ధమగుచున్నాడు. వారితో పాటు పోవుటకు నేను ఎంత పుణ్యము చేసి ఉండాలి?" ఇట్లు ఆలోచించుచూ తన సుందర చరణముల నఖములచే నేలను రాచుచుండెను. ఆమె నేత్రములనుండి నీరు ప్రవహించుచుండెను. ఆమె స్థితిని చూచి కౌసల్యాదేవి పలికెను: "నాయనా! సీత అత్యంత సుకుమారి. రూపసద్గుణరాశి. అత్తమామలకు కుటుంబములోని ఇతర జనులకు ప్రీతిపాత్రమైనది. నాకు అత్యంత ప్రియమైన కోడలు. ఈమెను నా కంటిపాపవలె చూచినాను. అట్టి సుకుమారి అయిన సీత నీవెంట వనమునకు వచ్చుచున్నది. వనములో ఏనుగులు, సింహములు, రాక్షసులు మొదలగు దుష్టప్రాణుల మధ్య ఉండగలదా? నీ వాజ్ఞాపించినచో ఆమె ఇంటిలోనే నాకు తోడుగా ఉండును."

కౌసల్యఅమృతవాక్కులను విని శ్రీరాముడు ప్రియవచనములతో ఆమెను అనునయించెను. తల్లి సమీపమున సీతాదేవితో మాట్లాడుటకు సంకోచించెను. కాని ఆపత్కాలావసరమును గుర్తించి ఇట్లు పలికెను: "ఓ రాజకుమారీ! నా సలహాను జాగ్రత్తగా వినుము. నీవు నా మేలు నీ మేలు కోరేదానివైతే నా మాట విని ఇంటిలోనే ఉండుము. అత్తమామలసేవకన్నా వేరే ధర్మము స్త్రీకి మరొకటి లేదు. మా తల్లిగారు నన్ను జ్ఞప్తికి తెచ్చుకొని దుఃఖించినపుడు నీవు ఆమెను ఓదార్చగలవు. మా తండ్రిగారి ఆజ్ఞను పాలించి త్వరగా తిరిగి రాగలను. నాపైగల ప్రేమవశమున వనమునకు వచ్చినచో అనేక కష్టములు పడవలసి వచ్చును. ఎండ, చలి, వర్షము గాలి – వీటికి ఓర్చుకొనవలెను. మార్గము గడ్డి, ముళ్ళు, రాళ్ళతో నిండియుండును. త్రోవలో దుర్గమ పర్వతములు, గుహలు, లోయలు, నదులు ఉన్నవి. అవి దాటుటకు వీలులేనివి. అక్కడ నేలపై పరుండవలెను. వల్కలములు ధరించవలెను. కందమూలఫలములను భుజించవలెను. అంతేగాక వనములో ఏనుగులు, సింహములు, పులులు, తోడేళ్ళు,

నరమాంసభక్షకులైన రాక్షసులు సంచరించెదరు. ఆ ఘనారణ్యములను తలుచుకుంటే ఎంతటి ధైర్యస్థులయిననూ భయపడెదరు. సహజముగా భయస్థురాలైన నీవు వనవాస జీవితమును గడపలేవు. కావున నా సలహాను విని ఇంటి వద్దనే ఉండుము." తన ప్రియతముడైన శ్రీరాముని వచనములు విని సీతాదేవి సుందరనేత్రములు నీటితో నిండిపోయెను. సంతప్త హృదయయై, అశ్రుధారలను బలవంతముగా ఆపుకొని, ధైర్యమును కూడగట్టుకొని అత్తగారి పాదములను పట్టుకొని పలికెను: "అమ్మా! నన్ను క్షమింపుడు. నాకేది పరమహితమో అట్టి సలహానే నా పతి ఇచ్చినారు. కాని నా మనస్సులో విచారించగా పతివియోగంకన్నా ప్రపంచములో స్త్రీకి మరొక దుఃఖము లేదు అని తోచింది." మరల శ్రీరాముడి వైపు తిరిగి జానకి ఇట్లు పలికెను: "ఓ ప్రాణపతీ, దయాసాగరా! మీరు లేని దేవలోకము కూడా నాకు నరకముతో సమానము. తల్లిదండ్రులు, సోదరులు, బంధువులు, స్నేహితులు, సేవకులు, కుమారులు కూడా ఎంత సజ్జనులు, సుశీలురు అయిననూ భర్తలేనిచో సూర్యునికంటే ఎక్కువ బాధించువారే. శరీరము, ధనము, గృహము, రాజ్యము – ఇవన్నియూ భర్తలేనిచో స్త్రీకి శోకకారణములే. భోగము రోగముతో సమానము అగును. ఆభరణములు బరువు అగును. సంసారము యమయాతన అగును. మీరు లేకుండా ప్రపంచములో నాకు ఏదియూ సుఖమును ఇవ్వదు. మీతో పాటు ఉండుటవలన పశుపక్ష్యాదులే నా కుటుంబము, వనమే మహానగరము, వల్కలములే నిర్మల వస్త్రములు, పర్ణశాలయే స్వర్గధామమగును. వనదేవతలే నన్ను అత్తమామలవలె రక్షించెదరు. కందమూలఫలములే అమృతసమమైన భోజనము అగును. ప్రతిక్షణము పతిదేవుని చరణకమలములను చూచి ఆనందించెదను. వనములో మీరు తెలిపిన కష్టములు ఏవియు భర్తృవియోగ దుఃఖముతో సమానముకాదు. మీరు లేకుండా పదునాలుగు సంవత్సరములు నేను జీవించగలనని తలచినట్లయితే నన్ను ఇచటనే వదలిపొండు. మీ కోమలమయిన

మూర్తిని చూచినపుడు వేడిగాలులు కూడా నన్ను ఏమియు చేయలేవు. నా స్వామి దగ్గర ఉండగా  నావైపు కన్నెత్తి చూచేవారు ఎవరు? నేను సుకుమారినైతే నా నాథుడు వనవాసమునకు యోగ్యుడా? నన్ను  విషయభోగములను అనుభవించమని మీరు వనములో తపస్సు చేయుట తగునా?"ఆ విధముగా పలికి సీతాదేవి  వ్యాకులచిత్త ఆయెను. శారీరక వియోగము కంటె ముందు వియోగము అను మాటనే సహింపరానిదయ్యెను.

ఆమె స్థితిని చూచిన రఘునాథుడు ఆమెను ఇంటిలో ఉంచినచో ఆమె మరణము తథ్యము అని తలచి, "చింతించకుము, నాతో పాటు రమ్ము. త్వరగా వనగమనముకు సిద్ధముకమ్ము," అని పలికి సీతాదేవిని  ఓదార్చెను.  మరల తల్లికి పాదాభివందనము చేసి ఆమె ఆశీర్వాదమును పొందెను.  తల్లి వచించెను: "కుమారా! వెంటనే పోయి నీ ప్రజల దుఃఖమును దూరము చేయుము. ఈ క్రూరాత్మురాలైన తల్లిని మరచిపోవద్దు. ఓ  విధాతా! నా అదృష్టము తిరిగి వచ్చునా? ఈ మనోహరమైన జంటను తిరిగి నా కన్నులతో చూడగలనా?" అని అనేక  విధముల వగచుచున్న తల్లిని శ్రీరాముడు ఊరడించెను. జానకి అత్తగారి పాదములకు నమస్కరించి "అమ్మా! నేను అదృష్టహీనను. మీకు సేవచేయాల్సిన సమయమున విధాత నాకు వనవాసమును విధించెను. మీరు మీ  దుఃఖమును త్యజించండి. కాని నా పై ప్రేమను మరచిపోకండి." సీతాదేవి వచనములు విని కౌసల్య ఆమెను తన  హృదయమునకు హత్తుకొని "గంగాయమునా నదులలో జలధారయున్నంతవరకు నీ సౌభాగ్యము ఉండును" అని ఆశీర్వదించెను. సీతారాములు కౌసల్యాదేవికి మరలమరల పాదాభివందనము చేసి సెలవు తీసుకొని  పోయిరి.

## 7. లక్ష్మణుని ప్రార్థన

లక్ష్మణునికి ఈ వార్త తెలియగానే వ్యాకులమనస్కుడై శ్రీరాముని వద్దకు పరుగెత్తి విచారవదనముతో, సజలనయనములతో అతని చరణములను పట్టుకొనెను. విచారగ్రస్తుడై చేతులు కట్టుకొని నిలిచియున్న లక్ష్మణుని చూచి స్నేహశీలుడైన శ్రీరాముడు యిట్లు పలికెను: "నాయనా, నీవు ప్రేమవశమున అధైర్యపడవలదు. చివరకు ఆనందము శుభమే యగును. ఎవడైతే తల్లిదండ్రుల, గురు, ప్రభువుల ఉపదేశము శిరసావహించునో వాని జన్మమే సార్థకము. దీనిని మనసులో నుంచుకొని నా సలహానువిని తల్లిదండ్రులకు సేవచేయుము. భరతశత్రుఘ్నులు కూడా ఇంటలేరు. మహారాజుగారు వృద్ధులు. నా వనవాస విషయమున చాలా దుఃఖించుచున్నారు. నీవు నాతో వనమునకు వచ్చినచో గురువుగారు, తల్లిదండ్రులు, ప్రజలు, పరివారము అందరూ దుర్భరమైన దుఃఖమును పొందెదరు. కావున నీవు ఇచ్చటనే వుండి అందరినీ ఓదార్చి సంతుష్టులుగా చేయుము." శ్రీరాముని శీతలవచనములకు లక్ష్మణుడు వాడిపోయెను. శ్రీరామచరణముల నిడుకొని పల్కెను: "ప్రభూ! నేను సేవకుడను. మీరు నా ప్రభువులు. కావున మీరు నన్ను త్యజించిననూ నేనేమి చేయగలను? మీరు నాకు మంచి ఉపదేశమునే యిచ్చితిరి. కాని బలహీనహృదయుడనగుట వలన నేను దానిని స్వీకరింపజాలను. నేను మీ ప్రేమతో పెరిగిన బాలుడను. మిమ్ములను తప్ప తల్లి, తండ్రి, గురువు ఎవ్వరినీ ఎరుగను. మనోవాక్కర్మలచే మీ చరణములందు అనురక్తుడనయిన నేను త్యజించుటకు యోగ్యుడనా?" కరుణాసింధువు శ్రీరామచంద్రుడు తన సోదరుని వినయపూర్వక వచనములను విని హృదయమునకు హత్తుకొని ఓదార్చుచూ, "నీవు పోయి తల్లిగారి అనుజ్ఞను తీసుకొని రమ్ము, త్వరగా వనమునకు పోవుదము" అనెను. రఘునాథుని

పల్కులు విని లక్ష్మణుడు గుడ్డివానికి కన్నులు వచ్చినంత ఆనందముతో తల్లి సుమిత్ర వద్దకు పోయి ఆమె పాదములకు నమస్కరించెను.

విచార మనస్కుడైన లక్ష్మణుని చూసి కారణము అడుగగా సవిస్తరముగా కథనంతయూ తెలిపెను. ఆ కఠోరవార్తను విని సుమిత్ర భయకంపిత అయ్యెను. శ్రీరామచంద్రుని, సీతాదేవి రూపమును, వారి సౌశీల్యస్వభావమును, రాజుకు వారిపైగల అనురాగమును తలచుకొని తలబాదుకొనుచూ "కైకేయి చాలా దుష్టకార్యము చేసినది" అనెను. కాని అది శోకింప సమయము కాదని గ్రహించి ధైర్యము వహించి కోమలవాణితో పలికెను: "నాయనా! వైదేహియే నీకు తల్లి. సర్వవిధముల ప్రేమపాత్రుడగు శ్రీరాముడే నీకు తండ్రి. శ్రీరాముడు ఉన్నచోటే అయోధ్య. నిజముగా సీతారాములు వనమునకు పోవుచున్నచో నీకు అయోధ్యలో పనిలేదు. కుమారా! అతనితో పాటు అడవికి పోయి నీ జన్మను సార్థకము చేసికొనుము. నీ చిత్తము సదా శ్రీరాముని చరణములకు స్థానమగుట వలన నీవు భాగ్యశాలివి. నీ తల్లినగుట వలన నేను భాగ్యశాలిని. శ్రీసీతారాముల సేవ సంచితపుణ్యఫలము. రాగము, దోషము, ఈర్ష్య, మదము, మోహము-వీటికి స్వప్నములో కూడా వశము కారాదు. అన్ని రకముల వికారములను త్యజించి మనోవాక్కర్మలచే వారిని సేవింపుము. వనములో నీకు సుఖశాంతులు లభించును. పుత్రా! శ్రీరామునికి క్లేశములు రాకుండా నీవు మెలగవలెను. నీవు తోడు ఉండుట వలన సీతారాములు సుఖముగా నుండవలెను." సుమిత్రాదేవి అట్లు ఉపదేశించి లక్ష్మణుని వనమునకు పోవుటకు ఆజ్ఞాపించెను. లక్ష్మణుడు, మాతృపాదములకు మోకరిల్లెను. ఆమె "శ్రీ సీతారాముల చరణములపై నీ విశుద్ధ ప్రగాఢ ప్రేమ నిత్యనూతనముగా ఉండుగాక!" అని దీవించెను.

## 8. వనగమనము

పిదప లక్ష్మణుడు నేరుగా శ్రీరాముని వద్దకు పోయి సీతారాములకు నమస్కరించి వారితోపాటు రాజుగారి భవనమునకు పోయెను. నగరములోని జనులు రెక్కలు తెగిన పక్షులవలె వ్యాకులచిత్తులై తలబాదుకొనుచూ ఇటునటు తిరుగుచూ, రాజద్వారమున గుమిగూడియుండిరి. "శ్రీరామచంద్రుడు వచ్చినారు" అని పల్కుచూ మంత్రి రాజుగారిని లేపి కూర్చుండబెట్టెను. సీతా సహితులై సోదరులిద్దరు వనవాసమునకు సిద్ధమగుట చూచి రాజు మిక్కిలి వ్యాకులుడు ఆయెను. ఏమియు మాట్లాడలేకపోయెను. శ్రీరాముడు తండ్రిగారి పాదములకు నమస్కరించి "నన్నాశీర్వదించి వనమునకు పోవుటకు ఆజ్ఞ యివ్వండి. హర్షించవలసిన సమయమున మీరేల దుఃఖించెదరు? ప్రేమవశమున కర్తవ్యమును నెరవేర్చకున్న ప్రపంచములో మీ కీర్తి నష్టమగును. మీరు నిందలపాలగుదురు" అనెను. అది విని మహారాజు ప్రేమతో లేచి రఘునాథుని కూర్చోబెట్టి పలికెను: "నాయనా! వినుము, నీవు చరాచరములకు ప్రభువని మునులు తెలిపెదరు. శుభాశుభకర్మలను విచారించి భగవంతుడు వాటి ఫలితములను ఇచ్చును. ఎవ్వడు ఎట్టి కర్మలు చేస్తే వానికి అట్టి ఫలితమే లభించును. ఇదియే సర్వసమ్మతమైన వేదనీతి. కాని ఈ సమయమున అపరాధము ఒకరిదైతే ఫలితము మరొకరు అనుభవించుచున్నారు. భగవంతుని లీలలు విచిత్రమైనవి." దశరథుడు శ్రీరాముని నిల్పుటకు అనేక ప్రయత్నములు చేసెను. కాని ధర్మనిరతుడు, ధీరుడు, బుద్ధిమంతుడు, శ్రీరాముడు తన పట్టుదల మానడని తెలిసి సీతాదేవిని దగ్గరకు తీసుకొని ఆమెకు అనేక విధములనుపదేశించెను. వనవాస క్లేశములను గూర్చి, అత్తమామలవద్ద లేక తండ్రిగారి వద్ద నుండి వారికి సేవలు చేయుటలో గల సుఖమును గూర్చి తెలిపెను. ఇతరులు కూడా వనవాస దుఃఖములను అతిశయోక్తులతో తెలిపిరి. కానీ సీతాదేవి

మనసు శ్రీరామచంద్రుని పాదములపైనే యుండెను. వారి కోమల వచనములు ఆమెకు వినసొంపుగా లేవు. సంకోచవశమున ఏమియూ పలుకలేదు.

ఇదంతయూ చూచి కైకేయి క్రోధముతో మునులు ధరించు వస్త్రములు, ఆభరణములు, పాత్రలు తెచ్చి శ్రీరాముని ముందుంచి పలికెను: "రఘురామా! నీవు రాజుగారికి ప్రాణసమానుడవు. ఇక్కడ గుమిగూడిన జనులు స్నేహశీలములు నటించుచున్నారు. రాజుగారి యశమును పుణ్యమును నష్టపరచెదరు. నిన్ను వనమునకు పోనివ్వరు. దీనిని ఆలోచించి నీకు ఏది మంచిదని తోచునో దానిని చేయుము." కైకేయి మాత ఉపదేశమును విని శ్రీరాముడు సంతసించెను. రాజునకు ఆ వచనములు బాణములవలె బాధించెను. అతడు మూర్ఛితుడు ఆయెను. ప్రజలు వికలురైరి. ఏమిచేయాలో వారికి తోచలేదు. శ్రీరాముడు వెంటనే ముని వేషమును దాల్చి తల్లిదండ్రులకు నమస్కరించి సీతాలక్ష్మణులతో సహా వశిష్ఠుని ఇంటికి పోయెను. గుమిగూడిన ప్రజలందరూ బాధపడుటను చూచి రఘురాముడు వారిని ఓదార్చి బ్రాహ్మణులందరికీ ఒక సంవత్సరమునకగు భోజన సామాగ్రిని ఇవ్వవలసినదని వశిష్ఠుని ప్రార్థించెను. యాచకులను దాన సన్మానములతో, మిత్రులను ప్రేమతో సంతసింపచేసెను. తన దాసదాసీలను పిలిచి గురువునకు అప్పగించి చేతులు జోడించి, "వీరిని మీరు తల్లిదండ్రులవలె రక్షింపుడు" అని ప్రార్థించెను. పురజనులతో "నా తల్లిదండ్రులకు నా వియోగబాధ తెలియకుండా చేయండి" అని ప్రార్థించెను. గురువుగారి పాదములకు ప్రణమిల్లి గణేశుని, గౌరీదేవిని, పరమేశ్వరుని ధ్యానించి వారి ఆశీర్వాదములతో బయలు దేరెను. అయోధ్యానగరము విషాదముతో ఆర్తనాదములతో నిండిపోయెను. దేవలోకము హర్షశోకసమ్మిళితమాయెను. లంకలో అపశకునములు పొడచూపెను.

మూర్ఛనుండి మేలుకొనిన రాజు సుమంత్రుని పిలిచి ఇట్లు పలికెను: "శ్రీరాముడు వనమునకు పోయిననూ నా ప్రాణములు పోకున్నవి. ఏ సుఖము కొరకు ఈ శరీరమున నిలిచియున్నవో తెలియుటలేదు. ఇంతకన్నా ఎక్కువ వ్యధ ఏముండును? మిత్రుడా! నీవు రథమును తీసుకొని రామునితో పొమ్ము. రాజకుమారులిద్దరూ, జానకీదేవి చాలా సుకుమారులు. వారిని రథమునందు ఎక్కించుకొని వనమును చూపి నాలుగు దినములకు తిరిగి రమ్ము. రఘునాథుడు సత్యవ్రతుడు కావున సోదరులిద్దరూ తిరిగిరామని చెప్పినా, దయచేసి జానకిదేవినైనను తిరిగి పంపమని ప్రార్థించుము. సీతాదేవి అడవిని చూచి భయపడినప్పుడు ఏ ఉపాయము చేతనైనను ఆమెను పిలుచుకొని రమ్ము. ఆమె కూడా రానిచో నేను మరణించుట తథ్యము" అని పలికి రాజు మూర్ఛితుడు అయెను. రాజాజ్ఞను పొందిన సుమంత్రుడు రథమును సిద్ధము చేసి సీతారామలక్ష్మణులను రథారూఢులుగా చేసెను. వారు రథమును అధిరోహించి అయోధ్యకు నమస్కరించి ముందుకు సాగిరి. వ్యాకులురయిన ప్రజలు వారి వెంట పరుగెత్తిరి. శ్రీరాముడు వారికి అనేక విధముల తిరిగి పొమ్మని నచ్చచెప్పిననూ వారు తిరిగి పోలేదు.

"శ్రీరామచంద్రుడు లేని అయోధ్యతో మాకేమి పని?" అని ప్రజలందరూ వారిని అనుసరించిరి. ఆ రాత్రికి వారు తమసానది తీరమును చేరిరి. కరుణామయుడైన శ్రీరాముడు మధుర వచనములతో వారిని అనేక విధముల నచ్చచెప్పిననూ వారి తిరిగి పోవుటకు అంగీకరించలేదు. శ్రీరాముడు ధర్మసంకటములో పడిపోయెను. వారు నిద్రావశులైన పిదప రాత్రి రెండు జాముల వేళ శ్రీరాముడు మంత్రిని మేలుకొలిపి "మిత్రమా! రథమును ఇచ్చటినుండియే చక్రముల జాడలు కూడా తెలియకుండా ఇటు నటు త్రిప్పుచూ మళ్ళించుకొని పొండు. జనులు చూచిన రథము ఏ దిశకు పోయినది తెలుసుకొనలేరు. వేరే ఉపాయము లేదు" అని పల్కెను. సీతారామలక్ష్మణులు రథమును

ఎక్కిరి. మంత్రి వెంటనే రథమును త్రిప్పుచూ జాడలు తెలియకుండా చేసెను.

## 9. గుహునితో సమాగమము

తెల్లవారగానే జనులు మేల్కొని సీతారామలక్ష్మణులు వెళ్ళిపోయినారని తెలుసుకొని మిగుల దుఃఖించిరి. చివరకు అయోధ్యకు తిరిగి వచ్చిరి. శ్రీరాముని పునరాగమునకై స్త్రీ, పురుషులందరూ వ్రతనియమములు పాటించిరి.

సీతాదేవితోను, మంత్రితోను, సోదరులిద్దరూ శృంగవీరపురమును చేరిరి. అచ్చట గంగానదిని చూచి రథమునుండి దిగి గంగాదేవికి దండ ప్రణామములు ఆచరించి, నదిలో స్నానము చేసిరి. వారి బడలిక మాయమాయెను. పవిత్ర జలపానముచే మనస్సు ప్రసన్నమాయెను. సత్త్వరజస్తమోగుణములకు అతీతుడై, సచ్చిదానంద స్వరూపుడైన శ్రీరామచంద్రుడు సామాన్య మానవుని వలె ప్రవర్తించెను. నిషాద రాజైన గుహునికి ఈ సమాచారము తెలియగానే సంతోషముతో తన మిత్రులను, బంధువులను పిలిచి కందమూలఫలములను కావళ్ళకు ఎత్తుకొని అపారహర్షముతో వచ్చి కానుకలను ముందర నుంచి, ప్రణామములు ఆచరించెను. శ్రీరామచంద్రుడు అతని స్వాభావిక ప్రేమకు వశుడై దగ్గరకు పిలిచి కుశలమడిగెను. నిషాదరాజు పలికెను: "ప్రభూ! మీ చరణకమలముల దర్శనమే మాకు సర్వసుఖములకు మూలము. నేను భాగ్యవంతుడను. ఈ నేల, సంపద, గృహములు అన్నియూ మీవే. నేను నా పరివారము మీ సేవకులము. దయచేసి మా నగరమునకు విచ్చేసి ఈ దాసుని కీర్తిని ఎక్కువ చేయుడు." శ్రీరామచంద్రుడు ఇట్లు పలికెను: "ప్రియ మిత్రమా! నీవు లెస్స పలికితివి, కాని తండ్రిగారు నాకు వేరే ఆజ్ఞను ఇచ్చినారు. పదునాలుగు సంవత్సరాలు నేను మునివేషధారినై మునుల

ఆహారమును భుజించుచూ వనములో నివసించవలెను. గ్రామములో ఉండుట నాకు ఉచితము కాదు." ఆ మాటలను విని నిషాదరాజు దుఃఖితుడాయెను. సీతారామలక్ష్మణుల సౌందర్యమును చూచి ఆ గ్రామ ప్రజలు ఇట్లు చర్చించిరి: "ఇట్టి సుకుమారులైన బాలకులను అడవికి పంపిన ఆ తల్లిదండ్రులు ఎట్టివారు?" అని కొందరు అనగా మరికొందరు "రాజు మంచిపనే చేసినాడు. ఈ నెపమున మనకు నేత్రానందము కలిగినది" అనిరి. వారు బసచేయుటకు నిషాద రాజు ఓ చక్కని శింశుపావృక్షపు నీడన ఏర్పాటుచేసెను. శ్రీరాముడు దానిని మెచ్చుకొనెను. నగర ప్రజలు వారికి వందనము లాచరించి వెళ్ళిపోయిరి. శ్రీరాముడు సాయంసంధ్యను నిర్వర్తించుటకు పోయెను. గుహుడు మెత్తని ఆకులతో గడ్డితో పరుపును సిద్ధపరిచి, స్వయముగా తీసుకొని వచ్చి పరిచెను. మధురఫలములను తీసుకొని వచ్చెను. శ్రీసీతారామలక్ష్మణులు, సుమంత్రుడు కందమూలఫలము లను భుజించిన పిమ్మట రఘుకులమణి నిద్రించెను. లక్ష్మణుడు ఆయన పాదములు ఒత్తెను. ప్రభువు నిద్రించగానే లక్ష్మణుడు సుమంత్రుని కూడా నిద్రించమని చెప్పి తాను కొద్ది దూరమున ధనుర్బాణములను గైకొని వీరాసనమున కూర్చొని మేలుకొని వుండెను. గుహుడు విశ్వాసపాత్రులైన కాపలాదారులను వేర్వేరు స్థలములలో నియమించి తాను స్వయముగా అంబులపొదితో, ధనుర్బాణములతో లక్ష్మణుని ప్రక్కన కూర్చొనెను. ప్రభువును చూచి నిషాదుడు మిగుల దుఃఖించెను. కన్నులలో నీరు తిరిగెను. లక్ష్మణునితో ప్రేమపూరిత వచనములు పలికెను: "ఇంద్రభవనము వంటి దశరథమహారాజు సుందరభవనములో హంసతూలికాతల్పముపై పవళించు సీతారాములు నేడు ఈ గడ్డిఆకులు పరిచిన చాపపై పరుండవలసి వచ్చెకదా! విధి బలీయమైనది. నీచబుద్ధిగల కైకేయి కుటిలత్వము వలన సీతారాములు సుఖించవలసిన సమయములో దుఃఖముల పాలైనారు, ఆమె దుర్బుద్ధి ప్రపంచమునే దుఃఖములో ముంచినది." అప్పుడు లక్ష్మణుడు జ్ఞాన,

భక్తి, వైరాగ్యములతో కూడిన కోమల, మధురవచనములతో యిట్లనెను: "సోదరా! ఎవ్వరు కూడా ఇతరులకు సుఖముగాని, దుఃఖముకాని ఇచ్చుటకు కారణము కాదు. ప్రతి ఒక్కరు తాము చేసిన కర్మఫలమును అనుభవించెదరు. సంయోగ వియోగములు, సుఖదుఃఖానుభవములు శత్రుమిత్రోదాసీనులు – ఇవన్నియూ భ్రమలు: జనన మరణములు, సంపద, ఆపదలు, నగరము, పరివారము ఇవన్నియూ అజ్ఞానజనితమైన సంసారబంధములు. ఏ విధముగా ఒక రాజు స్వప్నములో బిచ్చగాడు అయిననూ లేదా, దరిద్రుడు ఇంద్రపదవిని పొందిననూ మేల్కొనిన పిదప వారికి నష్టముకాని, లాభముకాని రాదో, అట్లే దృశ్యప్రపంచమును మనము గ్రహించవలెను. ఎవడైతే ఈ సంసారమునందు భోగవిలాస వస్తువులనుండి విరక్తుడు అగునో వాడే నిజముగా మేల్కొన్నవాడని గ్రహించవలెను. వివేకవంతునికి మోహము, భ్రమలు దూరమగును. అతడు శ్రీరఘునాథుని చరణములనే ప్రేమించును. ఇట్లు ఆలోచించి ఎవ్వరిని కోపగించుటకాని, దోషారోపణచేయుటకాని తగదు. మిత్రమా! దీనిని గ్రహించి మోహమును వదలి శ్రీరామచంద్రుని చరణములను ప్రేమించుము." అట్లు సంభాషించుచుండగానే తెల్లవారెను.

జగత్కల్యాణకారుడు, సుఖప్రదుడైన శ్రీరాముడు ప్రాతఃకాల విధులను నిర్వర్తించిన పిమ్మట మర్రిపాలు తెప్పించి తాను తన తమ్ముడు తలపై జటాజూటములు చుట్టిరి. ఆ దృశ్యమును చూచిన సుమంత్రుని కంట నీరు నిండెను. హృదయము పరితపించెను. విషాదవదనముతో చేతులు జోడించి యిట్లనెను: "నా ప్రభువైన కోసలరాజు దశరథుడు నన్ను ఇట్లాజ్ఞాపించెను: రథమును తీసుకొని శ్రీరామునితో అడవివరకు తోడుగా పోయి గంగానదిలో స్నానము చేసిన పిమ్మట సోదరులిద్దరనీ తీసుకొని రమ్ము. ప్రభూ! ఇది మహారాజుగారి ఆజ్ఞ. కాని మీరెట్లు చెప్పిన అట్లు చేయగలను." అనుచూ శ్రీరామచంద్రుని పాదములపై బడి "నాయనా! దయచేసి

అయోధ్యను అనాథగా చేయవద్దు" అని బాలునివలె ఏడవసాగెను. శ్రీరాముడు మంత్రిని లేవనెత్తి యిట్లు నచ్చచెప్పెను: "మిత్రమా! మీరు అన్ని ధర్మములను తెలిసినవారు. శిబి, దధీచి,హరిశ్చంద్రుడు, బలిచక్రవర్తి మొదలగువారు అనేక కష్టములను ఓర్చి ధర్మమును పాలించిరి. సత్యముతో సమానమైన ధర్మము ఏదియు లేదని వేదశాస్త్రపురాణములు ఘోషించుచున్నవి. నేను అదే ధర్మమును పాలించుచున్నాను. దానిని త్యాగము చేయుటచే ముల్లోకములలో నేను అపకీర్తి పాలయ్యెదను. ఒక ప్రతిష్ఠిత పురుషునికి అపకీర్తి కోటి మృత్యువులతో సమానము. మిత్రమా! నేను మీకు ఎక్కువగా చెప్పవలసినది ఏమున్నది? మీరు తిరిగి వెళ్ళి తండ్రిగారి పాదములకు ప్రణమిల్లి నన్ను గూర్చి చింతించవలదని విజ్ఞప్తి చేయండి. మీరు కూడా మా తండ్రిగారి వలె నా హితమును కోరువారు. మా తండ్రిగారు మమ్ములను గూర్చి విచారించుచూ దుఃఖించకుండా చూడవలసినదని నేను ప్రార్థించుచున్నాను." శ్రీరామచంద్రునికి సుమంత్రునికి జరిగిన ఆ సంభాషణను విని నిషాదరాజు, అతని కుటుంబీకులు మిక్కిలి వ్యాకులతను పొందిరి.

పిమ్మట సుమంత్రుడు సీతాదేవి వనవాస క్లేశాలను తట్టుకోజాలదని రాజుగారి సందేశమును వినిపించెను. ఆమె తండ్రిగారి యింటిలో నయినను లేక అయోధ్యలో నయినను ఉండవచ్చును అని పలికెను. శ్రీరాముడు తండ్రిగారి సందేశమును విని సీతాదేవికి అనేక విధముల నచ్చచెప్పెను. "నీవు అయోధ్యకు తిరిగి పోయినచో అత్తమామలు, గురువు, ప్రియజనులు, కుటుంబసభ్యులు అందరి దుఃఖము మాసిపోవును." పతిదేవుని వచనములు విని జానకీ దేవి ఇట్లు పలికెను: "నాథా! మీరు కరుణామయులు, పరమజ్ఞానులు. శరీరమును వదలి దాని ఛాయ వేరుగా నుండునా? సూర్యుని వదలి సూర్యకాంతి, చంద్రుని వదలి వెన్నెల వేరుగా నుండునా?"

తిరిగి సుమంత్రునితో యిట్లనెను: "మీరు నా హితమునుకోరువారు. మీకు సమాధానము చెప్పుట నాకు అనుచితము. మీరు అన్యథా భావించవద్దు. ఎంత ఐశ్వర్యము, వైభవము ఉన్నప్పటికీ నాకు అయోధ్యకానీ, జనకపురముకానీ ఆనందమును యివ్వజాలదు. ఈ అడవి, కొండలు, నదీతటాకములు, క్రూరమృగములు, పక్షులు–ఇవన్నియూ నా ప్రాణేశ్వరుని దగ్గర సుఖమును ఇచ్చునవియే. ధనుర్బాణములు ధరించిన నా పతిదేవుడు, నా మరిది నాకు తోడు ఉన్నారు. కావున నన్ను గూర్చి విచారించవలదని నా అత్తమామలకు విజ్ఞప్తి చేయండి." సీతాదేవి పలుకులు విన్న సుమంత్రుడు వికలమనస్కుడై మాట్లాడలేకపోయెను. శ్రీరాముడు అతని నెంతయో ఓదార్చెను. శ్రీరాముని ఆజ్ఞ అనుల్లంఘ్యము, కర్మగతి అనివార్యము అని భావించి శ్రీ సీతారామలక్ష్మణులకు ప్రణమిల్లి వెనుకకు మరలెను. సుమంత్రుడు రథమును సమీపించగానే గుఱ్ఱములు శ్రీరామునివైపు చూచి సకిలించ సాగెను. ఇది చూచి నిషాదజనులు దుఃఖించసాగిరి. ఎవరి వియోగమును సహించలేక పశువులు కూడా వ్యాకులత నొందినవో, అట్టివారి వియోగమును ప్రజలు, తల్లిదండ్రులు ఎట్లు సహించి జీవించగలరు?

## 10. గంగానదిని దాటుట

శ్రీరామచంద్రుడు సుమంత్రుని బలవంతముగా తిరిగి పంపిన పిదప గంగానదీ తీరమును చేరి గంగను దాటుటకు నావికుని అడిగెను. అతడు పడవను తేలేదు సరికదా, ఇట్లు పలికెను: "నాకు మీ రహస్యము తెలియును. మీ చరణకమలముల ధూళి తాకుట వలన రాయికూడా అందమైన స్త్రీగా మారినది. నా నావ కూడా ఋషిపత్నియైనచో నా జీవికను నష్టపోవుదును. ప్రభూ! నిజముగా మీరు గంగానదిని దాటదలచినచో మొదట మీ చరణములను కడిగిన తర్వాతనే మిమ్ములను నది దాటించగలను." పడవవాని మాటలు

వినసొంపుగా లేకున్ననూ, ప్రేమపూరితమైనవగుటవలన దయానిధి అయిన శ్రీరామచంద్రుడు ఆ మాటలు విని జానకీదేవి, లక్ష్మణుని వైపు చూచి నవ్వి పడవవానితో యిట్లు పలికెను: "నీ నావను రక్షించుకొను చర్యనే చేయుము. త్వరగా నీళ్ళు తెచ్చి కాళ్లు కడుగుము. ఆలస్యమగుచున్నది. మమ్ము నదిని దాటించుము." ఎవని నామస్మరణచేతనే మనుష్యుడు అపారభవసాగరమును దాటునో అట్టి కృపాళువు, శ్రీరామచంద్రుడు నదిని దాటుటకు ఒక పడవవానిని ప్రార్థించుచున్నాడు! నావికుడు ఒక చెక్కగిన్నెలో నీరు తెచ్చి శ్రీరామచంద్రుని చరణములను కడిగి ఆ పాదోదకమును తన పరివారముతో సహా త్రాగి గంగానదిని దాటించెను. నిషాదరాజైన గుహుడు, లక్ష్మణుడు, సీతారాములు పడవను దిగి గంగాతీరమున నిల్చిరి. నావికుడు కూడా పడవదిగి శ్రీరామునికి నమస్కరించెను. నావికునికి ఏదైనా బహుమతిని ఇవ్వాలని శ్రీరాముడు తలచెను. తన భర్తమనస్సులోని మాటను తెలుసుకొన్న సీతాదేవి తన రత్నఖచితమైన ఉంగరమును తీసెను. శ్రీరామచంద్రుడు నావికునితో ఈ బాడుగను తీసుకొమ్మని అడుగగా అతడు ప్రభు పాదములు పట్టుకొని పలికెను: "ప్రభూ! ఈ రోజు నా పాపములు, దుఃఖము, దారిద్ర్యము అన్నియు శాంతించినవి. మీ అనుగ్రహము తప్ప నాకు ఏమియు అక్కర్లేదు. మీరు తిరిగివచ్చునప్పుడు ఏమిచ్చిననూ నేను ఆ ప్రసాదమును స్వీకరించెదను." శ్రీరామచంద్రుడు, సీతాదేవి, లక్ష్మణుడు కూడా చాలా బలవంతము చేసినను నావికుడు ఏమియూ గ్రహించలేదు. కరుణానిధి అయిన శ్రీరాముడు అతనికి నిర్మల భక్తిని వరదానముగా అనుగ్రహించి వీడ్కోలు చెప్పెను.

పిదప రఘునాథుడు స్నానమును ఆచరించి, పార్థివ పూజ యొనరించి శివునికి ప్రణామములు ఆచరించెను. సీతాదేవి గంగాదేవిని పూజించి చేతులు జోడించి "మాతా! నా మనోరథమును పూర్తి

చేయుము. మరల నా పతిదేవునితో, మరదితో తిరిగివచ్చి నీ పూజ చేసెదను." అని ప్రార్థించెను. నిర్మల గంగా జలములనుండి ఒక దివ్యవాణి వినిపించెను. "సీతా! నీ ప్రభావము జగద్విదితము, నీ కృపాదృష్టి పడిన జనులకు సర్వసిద్ధులు లభించును. వినయముతో నన్ను ప్రార్థించి నాకు గొప్పతనము తెచ్చినావు. నీవు నీ ప్రియ భర్తతో, నీ మరదితో క్షేమముగా అయోధ్యకు తిరిగి రాగలవు. నీ మనోరథములన్నియూ నెరవేరును. నీ కీర్తి ప్రపంచమునంతయూ వ్యాపించును. ఇది నా ఆశీర్వాదము"అన్న దేవనది వచనములు విని సీతాదేవి మిగుల సంతోషించెను.

పిమ్మట శ్రీరామచంద్రుడు గుహుని తిరిగి పొమ్మని చెప్పెను. ఇది వినగానే గుహుని ముఖము పాలిపోయెను. హృదయము పరితాపము నొందెను. దీనముగా వేడుకొనెను: "ఓ రఘుకులశిరోమణీ! నాదొక విన్నపము. నేను మీతో పాటుండి మీకు మార్గములు చూపుచూ, కొన్నిరోజులు మీ చరణకమలముల సేవ చేసెదను. మీరు ఏ వనములో నున్ననూ ఆకులతో కుటీరమును నిర్మించెదను. పిదప మీరు ఎట్లు అజ్ఞాపించిన అట్లు చేసెదను." శ్రీరాముడు అతని స్నేహమును చూచి తనతో తీసికొనెను. గుహుని హృదయమానందముతో నిండెను. అతడు తన జాతి జనులందరినీ పిలిచి వెనుకకు పంపెను. పిదప గణపతిని, శివుని స్మరించి గంగాదేవికి నమస్కరించి శ్రీరామచంద్రప్రభువు గుహునితో, సీతాలక్ష్మణులతో వనములకు బయలుదేరెను.

## 11. భరద్వాజ దర్శనము

ఆ రోజు ప్రభువు ఒక చెట్టు క్రింద నివాసము చేసి, ప్రాతఃకాలమున బయలుదేరి తీర్థరాజమైన ప్రయాగను చేరెను. అతి పుణ్యప్రదమైన ప్రయాగను దర్శించి రఘువీరుడు ఆనందముతో దాని మహిమను సీతాదేవికి లక్ష్మణునికి గుహునికి వినిపించెను.

సకల శుభములను ఒసంగెడి త్రివేణీ సంగమమును దర్శించి, అందు స్నానమాడి సాదరముగా శివుని, తీర్థదేవతలను ఆరాధించెను. పిదప శ్రీరామచంద్రుడు భరద్వాజముని వద్దకు పోయి దండప్రణామములు ఆచరించెను. భరధ్వాజముని శ్రీరాముని ఆశీర్వదించి ఆలింగనము చేసుకొనెను. కుశలసమాచారమును అడిగిన పిమ్మట, ముని శ్రీరామునికి ఉచితాసనమును ఇచ్చి, ప్రేమపూర్వకముగా పూజించి, సంతుష్టుని చేసెను. రుచికరములైన కందమూలఫలములను సమర్పించెను. సీతాలక్ష్మణులతోను గుహునితోను కూడి ప్రభువు వాటిని ఇష్టముతో భుజించెను. బడలిక తీరి ప్రశాంతచిత్తుడాయెను. భరద్వాజుడు "రామా! మీ దర్శనముతో నేడు నా తపస్సు, తీర్థసేవనము, జపము, యోగము అన్నియూ సఫలమైనవి. నా మనోవాంఛలన్నియూ నెరవేరినవి. మీ చరణములందే నిరంతరము, స్వాభావిక భక్తి కలుగునట్లు వరమును అనుగ్రహింపుడు," అని ప్రార్థించెను. మునీశ్వరుని భక్తికి సంతోషించి రఘువీరుడు అతని యశమును పొగడి, "మునీశ్వరా! మీరు ఆదరించినవాడే గొప్పవాడు, గుణాఢ్యుడు" అని పల్కెను. శ్రీరాముని ఆగమనవార్తను వినిన బ్రహ్మచారులు, మునులు సిద్ధులు అందరూ భరద్వాజ ఆశ్రమమునకు వచ్చిరి. శ్రీరామచంద్రుడు వారికి నమస్కరించి నేత్రానందము కలిగించెను. వారు ఆశీర్వదించి వెళ్ళిపోయిరి. శ్రీరాముడు ఆ రాత్రి ముని ఆశ్రమమున విశ్రమించి, ఉదయమున ప్రయాగలో స్నానమాచరించి ముందుకు సాగెను. భరధ్వాజముని వారికి మార్గమును చూపుటకు నలుగురు బ్రహ్మచారులను తోడుగా నిచ్చెను. వారు యమునానది వరకు మార్గమును చూపిరి. శ్రీరామచంద్రుడు ఆ బ్రహ్మచారులను తిరిగి పొమ్మని విజ్ఞప్తి చేసెను వారు తమ మనోవాంఛ నెరవేరినదని సంతసించి తిరిగి పోయిరి.

శ్రీరాముడు, సీతాలక్ష్మణులు, గుహుడు యమునానదిని దాటి, అందు స్నానమాచరించిరి. నదీతీరమున గల ప్రజలు వారి రాకను విని తమ పనులన్నియు వదలి, పరుగెత్తుకొని వచ్చిరి. శ్రీసీతారామ లక్ష్మణుల సౌందర్యమును చూచి తమ భాగ్యమును ప్రశంసించుకొనిరి. అదే సమయమున అక్కడికి ఒక తాపసి వచ్చెను. అతడు తేజస్వి, చూచుటకు అల్పవయస్కుడు మరియు సుందరుడు. బహుశా అతడు కవియై యుండవచ్చును. అతడు విరాగి వేషధారి. కాని మనోవాక్కర్మలచే శ్రీరామచంద్రునిపై అనురాగి. తన యిష్టదైవమును గుర్తించగానే అతని కన్నులలో నీరు నిండెను. ప్రేమావేశమున నేలపై బడి ప్రణామము చేసెను. శ్రీరాముడు పులకితుడై అతనిని ప్రేమపూర్వకముగా ఆలింగనమొనర్చెను. పిదప ఆ తాపసి లక్ష్మణునికి సీతాదేవికి నమస్కరించెను. వారతనిని ఆశీర్వదించిరి. నిషాదుడు ఆ తాపసికి నమస్కరించెను. పిదప శ్రీరామచంద్రుని ఆజ్ఞను శిరసావహించి గుహుడు గృహోన్ముఖుడయ్యెను.

## 12. వాల్మీకి మహర్షి దర్శనము

శ్రీ సీతారామలక్ష్మణులు యమునానదికి నమస్కరించి ముందుకు సాగిరి. త్రోవలో అనేక మంది ప్రయాణీకులు వారితో కలిసిరి. దారిలో నున్న గ్రామ ప్రజలు వారిని చూచి మిక్కిలి సంతసించిరి. కొందరు ప్రేమవశులై వారితో పాటు నడుచుచుండిరి. మరి కొందరు చెట్లక్రింద మెత్తని గడ్డి పరచి "ఇచ్చట విశ్రమించి సేదతీర్చుకొని పొండి" అనిరి. మరికొందరు కడవలో నీళ్ళు తెచ్చి వారి దాహమును తీర్చుచుండిరి. వృద్ధులయిన వారు రామలక్ష్మణులను గుర్తించిరి. ఇతరులు వారిని గురించి ప్రశ్నలు వేయుచుండిరి. స్త్రీలు సీతాదేవిని తరచితరచి అడుగుచుండిరి. అక్కడక్కడ విశ్రమించుచూ సీతారామలక్ష్మణులు ముందుకు సాగిరి. వారు ఏ గ్రామమునకు పోయిననూ అక్కడి

ప్రజలు వారిని చూచి తన్మయులు అగుచుండిరి. వనవాసకథను విన్న జనులు రాజును, రాణిని నిందించుచుండిరి. మరికొందరు, "మాకు నేత్రానందము కలిగించి, రాజు మంచిపనే చేసినాడు" అని పలుకుచుండిరి. ముందు శ్రీరామచంద్రుడు వెనుక లక్ష్మణుడు నడుచుచుండగా మధ్య సీతాదేవి పరమాత్మ జీవాత్మల మధ్య మాయ వలె, రెండు కొదమ సింగముల మధ్య ఆడుసింహమువలె శోభిల్లెను. సుందరవనములు, చెరువులు, పర్వతములు చూచుచూ శ్రీరాముడు వాల్మీకి ఆశ్రమమును చేరెను. అత్యంత శోభాయమానమైన ఆ ఆశ్రమమును చూచి శ్రీరాముడు ప్రసన్నుడాయెను.

రఘునాథుని ఆగమన వార్త విని వాల్మీకి మహర్షి వారిని ఆహ్వానించెను. శ్రీరాముడు మునికి నమస్కరించెను. ముని ఆశీర్వదించి గౌరవముతో తన ఆశ్రమమునకు పిలుచుకొని పోయి, ఉచితాసనమునిచ్చి కందమూలఫలములను సమర్పించెను. శ్రీరాముడు చేతులు జోడించి శ్రవణానందకరముగా పలికెను: "మునీశ్వరా! మీ పాదదర్శనము వలన నా పుణ్యకర్మలు ఫలించినవి. మీ ఆజ్ఞ ప్రకారము, మునులకు తపస్వినులకు ఇబ్బంది కలుగని చోట ఆకులతో, గడ్డితో రమణీయమైన కుటీరమును నిర్మించుకొని అక్కడ సీతాలక్ష్మణులతో నివసించెదను. అట్టి స్థానమును తెలుపండి." రఘునాథుని పల్కులు విని వాల్మీకి యిట్లనెను: "శ్రీరామచంద్రా, మీరు వేదమర్యాదలను రక్షించు జగదీశ్వరులు, దేవతల కార్యసిద్ధికై రాజకుమారులుగా అవతరించి నిశాచరుల నాశనమునకై బయలుదేరినారు. రామా! ఈ జగత్తు ఒక నాటకము. నీవు దీనికి దర్శకుడవు. మీ దేహము పంచభూతాత్మకము కాదు. అది చిదానందమయము. సజ్జనుల, దేవతల కార్యములు నెరవేర్చుటకు మానవ శరీరము ధరించితిరి. నేను ఎక్కడ వుండాలి? అని మీరు నన్ను అడిగితిరి. మీరెక్కడలేరో ఆ చోటు చూపండి, అప్పుడు మీరు ఉండుటకు చోటు చూపెదను."

తన వచనములకు దరహాసవదనుడైన శ్రీరాముని చూచి ముని నవ్వి మరల పలికెను: "రామా! వినుము. మీరు సీతాలక్ష్మణులతో నివసించు స్థానమును తెలిపెదను. ఎవరి చెవులు మీ దివ్యకథలతో సముద్రము నదులతో నిండినట్లు నిండునో, అట్టివారి హృదయములలో నివసించుడు. ఎవరి నేత్రములు చాతకములవలె మీ శరీరము అను మేఘమును దర్శించుటకు యిచ్ఛగించునో అట్టివారి హృదయములు మీ నివాసస్థానములు. మీ నిర్మల యశస్సనెడి మానస సరోవరమునందు మీ సద్గుణములు అనెడి ముత్యములను ఎవడు హంసవలె తన నాలుకతో ఏరునో అట్టివాని హృదయమున నివసించుము. ఎవని నాసికలు మీకర్పించిన పవిత్రమైన సుగంధపుష్పములను ప్రసాదముగా గ్రహించునో, ఎవరు మీకు సమర్పించిన పదార్థములను భుజించెదరో, మీరు అలంకరించిన వస్త్రములను మహాప్రసాదముగా ధరించెదరో, అట్టివారి హృదయములో వసించుడు. ఎవరి మస్తకములు దేవతలు, గురువులు, బ్రాహ్మణులను చూచి వినయముతో ప్రణమిల్లునో, ఎవరి చేతులు సదా మీ పాదములను పూజించునో, ఎవరి పాదములు మీ పవిత్రక్షేత్రములపై నడుచునో, ఎవరి హృదయములలో మీపై విశ్వాసము గాఢముగా నుండునో, అట్టివారి హృదయములలో వసింపుడు. ఎవరి మనస్సులలో కామము, క్రోధము, మదము, అభిమానము, మోహము, లోభము, రాగము, ద్వేషము, కపటము, దంబము, మాయ లేవో అట్టివారి హృయములలో వసింపుడు. ఎవరు అందరికి హితకారులో, సుఖదుఃఖములను, మానావమానములను సమానముగా చూచెదరో, సత్యమునే విచారించి ప్రియముగా పలికెదరో, నిద్రించునప్పుడు, మేల్కొనినప్పుడు కూడా మీకు శరణాగతులగుదురో, ఎవరికి మీరు తప్ప వేరే ఆశ్రయము లేదో, ఎవరైతే పరస్త్రీలను తల్లులవలె, పరధనమును విషమువలె భావించెదరో, అట్టివారి హృదయములలో వసింపుడు. ఇతరుల అభివృద్ధిని చూచి సంతోషించువారు, ఇతరుల కష్టములను చూచి దుఃఖించువారు ఎవరికి మీరు ప్రాణసమానులో,

ఎవరి మనస్సులో స్వామి, మిత్రుడు, తల్లి, తండ్రి, గురువు, సర్వము మీరే అగుదురో అట్టివారి మనస్సనెడి మందిరములో మీరు నివసించుడు. ఎవరైతే ఇతరుల దోషములను గుర్తించక, కేవలము వారి సద్గుణములను స్వీకరిస్తారో, ఎవరు బ్రాహ్మణుల, గోవుల రక్షణకు పాటుపడతారో, ఎవరు మీమీదనే అనన్యభక్తిని గలిగి మీ భక్తులను ప్రేమిస్తారో అట్టి వారి హృదయములలో నివసించుడు. ఎవరైతే తమ బంధువులను, దానధర్మములను, వైభవమును, గృహసంతోషమును వదలి మిమ్మే శరణుజొచ్చి స్వర్గనరకమోక్షములను సమానభావముతో చూచి ప్రతిచోట ధనుర్బాణములు ధరించిన మిమ్ములనే చూచుచూ మనోవాక్కర్మలచే మీకు దాసులగుదురో అట్టి వారి హృదయమే మీకు నివాస స్థానము."

## 13. చిత్రకూట వాసము

ఆ విధముగా పల్కిన పిదప వాల్మీకి వారికి సుఖప్రదమైన చిత్రకూట పర్వతమును తన నివాసస్థానముగా చేసుకొమ్మని పలికెను. "రామచంద్రా! చిత్రకూట పర్వతమున మీకు అన్ని విధముల వసతులు కలవు. ఏనుగులు, సింహములు, జింకలు, పక్షులు తమ సహజ వైరమును మాని, అచ్చట విహరించును. అత్రిమహాముని పత్నియైన అనసూయాదేవి తన తపోబలముచే రప్పించిన పాపహారిణియగు మందాకినీ నది అచ్చట ప్రవహించును. అత్రి మొదలగు మునులు అనేకులు అచ్చట నివసించెదరు. రామా! మీరచ్చట నివసించి ఆ పర్వతమును గౌరవించండి." వాల్మీకి సలహాను అనుసరించి శ్రీ సీతారామలక్ష్మణులు చిత్రకూటపర్వతమును చేరి పవిత్ర మందాకినిలో స్నానమాచరించిరి. శ్రీరాముని ఆజ్ఞచే మందాకిని ఉపనదియైన పయస్విని నదీతీరమున లక్ష్మణుడు ఒక సుందరమైన పర్ణకుటీరమును నిర్మించెను. దేవతలు, మునులు శ్రీరాముని దర్శించి తన్మయులైరి.

తమ తపస్సు ఫలించినదని భావించిరి. అడవిలోనున్న కిరాతులు, కోలులు మిక్కిలి ఉత్సాహముతో కందమూలఫలములను తీసుకొని వచ్చి ప్రేమతో సమర్పించిరి. శ్రీరాముడు ప్రియవచనములతో వారిని గౌరవించెను. శ్రీరఘునాథుడు అడవిలో వచ్చి నివసించినది మొదలు వనమంతయు మంగళప్రదమాయెను. వివిధవృక్షములు పుష్పించెను, ఫలించెను. భ్రమరసంఘములు మధుర ఝుంకారములు చేసెను. శీతల మంద సుగంధయుతమైన గాలి వీచుచుండెను. కోయిలలు, చిలుకలు, గోరువంకలు, చకోరములు మున్నగు పక్షులు ఆత్మానందముగా పలుకుచుండెను. వేటకై తిరుగుచున్న శ్రీరామచంద్రుని చూచి జంతువులు ఆనందించుచుండెను. శ్రీసీతారాముల పాదములను అనుక్షణము చూచుచూ, వారికి తనపై గల వాత్సల్యమును తెలుసుకొని లక్ష్మణుడు స్వప్నములో కూడా తన సోదరులైన శత్రుఘ్నుని, భరతుని, తల్లిదండ్రులను ఇంటిని స్మరించడు. సీతాదేవి కూడా అయోధ్యను తన కుటుంబసభ్యులను యింటిని మరచి శ్రీరామునితో సుఖముగా నుండెను. పర్ణకుటీరము రాజ ప్రాసాదముకంటె సుఖప్రదమాయెను. మృగములు, పక్షులు కుటుంబముతో సమానముగా నుండెను. మునులు, మునిపత్నులు అత్తమామలవలె, కందమూలఫలములు అమృతతుల్యములైన ఆహారమువలె ప్రియములై ఉండెను. ఏ రామచంద్రుని స్మరణమాత్రముననే భక్తులు భోగవిలాసములను తృణముగా భావించెదరో, అట్టి శ్రీరామచంద్రుని ప్రియపత్ని, జగన్మాత, సీతాదేవి భోగవిలాసములను త్యాగము చేయుట ఆశ్చర్యకరమైన విషయము కాదు. కనురెప్పలు కన్నులను కాపాడునట్లు శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులను కాపాడుచుండెను.

## 14. దశరథుని మరణము

శ్రీరామచంద్రుని వెంట కొంత దూరము పోయిన నిషాదరాజు తిరిగి రాగానే మంత్రి సుమంత్రుని అతని రథమును చూచెను. "హా రామా! హా సీతా! హా లక్ష్మణా!" అను రోదించుచు అతివ్యాకులుడై మంత్రి నేలపై పడిపోయెను. రథమునకు గల గుఱ్ఱములు కూడా దక్షిణదిశవైపు తిరిగి సకిలించుచుండెను. నిషాదరాజు సుమంత్రునితో యిట్లు పలికెను: "సుమంత్రా! విషాదమును మానండి. మీరు జ్ఞానులు. పరమార్థమును ఎరిగినవారు. విధాత విముఖుడు అని తెలుసుకొని ధైర్యము వహించుడు" అని అనేక విధముల ఓదార్చి గుహుడు మంత్రిని తన నమ్మకమయిన నలుగురు సేవకులను యిచ్చి వీడుకొలిపి తన యింటికి మరలెను. శ్రీ సీతారామలక్ష్మణులు లేకుండా తాను ఒంటరిగా అయోధ్యకు వచ్చుచూ సుమంత్రుడు మిక్కిలి పశ్చాత్తాపముతో బాధపడుచుండెను. పదునాలుగు సంవత్సరముల తర్వాత మరల రాముడు తిరిగి వచ్చునను ఆశతోనే అతని ప్రాణములు నిలిచియుండెను. తమసానది తీరమును చేరిన పిదప సుమంత్రుడు తోడుగావచ్చిన నిషాదులను వినయముతో తిరిగి పంపెను. దినమంతయూ ఓ చెట్టుకింద కూర్చొని గడిపి సంధ్యాకాలమున నగర ప్రవేశము చేసెను. చీకటిలోనే నగర ప్రవేశము చేసి రథమును ద్వారమువద్దనే వదలి భవనమును ప్రవేశించెను. సుమంత్రుడు వచ్చినాడని తెలియగానే జనులు వచ్చి మిగుల వ్యాకులతను పొందిరి.

ఒంటరిగా వచ్చిన మంత్రిని జూచి రాణివాసమంతయు శోకపూరితమాయెను. రాజభవనము అతనికి ప్రేతనివాసస్థానమువలె కనబడెను. అతి దుఃఖముతో రాణులు అతనిని ప్రశ్నించిరి. కాని సుమంత్రుడు ఎవ్వరికీ సమాధానము ఇవ్వలేక కనిపించినవారినందరినీ రాజు గారెక్కడ? అని అడుగుచుండెను. కౌసల్యాదేవి మందిరమున

శయ్య, ఆభరణములను త్యజించి అతి దీనావస్థతో నేలమీద పడి "హా, రామా, లక్ష్మణా, సీతా"యని రోదించుచున్న దశరథుని చూచెను. సుమంత్రుని చూడగానే నీటిలో మునిగిపోవుచున్న వానికి ఆధారము దొరికినట్లు దశరథుడు సుమంత్రుని తన వద్ద కూర్చుండబెట్టుకొని సజలనయనుడై "మిత్రమా! రామచంద్రుని కుశలవార్తను తెలుపుము. వారిని తిరిగి పిలుచుకొని వచ్చినావా లేదా? వారు వనమునకు పోయిన, వారి సందేశము ఏమి?" అని అడుగసాగెను. మంత్రి ధైర్యము వహించి యిట్లు పలికెను: "మహారాజా! మీరు పండితులు,. జ్ఞానులు, శూరులు, ధీరులు. ఎల్లప్పుడూ సాధువులను సేవించువారు, సృష్టివినాశములు, జననమరణములు, సుఖదుఃఖములు కాలకర్మవశమైనవి. ధీరులైన వారు సుఖదుఃఖములను సమానముగా చూచెదరు. మీరు ధైర్యము వహించుడు. విచారించవలదు. శ్రీ సీతారామలక్ష్మణులు మొదట తమసానదీ తీరమున, పిదప పవిత్రగంగానదీ తీరమున బసచేసిరి. శృంగవేరపురము నందు గుహుడు అను నిషాదరాజు వారికి సేవలు చేసెను. రెండవదినము వారు జటాజూటములు ధరించి, నిషాదరాజు తెప్పించిన పడవను ఎక్కి గంగను దాటిరి. నా వ్యాకులతను చూచి శ్రీరాముడు ధైర్యము వహించి మిత్రమా! 'తండ్రిగారికి నా ప్రణామములు తెలుపుము. నా గురించి చింతించవలదని, మీ కృప అనుగ్రహము వలన మా వనవాసము సుఖముగా గడిపి మరల మీ పాదములను దర్శించెదను' అని పలికెను. నగరవాసులకు కుటుంబసభ్యులకు రాజుగారి క్షేమమునకే పాటుపడమని సందేశమును పంపెను. భరతుడు వచ్చిన తర్వాత తన సందేశమును యిట్లు వినిపించమనెను: 'రాజపదవి పొందిన తర్వాత నీతిని విస్మరించరాదు. మనోవాక్కర్మలతో ప్రజాపాలనము చేయవలెను. రాజమాతలందరినీ సమానముగా గౌరవించుము. తల్లిదండ్రులకు, స్వజనులకు సేవచేసి నీ భాతృత్వమును సఫలమొనర్చుము నన్ను గూర్చి విచారించకుండునట్లు తండ్రిగారిని ప్రేమతో సేవించుము.' సీతాదేవి కూడా ప్రణమిల్లి

ఏదియో చెప్పదలచెను. కాని ప్రేమవశమున ఆమె నోట మాట రాలేదు. అదే సమయమున శ్రీరాముని అనుమతితో నావికుడు పడవను ఆవలివడ్డునకు నడిపెను. ఇదే విధముగా రఘుకులమణి శ్రీరామచంద్రుడు వెళ్ళిపోయెను. నేను గుండె రాయిచేసుకొని చూచుచూ నిలబడితిని. శ్రీరాముని సందేశమును తీసుకొని ప్రాణములతో వచ్చిన నా క్లేశమును ఎట్లు ప్రకటింతును?" అట్లు చెప్పగానే మంత్రి కంఠము గద్గదమాయెను. అతడు శోకసంలగ్న మానసుడు ఆయెను.

సుమంత్రుని మాటలు విని దశరథుడు నేలపై పడిపోయెను. మనస్సు మోహవశమై ఆరాటపడెను. రాణులందరూ విలపించుచుండిరి. కౌసల్యాదేవి భవనమున రోదనమును విని, అయోధ్యానగరమంతయు హాహాకారధ్వనులతో నిండిపోయెను. రాజుగారి ప్రాణములు కంఠగత మాయెను. సూర్యవంశ సూర్యుడు అస్తమించుచున్నాడని గ్రహించి, కౌసల్యాదేవి ధైర్యమును చిక్కబట్టుకొని సమయానుకూలమైన మాటలు పలికెను: "నాథా! బాగా ఆలోచించండి. శ్రీరాముని వియోగమనెడి అపారసముద్రముపై పయనించు అయోధ్య అనెడి నావకు మీరు కర్ణధారులు. ఆ నావనెక్కి వియోగసముద్రమును దాటదలచిన జనులందరూ యాత్రికులు. మీరు ధైర్యము వహించినచో అందరూ తీరము చేరగలరు. లేనిచో పరివారమంతయు మునిగిపోవును." కౌసల్య మధురవచనములను వినగానే దశరథుడు ప్రాణములకై కొట్టుకొనుచున్న చేపపై చల్లని నీరు చల్లినట్లు కన్నులు తెరచి చూచెను. అప్పుడతనికి అంధుడైన తపస్వి శాపము జ్ఞాపకము వచ్చి, ఆ కథనంతయూ కౌసల్యకు వినిపించి ఇంకను వికలమనస్కుడాయెను. 'రామా రామా' అని అనేక మార్లు పలుకుచూ, రాముని వియోగమును భరించలేక శరీరమును వదలి స్వర్గస్థుడాయెను.

## 15. భరతుని పరితాపము

దశరథుడు జీవితమునందును మరణకాలమున కూడా తన జన్మము సఫలమొనర్చుకొనెను. అతని నిర్మలకీర్తి విశ్వమంతయూ వ్యాపించెను. రాణులందరూ రాజుగారి రూప, శీల, బల, తేజస్సులను వర్ణించుచూ అనేక విధముల రోధించిరి. దాసదాసీలు పరితపించిరి. అయోధ్యానగరమున ప్రతి యింటిలోను ఏడ్పులే వినపడెను. లోకమును నేత్రహీనమొనర్చిన కైకేయిని అందరూ తిట్టసాగిరి. మరునాడు ప్రాతఃకాలమున జ్ఞానులైన మునులు వచ్చిరి. వశిష్ఠమహాముని అందరినీ ఓదార్చి, నూనె నింపిన ఒక పడవలో రాజుగారి శవమును ఉంచుటకు ఆదేశించెను. పిదప దూతలను పిలిచి యిట్లు పలికెను: "వేగముగా భరతుని వద్దకు పోయి గురువుగారు మిమ్ములను ఇద్దరినీ వెంటనే రమ్మన్నారని చెప్పండి. రాజుగారి మరణవార్తను ఎవ్వరికీ తెలుపవద్దు." గురువుగారి ఆజ్ఞతో దూతలు వెంటనే భరతుని వద్దకు పోయిరి. అయోధ్యలో అనర్థములు ప్రారంభము అయినప్పటినుండి భరతునికి అపశకునములే కలుగుచుండెను. దూతలు వచ్చి గురువుగారి ఆజ్ఞను వినిపించగానే భరత, శత్రుఘ్నులు వెంటనే బయలుదేరి గుఱ్ఱములను వాయువేగముతో పరుగెత్తించసాగిరి. భరతుని మనస్సు పరిపరి విధముల ఆలోచించసాగెను. నగరమును సమీపించగానే అనేక అపశకునములు చూచెను. అయోధ్యావాసులెవ్వరూ మాట్లాడకుండా నమస్కరించి పోవుచుండిరి. భరతుని మనస్సు భయవిషాదములతో నిండియుండుట వలన ఎవరినీ కుశల ప్రశ్నలు వేయలేదు.

నగరమంతయు శోకతప్తమై యుండగా కైకేయి మాత్రము తన కుమారుడైన భరతుని రాకకు సంతసించెను. హారతిని సిద్ధపరచి లేచి పరుగెత్తి ద్వారమువద్దనే భరతుని కలిసి లోనికి పిలుచుకొని వచ్చెను. విచారగ్రస్తుడైన కుమారుని చూచి "మాతల్లిగారింట్లో అందరు

కుశలమా?" అని ప్రశ్నించెను. కుశలమే అని సమాధానమిచ్చి తమ యింటిలోని వారి క్షేమముల గూర్చి అడిగెను. "తండ్రిగారు ఎక్కడ? తల్లులందరూ ఎక్కడ? సీతాదేవి, రామలక్ష్మణులు ఎక్కడ?" అని అడిగెను. స్నేహపూరితమైన భరతుని వచనములు విని మొసలి కన్నీరు కార్చుచూ కైకేయి భరతుని చెవులను, మనస్సును శూలమువలె గ్రుచ్చు మాటలు వినిపించెను: "నాయనా! నేనన్ని సక్రమముగా ఏర్పాటు చేసినాను. మంథర నాకు చాలా సహాయపడినది. కాని విధాత నా పనినంతయూ చెడగొట్టినాడు. రాజుగారు స్వర్గస్థులైనారు." ఆ మాటను వినగానే భరతుడు సింహగర్జనను వినిన ఏనుగువలె విషాదముతో వివశుడై "తండ్రీ, నాయనా" అనుచూ నేలపై పడిపోయెను. "తండ్రీ! నీ అంతిమ కాలమున కూడా నేను మిమ్ములను దర్శించలేకపోయితిని. అయ్యో! మీరు నన్ను శ్రీరామచంద్రునికి అప్పగించక పోయితిరి" అని వగచెను. తర్వాత అతడు ధైర్యమును చిక్కబట్టుకొని "అమ్మా! తండ్రిగారి మరణమునకు కారణము ఏమి?" అని ప్రశ్నించెను. కఠోర హృదయయైన కైకేయి తాను చేసిన పనిని మొదటినుండి వివరించెను. శ్రీరామచంద్రుని వనవాస వార్తను విని భరతుడు తండ్రిగారి మరణవార్త కంటే ఎక్కువగా దుఃఖించి, దీనికంతయూ తానే కారణమని గ్రహించి నిశ్చేష్టుడాయెను. మిక్కిలి క్షోభ చెందిన కుమారుని సమాధానపరుచుటకు యత్నించుచూ కైకేయి, "నాయనా! మీ నాయనగారికై విచారించకుము. ఆయన పుణ్యము, యశమును సంపాదించి తన జన్మ సార్ధకమొనర్చుకొని చివరకు స్వర్గమునకు పోయినారు. బాగా ఆలోచించి, విచారమును మాని రాజ్యపాలనము చేపట్టుము" అని పలికినది. భరతుడు ఆ మాటలు వినగానే గాయముపై నిప్పుపడినట్లు ఉలికిపడెను.

దీర్ఘనిశ్వాసము వదలి యిట్లు పలికెను: "దుర్మార్గురాలా! నీవు అన్ని విధములా మన వంశనాశనము చేసినావు. నాపై ఇంత ద్వేషము

ఉన్నచో పుట్టినపుడే నన్ను ఎందుకు చంపివేయలేదు? నీవు చెట్టును కొట్టి దాని ఆకులను తడిపినావు. చేపలను బ్రతికించుటకు చెరువును ఎండగొట్టినావు. నేనెంతో అదృష్టవంతుడనగుటచే సూర్యవంశము, దశరథుని వంటి తండ్రి, రామలక్ష్మణులవంటి సోదరులు లభించినారు. కాని విధాత నీవంటి తల్లిని ప్రసాదించినాడు. ఓ దుర్మతీ! నీ మనస్సులో ఈ దురాలోచన రాగానే నీ హృదయమేల పగిలిపోలేదు? వరముల నడిగినపుడు నీ అంతరాత్మ బాధపడలేదా? మహారాజు నీ మీద ఎట్లు విశ్వాసము ఉంచెను? ఆయన పాపము! వట్టి అమాయకులు, సుశీలురు, ధర్మపరాయణులు. ఆయనకు నీ స్వభావము ఎట్లు తెలియును?. ఈ ప్రపంచములో శ్రీరామచంద్రుని ప్రేమించని ప్రాణులను చూపుము. అట్టి శ్రీరాముడు నీకు శత్రువాయెనా? నీవు స్త్రీ రూపములో వచ్చిన రాక్షసివి. లెమ్ము, నా ఎదుటనుండి తొలగిపొమ్ము. నీ లాంటి స్త్రీ గర్భమున విధాత నన్ను పుట్టించినాడు. నాలాంటి పాపి ఎవ్వరూ లేరు."

కైకేయి కుటిలత్వమును విని శత్రుఘ్నుడు కూడా కోపముతో మండిపోయెను. కాని ఏమియూ చేయలేకపోయెను. ఆ సమయముననే మంధర వివిధ వస్త్రములను, విలువగల ఆభరణములను ధరించి వచ్చెను. ఆమెను చూడగానే అగ్నిలో ఆజ్యము పోసినట్లు శత్రుఘ్నుడు అగ్నిగోళమాయెను. దానిపై లంఘించి వేగముగా వీపుపై కొట్టగా అది ముఖము నేలపై మోపి పడిపోయెను, దాని గూని బ్రద్దలాయెను, నెత్తి పగిలెను, పండ్లూడెను, నోటినుండి రక్తము స్రవించెను. "దేవుడా? నేనేమి చేసినాను? నేను చేసిన సేవలకిది ప్రతిఫలమా?" అని అరచెను. ఇది విని శత్రుఘ్నుడు అది నఖశిఖపర్యంతము దుష్టురాలని ఎరిగి కొప్పు పట్టుకొని ఈడ్చెను. భరతుడు దయాళువు కావున ఆమెను విడిపించెను. వారిద్దరూ కౌసల్యాదేవి మందిరమునకు పోయిరి.

కౌసల్యాదేవి వస్త్రములు మలినమైయుండెను. ముఖము పాలి పోయి ఉండెను. దుఃఖభారముచే ఆమె శరీరము శుష్కించి యుండెను. భరతుని చూడగానే కౌసల్యాదేవి లేచి పరుగెత్తుకొని వచ్చెను. కాని తలతిరుగుటచే మూర్ఛిల్లి నేలపై పడెను. అది చూచి భరతుడు అతి వ్యాకులుడై ఆమె పాదములపై పడి పలికెను: "అమ్మా! నాన్నగారు ఎక్కడ? వారిని చూపుము. సీతాదేవి, నా సోదరులు ఇద్దరూ ఎక్కడ? ఈ జగత్తులో కైకేయి ఏల జన్మించినది? జన్మించిననూ నా లాంటి ద్రోహిని, అభాగ్యుని ఏల కన్నది? నా వల్లనే కదా మీకీ దశ ప్రాప్తించినది. తండ్రిగారు స్వర్గములో, శ్రీరామచంద్రుడు వనవాసములో ఉన్నారు. ఈ అనర్థములకు నేనే కారణమైనాను." భరతుని మధుర వాక్యములను విని కౌసల్యాదేవి లేచి కూర్చొనెను. భరతశత్రుఘ్నులను చూచి ఆమె రామలక్ష్మణులే వనమునుండి తిరిగివచ్చినట్లు భావించెను. ఆమె హృదయములో శోకము, ప్రేమ ఒక్కసారిగా ఉప్పొంగెను. భరతుని కన్నీరు తుడిచి అనునయించుచూ పలికెను: "కుమారా! ధైర్యము వహించుము. ఇది ఆపత్కాలమని గ్రహించి శోకమును మానుము. కాలకర్మగతి అనివార్యము. విధాత ప్రతికూలుడుగా నున్నప్పుడు ఎవ్వరినీ దోషిగా తలంచవలదు. నాయనా! తండ్రిగారి ఆజ్ఞప్రకారము శ్రీరాముడు ఆభరణములు, వస్త్రములు త్యజించి వల్కలములు ధరించి, వనమునకు ఏగినాడు. అతని హృదయములో హర్షవిషాదములు లేవు. ఎవరిపైన ఆసక్తిగాని, కోపముగాని లేవు. శ్రీరాముని చరణములపై అనురక్తిగల సీతాలక్ష్మణులు కూడా అతనిని అనుసరించిరి. వారితోపాటు నేనుగాని నా ప్రాణములు గాని పోలేదు. రాజుగారిలాగా నేను మరణించిననూ బాగుండేది."

కౌసల్య వచనములు విని భరతుడు, ఇతర రాణీవాస ప్రజలు శోకముతో విలపించసాగిరి. భరతశత్రుఘ్నులను హృదయమునకు

హత్తుకొని కౌసల్య అనేక ఓదార్పు మాటలు వచించెను. భరతుడు కూడా అనేక విధముల రాజమాతలను ఓదార్చి చేతులు జోడించి ఇట్లు పలికెను: "తల్లిదండ్రులను, పుత్రులను చంపిన పాపము, గోశాలలను, బ్రాహ్మణనగరములను తగులబెట్టిన పాపము, స్త్రీలను, బాలురను హత్యచేసిన పాపము, మిత్రునికి రాజుకు విషమిచ్చిన పాపము, కర్మ, వచన, మనస్సులతో చేసెడి పాపములన్నియూ ఒకవేళ ఈ పనికి నా సమ్మతి లభించివుంటే నాకంటునుగాక, అమ్మా! ఈ కుట్రలో నాకు భాగము ఉన్నట్లయితే దుర్జనులు, పాపులు, హరిద్రోహులు కపటవేషధారులు, లోభులు పరస్త్రీ ధనములను అపహరించువారు పోవు గతి నాకు ప్రాప్తించుగాక!"

భరతుని నిష్కళంక స్వాభావికమైన మాటలు విని కౌసల్యాదేవి "నాయనా, నీవు సదా శ్రీరామునికి ప్రాణసముడవు. శ్రీరాముడు కూడా నీకు ప్రాణముకంటే ప్రియమైన వాడు. ఈ జగత్తులో ఎవరైన ఈ కుట్ర నీ సమ్మతితో జరిగినదని భావించితే వారికి కలలో కూడా సుఖము సద్గతులు ఉండవు" అని పలికి కౌసల్య భరతుని అనేక విధముల ఓదార్చెను. ఆ విధముగా రాత్రంతయూ గడిచెను.

మరునాడు ఉదయమున వామదేవుడు వశిష్ఠుడు వచ్చిరి. వారు మంత్రులను నగరములోని ముఖ్యజనులను పిలిపించిరి. వశిష్ఠుడు సమయానుకూలమైన పరమార్థ విషయమును తెలిపి భరతునితో "నాయనా! ధైర్యము వహించుము. ఇప్పుడు చేయవలసిన విధులను చేయుము" అని పలికెను. గురువుగారి ఆజ్ఞతో భరతుడు తండ్రిగారి దహనమునకు ఏర్పాట్లు గావించమని ఆజ్ఞాపించెను. వేదోక్తముగా రాజుగారి శరీరమునకు స్నానము చేయించిన పిదప శవయాత్రకై అతివిచిత్రమైన విమానమును చేయించెను. భరతుడు తల్లులందరి పాదములను పట్టుకొని వారిని సహగమనము చేయకుండా ఆపెను. వారునూ శ్రీరాముని దర్శనాభిలాషులై నిలచిపోయిరి. చందనము,

అగరు మొదలగు అనేక సుగంధ ద్రవ్యములు తీసుకొని రాబడెను. సరయూనదీ తీరమున స్వర్గమును అధిరోహించుటకు నిచ్చెన యనునట్లు చితి ఏర్పాట్లు చేయబడెను. దహనక్రియ చేసిన పిదప విధి పూర్వకముగా అందరూ స్నానము చేసి తిలాంజలులు వదిలిరి. వశిష్ఠుడు ఇచ్చిన ఆజ్ఞలన్నింటినీ నెరవేర్చుచూ భరతుడు వేద, స్మృతి, పురాణములలో చెప్పబడిన రీతిగా పదిరోజుల కార్యక్రమములు సక్రమముగా నిర్వర్తించెను. శుచియైన పిమ్మట అనేక దానములు చేసెను.

పిదప ఒక శుభదినమున వశిష్ఠుడు వచ్చి మంత్రులను ప్రతిష్ఠిత నాగరికులను పిలిపించెను. అందరూ రాజసభలో కూర్చున్న పిదప వశిష్ఠుడు భరతశత్రుఘ్నులను పిలిపించెను. భరతుని తన దగ్గర కూర్చుండబెట్టుకొని అనేక నీతిధర్మములను ఉపదేశించెను. పిదప రాజుగారి ధర్మవ్రతమును సత్యనిష్ఠను ప్రశంసించెను. శ్రీరామచంద్రుని గుణశీల స్వభావములను, శ్రీరాముని పట్ల సీతాలక్ష్మణుల ప్రేమను వర్ణించుచూ ముని శోకములో మునిగిపోయెను. అతని నేత్రములు కన్నీటితో నిండెను. వికలమనస్కుడైన వశిష్ఠుడు ఇట్లు పలికెను: "భరతా, వినుము. ప్రారబ్ధము చాలా బలీయమైనది. హాని లాభములు, జీవన్మరణములు విధాత అధీనములు. ఈ విషయమును గ్రహించి ఎవరినీ కోపగించరాదు. దోషిగా నెంచరాదు. దశరథునికై విచారించవలదు. అతడు అన్ని విధములా అదృష్టవంతుడు. దుఃఖమును మాని రాజుగారి ఆజ్ఞను శిరసావహించుము. సత్యపాలనకొరకే రాజుగారు శ్రీరాముని వనమునకు పంపినారు. శ్రీరాముని వియోగాగ్నికి తన దేహమును ఆహుతి చేసినారు. రాజుగారికి తన ప్రాణమునకంటే తాను ఇచ్చిన వచనమే ప్రియమైనది. కనుక నాయనా! అతని వచనమును సత్యము చేయుము. శోకమును వదలి ప్రజలను పాలించుము. నీకు పుణ్యము, కీర్తి లభించును. స్వర్గములోనున్న రాజుగారు సంతోషించెదరు.

వనవాసములో నున్న శ్రీరాముడు సీతాదేవి కూడా సంతోషించెదరు. ప్రజలు సుఖులగుటచే కౌసల్యాదేవి మొదలగు రాజమాతలు కూడా సుఖులయ్యెదరు. నీకు శ్రీరామునిపైగల ప్రేమను తెలిసినవారు అన్ని విధములా నిన్ను మెచ్చుకొందురు. శ్రీరామచంద్రుడు తిరిగి వచ్చిన పిదప రాజ్యమును అతనికిచ్చి సేవచేయుము." మంత్రులు కూడా చేతులు జోడించి "గురువుగారి ఆజ్ఞను పాలించుడు"అని ప్రార్థించిరి.

ధైర్యమును కూడగట్టుకొని కౌసల్యాదేవి పలికెను: "కుమారా! గురువుగారి ఆజ్ఞ ఆచరణీయము. శ్రీరామచంద్రుడు వనములో నున్నాడు. మహారాజుగారు స్వర్గస్థులైనారు. కావున కుటుంబమునకు, ప్రజలకు, మంత్రులకు, తల్లులకు అందరికీ నీవే ఆధారము. నేను నీ తల్లిగా చెప్పుచున్నాను. విధివైపరీత్యమును, కాలకఠోరత్వమును తలచి ధైర్యము వహించి గుర్వాజ్ఞను శిరసావహించుము. ప్రజలను పాలించి వారి దుఃఖమును పోగొట్టుము."

భరతుడు గురువుగారి వచనములను, కోమలమై నిష్కపటమైన మాతృ వాక్యములను విని మిక్కిలి వ్యాకులతను పొందెను. ధైర్యము వహించి చేతులు జోడించి సమాధానము ఇవ్వసాగెను: "గురువుగారు నాకు చాలా మంచి ఉపదేశము నిచ్చినారు. మంత్రులకు, ప్రజలకు కూడా అది సమ్మతమే. తల్లిగారు కూడా అదే ఉచితమని ఆదేశించినారు. గురువు, తల్లిదండ్రులు, ప్రభువు, మిత్రుల మాటలను సంతోషముతో స్వీకరించగలను. కావున నేను దానిని గౌరవముతో పాటించదలచినాను. కాని నా విన్నపమును విన్న తరువాత ఏది ఉచితమో ఉపదేశించుడు.

నా తల్లిగారి కుటిలత్వముచేత బాధింపబడిన సీతాపతి సేవలోనే నాకు హితము కలదు. శ్రీ సీతారామలక్ష్మణ పాదములను దర్శించని శోక పూరితమైన ఈ రాజ్యము వలన ఎవరికి లాభము? నన్ను రాజుగా చేసి మీరు లాభపడతారని కేవలం మీకు నాపై

గల మోహముచే తలచుచున్నారు. కైకేయి పుత్రుడు కుటిలబుద్ధి, రామునికి శత్రువు. లజ్జావిహీనుడైన నాలాంటి అధముని రాజ్యములో సుఖమును ఆశించుట కేవలము భ్రమ మాత్రమే. ధర్మశీలుడే రాజు కావలెను. సీతారాములను వనములకు పంపిన నావంటి పాపి ఎవ్వరుండరు. రాజుగారు శ్రీరామునికి వనవాసము ఇచ్చి వారిని వదలలేక స్వర్గస్థులైరి. నేను దుష్టుడను, అన్ని అనర్థములకు మూలకారణమైనవాడిని, కూర్చొని సావధానముగా మీ మాటలు వింటున్నాను. శ్రీ రఘునాథుడు లేని ఈ భవనమును చూస్తూ, లోకము చేయు పరిహాసమును భరిస్తూ ఈ ప్రాణములు పోకుండా యున్నవి. కైకేయి గర్భమునుండి జన్మించిన ఈ శరీరమును అంటి పెట్టుకొన్న ఈ నీచప్రాణములు మిక్కిలి హేయమైనవి. ఆమె శ్రీసీతారామలక్ష్మణులను వనమునకంపెను. దేవలోకమునకు పంపి పతికి ఉపకారము చేసెను. తాను వైధవ్యమును అపకీర్తిని మోసుకొనెను. ప్రజలను శోక సంతప్తులుగా చేసెను. నాకు సుఖమును రాజ్యమును సత్కీర్తిని ఇచ్చెను. అట్టి కైకేయి కుమారుడుగా నేను రాజగుట అనుచితముగాదు. నేను దేనికి అర్హుడనో విధాత నాకు అదే ప్రసాదించెను. కాని దశరథుని పుత్రునిగా శ్రీరాముని తమ్మునిగా చేసి ప్రసాదించిన వరము వ్యర్థము అయినవి. మీరు కూడా నన్ను పట్టాభిషిక్తుని కమ్మంటున్నారు. శ్రీరామచంద్రుని తల్లి అతి సరళహృదయురాలు. నాపై విశేషప్రేమ కలది. నా దీనత్వమును చూచి ఆమె అట్లు పలికినది. గురుదేవులు వివేకసముద్రులు. వారు కూడా నన్ను రాజ్యాభిషక్తుని చేయ సంకల్పించినారు. విధాత ప్రతికూలుడు అయినప్పుడు ప్రతిఒక్కరు ప్రతికూలురగుదురు. శ్రీ సీతారాములు తప్ప ప్రపంచములో ఎవ్వరు కూడా ఈ కుట్రలో నాకు భాగము లేదని చెప్పరు. అందరికీ ప్రణమిల్లి నా విన్నపమును వినిపించెదను. శ్రీరామచంద్రుని చరణములను దర్శించనిదే నా ఆత్మక్షోభ చల్లారదు. శ్రీరాముడు తప్ప నా మనస్సులోని

మాట ఎవ్వరూ తెలుసుకొనలేరు. నేనొక నిర్ణయానికి వచ్చినాను. ప్రాతఃకాలమున శ్రీరామచంద్రప్రభువు సన్నిధికి పోతాను. ఒకవేళ నేను అపరాధిని అని, ఈ ఉపద్రవమునకు నేనే కారణమని భావించినను తమ శరణాగతియన్న నన్ను చూచి శ్రీరామచంద్రుడు తప్పక నా అపరాధములను క్షమించి కృప జూపును. ఆయన కృపా, స్నేహములకు పట్టుకొమ్మ. శత్రువులకు కూడా అపకారము తలపెట్టడు. కావున మీరు నా నిర్ణయమునే మంచిగా భావించి శ్రీరామచంద్రుని పిలుచుకొని వచ్చుటకు నాకు ఆజ్ఞ, ఆశీర్వాదమును ఇవ్వండి. నా విన్నపము నాలించి నన్ను తన దాసునిగా భావించి శ్రీరామచంద్రుడు రాజధానికి తిరిగి రాగలడు!"

## 16. భరతుని గుహుని సమాగమము

భరతుని వచనములు అందరికీ ప్రియములాయెను తల్లులు, మంత్రులు, గురువులు, నగరములోని స్త్రీ పురుషులు, భరతుని ప్రశంసించుచూ "మీరు మూర్తీభవించిన శ్రీరామప్రేమ," అని పొగిడిరి. "నాయనా భరతా! శ్రీరామునికి మీరు ప్రాణసములు. ఇందులో సందేహములేదు. ఎవడైనా నీచుడు తన అజ్ఞానము వలన, మీ తల్లి కైకేయి కుటిలత్వము కారణమున మిమ్ములను సందేహించినచో, వాడు తన వంశముతోసహా నూరుకల్పములు నరకమును అనుభవిస్తాడు. శ్రీరాముడు ఏ వనములో ఉన్నాడో మనమందరమూ అక్కడికి పోవలెను. శోకసముద్రములో మునిగిపోవు మాకందరికీ మీరు చేయూతనిచ్చినారు" అని నగర ప్రజలందరూ భరతుని స్నేహశీలములను పొగుడుచూ భరతునికి వశిష్ఠునికి నమస్కరించి సెలవు గైకొని తమ ఇండ్లకు తరలిపోయిరి. మరునాడు ప్రాతఃకాలమునందే బయలుదేరవలెనని నిర్ణయించబడెను. ప్రతి యింటిలో ప్రజలు అనేక విధముల వాహనములను సిద్ధపరచుకొనిరి. భరతుడు భవనము చేరి నగర రక్షణకై

విశ్వాసపాత్రులైన సేవకులను పిలిచి వారికి ముఖ్యవిషయములన్నింటినీ వివరముగా తెలిపి వారిని యోగ్యమైన పనులందు నియమించెను. రక్షణవ్యవస్థ చేసి రక్షకులను నియమించి కౌసల్యాదేవి వద్దకు పోయెను. ప్రేమస్వరూపమును తెలిసిన భరతుడు శ్రీరాముని విరహముచే ఆర్తులైన తల్లులకై పల్లకీలను వాటిలో సుఖాసనములను ఏర్పాటు చేసెను. ప్రాతఃకాలమున భరతుడు చతురులయిన మంత్రులను పిలిచి పలికెను: "రాజ్యాభిషేకమునకు వలసిన వస్తువులన్నిటినీ తీసుకొని పొండు. వశిష్ఠమహాముని వనములోనే శ్రీరామునికి రాజ్యమును అప్పగించును." మంత్రులు ప్రణమిల్లి గుఱ్ఱములు, ఏనుగులు, రథములు సిద్ధపరచిరి. మొదట వశిష్ఠమహాముని తన భార్య అరుంధతితో పాటు అవసరమైన వస్తువులను తీసుకొని రథమును అధిరోహించెను. పిదప తపస్వినులు, తేజస్వినులైన బ్రాహ్మణులు వేర్వేరు వాహనములను ఎక్కిరి. నగరప్రజలు తమ వాహనములను ఎక్కి బయలుదేరిరి. రాణులు పల్లకీలను ఎక్కిరి. విశ్వాసపాత్రులైన సేవకులకు నగరమును అప్పగించి భరతశత్రుఘ్నులు శ్రీరాముని సంస్మరించుచు కాలినడకనే పోవుచుండిరి. ఇది చూచి ప్రజలుకూడా తమ వాహనములను దిగి నడవసాగిరి. తన పల్లకిని భరతునికి సమీపమున ఆపి కౌసల్యాదేవి పలికెను: "నాయనా! నా మాటవిని రథమును ఎక్కుము. నీవు కాలినడకతో పోయినచో అందరూ అట్లే చేసెదరు. శోకతప్తులైన వారు బలహీనులు అయినారు. నడవలేరు." మాతృవచనములను శిరసావహించి ఆమెకు ప్రణమిల్లి, ఇద్దరూ రథమును ఎక్కిరి. మొదటిరోజు తమసానదీ తీరమున, రెండవరోజు గోమతీనదీ తీరమున బస చేసిరి. భూషణములను భోగవిలాసములను త్యజించి అందరూ శ్రీరామచంద్రుని కొరకు నియమవ్రతములను పాటించిరి.

రెండవరోజు తెల్లవారగనే బయలుదేరి శృంగవీరపురమును సమీపించిరి. నిషాదరాజు విషయమునంతయూ తెలిసి దుఃఖితుడై మనసులో యిట్లు ఆలోచించెను: "భరతుడు వనమునకు వచ్చు కారణము ఏమై

ఉండునో? ఇతని మనస్సులో కుటిలత్వము లేనిచో వెంట సైన్యమును తీసుకొని రావలిసిన అవసరము ఏమి? లక్ష్మణునితో సహా శ్రీరాముని చంపి నిష్కంటకముగా రాజ్యమునేలుటకు తలంచియుండును. కాని భరతుడు రాజనీతిని గూర్చి ఆలోచించలేదు. మొదటనే ఇతనికి కళంకము అంటినది. ఇప్పుడు జీవితమే చాలించవలసివచ్చును. దేవదానవులందరూ ఏకమై వచ్చిననూ శ్రీరాముని రణభూమిలో ఎదురించలేరు. భరతుడు ఈ విధముగా ప్రవర్తించుటలో ఆశ్చర్యము లేదు. విషపుతీగలకు అమృతఫలములు కాయువుగదా?" ఆ విధముగా ఆలోచించి నిషాదరాజు గుహుడు తన జాతివారితో "అందరూ జాగ్రత్తగానుండుడు. నావలను సిద్ధమొనర్చుడు. అన్ని ఘట్టములను మూసివేయుడు" అని హెచ్చరించెను. "యుద్ధసామాగ్రిని సమకూర్చు కొని ఘట్టములవద్ద నిలుచుండుడు. చావుకు కూడా సిద్ధముకండు. నేను ముందు నిలిచి భరతునితో పోరాడెదను. నేను బ్రతికుండగా భరతుని గంగానది దాటనివ్వను. యుద్ధములో మరణించుట, అదియు గంగాతీరమున శ్రీరాముని కార్యమునకు ఇట్టి మృత్యువు లభించుట నా భాగ్యము అని తలచెదను" అని పలుకుచూ విషాదరహితుడై నిషాదరాజు తన వారి ఉత్సాహమును ఇనుమడింపచేయుచూ, శ్రీరాముని స్మరించుచూ తాను కవచమును, ధనుర్బాణములను ధరించి యుద్ధమునకు సిద్ధమాయెను. మిగతావారుకూడా తమ ఆయుధములను ధరించి యుద్ధోన్ముఖులైరి. కొందరు వృద్ధులు నిషాదరాజుతో యిట్లు పలికిరి. "శకునములు చూచినచో యుద్ధము జరుగదని తోచుచున్నది. భరతుడు శ్రీరామచంద్రుని తిరిగి రమ్మని ప్రార్థించుటకు వచ్చుచున్నట్లున్నది. కావున మనము పోయి భరతుని కలిసెదము. అతని శీలస్వభావములను తెలుసుకోకుండా యుద్ధముచే యుటలో హితముకన్నా హానియే ఎక్కువ గలదు." సముచితమైన వారి మాటలు విని గుహుడు కానుకలతో కందమూలఫలములతో భరతుని కలియుటకు పోయెను.

మునిశ్రేష్ఠుడైన వశిష్ఠుని చూచి నిషాదరాజు తన పేరు చెప్పి దూరమునుండియే దండప్రణామములు ఆచరించెను. అతనిని శ్రీరాముని ప్రియుడని ఎఱింగి ముని ఆశీర్వదించి భరతునికి పరిచయము చేసెను. రాముని సఖుడు అని విన్నంతనే భరతుడు రథమును దిగి అనురాగము ఉప్పొంగగా గుహుని కలుసుకొనుటకు వచ్చెను. దండప్రణామములు ఆచరించిన గుహుని భరతుడు హృదయమునకు హత్తుకొని లక్ష్మణునే కలిసినట్లు భావించెను. ఎవరైతే ఆవలించునప్పుడు "రామరామ" అని పలుకుదురో అట్టివారి సమీపమున పాపములు రానేరావు. మరి గుహుని స్వయముగా శ్రీరాముడే హృదయముకు హత్తుకొని అతనిని అతని కులమును జగత్తులో పావనమొనర్చెను. అట్టి నిషాదుని అతి ప్రేమతో భరతుడు కౌగిలించుకొనుట చూచి దేవతలు, జనులు అసూయ పడసాగిరి. నిషాద రాజును అతి ప్రేమతో కలిసి భరతుడు అతని కుశలమును శుభమును ప్రశ్నించెను. భరతుని శీలస్వభావములను ప్రేమను చూచి నిషాదుడు తనను తాను మరచిపోయెను. పిదప ధైర్యము వహించి భరతుని పాదములకు మ్రొక్కి ప్రేమతో చేతులు జోడించి "ప్రభూ! మీ పాదములే శుభములకు మూలము. వాటిని చూచి నేను మూడుకాలాల్లోను శుభములను పొందితిని" అని పలికెను. నిషాదరాజు ప్రేమను చూచి, అతని వినయవాక్కులను విని శత్రుఘ్నుడు అతనిని కలిసెను. నిషాదరాజు తన పేరు చెప్పుకొని రాణులందరికీ సాదరముగా ప్రణమిల్లెను. వారు అతనిని ఆశీర్వదించిరి. అయోధ్యావాసులందరూ నిషాదరాజును చూచి లక్ష్మణుని చూచిన ఆనందమును పొందిరి. తన భాగ్యమును వారు పొగడుటను విని ప్రసన్నచిత్తుడైన నిషాదరాజు అందరిని తనతో పాటు తీసుకొని పోయెను.

అతడు తన సేవకులకు సైగ చేసెను. అతని అభిమతమును కనిపెట్టి వారు తమ యిండ్లలో వృక్షచ్ఛాయలందు, చెరువుగట్లపై

వనోపవనములందు విడుదులను ఏర్పాటు చేసిరి. భరతుడు నిషాద రాజు భుజముపై చేయివేసి వినయము, అనురాగము శరీరధారణ చేసినట్టు శోభిల్లుచుండెను. భరతుడు తన సేనలతో గంగానదిని దర్శించెను. శ్రీరామఘట్టమును దర్శించి నమస్కరించి స్వయముగా శ్రీరామచంద్రుడినే చూసినంత ఆనందమును పొందెను. అందరూ గంగానదియందు స్నానమాచరించిరి. ఏ శింశుపావృక్షపు నీడలో శ్రీరాముడు విశ్రమించెనో, దానిని గుహుడు భరతునికి చూపెను. భరతుడు ఆ చెట్టుకు దండప్రణామములు ఆచరించెను. అచటి దర్భశయ్యను చూచి దానికి ప్రదక్షిణ నమస్కారములు ఆచరించెను. సీతాదేవి వస్త్రములనుండి ఆభరణములనుండి రాలిన రెండు లేక మూడు కనకబిందువులను చూచి వాటిని సీతాదేవితో సమానముగా భావించి శిరస్సున ధరించెను. "దుఃఖమను మాట ఎరుగని సీతారాములు విధివశమున ఈ దర్భశయ్యపై పరుండవలసి వచ్చెను. వనములో కాలినడకన ప్రయాణించవలసి వచ్చెను. కందమూలఫలములను భుజించవలసి వచ్చెను. ఈ ఉపద్రవములకు నేనే కదా కారణము? నా తల్లి కైక నన్ను స్వామిద్రోహిగా చేసెను" అని భరతుడు పరిపరివిధముల పరితాపమును పొందెను. ఆ మాటలను విని నిషాదరాజు ప్రేమపూర్వకముగా నచ్చచెప్ప సాగెను: "ప్రభూ! మీరేల వృధాగా విచారపడెదరు? శ్రీరామచంద్రునికి మీతో సమానమైన ప్రియులు లేరు. ప్రభువు అంతర్యామి: వినయము, ప్రేమ, దయాస్వరూపులు, మీరు దృఢచిత్తముతో విశ్రమించుడు." తన సఖుని పలుకులు విని ధైర్యము వహించి శ్రీరాముని స్మరించుచూ భరతుడు ఆ రాత్రి తన గుడారమున విశ్రమించెను. శృంగవీరపుర జనులు అయోధ్యావాసులు శ్రీరాముడు విశ్రమించిన స్థలమును చూచి ప్రదక్షిణ చేసి నమస్కరించిరి. కైకేయిని దూషించుచూ భరతుని ప్రశంసించుచుండిరి. ఆ విధముగా జనులందరూ ఆ రాత్రి మేలుకొనియుండి ప్రాతఃకాలమున నదిని దాటిరి.

## 17. భరత, భరద్వాజ సమాగమము

మరునాడు ఉదయమున ఒక నావపై గురువును, మరొక నావపై తల్లులను తీసుకొని భరతుడు తన పరివారముతో నదిని దాటెను. నిషాదరాజును ముందుంచి తన సైన్యమును నడిపించెను. రాజమాతల పల్లకీలకు శత్రుఘ్నుడు రక్షకుడుగా నుండెను. భరతశత్రుఘ్నులు గుహుడు కాలినడకతోనే పోవుచుండిరి. అపరిమితభక్తితో సీతారాముల స్మరణ చేయుచూ మూడు జాములకు ప్రయాగ చేరిరి. విధిపూర్వకముగా గంగాయమునా సంగమమున స్నానమాచరించి, భరతుడు ఆ తీర్థరాజమునకు చేతులు జోడించి ప్రార్థించెను.

తీర్థరాజమైన ప్రయాగలో నివసించు బ్రహ్మచారులు వానప్రస్థులు, గృహస్థులు, సన్యాసులు అందరూ భరతుని స్నేహశీలములను పొగిడిరి. భరతుని రాకను గురించి భరద్వాజమునికి తెలిపిరి. తనకు సాష్టాంగ నమస్కారము చేయు భరతుని చూచి భరద్వాజముని పరుగెత్తుకొని పోయి, అతనిని లేపి హృదయమునకు హత్తుకొని ఆశీర్వాదమును ఇచ్చి, ఉచితాసనమున ఉపవిష్టుని చేసెను. చింతాక్రాంతుడైన భరతుని చూచి భరద్వాజముని పలికెను: "భరతా, వినుము. విధాత కృత్యములు మన యధీనములో లేవు. ఇందులో కైకేయి దోషము కూడా లేదు. ఆమె బుద్ధిని సరస్వతీదేవి దొంగిలించినది. నీ నిర్మలమైన కీర్తిని లోకము ప్రశంసించును. 'తండ్రి ఎవరికి రాజ్యమును అప్పగించునో, అతడే రాజ్యాధికారి' యను మాట వేదములు, లోకములు కూడా సమ్మతించును. తండ్రి సత్యప్రతిజ్ఞుడు, నిన్ను పిలిచి రాజ్యమును అప్పగించి యుండవచ్చును. కాని వనగమనము భగవంతుని యిచ్ఛానుసారము జరిగినది. రాణి తాను చేసిన పనికి పశ్చాత్తాపపడినది. నీవు రాజ్యమును అంగీకరించినచో నీ దోషము ఏమియూ లేదు. శ్రీరాముడు కూడా దీనిని విని సంతోషించును. కాని భరతా! ఇప్పుడు నీవు చేసిన

పని మిక్కిలి ఉత్తమమయినది. శ్రీరామచంద్రుని మనస్సులో సీతో సమానుడైన ప్రేమపాత్రుడు ఎవరూ లేరు. ఇది రఘునాథుని గొప్పదనము కాదు. ఏలనన రఘునాథుడు శరణాగతవత్సలుడు. నీవు శ్రీరాముని ప్రేమావతారము. శ్రీరామభక్తిరసామృతమును పొందుటకు ఇది శుభారంభము." అట్లు అనేక విధముల భరద్వాజ ముని భరతుని భక్తిని పొగడుచూ శ్రీరామచంద్రుని గుణగణములను ప్రశంసించెను.

ముని వచనములను విని సభాసదులెల్లరూ ప్రసన్నులై 'బాగుబాగు' యని పొగిడిరి. మునులకు నమస్కరించి భరతుడు గద్గద స్వరముతో పలికెను: "మునుల సమూహములో అదియు తీర్థరాజమైన ప్రయాగలో సత్యమును పలుకుచున్నాను. మీరు సర్వజ్ఞులు. శ్రీరామచంద్రుడు అంతర్యామి. అందరి మనస్సులలో నున్న భావమును గ్రహించువాడు. లోకము నన్ను నీచునిగా భావించునని నాకు దుఃఖము లేదు. తండ్రిగారి మృత్యుశోకము కూడా లేదు. ఏలనన వారి పుణ్యము కీర్తి విశ్వవ్యాప్తము అయినవి. అతడు శ్రీరామలక్ష్మణులవంటి అనుపమపుత్రరత్నములను కన్న పుణ్యాత్ముడు. శ్రీరామచంద్రుని వియోగబాధను భరించలేక క్షణభంగురమయిన ఈ శరీరమును వదలెను. విచారించ వలసిన విషయము ఏమన శ్రీ సీతారామ లక్ష్మణులు ముని వేషములతో ఈ వనములో పాదచారులై సంచరించుచున్నారు. వారు వల్కలములను ధరించి, ఫలములను భుజించి, గడ్డిఆకులు పరుచుకొని భూమిపై పరుండి, చెట్లక్రింద నివాసము చేయుచున్నారు. ప్రతిరోజు శీతవర్షాతప పవన బాధలను సహించుచున్నారు. ఈ దుఃఖతాపమే నా హృయమును కాల్చివేయుచున్నది. ఈ రోగమునకు మందు లభించలేదు. శ్రీరామ చంద్రుడు తిరిగి వచ్చిననేగాని ఈ ఉపద్రవము చల్లారదు. అప్పుడే అయోధ్య నిలబడును. వేరే ఉపాయము లేదు." భరతుని వచనములు విని మునులు సంతోషించిరి. భరద్వాజుడు పలికెను: "నాయనా!

నీవు విచారించవలదు. శ్రీరామచంద్రుని చరణములను చూచినంతనే దుఃఖమంతయు మాయమగును. ఇప్పుడు మీరు మా ప్రియమైన అతిథులు. మేమిచ్చిన కందమూలఫలములను స్వీకరించుడు" అని భరద్వాజుడు విశ్వాసపాత్రులైన శిష్యులను కందమూల ఫలములను తీసుకొని రమ్మని పంపెను. కాని భరతుడు, అతని సోదరుడైన శత్రుఘ్నుడు తమ పరివారముతో వచ్చినప్పుడు అతనికి ఆతిథ్యము నిచ్చుటకు తగిన రీతిగా ఏర్పాటు చేయుటకు తన తపోమహిమ చేత భరద్వాజుడు అణిమాది సిద్ధులను ప్రార్థించెను. వారు క్షణములో రాజపరివారమునకు అవసరమైన గృహములను నిర్మించి, భోగ ఐశ్వర్యసామాగ్రులను దాసదాసీలను అవసరమైన వస్తువులన్నిటినీ సమకూర్చిరి. అమృతతుల్యమైన భోజనపదార్థములన్నియూ సమకూర్చిరి. మహాముని తపశ్శక్తికి దేవతలు కూడా ఆశ్చర్యపడిరి. కాని భరతుడు మాత్రము ఇన్ని విలాస వస్తువుల మధ్యనున్ననూ వాటిని స్పృశించలేదు.

## 18. శ్రీరామభరత సమాగమము

ప్రాతఃకాలమున త్రివేణీ స్నానమాచరించి మునికి నమస్కరించి వారి ఆశీర్వాదములతో గుహుని తన పరివారమును వెంట నిడుకొని భరతుడు చిత్రకూటమునకు బయలుదేరెను. సాక్షాత్ అనురాగమే శరీరధారణ చేసినదాయన్నట్లు రామసఖుడైన గుహుని చేతిలో చేయి వేసుకొని భరతుడు నడుచుచుండెను. కాళ్ళకు పాదరక్షలు లేవు, శిరమున ఛత్రము లేదు, అతని ప్రేమ, స్నేహము, వ్రతము, ధర్మము నిశ్చలమైనది. శ్రీసీతారామలక్ష్మణులు ఏ విధముగా సంచరించినదీ తెలుపమని నిషాదరాజుతో అడుగగా అతడు తన కోమల స్వరముతో చెప్పుచుండెను. శ్రీరాముడు ఆగిన స్థలములను అక్కడి వృక్షములను చూచి అతని హృదయము ప్రేమభరితమాయెను. పృథ్వి

కోమలమాయెను. త్రోవ నిష్కంటకమాయెను. మేఘములతనికి నీడనిచ్చెను. శీతలమందసుగంధిత పవనములు వీచెను. భరతుని ప్రయాణము శ్రీరాముని ప్రయాణమునకన్నా సుఖదాయకమాయెను. మార్గములో శ్రీరామచంద్రుడు చూచిన లేక శ్రీరాముని చూచిన అసంఖ్యాకములైన జడచేతన జీవులు అదే సమయమున మోక్షమునకు అధికారి అయినవి. కాని ఇప్పుడు భరతుని దర్శనముచే అవి జననమరణరూపమైన భవరోగమునుండి ముక్తి పొందినవి.

భరతుని ప్రేమస్వభావమును చూచి ఈ ప్రేమవశమున శ్రీరాముడు తిరిగి పోయినచో తన కార్యము సఫలము కాదని ఇంద్రునికి విచారము కలిగెను. అతడు తన గురువగు బృహస్పతితో భరతునికి శ్రీరామచంద్రుని దర్శనము కాకుండా ఏదైనా కపటోపాయమును ఆచరించుమని ప్రార్థించెను. ఇంద్రుని మాటలు విని "వేయి కన్నులున్ననూ ఇతడు గ్రుడ్డివాడే" అని భావించుచూ బృహస్పతి చిరునవ్వుతో పలికెను: "అనవసరంగా భయపడకుము. కపటము మానుము. ఈ సమయములో ఎట్టి పన్నాగమయినను రహస్యమును బట్టబయలు చేయును. అది పన్నినవానికి ఎదురుతిరుగును. రఘునాథుడు తనకు చేసిన అపరాధమునకు ఎవ్వరినీ కోపగించడు. కాని భక్తుని యెడల అపరాధము చేసినవాడు శ్రీరాముని క్రోధాగ్నికి భస్మమగును. అంబరీషుని కథయే దీనికి దృష్టాంతము. ప్రపంచమంతయూ శ్రీరాముని జపించును. ఆ శ్రీరాముడు భరతుని జపించును. అట్టి భరతునితో సమానమగు ప్రియుడు శ్రీరామచంద్రునికి ఎవ్వరునూ లేరు. కావున ఇంద్రా! రఘుకుల శ్రేష్ఠుడైన శ్రీరామచంద్రుని భక్తునికి అహితమును ఎప్పుడూ తలంచకుము. భరతుడు భక్తశిరోమణి. అతనికి నీవు భయపడవలదు. ప్రభువు సత్యప్రతిజ్ఞుడు. దేవతలకు హితము చేయువాడు. భరతుడు శ్రీరామచంద్రుని ఆజ్ఞనే అనుసరించును. నీవు స్వార్థమునకు వశుడవై వ్యాకులుడవగుచున్నావు. ఇది నీ

అజ్ఞానము మాత్రమే." బృహస్పతి ఉపదేశమును విని ఇంద్రుని మనస్సు ప్రశాంతతను పొందెను. అతని చింత దూరమాయెను. దేవరాజు ప్రసన్నుడై భరతుని ప్రశంసించసాగెను. భరతుడు మార్గమున ప్రేమమగ్నుడు అయిపోతుండగా మునులు, సిద్ధులుకూడా అసూయచెందుచుండిరి. దారిలో మజిలీలు చేయుచూ భరతాదులు యమునానదీతీరమున బస చేసిరి. సమయానుసారముగా నిషాదరాజు ఆజ్ఞచే వారికి భోజన వసతి సౌకర్యములు ఏర్పరచబడెను. అన్ని ఘట్టములందు అసంఖ్యాకములయిన ఓడలు వచ్చి చేరెను. ఉదయమున అందరూ నదిని దాటిరి. నదిలో స్నానమాచరించి నదికి ప్రణమిల్లి నిషాదరాజుతో సోదరులిద్దరు బయలుదేరిరి. ముందుగా అందమైన వాహనములలో వశిష్ఠుడు, వామదేవుడు మొదలగు మునిశ్రేష్ఠులు ఉండిరి. వారి వెంట రాజపరివారము ఉండెను. వారివెంట సోదరులిద్దరూ అతి సామాన్యమయిన దుస్తులు ధరించి నడుచుచూ పోవుచుండిరి. వారి వెంట సేవకులు, మిత్రులు, మంత్రికుమారులు సీతాలక్ష్మణులను స్మరించుచూ నడుచుచుండిరి. ఏ ప్రదేశములందు శ్రీరాముడు విశ్రమించియుండెనో, వాటికి ప్రేమపూర్వకముగా నమస్కరించుచుండిరి. మార్గమధ్యమున స్త్రీ, పురుషులు వారి ఆగమనమును విని తమ పనులన్నియూ వదిలివేసి వచ్చి వారి స్వరూపమును ప్రేమను చూచి తమ జన్మ సఫలమయినదని భావించిరి. తన గుణములతో పాటు శ్రీరామచంద్రుని గుణగణములను వినుచూ, శ్రీరఘునాథుని స్మరించుచూ తీర్థమున స్నానమాడుచూ, మున్యాశ్రమాలను, దేవతామందిరములను చూచునప్పుడు ప్రణమిల్లుచూ భరతుడు ముందుకు నడుచుచుండెను. అందరికీ శుభశుకునములు కనపడెను. శ్రీరామచంద్రుని దర్శనమగునని అందరూ భావించిరి. శరీరములు అలిసిననూ కాళ్ళు తడబడుచున్ననూ శ్రీరాముని దర్శనాభిలాషతో ఉత్సాహముగా అందరూ నడిచిరి. అదే సమయమున నిషాదరాజు సహజసుందరమయిన కామద గిరిని వారికి

చూపెట్టెను. ఆ పర్వత సమీపమున పయస్విని అను నదీతీరమున శ్రీ సీతారామలక్ష్మణులు నివసించుచుండిరి. ఆ పర్వతమును చూడగానే అందరూ సాష్టాంగనమస్కారములు ఆచరించిరి. శ్రీ రఘునాథుడు అయోధ్యకు తిరిగివచ్చునట్టుగా సంతసించిరి. ఆ రాత్రి ఆ పర్వత సమీపమున బసచేసి తెల్లవారగానే ముందుకు ప్రయాణమయిరి.

అక్కడ శ్రీరామచంద్రుడు తెల్లవారకముందే నిద్రలేచెను. సపరివారముగా భరతుడు వచ్చినట్లు కలగన్న సీతాదేవి తన కలను శ్రీరామునితో చెప్పుచుండెను. "ప్రభువియోగముచే భరతుని శరీరము తప్తమయినది. అతనిని అనుసరించిన వారందరూ దీనులు, దుఃఖితులు విచారగ్రస్తులుగా నుండిరి. రాణుల ఆకారము పూర్తిగా మారిపోయినది." ఈ స్వప్న వృత్తాంతమును విని శ్రీరాముని కన్నులలో నీరు నిండెను. అందరినీ శోకమునుండి రక్షించు ప్రభువే శోకమగ్నుడాయెను. "ఈ స్వప్నము మంచిదికాదు. ఏదో అశుభవార్త వినబోవుచున్నాము" అని పల్కుచూ తమ్మునితోపాటు స్నానమాచరించి, మహాదేవుని పూజించి, మునులకు వందనము ఆచరించి, శ్రీరామచంద్రుడు కూర్చొని ఉత్తరదిశకు చూడసాగెను. ఆకాశము ధూళిధూసరితమై, పశుపక్ష్యాదులు వ్యాకులముతో పరుగెత్తుకొని ఆశ్రమమువైపునకు వచ్చుటను చూసెను. శ్రీరామచంద్రుడు లేచి నిలబడి దీనికి కారణము ఏమై ఉండునని ఆలోచించెను. ఇంతలో కోలులు, కిరాతులు వచ్చి సమాచారమంతయూ వినిపించిరి. సుందరమైన మంగళవచనములు విని శ్రీరాముని మనస్సు సంతసించెను. అతని శరీరము పులకరించెను. మరొకరు వచ్చి భరతునితో పాటు చతురంగబలము కూడా వున్నదని తెలిపిరి. ఇది వినగానే భరతుని స్వభావమును ఎరిగిన శ్రీరాముని మనస్సునకు నిలకడ చిక్కలేదు.

ప్రభు హృదయము క్షోభించుట నెరింగి లక్ష్మణుడు సమయానుకూలముగ పలికెను. "స్వామీ! మీరు అడుగకున్ననూ ఒక విషయము

విన్నవించెదను. సమయమును అనుసరించి సేవకుడు సలహాలిచ్చుటకు సాహసించవలెను. మీరు సర్వజ్ఞులు. అయినను నేను నా మనస్సులోని మాటను చెప్తాను. మీరు కరుణామయులు. అందరినీ సమానముగా ప్రేమించెదరు. అందరూ మీవలెనే యుందురని భావించెదరు. కాని మూఢులు, విషయలోలురు, రాజ్యాధికారము పొందినచో తమ స్వభావమును మరచెదరు. భరతుడు నీతిపరాయణుడు, సాధువు, చతురుడు మరియు మీపై అమితభక్తి కలవాడు. కాని నేడు ఆ భరతుడే రాజ్యాధికారమును పొంది ధర్మమర్యాదలు తప్పి వచ్చినాడు. మీరు వనవాసములో ఒంటరిగా నున్నారు. దుర్బుద్ధితో తన మనుజులను కూడగట్టుకొని రాజ్యమును నిష్కంటకముగా నొనర్చుకొనుటకు సేనతోపాటు వచ్చినాడు. శత్రుశేషము, ఋణశేషము మిగల్చరాదని భరతుడీ ఉపాయమును పన్నెను. మీకెవ్వరూ సహాయకారులు లేరని తలచి నిరాదరముతో ఈ పని చేయుట భరతునికి తగదు." ఆ విధముగా పలికి లక్ష్మణుడు చేతులు జోడించి భరతుని ఎదురించుటకు ఆజ్ఞకై ప్రార్థించెను. నిద్రించిన వీర రసమే మేల్కొనినదా అన్నట్లు శిరస్సున కొప్పుముడి వేసికొని, నడుమునకు అమ్ములపొదిని కట్టుకొని, చేతులలో ధనుర్బాణములు ధరించి యిట్లనెను: "నేడు నేను శ్రీరామచంద్రుని సేవకుడనను కీర్తిని పొందెదను. భరతునికి గుణపాఠము నేర్పెదను. శ్రీరాముని అవమానించిన నేరమునకు భరతశత్రుఘ్నులిద్దరూ రణశయ్యపై పరుండెదరు. సింహము గజసమూహములను చీల్చిచెండాడునట్లు భరతుని అతని సేనలతో సహా యుద్ధభూమిలో చూర్ణము చేసెదను." లక్ష్మణుని క్రోధాగ్నిని చూచి లోకములు తల్లడిల్లెను. అతని బాహుబలమును ప్రశంసించుచూ ఆకాశవాణి పలికెను: "నాయనా! నీ బలసామర్థ్యాలు ఎవరు ఎరుగరు? కాని ఏ కార్యమునైననూ ఉచితమో, అనుచితమో అని ఆలోచించి చేయవలెను. ఆలోచించకుండా సాహసముతో ఏదైనా పనిచేసి తర్వాత పశ్చాత్తాపపడుట బుద్ధిమంతుల లక్షణము కాదు."

ఆ దేవతావచనములు విని లక్ష్మణుడు జంకెను. సీతారాములతనికి ధైర్యము చెప్పిరి. శ్రీరాముడు పలికెను: "నాయనా, నీవు చెప్పినది నీతి సమ్మతమే. రాజ్యమదము ఎవ్వరినైనా యున్మత్తుని చేయును. కాని భరతుడు ఉత్తముడు. బ్రహ్మవిష్ణుమహేశ్వరుల పదవులు లభించిననూ భరతుడు రాజ్యమదము పొందడు" అని పల్కుచూ లక్ష్మణుని ఊరడించెను. భరతుడు మందాకినీనదియందు స్నానమాచరించి అందరినీ నదితీరమున నుంచి, తల్లుల, గురువుల, మంత్రుల, ఆజ్ఞను పొంది నిషాదరాజు మరియు శత్రుఘ్నుని తనతో తీసుకొని శ్రీసీతారాములున్నచోటికి పోయెను. తన తల్లిచేసిన దుష్కార్యము తలుచుచూ జంకుతో ముందుకు సాగెను. గుహుడు ధైర్యము చెప్పుచుండగా భరతుడు శ్రీరాముని ఆశ్రమమును సమీపించెను. మనోహరమైన ఆశ్రమమును చూచి భరతుడు అత్యంత ఆనందమును పొందెను. గుహుడు ఒక ఎత్తైన ప్రదేశమున నిలిచి రెండు చేతులతో చూపుచూ భరతునితో పలికెను: "అన్ని ఋతువులందు మనోహరముగా నున్న ఈ వనమున పర్ణకుటీరము నిర్మించుకొని శ్రీ సీతారామలక్ష్మణులు ఇందు నివసించుచున్నారు. ఒక వటవృక్షపు ఛాయయందు వేదికపై కూర్చొని పరమజ్ఞాని శ్రీరామచంద్రుడు మునులతో వేదశాస్త్రపురాణములు వినుచున్నారు." నిషాదరాజు వచనములు విని భరతుడు సమస్త సన్మంగళములకు స్థానమైన సుందరపవిత్ర ఆశ్రమమును చూడగలిగెను. వెంటనే ఆశ్రమమున ప్రవేశించి "ప్రభూ! నన్ను రక్షింపుము" అనుచూ శ్రీరామచంద్రుని పాదములపై పడెను. అతని ప్రేమపూరిత వచనములను విని గుర్తించి భరతుడు ప్రణమిల్లుచున్నాడని లక్ష్మణుడు గ్రహించెను. "రఘునాథా! భరతుడు నమస్కరించుచున్నా"డని పలికెను. ఆ మాటలు వినగానే శ్రీరామచంద్రుడు ఉలిక్కిపడి లేచెను. అతనిని లేవనెత్తి హృదయమునకు హత్తుకొనెను. భరతుని, శ్రీరాముని సమాగమమును అందరూ చూచి తమను తాము మరిచిపోయిరి. పిదప శ్రీరామచంద్రుడు ప్రేమ

పూర్వకముగా శత్రుఘ్నుని, నిషాదరాజును ఆలింగనము చేసుకొనెను. లక్ష్మణుడు కూడా భరతశత్రుఘ్నులను, గుహుని తన హృదయమునకు హత్తుకొనెను. భరత,శత్రుఘ్నులు మునులకు నమస్కరించిరి. సీతాదేవి చరణకమలములకు ప్రణమిల్లిరి. ఆమె మనస్సులో వారిని దీవించి తనను తాను మరచిపోయెను. ప్రసన్నురాలైన సీతాదేవిని చూచి భరతుడు శోకరహితుడై భయాందోళనలను వీడెను. ఎవ్వరు ఏమియూ మాట్లాడలేదు. ఎవరు కుశలప్రశ్నలు అడగలేదు.

ఆ సమయమున గుహుడు ధైర్యము వహించి చేతులు జోడించి వినతి చేయసాగెను: "ప్రభూ, మునిశ్రేష్ఠుడైన వశిష్ఠుడు, తల్లులు, పురజనులు, సేవకులు, సేనాపతులు, మంత్రులు, అందరూ మీ వియోగముచే వ్యాకులురై ఇక్కడికి వచ్చినారు." గురు వశిష్ఠుని ఆగమన వార్తను విని శ్రీరామచంద్రుడు శత్రుఘ్నుని సీతాదేవి వద్దనుంచి లక్ష్మణ సమేతుడై వేగముగా వెళ్ళి గురువుగారికి దండప్రణామములు ఆచరించెను. వసిష్ఠుడు ముందుకు పరుగెత్తుకొని వచ్చి వారిని తన హృదయమునకు హత్తుకొని ఆదరించెను. కరుణానిధి, చతురుడయిన శ్రీరాముడు ప్రజ లందరూ దుఃఖితులు అని యెరింగి వారి అభిలాష ప్రకారము వారి దుఃఖాగ్నిని చల్లార్చెను. అనేక కోట్ల ఘటములందు ఒకే సూర్యుడు ప్రతిబింబించునట్లు అయోధ్యావాసులందరి హృదయములలో శ్రీరాముడు ఒక్కసారిగా భాసిల్లెను. మంచుచే కొట్టబడిన అందమైన లతలవలె నున్న దుఃఖితులయిన తల్లులను శ్రీరామచంద్రుడు చూచెను. మొదట కైకేయికి ప్రణమిల్లి తన సద్బుద్ధిని భక్తిని ప్రకటించి ఆమెను అనునయించెను. రాజమాతలందరినీ ఓదార్చెను. పిదప రామలక్ష్మణులు గురుపత్నియైన అరుంధతి చరణములకు నమస్కరించిరి. పిదప సుమిత్రాదేవికి, కౌసల్యాదేవికి ప్రణమిల్లిరి. వారు కుమారులను మిక్కిలి అనురాగముతో హృదయమునకు హత్తుకొని కన్నీటితో తడిపిరి. శ్రీరామచంద్రుడు వారినందరినీ తన

ఆశ్రమమునకు ఆహ్వానించెను. అయోధ్యావాసులు జలస్థలవసతులు ఉన్నచోట వసించిరి. బ్రాహ్మణులు, మంత్రులు, తల్లులు, గురువులు, మొదలగువారిని వెంటనిడుకొని భరతుడు, శ్రీరాముడు, లక్ష్మణుడు పవిత్రమయిన ఆశ్రమమునకు పోయిరి.

సీతాదేవి వశిష్ఠమునికి, గురుపత్నియైన అరుంధతిదేవికి ప్రణమిల్లెను. తన అత్తగార్లను చూచినప్పుడు సీతాదేవి హృదయము మిక్కిలి పరితపించెను. వారు కూడా ఆమెను చూచి విధివైపరీత్యమును నిందించుచూ దుఃఖించిరి. సీతాదేవి ఒకరి తరువాత ఒకరి పాదములు స్పృశించగా వారు "సదా సుమంగళివిగా నుండుము" అని ఆశీర్వదించిరి. వశిష్ఠుడు అందరినీ కూర్చొనమని ఆదేశించి, అనేక వేదాంత రహస్యములు తెలుపుచూ దశరథ మహారాజు మరణవార్తను తెలిపెను. తనపైగల ప్రేమ వల్లనే రాజు మరణించినాడని విని ధీరుడైన శ్రీరాముడు కూడా సహించరాని వేదనను అనుభవించెను. లక్ష్మణుడు, సీతాదేవి, రాణులుకూడా విలపింప సాగిరి. వశిష్ఠుడు అందరికీ ధైర్యము చెప్పి ఓదార్చెను. సపరివారముగా శ్రీరాముడు మందాకినీ నదిలో స్నానమాచరించి నిర్జల వ్రతమును పూనెను.

రెండవరోజు ప్రాతఃకాలముననే ముని ఆజ్ఞానుసారము శ్రీరామచంద్రుడు వేదోక్తముగా తన తండ్రిగారి శ్రాద్ధ కర్మలను నిర్వర్తించెను. రెండు రోజుల తర్వాత శ్రీరాముడు గురువుగారితో పలికెను: "ప్రభూ! కందమూలఫలములు, నీరును ఆహారముగా గొని జనులందరూ దుఃఖితులుగా నున్నారు. భరత శత్రుఘ్నులు, మంత్రులు, తల్లులను చూచి నాకు ప్రతిక్షణము యుగమువలె తోచుచున్నది. కావున పురజనులందరితో పాటు మీరు అయోధ్యకు తిరిగి పోవలసినది. మీరిక్కడ, తండ్రిగారు స్వర్గములో, మరి అయోధ్య శూన్యమైనది. నేను సాహసముతో చెప్పినను మీ కేది ఉచితమో దానిని చేయుడు." శ్రీరాముని వచనములను విని ప్రజలందరూ భయపడిరి. అప్పుడు

గురువుగారు యిట్లు పలికెను: "రామా! నీవు ధర్మసేతువు, మరియు కరుణామయుడవు, నీవిట్లు పలుకుటలో ఆశ్చర్యము లేదు. ప్రజలు దుఃఖితులు అయిననూ నీ దర్శన సౌఖ్యముచే వారిని కొద్ది రోజులు సుఖశాంతులతో ఉండనిమ్ము." వశిష్ఠుని పలుకులు విని ప్రజలు సంతసించిరి. వారు ప్రతిరోజు పయస్వినీ నదియందు స్నానమాడి శ్రీరాముని నేత్రానందముగా దర్శనము చేసుకొని ప్రణామములు ఆచరించి చిత్రకూటము, కామదగిరి మొదలగు పర్వతములను, వనములను చూచుటకు పోవుచుండిరి. అమృతతుల్యమగు జలము లతో సెలయేరులు ప్రవహించుచుండెను. శీతల మంద, సుగంధిత పవనము వారి తాపత్రయములను హరించుచుండెను. లతలు, ఫలపుష్పములతో కూడిన వృక్షములు, సుందర శిలలు, కమలములతో కూడిన సరోవరములు, పక్షుల కిలకిలారావములు, సహజ వైరమును మాని విహరించు పశుపక్ష్యాదులతో ఆ వనము వారికి మిక్కిలి మనోహరముగా నుండెను. అడవి జాతివారు వారికి కందమూల ఫలములను, తేనెను తెచ్చి సమర్పించుచుండిరి. అయోధ్యవాసులకు సేవ చేయుటయే తమ భాగ్యమని వారు భావించుచుండిరి. నిరంతరము శ్రీరామచంద్రుని దర్శించుచూ సేవించుచుండిన వారి అదృష్టమును అయోధ్యావాసులు కొనియాడిరి. ఈ విధముగా ప్రతిదినము వారు పరమానందముతో వనశోభను తిలకించుచూ ఆనందముగా గడిపిరి.

సీతాదేవి తన అత్తగార్లందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క వేషములో కనపడి వారి సేవలు చేయుచుండెను. వారు ఆమెకు ఉపదేశములు, ఆశీర్వాదములను యిచ్చిరి. సీతారామలక్ష్మణుల శాంతస్వభావమును చూచి, కుటిల స్వభావురాలైన కైకేయి పశ్చాత్తాపపడెను. "శ్రీరామచంద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చునా? రాడా?" అని ప్రతి యొక్కరి మనస్సులో సందేహము కలుగుచుండెను. భరతునికైతే ఆకలి వేయుటలేదు. నిద్రపట్టుట లేదు. అతడు నిరంతరము

ఆలోచించసాగెను: "బాగుగా పండి కోతకు సిద్ధమయిన ధాన్యము ఈతిబాధలవలన నష్టమయినట్లు రాముడు రాజ్యాభిషిక్తుడు అగు సమయమున నా తల్లి దుర్బుద్ధిచే సర్వము విఘ్నమయినది. ఏ విధముగా శ్రీరామచంద్రుని పట్టాభిషేకము జరుగును? నాకు ఏ ఉపాయము తోచుటలేదు. గురువుగారి ఆజ్ఞను పాలించి శ్రీరాముడు తప్పక అయోధ్యకు తిరిగి రాగలడు. కాని వశిష్ఠముని శ్రీరామచంద్రుని మనస్సు నెరిగియే ఏమైనా చెపుతారు. మాత కౌసల్య చెప్పినచో తిరిగి రాగలడు. శ్రీరాముని కన్నతల్లి అతనిని బలవంతము చేయునా? నేనైతే అతని సేవకుడను. నేను హఠము చేసినచో అది అధర్మము అగును. నాకు ఏ ఉపాయము తోచుటలేదు." ఇట్లు ఆలోచించుచుండగా రాత్రి గడిచెను. ప్రాతఃకాలమున భరతుడు స్నానముచరించి శ్రీరామునికి శిరసాప్రణమిల్లి కూర్చొనుచుండగా వశిష్ఠుడు అతనిని పిలువనంపెను.

ముని శ్రేష్ఠుడయిన వసిష్ఠుడు అందరినీ సమావేశపరచి ఇట్లు పలికెను: "సభాసదులారా! వినుడు. శ్రీరామచంద్రుడు రాజు స్వతంత్రుడు, ధర్మరక్షణచేయు భగవంతుడు, సత్యప్రతిజ్ఞుడు, వేద మర్యాదలను రక్షించువాడు. శ్రీ రాముని జననమే జగత్ కల్యాణమునకై జరిగినది.ఆయన గురువుల తల్లిదండ్రుల ఆజ్ఞలను పాలించువాడు. దుష్టులను నాశమొనర్చి దేవతలను రక్షించువాడు. నీతి, ప్రీతి, పరమార్థము, స్వార్థము వీటి సరియైన అర్థమును ఎరిగిన వాడు, కావున శ్రీరామచంద్రుని ఆజ్ఞను పాలించుటలోనే మన మేలు కలదు. ఈ తత్త్వరహస్యమును గ్రహించి చతురులయిన మీకు ఏది సమ్మతమో ఆ సలహో నివ్వండి. శ్రీరాముని పట్టాబిషేకము అందరికీ సుఖదాయకము. శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వచ్చు మార్గము ఆలోచించి ఉపాయమును చెప్పుడు." లోకహితమును గోరి పలికిన ముని వాక్యములను అందరూ ఆదరముగా వినిరి. కాని ఎవ్వరూ ఎట్టి సమాధానమును ఇవ్వలేదు. అప్పుడు భరతుడు ప్రణమిల్లి చేతులు

జోడించి పలికెను: "సూర్యవంశములో అనేక మంది రాజులు ఉద్భవించిరి, వారు ఒకరికంటే మరొకరు గొప్పవారు. వారి జన్మకు కారకులు తల్లిదండ్రులు. విధాత వారి శుభాశుభకర్మ ఫలములను పంచును. కాని మీ ఆశీర్వాదము సమస్త దుఃఖములను నాశన మొనర్చి శుభమును చేకూర్చును. మీరొక్కరే విధాత నిర్ణయమును కూడా మార్చగలరు. మీరేది నిశ్చయించినారో దానిని ఎవ్వరూ వ్యతిరేకించరు." భరతుని ప్రేమపూరిత వచనములు విని వశిష్ఠుడు ఇట్లు పలికెను: "నాయనా! నీ పలుకులు సత్యమే. కాని దానికి శ్రీరామచంద్రుని కృపయే కారణము. శ్రీరామచంద్రునికి విముఖుడు అయిన వానికి స్వప్నములో కూడా కార్యసిద్ధి జరగదు. నాకొక్క ఉపాయము తోచుచున్నది. దానిని చెప్పుటకు సంకోచించుచున్నాను. సర్వస్వము నష్టమగుచున్నప్పుడు బుద్ధిమంతులు సగమును త్యాగము చేయుటకు సిద్ధపడుదురు. కావున భరతశత్రుఘ్నులిద్దరూ వనవాసము చేయండి. సీతారామలక్ష్మణులను అయోధ్యకు తిరిగి రానివ్వండి." ఈ మధురమైన వచనములు విని సోదరులిద్దరూ ఆనందపరవశులైరి. వారి మనస్సులు ప్రసన్నమై దశరథ మహారాజు బ్రతికినట్లు, శ్రీరామచంద్రుడు రాజైనట్లు సంతోషించిరి. అందులో హాని కొద్దిగా, లాభము చాలా యున్నట్లు తోచెను. కాని రాణులకు మాత్రము సుఖదుఃఖములు సమానము అనిపించి విలపించసాగిరి. భరతుడు పలికెను: "మునిశ్రేష్ఠుని ఆజ్ఞను నెరవేర్చడం వలన జగత్తులోని సమస్త జీవుల వాంఛితములు ఈడేరును. పదునాలుగు సంవత్సరములు ఎందుకు? నేను జీవితమంతయూ వనవాసము చేయగలను. ఇంతకంటే నాకు సుఖము వేరేలేదు. శ్రీ సీతారాములిద్దరు అంతర్యాములు, సర్వజ్ఞులు. స్వామీ! మీరు ఈ మాటను హృదయపూర్వకముగా చెప్పుచున్నచో, ఈ ప్రస్తావనను మార్చేదిలేదని ప్రమాణము చేయండి." భరతుని ప్రేమపూరిత వాక్యములకు వశిష్ఠుడు మరియు ఇతర జనుల పులకించి పోయిరి.

వశిష్ఠుని అంతరాత్మలో భరతుడు అత్యంత ప్రేమాస్పదుడాయెను. ఆయన సపరివారముగా శ్రీరాముని వద్దకు వచ్చెను. శ్రీరామచంద్రుడు అతనికి నమస్కరించి అందరిని ఆసీనుల గావించెను. పిదప దేశకాలసందర్భములకు తగునట్లు ముని పలికెను: "సర్వజ్ఞా, రామా! నీవు ధర్మము, నీతి, గుణము, జ్ఞానములకు నిధివి. అందరి హృదయములలో నుండి వారి మంచి చెడు భావములను కూడా తెలుసుకొందువు. పురవాసులకు, తల్లులకు, భరతునికి ఏది శుభమో అట్టి ఉపాయమును తెలుపుము." ముని మాటలు విని శ్రీరఘునాథుడు పలికెను: "ప్రభూ, ఉపాయము మీ వద్దనే ఉన్నది మీ కోరిక నెరవేర్చుట, మీ ఆజ్ఞను పాలించుటలోనే అందరికీ శుభము కలుగును. మీ ఆజ్ఞను నేను శిరసా వహించెదను." వశిష్ఠుడు యిట్లు పలికెను: "రామా! నీవు సత్యము పలికితివి. కాని భరతుని భక్తి నా బుద్ధిని అతిక్రమించినది. భరతుని భక్తికి నా బుద్ధి తలయొగ్గినది. కావున భరతునికి ఏమి అపేక్షితమో దానిని చేయుట మంచిదని నా అభిప్రాయము. మొదట భరతుని ప్రార్థను సాదరముగా వినండి. దానిపై బాగుగా ఆలోచించండి." భరతునిపై గురువునకు గల అనురాగమును చూచి శ్రీరాముడు మిగుల ఆనందించెను. భరతుని ధర్మపరిరక్షకునిగా మనోవాక్కర్మలచే తన సేవకునిగా గుర్తించి ఇట్లనెను: "స్వామీ? భరతునితో సమానుడైన సోదరుడెవ్వడూ లేడు. అది గాక మీ అనురాగమును పొందిన భరతుడు మిక్కిలి భాగ్యశాలి. నా తమ్ముడు అగుటవలన అతని గొప్పదనమును పొగడుటకు సంకోచించుచున్నాను. భరతుడు ఏది చెప్పునో దానిని చేయుటయే శ్రేయస్కరము." అప్పుడు వశిష్ఠ మహాముని భరతునితో పలికెను: "నాయనా, భరతా! సంకోచమును వదిలి దయాసాగరుడైన శ్రీరామచంద్రునితో నీ మనస్సులోని మాటను తెలుపుము."

ముని వచనములు విని భరతుడు ఆనందించెను. కాని భారమం తయూ తనపై నుంచుటచే ఏమియూ చెప్పలేక ఆలోచనలో మునిగి పోయెను. ధైర్యము వహించి సభలో లేచి నిలుచుండి యిట్లు పలికెను: "నేను చెప్పవలసిన విషయమును మునీశ్వరులే సెలవిచ్చినారు. నా స్వామి స్వభావమును నేను ఎరుగుదును. ఆయన అపరాధులను కూడా కోపించడు. ఆటలలో కూడా నేనతనిని అప్రసన్నునిగా చూడలేదు. బాల్యము నుండి కూడా నేనతనిని విడిచి యుండలేదు. నేను ప్రభు కృపను బాగుగా అనుభవించినాను. ఆటలో కూడా నేను ఓడిపోయేటప్పుడు నన్ను గెలిపించేవాడు. కాని విధాత మా స్నేహమును సహించలేక పోయెను. ఆయన నా తల్లిద్వారా మా యిద్దరి మధ్య భేదమును సృష్టించి విడదీసెను. ప్రేమతో ఇచ్చిన వాగ్దానమును రక్షించుటకు నా తండ్రిగారు మరణించుట, నా తల్లిగారి దుర్బుద్ధి ప్రపంచమంతయూ చూచినది. ఇప్పుడు వ్యాకులులయిన మా తల్లులను చూడలేము. అయోధ్యలోని స్త్రీపురుషులందరూ దుస్సహమయిన తాపముచే బాధపడుచున్నారు. ఈ అనర్థములు అన్నిటికీ మూలము నేనేయని తెలుసుకొని దుఃఖమును సహించినాను. సీతాలక్ష్మణులను వెంటనిడుకొని ముని వేషము ధరించి శ్రీరామచంద్రుడు కాలినడకన వనమునకు వచ్చినాడు. దీనిని వినికూడా నేను బ్రతికేయున్నాను. ఇప్పుడు యిక్కడికి వచ్చి ప్రత్యక్షముగా అన్నింటినీ చూసినాను. ఎవరిని చూచి త్రోవలో గల సర్పములు, తేళ్ళు కూడా తమ విషమును త్యజించునో అట్టి సీతారామలక్ష్మణులు కైకేయి దృష్టిలో శత్రువులైరి. కైకేయి పుత్రుడనైన నాకుతప్ప ఈ దుస్సహవేదన నెవరికి విధాత విధించును?" దుఃఖము, ప్రేమ, నీతి, వినయములతో కూడిన భరతుని వ్యాకుల హృదయము నుండి వచ్చిన మధురవాణిని విని అందరూ శోకమగ్నులైరి. వశిష్ఠుడు అనేక పౌరాణిక కథలు చెప్పి భరతుని ఊరడించెను. శ్రీరాముడుకూడా యిట్లు పలికెను: "భరతా! జీవునిగతి ఈశ్వరుని అధీనము అని తెలిసికూడా నీవు

వృధాగా బాధపడుచున్నావు. ముల్లోకములలో నీతో సమానమైన కీర్తిమంతుడు లేడు. నీపై కుటిలత్వమును ఆపాదించువాడు ఈ లోకమున నాశనమొందును. నీ రక్షణపైననే పృధ్వి ఆధారపడినది. వ్యర్ధముగా కుతర్కము చేయవలదు. ప్రేమ, ధైర్యము దాచినచో దాగవు. నాయనా! నేను నిన్ను బాగా ఎరుగుదును కాని నా మనస్సు సందిగ్ధమయినది. రాజు తన ప్రమాణమును నిలబెట్టుకొనుటకు నన్ను త్యజించెను. నాపై వాత్సల్యముచే ప్రాణములను త్యజించెను. అట్టి తండ్రిగారి మాటను జవ దాటుటకు మనస్సు బాధ పడును. దానికంటే ఎక్కువగా నా మనస్సులో నీ గురించి చింత గలదు. వీటన్నిటికంటే ముఖ్యముగా గురువుగారు నన్ను ఆజ్ఞాపించినారు. కావున ప్రశాంత చిత్తుడవై సంకోచములు వదలి నీవేది చెప్పిన దానిని నేను నెరవేర్చెదను." సత్యప్రతిజ్ఞుడైన శ్రీరాముని మాటలు విని సభాసదులు ప్రసన్నులైరి.

పూర్తిగా భారము తనపై పడినది అని భావించి భరతుని హృదయము అనేక విధముల ఆలోచించసాగెను. పిదప శ్రీరాముని ఆజ్ఞను పాలించుటలోనే తనకు శుభమగునని నిశ్చయించుకొని యిట్లు పలికెను: "స్వామీ! కరుణాసాగరా! అంతర్యామీ! ఇప్పుడు నేను ఏమి చెప్పగలను? ఇతరులతో ఏమి చెప్పించగలను? గురువుగారి ప్రసన్నత, స్వామి అనుకూలత నా మలిన మనస్సులోని కల్పిత వ్యధను తుడిచివేసినది. నా భయము నిష్కారణమైనది. నా దౌర్భాగ్యము, నా తల్లి కుటిలత్వము, విధి వైపరీత్యము, కాలకాఠిన్యము – ఇవన్నియూ నాపై కుట్ర పన్నినవి. కాని శరణాగతవత్సలుడగు మీ ప్రతిజ్ఞ నన్ను రక్షించినది. కరుణామూర్తీ! మీ మనస్సున ఉద్వేగము లేకుండా ఈ దాసునికి ఏది క్షేమమో దాని చేయుడు. మీరు అయోధ్యకు తిరిగి వచ్చుటలో అందరి స్వార్ధము గలదు. కాని మీ ఆజ్ఞను పాలించుటలో కోటి శుభములు కలవు. యిదియే స్వార్ధపరమార్ధముల

సారము, సమస్త పుణ్యముల ఫలము, దేవా! నా ప్రార్ధనను విని మీకు ఏది ఉచితము అని తోచిన అట్లు చేయుడు. రాజ్యాభిషేకమునకు వలసిన సామాగ్రి అంతయూ తెచ్చినాను. మీ మనస్సు యిచ్చగించిన రాజ్యాభిషేకము చేసుకొని వాటిని సఫలము చేయుడు. నన్ను, శత్రుఘ్నుని వనములకు పంపండి. మీరు అయోధ్యకు పోయి అందరినీ పునీతులుగా చేయుడు. లేదా లక్ష్మణుని, శత్రుఘ్నుని తిరిగి పంపుడు. నేను మీతో పాటు ఉండగలను. లేదా మూడవ ప్రత్యామ్నాయము మేము ముగ్గురము సోదరులము వనవాసము చేసెదము. మీరు సీతాదేవితో సహా అయోధ్యకు తిరిగిరండి. మీరు ప్రసన్నులై ఏ ఆజ్ఞ యిచ్చిననూ మాకది శిరోధార్యము." భరతుని పవిత్ర వచనములు విని అందరూ ప్రసన్నులైరి. కాని శ్రీరాముడు మాత్రము మౌనముగా నుండిపోయెను.

## 19. జనకుని ఆగమనము

అదే సమయమున జనకమహారాజు దూతలు వచ్చిరి. వారి రాకను విని వశిష్ఠుడు వెంటనే వారిని పిలిపించెను. దూతలు నమస్కరించి శ్రీరాముని మునివేషముతో చూచి విచారించిరి. "జనకరాజు కుశలమా?" అని వశిష్ఠుడు దూతలను అడిగెను. దూతలు ప్రణమిల్లి పలికిరి: "స్వామీ! మీరు కుశలప్రశ్నలు వేయుటయే మాకు శుభంకరము. కుశలమంతయు కోసలనాథుడైన దశరథునితోనే పోయినది. దశరథుడు స్వర్గస్థుడైన వార్తవిని జనకపుర వాసులందరూ శోకతప్తులైరి. రాణి కైకేయి పన్నాగము వినగానే జనకరాజు ఏమియూ తోచని వాడాయెను. 'భరతునికి రాజ్యాభిషేకము, శ్రీరాముని వనవాసము' ఈ మాటలను వినిన జనకుని హృదయము చింతతో వ్యాకులమాయెను. వెంటనే పండితులను, మంత్రులను పిలిచి కర్తవ్యమును ఆలోచించిరి. ఎవరు ఏమియూ చెప్పలేకపోయిరి. అప్పుడు రాజు ధైర్యము వహించి నలుగురు చతురులయిన గూఢచారులను అయోధ్యకు పంపెను. వారినిట్లు

ఆజ్ఞాపించెను: "మీరు అయోధ్యకు పోయి శ్రీరామునియెడల భరతునికి సద్భావమా, లేక దుర్భావమా కనుక్కొని రండి. కాని ఎవ్వరికి గూడా మీరెవ్వరో తెలియకూడదు." ఆ నలుగురు గూఢచారులు అయోధ్యకు పోయి భరతుని వైఖరిని గూర్చి తెలిసికొనిరి. భరతుడు చిత్రకూటమునకు తరలి రాగానే వారు మిథిలానగరమునకు వచ్చిరి. జనకమహారాజు సభలో భరతుని కార్యదీక్షను వర్ణించి చెప్పిరి. జనకరాజు భరతుని పొగడుచూ పరాక్రమశాలురు యోధులైన సేనాపతులను పిలిచెను. నగరమును, దేశమును, రాజ భవనమును కూడా వారి రక్షణలో నుంచి తానూ గుర్రములు, ఏనుగులు మొదలగు వానితో శుభముహూర్తమున బయలుదేరి త్రోవలో ఎక్కడా ఆగకుండా ఈ రోజు ఉదయము ప్రయాగ చేరినారు. అక్కడ స్నానమాచరించి బయలుదేరినారు. వారి పరివారము యమునను దాటినది. ముందుగా ఈ వార్తను తెలుపమని మమ్ములను పంపినారు."

జనకరాజు ఆగమన వార్తను విని అయోధ్యాప్రజలు సంతోషభరితులైరి. శ్రీరాముడు సందిగ్ధావస్థలో పడెను. కైకేయి బాధతో కుమిలిపోవుచుండెను. స్త్రీ పురుషులందరూ 'జనకుని రాక వలన ఇంక కొద్ది రోజులు ఉండవచ్చును కదా!'యని సంతోషించిరి. వారు సకల దేవతలను యిట్లు ప్రార్థించిరి: "శ్రీరాముడు రాజుగా సీతాదేవి రాణిగా భరతుడు యువరాజుగా అయోధ్యానగరము ఆనందముతో నుండుగాక! సమాజము సుఖశాంతులతో వర్ధిల్లుగాక!".

ఆ సమయమున మిథిలాధిపతి జనకుడు వచ్చుచున్నాడని విని శ్రీరాముడు పరివారముతో సహా సాదరముగా లేచి నిలబడెను. జనకుని ఆహ్వానించుటకు తన సోదరులతో, మంత్రులతో గురువుతో పురజనులతో ముందుకు నడిచెను. జనకుడు రథము దిగి శ్రీరాముని దర్శించెను. వశిష్ఠునికి నమస్కరించెను. శ్రీరఘునాథుడు కూడా శతానందుడు మొదలగు మునులకు నమస్కరించి జనకుని

సపరివారముగా తన ఆశ్రమమునకు పిలుచుకొనివచ్చెను. రెండవరోజు ప్రాతఃకాలముననే జనకుడు శ్రీరాముడు ఇతరులు స్నానమును ఆచరించి వటవృక్షము క్రింద కూర్చొనిరి. వశిష్ఠుడు, శతానందుడు విశ్వామిత్రుడు కూడ వారికి ధర్మ, నీతి వైరాగ్య వివేక శాస్త్రములలో ఉపదేశములు చేసిరి. వనవాసులు వారికి కందమూల ఫలములను సమర్పించిరి. జనకపురవాసులు వనశోభను తిలకించుచూ సంచరించుచుండిరి. ఆ విధముగా నాలుగు దినములు గడిచెను. మందాకినీ నదియందు స్నానము, శుభలక్షణసంపన్నుడైన శ్రీరాముని దర్శనము, వనములందు తపోవనస్థానములందు విహారము, అమృతతుల్యమయిన కందమూలఫలభక్షణము జనకపురవాసులకు మిక్కిలి ఆనందదాయకములాయెను.

అదే సమయమున సీతాదేవి తల్లిగారైన సునయనాదేవిచే కౌసల్య మున్నగు రాణులను చూచుటకు పంపబడిన దాసీలు వచ్చిరి. ఆ దాసీలద్వారా సీతాదేవి అత్తగార్లు ఆ సమయమున తీరికగానున్నారని తెలుసుకొని జనకపురి రాణివాస స్త్రీలు వారిని కలియుటకు పోయిరి. కౌసల్యాదేవి వారిని సాదరముగా ఆహ్వానించి ఉచితాసనములను ఇచ్చెను. వారి శరీరములు పులకించెను. నేత్రములు సజలమాయెను. కరుణరసమే అనేక రూపములు ధరించినదా యన్నట్లు స్త్రీలందరూ శ్రీ సీతారాములను ప్రేమమూర్తులుగా భావించిరి. శోకతప్తురాలైన సునయనాదేవిని సుమిత్ర కౌసల్యలు ఓదార్చిరి. భరతుని శీలము, గుణము, వినయము, భక్తి విశ్వాసములను వారు మిక్కిలి పొగిడిరి. కౌసల్యాదేవి నిష్కపట స్వభావమును చూచి వారు మిక్కిలి సంతసించిరి. పిదప సీతాదేవిని తన గుడారమునకు తీసుకొని పోవుటకు అనుమతినిపొంది సునయనాదేవి కూతురితో సహా పోయెను. అచ్చట సీతాదేవి తన కుటుంబసభ్యులతో కలిసెను. ఆమె మునివేషములో నుండుటను చూచి వారు దుఃఖితులు అయిరి. జనకమహారాజు కూడా

అచటికి వచ్చి సీతాదేవిని చూచి ప్రేమవిహ్వలుడు ఆయెను. అతడిట్లు పలికెను: "బిడ్డా! నీవు రెండు వంశములను పావనము చేసితివి. నీ కీర్తివలన లోకమంతయు వెలుగును చూచినది." తల్లిదండ్రులు ఆమెను హృదయమునకు హత్తుకొని హితమైన ఉపదేశములను, ఆశీర్వాదములను ఇచ్చి అత్తగార్ల సేవకై పంపివేసిరి.

మరునాడు ప్రాతఃకాలమున అయోధ్యా, మిధిలావాసులు నిద్రలేచి స్నానమాచరించి ఇష్టదేవతలను ఆరాధించిరి. శ్రీరామచంద్రుడు స్నానానంతరము వశిష్ఠముని వద్దకు వెళ్ళి నమస్కరించెను. మరియు యిట్లు పలికెను: "భరతుడు, అయోధ్యావాసులు, తల్లులు శోక వ్యాకులురు, వనవాసదుఃఖితులు అయిరి. మిథిలాధిపతి కూడా పరివారముతో సహా క్లేశములు అనుభవించుచూ చాలా రోజులు ఉన్నారు. కావున ఏది ఉచితమో దానిని చెయ్యండి. అందరి హితము మీ చేతులలో కలదు." శ్రీరాముని శీలస్వభావములకు సంతసించి వశిష్ఠుడు యిట్లు పలికెను: "రామా! నీవు లేకుండా ఈ రెండు సమాజముల వారికి ఇల్లు వాకిలి, ఇతర సుఖములు నరకముతో సమానము. నీ ఆజ్ఞయే అందరికి శిరోధార్యము." అట్లు పలికి శ్రీరాముని ఆశ్రమమునకు పంపి వశిష్ఠుడు జనకరాజు వద్దకు వచ్చి శ్రీరామచంద్రుని వచనములను వినిపించెను. "రాజా! మీరు విజ్ఞాననిధులు, సుజనులు, పవిత్రులు, ధర్మనిష్ఠాపరులు. ఈ సందిగ్ధ పరిస్థితిని పరిష్కరించుటకు మీరే సమర్థులు." అని పల్కెను. వశిష్ఠ ముని వచనములు విని జనకుడు సంతసించెను. పిదప పరివారముతో సహా భరతుని వద్దకు పోయెను. భరతుడు అతనికి నమస్కరించి శ్రీరాముని యెడలగల తన భక్తిశ్రద్ధలను ప్రకటించెను.

జనకుడు, వశిష్ఠుడు మొదలగు మునులతో కలిసి శ్రీరాముని వద్దకు వచ్చి యిట్లు పలికెను: "నాయనా! రామా! ప్రతిఒక్కరూ నీవిచ్చు ఆజ్ఞను శిరసావహించెదరు. యిది నా అభిప్రాయము." రఘునాథుడు

చేతులు జోడించి "మీరు, మిథిలేశ్వరులు ఉండగా మీ సమక్షమున నేను చెప్పుట అనుచితము. మీ ఆజ్ఞ అందరికీ శిరోధార్యము" అని పలికెను. అందరూ సంకోచముతో మౌనము వహించి భరతుని వంక చూడసాగిరి. భరతుడు ధైర్యము వహించి చేతులు జోడించి అందరికి ప్రణమిల్లి శ్రీరామచంద్రునితో యిట్లు పలికెను: "ప్రభూ! మీరే నాకు తల్లి, తండ్రి, గురువు, స్వామి, పూజ్యులు, హితకారి. మీరు అంతర్యామి, సర్వజ్ఞులు, శరణాగతరక్షకులు, గుణములను గ్రహించి దోషములను హరించువారు. ప్రభూ! నేను తండ్రిగారి ఆజ్ఞను మోహవశమున ఉల్లఘించి సమాజముతోపాటు ఇక్కడికి వచ్చినాను. మీ కృపవలన నా దోషములు కూడా భూషణములు అయినవి. నా కీర్తి నలుదిక్కుల వ్యాపించినది. మీ ప్రవర్తన, మహిమ జగత్ప్రసిద్ధము. దుష్టులు, నీచులు, నాస్తికులు, నీతిమాలిన వారు కూడా మీ శరణుజొచ్చిన, వారిని క్షమించినారు. మీ వంటి ప్రభువు మరొక్కరు ఉండరు. శోకము లేక స్నేహవశుడవై బాల్యస్వభావముచే మీ ఆజ్ఞను పాలించకుండా నేను వచ్చినాను. అయిననూ కృపతో నా యపరాధమును క్షమించి దయ చూపినారు. ప్రభు పాదములపై ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. సర్వకాల సర్వావస్థలయందునూ స్వామి సేవచేయుటయే నా కోరిక. మీ ఆజ్ఞయే నాకు శిరోధార్యము" అని పలికి భరతుడు పులకిత శరీరముతో సజలనయనములతో ప్రభు చరణములపై వ్రాలెను. అందరూ భరతుని భాతృభావమును అపార భక్తిమహిమను పొగడసాగిరి. దేవతలు కూడా బరువెక్కిన హృదయములతో భరతుని పొగడుచూ అతనిపై పుష్పవృష్టిని కురిపించిరి.

## 20. పాదుకా ప్రదానము

దయాళువు అయిన శ్రీరాముడు సభాసదుల స్థితిని చూచెను. భరతుని మనస్సులోని మాటను తెలిసికొనెను. దేశకాల అవసరములను,

సమాజమును చూచి అమృతతుల్యమయిన వాక్కులతో పల్కెను: "సోదరా! భరతా! నీవు ధర్మధురంధరుడవు, ప్రేమమూర్తివి. కర్మవచనమనోపవిత్రతకు నీకు నీవే సాటి. నీవు సూర్యవంశమర్యాదను, సత్యప్రతిష్ఠుడైన తండ్రిగారి కీర్తి ప్రేమలను, సమాజము, గురువులందు మర్యాదను ఉదాసీనులైన మిత్రశత్రు మనస్సులను కూడా ఎరుగుదువు. నీపై నాకు పూర్తిగా విశ్వాసము కలదు. తండ్రిగారు లేని సమయమున కేవలము గురువుగారి కృపయే మనలను రక్షించినది. రాజకార్యము, గౌరవప్రతిష్ఠలు, ధర్మము అన్నియు, గురువుగారి మహిమచేతనే రక్షింపబడును. తల్లిదండ్రుల, గురువుల ప్రభువాజ్ఞను పాలించుటయే ధర్మరక్షణకు సాధనము, కావున నీవు వారి ఆజ్ఞను పాలించుము. నన్ను కూడా పాలించనిమ్ము. సూర్యవంశ రక్షకుడవు కమ్ము. సోదరా! నా కష్టములను అందరూ పంచుకొన్నారు. కాని నా వనవాసకాలము ముగియువరకు అమితమైన బరువుబాధ్యతలు నీ పైననే ఉండును. కష్టసమయములందు ఉత్తమసోదరుడే సహాయపడును. సేవకులు కాలు సేతులు నేత్రములతో సమానము. ప్రభువు ముఖముతో సమానము." అమృతతుల్యమగు రఘునాథుని వాక్యములను విని అందరూ ప్రేమమగ్నులైరి. భరతునికి సంతోషమాయెను. అతని మనోక్లేశము మాయమాయెను. భరతుడు మరల ప్రణమిల్లి చేతులు జోడించి పలికెను: "స్వామీ! నాకు మీ సహచర్య సుఖము లభించినది. నా జన్మ సఫలమైనది. మీ ఆజ్ఞ ఏదయినప్పటికీ సాదరముగా నేను శిరసావహింతును. ఈ వనవాసకాలమునందు సేవ చేయుటకు ఏదైనా ఆలంబనము నాకు ఒసంగుడు. గురువుగారి ఆజ్ఞతో అభిషేకమునకై అన్ని తీర్థములనుండి జలమును తెచ్చినాను. దానికి మీ ఆజ్ఞ ఏమి? నా మనస్సులో ఒక అభిలాష ఉన్నది. ప్రభువాజ్ఞ అయినచో చిత్రకూటమునందలి ముని ఆశ్రమములు, తీర్థములు, వనములు, విశేషముగా, ప్రభుపాదముద్రలుగల భూములను చూచెదను." శ్రీరాముడు పలికెను: "నాయనా, అవశ్యముగా నీవు

అత్రిమహాముని ఆజ్ఞను శిరసావహించి నిర్భయముగా సంచరించుము. అత్రిముని అనుగ్రహముచే ఈ వనము శుభప్రదము, పరమపవిత్రము, అతి మనోహరమైనది. ఋషిపుంగవులు అత్రి చెప్పిన స్థానములోనే ఈ తీర్థజలము నుంచుము." ప్రభు వచనములు విని భరతుడు మిగుల సంతసించెను. శ్రీరామచంద్రభరతుల సంవాదమును విని రెండు పక్షములవారి మనస్సులలో హర్షము విషాదము కలిగెను. కౌసల్యాదేవి సుఖదుఃఖములను సమానముగా భావించెను. కొందరు శ్రీరాముని గొప్పదనమును, మరికొందరు భరతుని మంచితనమును పొగిడిరి.

అత్రిమహాముని భరతునితో పలికెను: "ఈ పర్వత సమీపమున ఒక అందమైన బావి గలదు. ఈ పవిత్రతీర్థజలమును అందులో నుంచుము." అత్రిముని ఆజ్ఞచే భరతుడు తీర్థజలములున్న పాత్రలను తీసుకొని సోదరుడైన శత్రుఘ్నునితో అత్రి మొదలగు మునులతో కూడా ఆ అగాధ కూపమునకు పోయెను. ఆ పావనజలమును ఆ పుణ్యస్థలమునందు ఉంచెను. అప్పటినుండి దానికి భరతుని బావి అని పేరు గల్గెను. ఈ జలములందు ఏ ప్రాణి భక్తితో స్నానమాడునో వారు మిక్కిలి పవిత్రులయ్యేదరు. ఈ బావి మహిమను పొగడుచు జనులందరూ తిరిగి శ్రీరాముని ఆశ్రమమునకు పోయిరి. అత్రి ముని శ్రీరామచంద్రునిరికి ఆ తీర్థప్రభావమును వినిపించెను. ప్రీతిపూర్వకముగా ధార్మిక చర్చలలో ఆ రాత్రి గడిచెను.

ప్రాతఃకాలమున భరతశత్రుఘ్నులు శ్రీరాముని, అత్రిముని, వశిష్ఠుని ఆజ్ఞను గైకొని సపరివారముగా కాలి నడకన రామ వనమువ తిరుగుటకు బయలుదేరిరి. పాదరక్షలు కూడ లేకుండా వారు తిరుగుటను చూచి భూమియే మెత్తబడెను. గడ్డి, ముండ్లు, కంకర లేకుండా మార్గము సుగమము ఆయెను. సుఖప్రదమైన పవనములు వీచెను, మేఘములు నీడనిచ్చెను. వృక్షములు ఫలపుష్ప భరితములు ఆయెను. పక్షులు, పశువులు, అన్ని ప్రాణులు,

భరతుడు శ్రీరామచంద్రునికి అంత్యంత ప్రీతిపాత్రుడని గుర్తించి సేవ చేసెను. పవిత్ర జలాశయములను, భూఖండములను, పర్వతములను, వన ఉపవనములను వర్ణించుచూ అత్రి మహాముని వాటి పేర్లు ప్రభావములను విశదీకరించెను. వనదేవతలు కూడా భరతుని ఆశీర్వదించిరి. ఈ విధముగా అయిదు దినములు భరతుడు అన్ని తీర్థస్థానములను దర్శించెను.

ఆరవ రోజు ఉదయమునే భరతుడు జనకరాజు, బ్రాహ్మణులు, పరివారము, సమావేశమయిరి. వసిష్ఠుని జనకరాజును భరతుని సభాసదులందరినీ చూచి శ్రీరామచంద్రుడు సంకోచముతో భూమి వైపునకు చూడసాగెను. జ్ఞానియైన భరతుడు శ్రీరామచంద్రుని మనస్సులోని మాటను తెలుసుకొని ధైర్యము వహించి సాష్టాంగప్రణామములు ఆచరించి చేతులు జోడించి పలికెను: "ప్రభూ! మీరు నా కోరికలన్నిటినీ తీర్చినారు. నా కారణమున వీరందరు దుఃఖమును పొందిరి. మీరు కూడా చాలా ఇబ్బంది పడినారు. ఇప్పుడు అయోధ్యకు తిరిగిపోయి మీరు వచ్చువరకు సేవచేయుటకు అనుజ్ఞ నివ్వండి. ఏ ఉపాయముచే ఈ సేవకుడు మీ చరణములను వనవాసకాలము పూర్తియగువరకు దర్శించగలడో సెలవిండు. మీ ప్రేమతో బంధింపబడుటచే అయోధ్యావాసులు పవిత్రులైనారు. మీరు సర్వజ్ఞులు. నా కోరికను కూడా పాలించండి. రెండు విధముల ప్రతిజ్ఞాపాలనము చేయండి. వనవాస ప్రతిజ్ఞను పాలించుచూ, అయోధ్యలో కూడా ప్రభువులుగా నుండండి. నేను మీ సేవకునిగా నుండెదను. నా దోషమును దూరము చేసి సంకోచమును వదలి నన్ను అనుచరునిగా భావించి ఉపదేశించండి."

భరతుని దీన నిష్కపట వాక్కులు విని శ్రీరామచంద్రుడు యిట్లు పలికెను: "నాయనా! మన గురువులు వశిష్ఠులవారు, విశ్వామిత్రులు, జనకరాజు మనకు రక్షకులై ఉండగా నీకు నాకు

స్వప్నములో కూడా క్లేశములు ఉండవు. విచారము మాని వనవాసకాలము వరకు అయోధ్యను పాలించుము. వశిష్ఠముని, తల్లుల, మంత్రుల ఉపదేశానుసారము రాజ్యమును పాలించుము. అధికారి నోటివలె నుండవలెను. అది ఒక్కటే తింటుంది, త్రాగుతుంది. కాని వివేకముతో శరీరమునందరి భాగములను పోషిస్తుంది. అట్లే రాజు రాజ్యములోని ప్రజలందరినీ కాపాడవలెను. రాజధర్మసారమిదియే." శ్రీరఘునాథుడు భరతునికి అనేక విధముల నచ్చచెప్పెను. కాని ఒక ప్రత్యక్షాధారము లేనిదే అతని మనస్సునకు సుఖశాంతులు లభించలేదు. కావున శ్రీరామచంద్రప్రభువు కృపతో తన పాదుకలను ఇచ్చెను. భరతుడు వానిని భక్తితో తన శిరస్సుపై నుంచుకొనెను. ఈ ఆలంబనమును పొంది భరతుడు మిక్కిలి సంతోషించెను. పాదుకలు లభించుటచే శ్రీరాముడు అయోధ్యలో నున్నంత సౌఖ్యము భరతునికి కలిగెను. భరతుడు శ్రీరామచంద్రునికి ప్రణమిల్లి తిరిగిపోవుటకు అనుజ్ఞను అడిగెను. శ్రీరాముడు భరతుని హృదయమునకు హత్తుకొనెను. ధీరోధాత్తుడు అయిన శ్రీరాముడు కూడా ధైర్యము వదిలెను. అతని నయనములు అశ్రుపూరితములు ఆయెను. పిదప శ్రీరాముడు శత్రుఘ్నుని హృదయమునకు హత్తుకొనెను. శ్రీరామప్రభువు చరణములకు నమస్కరించి అతని ఆజ్ఞను శిరసావహించి, మునుల, తపస్వినుల, వనదేవతలకు ఆదర సన్మానములు చేసి, భరతశత్రుఘ్నులు లక్ష్మణునికి ప్రణమిల్లిరి. సీతాదేవి పాదములకు నమస్కరించి, ఆమె ఆశీర్వాదమును పొంది బయలుదేరిరి.

శ్రీరాముడు లక్ష్మణునితో సహా జనకమహారాజుకు ప్రణమిల్లి, "మీరు దయతో చాలా కష్టములకోర్చితిరి. సపరివారముగా వనమునకు విచ్చేసితిరి. మమ్ములను ఆశీర్వదించి మీ నగరమునకు బయలుదేరుడు" అని పల్కెను. జనకరాజు ధైర్యము వహించి బయలుదేరెను. పిదప సోదరులిద్దరూ అత్తగారు అయిన సునయనాదేవి చరణములకు మ్రొక్కి

ఆశీర్వాదములను పొందిరి. పిదప విశ్వామిత్రుడు, వామదేవుడు, జాబాలి, కుటుంబసభ్యులు, మంత్రులు అందరికీ యోగ్యతానుసారము శ్రీరామలక్ష్మణులు వీడ్కోలు యిచ్చిరి. కైకేయిదేవి చరణములకు వందనము లాచరించి ఆమె శోక సంకోచములను పారద్రోలి, పల్లకీని అలంకరించి వీడ్కోలు యిచ్చిరి. సీతాదేవి తన పరిచారికలను, తల్లిదండ్రులను కలిసి వీడ్కోలు చెప్పిన పిదప శ్రీరామునితో సహా వచ్చి అత్తగార్లకు నమస్కరించెను. శ్రీ సీతారామలక్ష్మణులు పల్లకీల వెంట కొంత దూరము నడిచి రాజమాతలను సాగనంపిరి. పిదప గురువైన వశిష్ఠుని, గురుపత్ని అయిన అరుంధతీదేవి చరణకమలములకు మ్రొక్కి సీతాలక్ష్మణులతో శ్రీరామచంద్రుడు హర్షశోకములతో తన పర్ణకుటీరమున తిలకించెను. నిషాదరాజైన గుహుని గౌరవముతో వీడుకొలిపెను. వటవృక్షపు నీడలో కూర్చొని, శ్రీ సీతారామలక్ష్మణులు తన కుటుంబసభ్యుల ఎడబాటుకు దుఃఖితులైరి.

మునులు, బ్రాహ్మణులు, వశిష్ఠముని, జనకరాజు, పరివారమంతయూ రాముని విరహముచే వ్యాకులతను పొందిరి. యమునా నదిని, గంగానదిని దాటి రెండవరోజు శృంగవీరపురమును చేరిరి. నిషాదరాజు వారికి అన్ని ఏర్పాట్లు చేసెను. నాలుగవ రోజునకు అందరూ అయోధ్యను చేరిరి. జనకుడు నాలుగుదినములు అయోధ్యలో నుండి రాజకార్యములు చక్కదిద్ది, మంత్రికి, వశిష్ఠునికి, భరతునికి రాజ్యభారమును అప్పగించి పూర్తి ఏర్పాట్లు గావించిన పిదప తన రాజధానికి తిరిగి పోయెను. శ్రీరామచంద్రుని దర్శనాభిలాషులై అయోధ్యావాసులందరు, భూషణములను భోగవిలాసములను వదలి నియమములను, వ్రతములను పాటించిరి. భరతుడు మంత్రులకు సేవకులకు తగిన ఆదేశములను యిచ్చెను. తల్లుల సేవాబాధ్యతను శత్రుఘ్నునికి అప్పగించెను. గురువుగారి ఉపదేశము ఆశీర్వాదములను పొంది శుభ ముహూర్తమున శ్రీరామచంద్రప్రభుపాదుకలను సింహాసన

ముపై అధిష్ఠించెను. కౌసల్యాదేవి, వశిష్ఠుని ఆజ్ఞను పడసి ధర్మశ్రేష్ఠుడైన భరతుడు నందిగ్రామమున పర్ణకుటీరమున నివసింపసాగెను. శిరమున జటాజూటమును ధరించి, మునులవలె వల్కలములు ధరించి, సమస్త సుఖములను త్యజించి వనవాసవ్రతమును ఆచరించెను. భరతుని శరీరము రోజురోజుకు శుష్కించెను. కాని ముఖమునందలి తేజస్సు, కాంతి తగ్గలేదు. నిత్యము శ్రీరాముని పాదుకలను పూజించి రాజ్యకార్యములు నిర్వహించుచుండెను. భరతుని హృదయమున సదా శ్రీ సీతారాములే ఉండిరి. అతని నియమ వ్రతములను, భక్తిని చూచి మునులు, దేవతలు కూడా ఆనందము, ఆశ్చర్యమును పొందిరి.

ఎవరైతే భరతుని చరిత్రను నియమముతో, ఆదరముతో వింటారో, వారికి శ్రీసీతారామచంద్రుల చరణములపై అవశ్యము భక్తి కలుగును. మరియు సాంసారిక విషయములందు విరక్తి కలుగును.

కలియుగ పాపములన్నింటినీ నాశనముచేయు
శ్రీరామచరితమానసమందలి అయోధ్యాకాండమను
రెండవసోపానము సమాప్తము.

* * *

## శ్రీ రామాష్టకమ్
### రచన: శ్రీ వ్యాసభగవానుడు

*భజే విశేష సుందరం, సమస్తపాపఖండనమ్।*
*స్వభక్త చిత్త రంజనం, సదైవ రామమద్వయమ్ ॥1॥*

అతి సౌందర్యరూపుడు, సర్వపాపములను నశింపజేయువాడు, తన భక్తులమానసములను రంజింపచేయువాడు, అద్వయ స్వరూపుడైన శ్రీరాముని భజించుచున్నాను.

*జటాకలాప శోభితం, సమస్తపాప నాశకమ్ ।*
*స్వభక్త భీతి భంజనం, భజేహ రామమద్వయమ్ ॥2॥*

జటాజూటముచే శోభిల్లువాడు, సమస్తపాపములను నశింపజేయువాడు, తనభక్తుల భయమును పారద్రోలువాడు, అద్వయ స్వరూపుడైన శ్రీరాముని భజించెదను.

*నిజ స్వరూప బోధకం, కృపాకరం భవాపహం ।*
*సమం శివం నిరంజనం, భజేహ రామమద్వయమ్ ॥3॥*

ఆత్మ స్వరూపమును బోధించువాడు, కృపాకరుడు, సంసార బంధములను తొలగించువాడు, పరబ్రహ్మ స్వరూపుడు, శుభకరుడు, నిరంజనుడు, అద్వయ స్వరూపుడైన శ్రీరాముని భజించుచున్నాను.

*అస త్ప్రపంచకల్పిత హ్యనామరూపవాస్తవమ్ ।*
*నిరాకృతిం నిరామయం భజేహ రామమద్వయమ్ ॥4॥*

అసత్య ప్రపంచములో వాస్తవమైనవాడు, రూపములను కల్పించుకొనినవాడు, నిరాకారుడు, నిరామయుడు, అద్వైతస్వరూపుడైన శ్రీరాముని భజించుచున్నాను.

*నిష్ప్రపంచ నిర్వికల్ప నిర్మలం నిరామయమ్ ।*
*చిదేకరూప సంతతం భజేహ రామమద్వయమ్ ॥5॥*

ప్రపంచాతీతుడు, నిర్వికల్పుడు, నిర్మలుడు, నిరామయుడు, సదా

చితాస్వరూపుడై వెలుగొందువాడైన అద్వయుడైన శ్రీరాముని భజించెదను.

*భవాబ్ధి పోతరూపకం హ్యశేష దేహకల్పితమ్।*
*గుణాకరం కృపాకరం భజేహ రామ మద్వయమ్ ॥6॥*

భవసాగరమును దాటించునావ, కల్పితదేహధారుడు, సద్గుణఖని, దయాస్వరూపుడు, సత్తాస్వరూపుడైన శ్రీరాముని భజించుచున్నాను.

*మహావాక్య బోధకై ర్విరాజ మానాశాక్పదైః।*
*పరబ్రహ్మ వ్యాపకం భజేహ రామమద్వయమ్ ॥7॥*

మహా వాక్యములచే తెలియబడువాడు, వేదములలో వర్ణింపబడినవాడు, పరబ్రహ్మ స్వరూపుడు, సర్వ వ్యాపకుడు, అద్వైతరూపుడగు శ్రీరాముని భజించెదను.

*శివప్రదం సుఖప్రదం భవచ్ఛిదం భ్రమాపహమ్।*
*విరాజమానదైశికం భజేహ రామమద్వయమ్ ॥8॥*

శుభముల నిచ్చువాడు, సుఖప్రదుడు, సంసార క్లేశములను తొలగించువాడు, భ్రమలనంతము చేయువాడు, ప్రకాశవంతుడు, సత్తాస్వరూపుడైన శ్రీరాముని భజించుచున్నాను.

## ఫలశ్రుతి

*రామాష్టకం పఠంతి యస్సుకరం సుపుణ్యం*
*వ్యాసేన భాషిత మిదం శృణుతే మనుష్యః ।*
*విద్యాం శ్రియం విపుల సౌఖ్యమనంత కీర్తిం*
*సంప్రాప్య దేహ విలయే లభతే చమోక్షమ్ ॥*

సుకరమైన, పుణ్యప్రదమైన, శ్రీవ్యాస భగవానునిచే రచించబడిన ఈ రామాష్టకమును ఏ మానవుడు శ్రద్ధతో పఠించునో, వినునో, అతడు విద్యను, సంపదను, అమితానందమును, అనంతకీర్తిని పొంది, దేహము నశించిన పిదప మోక్షమును పొందుచున్నాడు.

# మూడవ సోపానము

# అరణ్యకాండము

## 1. వందనము

ధర్మమను వృక్షమునకు మూలమైనవాడు, వివేకమను సాగరమును ఆనందపరుచు చంద్రుడు, వైరాగ్యమను కమలమును వికసింపచేయు సూర్యుడు, పాపమను చీకటిని రూపుమాపువాడు, తాపత్రయములను హరించువాడు, మోహమను మేఘమును ఛిన్నాభిన్నము చేయువాడు, బ్రహ్మపుత్రుడు కలంకనాశకుడు శ్రీరామచంద్రప్రభువునకు ప్రియ మైనవాడు - అట్టి శ్రీ శంకరునికి ప్రణామములు ఆచరింతును. మేఘశ్యామల శరీరుడు, ఆనందఘనుడు, సుందర పీతాంబరధారి, ధనుర్బాణములు కలవాడు, నడుమున అక్షయతూణీరము కలవాడు, కమలలోచనుడు శిరస్సుపై జటాజూటధారియై సీతాదేవి లక్ష్మణులతో మార్గమున పోవుచూ శోభాయమానుడై ఆనంద ప్రదాతయైన శ్రీరామచంద్రుని భజింతును.

## 2. మున్యాశ్రమ సందర్శనము

ఒకరోజు శ్రీరామచంద్రుడు అందమైన పుష్పములను సేకరించి తాను స్వయముగా సిద్ధపరచిన రకరకములైన భూషణములతో సీతాదేవిని అలంకరించెను. ఆ సమయమున దేవేంద్రుని కుమారుడు మందబుద్ధి అయిన జయంతుడు కాకి రూపమును ధరించి శ్రీరాముని బలమును, మహిమను పరీక్షించదలచి సీతాదేవి చరణములను తన

ముక్కుతో పొడిచి పారిపోయెను. రక్తము స్రవించుట చూచిన శ్రీరాముడు ఒక గడ్డిపోచను బాణముగా చేసి ధనుస్సుపై సంధించెను. మంత్రప్రేరితమైన ఆ బాణము వెంటబడగా భయభీతుడైన జయంతుడు ఇంద్రుని, బ్రహ్మను, శివుని గూడా శరణుజొచ్చెను. కాని శ్రీరామునికి ద్రోహము చేసిన వాని నెవ్వరు రక్షించకపోయిరి. చివరకు నారదుని ఉపదేశముతో జయంతుడు శ్రీరామునే శరణుజొచ్చెను. శరణాగతవత్సలుడైన శ్రీరాముడు వాని దీనావస్థను చూచి ఒక కన్నుమాత్రము తీసి వదిలివేసెను. శ్రీరఘునాథుడు చిత్రకూటమున ఇట్లు అనేక అద్భుతకార్యములు చేసెను.

చిత్రకూటముననున్నచో మరల అనేకులు అక్కడికి వచ్చెదరు అని తలచి శ్రీరాముడు మునుల ఆజ్ఞను గైకొని సీతాలక్ష్మణులతోపాటు చిత్రకూటమును వదలి ముందుకు సాగెను. మార్గమున అత్రిమహాముని ఆశ్రమమును దర్శించి మునికి దండప్రణామములు ఆచరించెను. ముని వారిని తన ఆశ్రమమునకు గొనిపోయి భక్తితో పూజించి కందమూలఫలములతో ఆదరించెను. పరమజ్ఞాని అయిన అత్రిమహాముని చేతులు జోడించి ప్రభువును అనేక విధముల స్తుతించెను.*

*నమామి భక్తవత్సలం। కృపాలు శీలకోమలం।*
*భజామి తే పదాంబుజం। అకామినాం స్వధామదం॥*

*నికామ శ్యామసుందరం। భవాంబునాథమందరం ।*
*ప్రఫుల్ల కంజ లోచనం । మదాది దోష మోచనం॥*

*ప్రలంబ బాహు విక్రమం। ప్రభోఽప్రమేయ వైభవం।*
*నిషంగచాప సాయకం। ధరం త్రిలోకనాయకం॥*

*దినేశవంశమండనం। మహేశ చాప ఖండనం।*
*మునీంద్రసంత రంజనం। సురారి బృందభంజనం॥*

---

* ఈ శ్లోకముల యర్థము ఈ కాండము తర్వాత చూడగలరు.

మనోజ వైరి వందితం। అజాది దేవ సేవితం।
విశుద్ధబోధ విగ్రహం। సమస్తదూషణాపహం॥

నమామి ఇందిరాపతిం। సుఖాకరం సతాం గతిం।
భజే సశక్తిసానుజం। శచీపతి ప్రియానుజం॥

త్వదంఘ్రిమూల యే నరాః। భజంతి హీనమత్సరాః।
పతంతి నో భవార్ణవే। వితర్క వీచి సంకులే॥

వివిక్తవాసినస్సదా। భజంతిముక్తయే ముదా।
నిరస్య ఇంద్రియాదికం। ప్రయాంతి తే గతిం స్వకం॥

త్వమేక మద్భుతం ప్రభుం। నిరీహ మీశ్వరం విభుం
జగద్గురుం చ శాశ్వతం। తురీయ మేవ కేవలం॥

భజామి భావవల్లభం। కుయోగినాం సదుర్లభం।
స్వభక్త కల్ప పాదపం। సమం ససేవ్య మన్వహం॥

అనూపరూప భూపతిం। నతోఽహముర్విజాపతిం।
ప్రసీద మే నమామి తే। పదాబ్జ భక్తి దేహి మే॥

పఠంతి యే స్తవం ఇదం। నరాదరేణ తే పదం।
వ్రజంతి నాత్ర సంశయం। త్వదీయ భక్తి సంయుతాః॥

ఆ విధముగా స్తుతించి అత్రిమహాముని చేతులు జోడించి శిరసా నమస్కరించి పలికెను: "ప్రభూ! నా మనస్సు ఎల్లప్పుడు కూడా మీ చరణకమలములను వదలకయుండుగాక!" పిదప సీతాదేవి అత్రిముని భార్య అనసూయకు పాదాభివందనము నాచరించెను. మునిపత్ని ఆమెను ఆశీర్వదించి నిత్యనూతనము, నిర్మలము, మనోహరములైన, వస్త్రములను ఆభరణములను ధరింప చేసెను. మరియు అనేక స్త్రీ ధర్మములను ఉపదేశించెను: "రాజకుమారీ! వినుము తల్లిదండ్రులు, సోదరులు, అందరూ కొంత పరిమితివరకే సుఖమును ఇవ్వగలరు.

కాని భర్త జీవితాంతము కష్టసుఖములందు తోడుగా నుండును. కావున శరీరమనోవాక్కులచే సదా పతిని ప్రేమించుటయే స్త్రీకి ఏకైక ధర్మము: సీతా! వినుము. నీ నామమును స్మరించియే స్త్రీలు పాతివ్రత్య ధర్మములను పాటించెదరు. నీవైతే శ్రీరామునికి ప్రాణముతో సమానము." ఆ ఉపదేశమును విని జానకీదేవి పరమానందభరితయై అనసూయాదేవికి మ్రొక్కెను. దయానిధియైన శ్రీరామచంద్రుడు అత్రిముని ఆజ్ఞను బడసి మరొక వనమునకు పోవుటకు ముందుకు సాగెను. ముందు శ్రీరాముడు, మధ్య సీతాదేవి, వెనుక లక్ష్మణుడు నడచుచుండగా బ్రహ్మ జీవులమధ్య మాయవలె శోభిల్లిరి. మార్గములో విరాధుడు అను రాక్షసుని వధించి వానికి శాపవిమోచనము కలిగించి శ్రీరాముడతనిని విష్ణులోకమునకు పంపెను. పిదప శ్రీ సీతారామలక్ష్మణులు శరభంగుని ఆశ్రమమును చేరిరి.

శ్రీరామచంద్రుని దర్శనముచే శరభంగుని జన్మ ధన్యమాయెను. అతడు "ప్రభూ! రాత్రింబగళ్ళు మీ రాకకై ఎదురుచూచుచున్నాను. నేను సాధనరహితుడను. అయిననూ నన్ను మీ సేవకునిగా భావించి నాపై కృప జూపితిరి. నేను ఈ శరీరమును త్యజించి మీ ధామము చేరువరకు మీరు యిచ్చటనే యుండుడు," అని పలికి తాను చేసిన యోగయజ్ఞ జపతపములన్నియూ ప్రభువునకు అర్పించి యోగాగ్నిచే తన శరీరమును భస్మమొనర్చి వైకుంఠమును చేరెను. మునులందరు శ్రీరాముని స్తుతించిరి. వారతనితో కలసి ప్రయాణించిరి. త్రోవలో ఒక ఎముకల కుప్పను చూచి మిక్కిలి జాలిగలిగి అవి ఎవరివి అని అడుగగా మునులిట్లు పలికిరి: "స్వామీ! మీరు సర్వజ్ఞులు. అయిననూ మమ్ము అడుగుచున్నారు. రాక్షసులు వన్యాశ్రమములందు మునులను చంపి భక్షించినారు. ఇవి ఆ మునుల ఎముకల కుప్పలు." అది విని శ్రీరాముని కన్నులు నీటితో నిండెను. పిదప "ఈ పృథ్విలో

రాక్షసులు లేకుండా చేస్తాను" అని ప్రతిజ్ఞ చేసి రఘునాథుడు అనేక మునుల ఆశ్రమములను దర్శించి వారికి సౌఖ్యమును అందించెను.

అగస్త్యమునికి సుతీక్ష్ణుడు అను ఒక శిష్యుడు ఉండెను. అతడు మనోవాక్కర్మలచే శ్రీరాముని చరణ సేవకుడు. ప్రభువు రాకను వినగానే పరుగెత్తి పోయి పలికెను: "విధాత, దీనబంధు, శ్రీరాముడు నావంటి దుష్టులపై దయ చూపునా? నా మనస్సున భక్తి వైరాగ్యజ్ఞానములు లేవు. నేను సత్సాంగత్యము, యోగజపయజ్ఞాదులు చేయలేదు. సంసార బంధములనుండి విడిపించు ప్రభు ముఖకమలమును చూచి నేడు నా కన్నులు సఫలమయినవి." అట్లు అనుకొనుచున్న సుతీక్ష్ణ ముని ప్రేమమగ్నుడాయెను. అతని భక్తి పారవశ్యమును శ్రీరఘునాథుడు దూరము నుండి చూచి ప్రసన్నుడాయెను. ధ్యానమునుండి అతన్ని లేపుటకు ప్రయత్నించిననూ అతడు లేవలేదు. అప్పుడు శ్రీరాముడు చతుర్భుజములతో అతనికి ప్రత్యక్షమాయెను. ముని చలించకుండా చిత్రములో బొమ్మవలె నిలబడి పోయెను. పిదప ధైర్యమును వహించి అనేక విధముల ప్రార్థన చేసి "ప్రభూ! శ్రీసీతారామలక్ష్మణులతో సహా ధనుర్బాణములను ధరించి నా హృదయాకాశమున చంద్రునివలె స్థిరముగా నుండుము" అని కోరెను. "అట్లే కానిమ్ము" అని పలికి శ్రీరామచంద్రుడు ప్రసన్నుడై అగస్త్యముని వద్దకు పోయెను. సుతీక్ష్ణుడు కూడ తన గురువుగారిని చూచునెపముతో శ్రీరాముని వెంట నడిచెను. అగస్త్యముని ఆశ్రమమును చేరగానే అతడు గురువునకు నమస్కరించి శ్రీసీతారామలక్ష్మణులు వచ్చిన సంగతిని తెలిపెను.

భగవంతుని చూడగానే అగస్త్యముని నేత్రములు ఆనందాశ్రువులతో నిండెను. సోదరులిద్దరు మునికి సాష్టాంగ నమస్కారములు చేసిరి. కుశల సమాచారములు అడిగి అగస్త్యుడు వారిని ఉచితాసనముల కూర్చుండబెట్టి పూజించి "నా సమానమైన భాగ్యశాలి ఎవ్వరులేరు" అనెను. అక్కడున్న మునులందరు ఆనందస్వరూపుడైన శ్రీరాముని

చూచి హర్షితులైరి. పిమ్మట శ్రీరాముడు అగస్త్యమునితో పలికెను: "నేను ఏ కారణమున ఇక్కడికి వచ్చినానో మీరు ఎరుగుదురు. నాకు మీరొక సలహాను ఇవ్వండి. దాన్ని అనుసరించి నేను మునుల శత్రువులైన రాక్షసులను చంపగలను." ప్రభు వాక్యములను విని ముని నవ్వుచూ పలికెను: "సమస్త లోకపాలకులకు ప్రభువై యుండియూ మీరు సామాన్యమానవునివలె నన్ను ప్రశ్నించుచుంటిరి. ఓ దయానిధానా! నాకొక వరమును ప్రసాదించుడు. సీతాలక్ష్మణసమేతముగా మీరు నా హృదయమున వసింపుడు. మీరు అఖండానంద స్వరూపులైన పరబ్రహ్మఅనియు, అనుభవైకవేద్యులు అనియు నేను ఎరుగుదును. కాని మీరు ఎల్లప్పుడు మీ దాసులను గొప్పవారిని చేస్తారు. ఇదే కారణమున నన్ను మీరు ప్రశ్నించినారు. యిక్కడ పంచవటి అను మనోహరమైన పవిత్ర స్థానము కలదు. దానిని పావనము చేసి మునులనందరినీ రక్షించుడు." ఆ విధముగా ముని ఆజ్ఞను బడసి శ్రీరామచంద్రుడు పంచవటిని సమీపించెను. అచట జటాయువుతో కలసి అతనితో మైత్రిని కలిపి గోదావరీనదీతీరమున పర్ణకుటీరమును నిర్మించుకొని నివసించెను.

## 3. భక్తియోగ మహిమ

శ్రీరాముడు అక్కడ నివసించినప్పటినుండి మునులు నిర్భయులై సుఖముగా నుండిరి. పర్వతములు, వనములు, మరియు తటాకములు శోభిల్లెను. పశుపక్షి సమూహములు ఆనందముతో ఉండెను. ఒకసారి శ్రీరామచంద్రప్రభువు సుఖాసీనుడైన సమయమున లక్ష్మణుడు నిశ్చల భావమున పలికెను: "స్వామీ! మిమ్ములను నా ప్రభువుగా భావించి అడుగుచున్నాను. నేనన్నింటినీ త్యజించి మీ చరణములనే సేవించునట్లు ఉపదేశింపుడు. జ్ఞాన వైరాగ్య మాయా స్వరూపములను వాని వృత్తులను వర్ణించండి. మీ దయను పొందు భక్తి మార్గమును ఉపదేశించండి.

ప్రభూ! ఈశ్వరునికి జీవునికి గల భేదమును వివరించండి. దాని వలన మీ చరణములపై నా భక్తి దృఢమై శోకము, మోహము, భ్రమ తొలగిపోవును." శ్రీరాముడు ప్రసన్నుడై యిట్లు పలికెను: "నాయనా! నేను నీకు సంక్షిప్తముగా అన్ని విషయములు తెలిపెదను. నేను, నాది, నీవు, నీది అను భావమే మాయా స్వరూపము. ఇది జీవులను తన వశములో నుంచుకొనును. ఇంద్రియములు, ఇంద్రియవిషయములు, మనోవాంఛలు ఇవన్నియూ మాయ అని గ్రహించుము. ఈ మాయ మిథ్య, అమిథ్య అని రెండు రకములు. అమిథ్య దుష్టమయినది, దుఃఖప్రదమైనది. దీని వశములో పడి జీవుడు సంసారము అను బావిలో పడును. మిథ్యా గుణయుతమైనది. ప్రభువు ప్రేరణచే ఇది జగత్తును సృష్టించును. దీనికి స్వంతశక్తి ఏమియూ లేదు. అభిమానము మున్నగు దోషములు ఏ మాత్రము లేకుండుట, అందరిలో ఒకే పరమాత్మను చూచుట జ్ఞానమనబడును. ఎవడైతే సకల సిద్ధులను సత్త్వరజస్తమో గుణములను గడ్డిపోచవలె త్యజించునో వానినే పరమ విరాగి యందురు. ఎవడు మాయనుగాని, ఈశ్వరునిగాని తన స్వరూపమునుగాని తెలుసుకొనడో వాడే జీవుడు అనబడును. జీవులకు వారి కర్మను అనుసరించి బంధనము, మోక్షము నొసంగువాడు సర్వాతీతుడు. మాయను ప్రేరేపించువాడు ఈశ్వరుడు. ధర్మమునుండి వైరాగ్యము, యోగమునుండి జ్ఞానము జనించును. జ్ఞానము వలన మోక్షము సిద్ధించును. దేనివలన నా మనస్సు త్వరగా కరిగిపోతుందో దానిని భక్తి యందురు. అదియే నా భక్తులకు సుఖప్రదము, సులభమైన మార్గము. దానిని అనుసరించి భక్తులు నన్ను పొందెదరు. సజ్జనుల చరణకమలములపై ఎవనికి అత్యంత ప్రేమయుండునో మనోవాక్కర్మలచే ఎవడు నియమపూర్వకముగా నన్ను భజిస్తాడో నా గుణగానము చేస్తాడో ఎవనియందు కామము, మదము, దంబము మొదలగునవి లేవో వానికి నేను సదావశుడనై వుందును."

# 4. శూర్పనఖను శిక్షించుట

ఆ భక్తి యోగ వర్ణనమును విని లక్ష్మణుడు మిక్కిలి సంతసించి ప్రభు చరణములకు ప్రణమిల్లెను. ఆ విధముగా జ్ఞాన, వైరాగ్య, నీతి చర్చలలో కొన్ని దినములు గడిచెను. రావణునికి శూర్పనఖ యను దుష్టస్వభావురాలు భయంకర ఆకారము గల చెల్లెలు ఉండెను. ఆమె ఒక రోజు పంచవటికి వచ్చి రాజకుమారులిద్దరినీ చూచి కామాతుర అయ్యెను. సుందర రూపము ధరించి ప్రభువును సమీపించి చిరునవ్వుతో మధుర వచనములు పలికెను. "నీతో సమానమైన పురుషుడు కాని, నాతో సమానమైన స్త్రీగాని ఎవ్వరూలేరు. బ్రహ్మ మన యిద్దరినీ సమాగమపరిచెను. నాకు యోగ్యుడైన పురుషుడు ముల్లోకములలో కనిపించలేదు. అందువల్లనే యింతవరకు అవివాహితగానే ఉన్నాను. నిన్ను చూచిన పిదప నా మనస్సు శాంతించినది." శూర్పనఖ మాటలు విని శ్రీరామచంద్రుడు సీతాదేవివైపు చూపుచూ తను వివాహితుడనని సంకేతమును ఇచ్చుచూ "నా తమ్ముడు అవివాహితుడు" అని చెప్పెను. అప్పుడది లక్ష్మణుని దగ్గరకు వచ్చెను. దానిని తన శత్రుసోదరి అని యెరింగి ప్రభువు వైపు చూచి లక్ష్మణుడు మధురస్వరముతో పలికెను: "సుందరీ వినుము, నేను అతని సేవకుడను. పరాధీనుడను, నీవు నాతో పరిణయమాడిన సుఖముగా ఉండవు. ప్రభువు సమర్థుడు. అయోధ్యకు రాజు. అతడు ఏమి చేసిననూ శోభించును." లక్ష్మణుని సమాధానమును విని అది తిరిగి శ్రీరాముని వద్దకు వచ్చెను. ప్రభువు దానిని మరల లక్ష్మణుని వద్దకు పంపెను. లక్ష్మణుడు "సిగ్గును తృణసమానముగా వదిలివేసినవాడే నిన్ను వరించవలెను" అని పలికెను. అప్పుడు అది కోపముతో తిరిగి శ్రీరాముని వద్దకు పోయి తన భయంకర రూపమును ప్రకటించెను. సీతాదేవి భయపడుటను చూచి శ్రీరాముడు లక్ష్మణునికి సైగ చేసెను. లక్ష్మణుడు మిక్కిలి నేర్పరితనముతో దాని ముక్కు,

చెవులు కోసి, దాని ద్వారా రావణుని యుద్ధమునకు ఆహ్వానించినట్లు చేసెను.

## 5. ఖరదూషణ సంహారము

ముక్కు, చెవులు తెగిన రాక్షసి ఇంకనూ వికార రూపముతో వెక్కి వెక్కి ఏడ్చుచూ ఖరధూషణుల వద్దకు పోయి పలికెను: "సోదరా! నీ బలము, పౌరుషము వ్యర్థము." ఖరదూషణులు అడిగిన పిదప విషయమును అంతయు తెలిపెను. వారు అసంఖ్యాకములైన అస్త్రశస్త్రములను ధరించిన రాక్షస సైన్యములను తమ వెంట తీసుకొని శూర్పణఖను ముందుంచి వచ్చిరి. ఆకాశము దూళిచే కప్పబడుట చూచి శ్రీరాముడు లక్ష్మణునితో "రాక్షసులు భయంకర సైన్యముతో వచ్చుచున్నారు. నీవు జానకిని తీసుకొని పర్వతగుహలోనికి పొమ్ము. జాగ్రత్తగా నుండుము," అని పలికెను. ప్రభువాజ్ఞను విని లక్ష్మణుడు ధనుర్బాణములు ధరించి సీతాదేవితో పోయెను. శత్రుసైన్యము సమీపించెను. శ్రీరాముడు నడుమునకు తూణీరమును బిగించి ధనుస్సున బాణమును సంధించి రాక్షస సైన్యమును చూసెను. అతిలోక సుందరుడైన శ్రీరామచంద్రుని చూచి రాక్షస సైనికులు ముగ్ధులై బాణములు వదలలేకపోయిరి. ఖరదూషణులు అతనితో యుద్ధముచేయ నిచ్చగించక "నీవు దాచి వుంచిన నీ స్త్రీని మాకు అప్పగించి మీరిద్దరూ ఇంటికి పొండి." అని సందేశమును పంపిరి. శ్రీరామచంద్రుడు చిరునవ్వు నవ్వి పలికెను: "మేము క్షత్రియులము. అడవులలో మీ వంటి దుష్ట పశువులను వేటాడెదము. మేము మానవులమైనను రాక్షస కులమును సంహరించి మునులను రక్షించెదము. మీ వద్ద శక్తిలేనిచో ఇంటికి మరలిపొండి. యుద్ధభూమినుండి పారిపోయే వ్యక్తిని నేను చంపను. రణభూమిలో కపటచాతుర్యమును ప్రకటించుట, శత్రువుపై దయచూపుట పిరికి వాండ్ల లక్షణము." ఆ సందేశమును విని ఖరదూషణుల హృదయము

క్రోధాగ్నితో మండెను. రాక్షస సైనికులు అనేక ఆయుధములు ధరించి శ్రీరామునిపైకి దుమికిరి. కాని శ్రీరాముని ధనుష్టంకారమును విని వ్యాకులులైరి. అనేక శరపరంపరలచే శ్రీరాముడు రాక్షససైన్యమును చీల్చిచెండాడెను. వారి మొండెములు, తలలు, భుజములు, చేతులు చెల్లాచెదరై భూమిపై పడెను. రాక్షసులు మాయాయుద్ధము చేయుట చూచి ప్రభువు కూడా తన మాయను ప్రకటించసాగెను. వారిలో ప్రతియొక్కరికి శ్రీరామునిరూపము కనుపించసాగెను. వారిలో వారే యుద్ధము చేయసాగిరి. ఖర, దూషణ, త్రిశరులను సంహరించి శ్రీరామచంద్రప్రభువు దేవతలను సంతోషింపచేసెను. వారు శ్రీరాముని స్తుతించుచూ పుష్పవృష్టిని కురిపించిరి. లక్ష్మణుడు సీతాదేవిని పిలుచుకొని వచ్చి ప్రభుపాదములకు నమస్కరించెను. ప్రభువు అతనిని లేవనెత్తి హృదయముకు హత్తుకొనెను. శ్రీరాముని కోమలశ్యామలశరీరమును ఎంత చూచిననూ సీతాదేవి కన్నుల తనివి తీరలేదు. ఆ విధముగా పంచవటిలో శ్రీరామచంద్రుడు దేవతలను మునులను సంతసింపచేయు అనేక అద్భుతకార్యములు నెరవేర్చెను.

## 6. సీతాపహరణము

ఖరదూషణుల వినాశనమును చూచిన శూర్పనఖ రావణుని వద్దకు పోయి అతికోపముతో అరచెను: “నీ రాజ్యము కోశాగారమును మరచి మద్యము తాగి రాత్రింబగళ్ళు పడి నిద్రపోవుచున్నావు. శత్రువులు సమీపించినది కూడా నీవు ఎరుగవు. అరే దశకంఠా! నీవు బ్రతికుండగా నేను ఈ స్థితిలో నుండవలెనా?” అనుచూ అనేక విధముల విలపించెను. దాని విలాపమును విని సభాసదులు వ్యాకులులై లేచి నిలబడిరి. రావణుడు “నీ ముక్కు, చెవులు కోసినది ఎవరు?”అని ప్రశ్నించెను. సమాధానముగా శూర్పనఖ పలికెను: “అయోధ్యాపతియైన దశరథుని కుమారులు. పురుషసింహులు. వనములో వేటకై వచ్చినారు.

వారు పృథ్విపై రాక్షసులను మట్టుబెట్టనెంచినారు.వారి భుజబలమును చూచి మునులు వనములో నిర్భయముగా. సంచరించుచున్నారు. చూచుటకు బాలకులే అయిననూ పరమవీరులు, ధనుర్ధారులు. వారిలో అతిలోకసుందరుడు రాముడు. అతనితో పాటు పదునారేండ్ల తరుణి గలదు. నూరుకోట్ల రతీదేవులైనను ఆమె సౌందర్యమునకు సాటిరారు. నేను నీ సోదరిని అని తెలియగానే వారు నన్ను పరిహసించిరి. అతని తమ్ముడు నా ముక్కు చెవులు కోసినాడు. ఖరదూషణులు నా యాక్రందనను విని యుద్ధము చేసిరి. కాని వారిని సమస్త సైన్యముతో సహా ఒక్క క్షణములో వధించిరి." ఖరదూషణ, త్రిశరుల సంహారమును వినగానే, రావణుని శరీరము కోపముతో మండెను. అతడు శూర్పణఖకు అనేక విధముల నచ్చచెప్పి తన భవనమునకు పోయెను. కాని తీవ్రమయిన ఆలోచనచే రాత్రి నిద్రపట్టలేదు. అతడు యిట్లు ఆలోచించసాగెను: "ఖరదూషణులు నాతో సమానమైన బలశాలులు. భగవంతుడు తప్ప వారినెవ్వరూ వధించలేరు. ఒక్కవేళ దేవతలను ఆనందింపచేయుటకు భగవంతుడే అవతరించినచో నేనతనితో వైరము పెంచుకొని యుద్ధము చేసెదను. ఒకవేళ వారు రాజకుమారులు అయినచో వారిద్దరినీ యుద్ధములో ఓడించి వారి స్త్రీని హరించి తెచ్చెదను!" ఈవిధముగా ఆలోచించి రావణుడు ఒంటరిగా రథమును ఎక్కి సముద్రతీరమున మారీచుడు నివసించు ప్రదేశమునకు పోయెను.

ఇచ్చట శ్రీ రామచంద్రుడు ఒక యుక్తి పన్నెను. లక్ష్మణుడు కందమూలాల ఫలములు తెచ్చుటకు వనములకు పోయినపుడు కృపాసాగరుడు శ్రీరామచంద్రుడు నవ్వి జానకితో యనెను: "ప్రియా! నేనొక మనోహరమైన లీలను చేసెదను.నేను నిశాచరులనందరినీ వధించువరకు నీవు అగ్నిదేవునితో నివసించుము." శ్రీరామచంద్రుని ఆదేశమున సీతాదేవి అగ్నిప్రవేశము చేసి తన ప్రతిరూపమును అక్కడ

వుంచెను. ఆమె శీల స్వభావములచే రూపనమ్రతలచే సీతాదేవిని పోలియుండెను. భగవంతుడు చేసిన ఈ లీలను లక్ష్మణుడు కూడా ఎరుగడు.

స్వార్థపరుడు, నీచుడైన రావణుడు ఆ సమయమున మారీచునివద్దకు పోయి నమస్కరించెను. వేళగాని వేళయందు పూచిన పూవువలె దుష్టుని మధురవాణికూడా భయంకరము అయెను. మారీచుడు అతనిని పూజించి సగౌరవముగా అడిగెను: "రావణా! నీమనసింత వ్యాకులమగుటకు కారణమేమి? నీవు ఒంటరిగా ఏల వచ్చితివి!" మూర్ఖుడైన రావణుడు కథనంతయూ సగౌరవముగా వినిపించి పలికెను: "నీవు నీ మాయచే లేడి రూపమును ధరించుము. నేను ఆ రాజకుమారిని అపహరించెదను." మారీచుడు దానికిట్లు సమాధానము ఇచ్చెను: "ఓ దశకంఠా! వినుము. అతడు మానవ రూపముతో నున్న చరాచరజగత్తునకు ఈశ్వరుడు. అతనితో వైరము వలదు. ఈ రాజకుమారుడే విశ్వామిత్రుని యాగ సంరక్షణమునకు పోయి నన్ను బాణముతో కొట్టగా, నేను ఒక్క క్షణములో నూరుయోజనముల దూరమున పడినాను. అందువలన అతనితో వైరము చేయుటచే శుభము జరగదు. తాటకను, సుబాహువును వధించినవాడు, శివ ధనుస్సును విరిచినవాడు. ఖరదూషణత్రిశరులను సంహరించినవాడు. అతడు మానవమాత్రుడు కాడు. కావున నీ కుటుంబక్షేమమును ఆలోచించి యింటికి మరలిపొమ్ము." అది వినగానే రావణుడు క్రోధాగ్నిలో మండి మారీచుని అనేక విధముల తిట్టెను. "మూర్ఖుడా! గురువువలె నాకు జ్ఞానోపదేశము చేసెదవా? ఈ ప్రపంచములో నాతో సమానమైన యోధుడు ఎవ్వడు? చెప్పుము." మారీచుడు రెండు విధములా తనకు మరణము తథ్యము అని తలచి రఘునాథుని శరణుజొచ్చిన శుభమని గ్రహించెను. "నేను సమాధానము చెప్పినచో రావణుడు నన్ను చంపును, కావున రఘునాథుని బాణము చేతనే ఏల

చావకూడదు? ఈ నెపముతో పరమప్రేమపాత్రుడైన శ్రీరాముని దర్శించెదను కదా!" అని ఆలోచించి రావణునితోపాటు పోయెను.

రావణుడు దండకారణ్యమును సమీపించగనే మారీచుడు తన మాయవలన కపట మృగమాయెను. బంగారు దేహకాంతి గలిగి మణులు పొదగబడియున్న ఆ సుందర మృగమును చూచి సీతాదేవి పలికెను: "ప్రభూ! ఈ జింక అతి సుందరముగా నున్నది. దీనిని చంపి దాని చర్మమును తీసుకొనిరండి," అని పలికెను. శ్రీరాముడు విషయమంతయూ తెలిసినప్పటికీ దేవతల కార్యమును నెరవేర్చుటకు లేచి ధనుర్బాణములను గైకొని లక్ష్మణునితో పలికెను: "సోదరా! వనములో నిశాచరులు తిరుగుచుందురు. నీ బుద్ధి, బలమును ఉపయోగించి సీతను రక్షించుము." ప్రభువును చూచి జింక పారిపోయెను. శ్రీరామచంద్రుడు దాని వెనక పరుగెత్తెను. అది ఒకసారి సమీపమునకు వచ్చును. మరియొక్కసారి దూరముగా పరుగెత్తును. ఒకసారి కనిపించును. మరియొకసారి మాయమగును. ఇట్లు అనేక పన్నాగములతో అది ప్రభువును దూరముగా తీసికొని పోయెను. శ్రీరాముడు బాణమును సంధించి గురిచూచి కొట్టెను. ఆ మృగము ఘోరమైన శబ్దము చేయుచూ లక్ష్మణుని పేరును బిగ్గరగా పిలుచుచూ నేల కొరిగెను. ప్రాణత్యాగ సమయమున మారీచుడు తన నిజరూపమును పొంది శ్రీరాముని స్మరించెను. సర్వజ్ఞుడైన ప్రభువు అతనికి మోక్షమును ప్రసాదించెను. దేవతలు ప్రభువు గుణములను పొగడుచూ పుష్పములను గురిపించిరి.

మారీచుని వధించి శ్రీ రఘువీరుడు తిరిగి వచ్చుచుండెను. అతని చేతులందు ధనుర్బాణములు, నడుమున తూణీరము శోభించుచుండెను. ఇక్కడ సీతాదేవి మారీచుని "హా లక్ష్మణా!" అను దుఃఖభరిత నినాదమును విని భయముతో లక్ష్మణునితో పలికెను: "లక్ష్మణా! మీ అన్నగారు సంకటములో నున్నారు. నీవు వెంటనే పరుగెత్తుకొని

పొమ్ము." లక్ష్మణుడు నవ్వి "మాతా! ఎవ్వని బొమముడి సంకేతముతోనే సృష్టి లయమయిపోవునో, అట్టి శ్రీరాముడు సంకట పరిస్థితిని ఎదుర్కొనునా?" అని పలికెను. అప్పుడు సీతాదేవి కఠోరమైన మాటలు పలికెను. లక్ష్మణుడు కూడా చలించిపోయి సీతాదేవిని వనదేవతలకు దిక్పాలకులకు అప్పగించి శ్రీరాముని వద్దకు పోయెను.

శూన్యమయిన ఆశ్రమమును చూచి సన్యాసివేషములో రావణుడు కుక్కవలె దొంగతనముగా ఇటునటు చూచుచూ వచ్చెను. సీతాదేవికి వివిధ సుందరకథలు అల్లి రాజనీతి, భయము, ప్రేమ చూపించెను. సీతాదేవి "సన్యాసీ! నీవొక దుష్టుడివలె మాట్లాడుచున్నావు," అని పలికెను, అప్పుడు రావణుడు తన నిజస్వరూపమును చూపి తన పేరును కూడా తెలుపగానే సీతాదేవి భయభీతురాలాయెను. కాని ధైర్యము వహించి "దుష్టుడా! ఆగుము. నా పతిదేవుడు వచ్చును. ఒక కుందేలు ఆడ సింహమును కోరినట్లు నీవు నన్ను కోరి కాలునికి వశమగుచున్నావు," అని పలికెను, రావణుడు క్రుద్ధుడై సీతాదేవిని తన రథమున కూర్చుండబెట్టుకొని ఆకాశమార్గమును పోయెను. కాని భయవిహ్వలుడై రథమును నడుపలేకపోయెను. సీతాదేవి విలపించసాగెను. "ఓ విశ్వవిఖ్యాత వీరుడా, రఘునాథా! శరణాగతవత్సలా! నాపై దయచూపకపోవుటకు నా అపరాధము ఏమి? ఓ లక్ష్మణా! నీ దోషము ఏమియూ లేదు. నా క్రోధఫలితమును నేను అనుభవించుచున్నాను. నా నాథుడు చాలా దూరములో నున్నాడు. నా ఈ ఆపదను ప్రభువునకు ఎవ్వరు వినిపించెదరు?" అని పరిపరివిధముల శోకించెను. సీతాదేవి విలాపమును విని స్థావర, జంగమ ప్రాణులన్నియూ దుఃఖించసాగెను. మార్గములో గృధ్ర రాజైన జటాయువు శోకపూరితమైన సీతాదేవి వాణిని విని "ఈమె నిజముగా రఘుకుల శ్రేష్ఠుడైన శ్రీరాముని పత్నియే" అని గుర్తించి "బిడ్డా!

భయపడకుము, నేనీ రాక్షసుని నాశనమొనర్తును" అనిపలుకుచూ అతి వేగముగా పరుగెత్తి వచ్చెను. దగ్గరికి వచ్చిన పిదప అది ముసలి జటాయువు అని రావణుడు గుర్తించెను. జటాయువు పలికెను: "రావణా! నా హెచ్చరికను వినుము. జానకీదేవిని వదిలి క్షేమముగా ఇంటికి పొమ్ము, లేనిచో శ్రీరాముని క్రోధాగ్నిలో నీ వంశము భస్మమగును." రావణుడు ఏమియూ సమాధానము పలుకలేదు. జటాయువు అతని తల వెంట్రుకలు పట్టుకొని రథమునుండి క్రిందికి పడద్రోసి తన ముక్కుచే పొడిచి అతని శరీరమును గాయపరచెను. అలసిపోయిన రావణుడు కృద్ధుడై లేచి తన కరవాలముతో జటాయువు రెక్కలను నరికెను. జటాయువు శ్రీరాముని స్మరించుచూ నేలకొరిగెను. పిదప సీతాదేవిని రథములో కూర్చుండబెట్టుకొని రావణుడు భయాందోళనలతో ఆకాశమార్గమున పోయెను. సీతాదేవి విలపించుచూ మార్గమున ఒక పర్వతముపై కోతులను చూచి హరినామస్మరణ చేయుచూ తన వస్త్రమును పడవేసెను అట్లు రావణుడు సీతాదేవిని తీసుకుపోయి అశోకవనములో నుంచెను.

## 7. సీతాన్వేషణము

ఇక్కడ శ్రీ రఘునాథుడు తన తమ్ముడైన లక్ష్మణుడు ఎదురుగా వచ్చుటను చూచి చింతాక్రాంతుడై "సోదరా, జానకిని ఒంటరిగా వదిలి నా యాజ్ఞను ఉల్లఘించి వచ్చినావా? వనములో రాక్షసులు సంచరిస్తూవుంటారు. సీత ఆశ్రమములో లేదని నా మనస్సు చెప్పుచున్నది" అని పలికెను. లక్ష్మణుడు శ్రీరాముని పాదములను పట్టుకొని చేతులు జోడించి "ప్రభూ! ఇందులో నా దోషము ఏమియూ లేదు" అని పలికెను. ఆశ్రమమునకు పోయి జానకినిగానక శ్రీరాముడు సామాన్య మానవునివలె వ్యాకులుడై దుఃఖితుడాయెను. లక్ష్మణుడు అతనిని అనేక విధముల ఊరడించెను. వనములోని పశుపక్షులను, చెట్లను, లతలను, చరాచర ప్రాణులన్నింటినీ జానకి జాడ

తెలుపమని ప్రార్థించుచూ శ్రీరాముడు విలపించెను. మార్గములో నేలపై పడిన గృధ్రరాజు జటాయువు ప్రభువుకు నమస్కరించి "రావణుడు సీతాదేవిని అపహరించుకొని దక్షిణదిశకు పోయినాడు"అని తెలిపెను. మరియు జటాయువు యిట్లు పలికెను: "ప్రభూ! నేను మీ దర్శనార్థము నా ప్రాణములు నిలుపుకొని వున్నాను, ఇప్పుడు మరణించ దలిచినాను. చనిపోవు సమయమున ఎవని నామము నోట వచ్చిన ముక్తి లభించునో అట్టి భగవంతుడే నా ఎదుట వుండుట నా భాగ్యము" అని పలికెను. ప్రభువు జటాయువునకు కైవల్యము నొసంగెను. యధోచితముగా అతని క్రియా కర్మలు శ్రీరాముడు తన చేతితో చేసెను.

పిదప సోదరులిద్దరూ సీతాదేవిని వెదకుచూ ముందుకు నడిచిరి. మిక్కిలి దట్టమైన అరణ్యమున మార్గములో శ్రీరాముడు కబంధుడు అను రాక్షసుని సంహరించెను. అతను తాను దుర్వాసునిచే శపింపబడిన గంధర్వుడనని పలికెను. అతనికి శాప విమోచనమగుటచే తన గంధర్వలోకమునకు వెళ్లిపోయెను. పిదప శ్రీరాముడు శబరి ఆశ్రమమున ప్రవేశించెను. తన యింటికి విచ్చేసిన శ్రీరాముని చూచిన శబరికి మతంగముని పలుకులు జ్ఞప్తికి వచ్చి సంతసించెను. వారిని అర్ఘ్యపాద్యములతో పూజించి రుచిగల కందమూల ఫలములను సమర్పించెను. పిమ్మట చేతులు జోడించి యిట్లు పలికెను: "నేను ఏ విధముగా మిమ్ము స్తుతించవలెను? నీచజాతిస్త్రీని, మందబుద్ధిని." శ్రీరాముడు పలికెను: "ఓ వనితా! నేను కేవలము భక్తిసంబంధమునే గుర్తించెదను. జాతి, కులము, ధనము, బంధుత్వము, గౌరవము, గుణము, బుద్ధి కౌశలము ఇవన్నియూ వున్ననూ భక్తిలేని మనుజుడు నీరులేని మేఘమువంటివాడు," అని పలికి శ్రీరామచంద్రుడు ఆమెకు నవవిధ భక్తి మార్గములను తెలిపెను. పిదప సీతాదేవి సమాచారము ఎరిగినచో తెలుపుమని అడిగెను. శబరి పలికెను: "రఘునాథా! మీరు

పంపాసరోవరముకు పొండి. అక్కడ సుగ్రీవునితో మీకు స్నేహము కాగలదు. అతడు మీకు సమాచారమునంతయూ తెలుపును. మీరు సర్వమును ఎరిగియు నన్ను అడుగుచున్నారు" అని పలికి మాటికిమాటికీ ప్రభువు చరణములకు ప్రణమిల్లి ప్రేమపూర్వకముగా మతంగముని తనకు చెప్పిన విషయమును తాను ఏ విధముగా ప్రభువుకొరకు ఎదురుచూచినది వినిపించెను. భగవంతుని తన హృదయమున నిలుపుకొని యోగాగ్నిలో తన శరీరమును త్యాగమొనర్చి శబరి పరమపదమును చేరెను.

సోదరులిద్దరూ ఆ వనమును వదలి ముందుకు నడిచిరి. వనశోభను, పశుపక్ష్యాదులను చూచి శ్రీరాముడు ఇంకనూ విరహాకులుడయ్యెను. రామలక్ష్మణులు అనేక పురాణములను, శాస్త్రములను చర్చించుచూ పంపాసరోవరతీరమునకు చేరిరి. ఆ సరోవరమునందలి స్వచ్ఛమయిన జలము, దాని సమీపమున ఫలపుష్పభరిత వృక్షములు, అందుగల మునిఆశ్రమములు వారికెంతయో మనోహరముగా ఉండెను. ఆ సరోవరమున స్నానమాడి ఒక వృక్షపు నీడయందు సోదరునితో సహా విశ్రమించిన శ్రీరాముని దేవతలు మునులు దర్శించి స్తుతించిరి. నారద మహాముని దండప్రణామములు ఆచరించి "నా శాపముచేతనేగద శ్రీహరి అనేక కష్టములను సహించుచున్నారు" అని భావించెను. శ్రీరామచంద్రుడు అతన్ని ఊరడించి "దుష్టశిక్షణకై నేను అవతారమును ఎత్తితిని. నీ శాపము కేవలము నిమిత్తమాత్రమే" అనెను. నారదుడు "ప్రభూ! నాకు వివాహేచ్ఛ కలిగించి వివాహమాడనీయని కారణమేమి?" అని ప్రశ్నించెను. ప్రభువు పలికెను: "నారదా! ఎవడైతే సమస్తమైన ఆశలను వదులుకొని అనన్యభక్తితో నన్ను ఆరాధించునో అతనిని సదా తల్లి తన సంతానమును రక్షించినట్టు రక్షించెదను. కావున నీపై అట్టి ప్రేమచే కామమునకు, మోహమునకు దూరముగా నుండునట్లు రక్షించితిని." శ్రీరామచంద్రుని మనోహర వచనములను

విని నారదుని నేత్రములు సజలమ్మాయెను. శరీరము పులకించెను. ప్రభువు అతనికి భక్తిజ్ఞానవైరాగ్య విషయము లనేకములు తెలిపెను. శ్రీరాముని పాదములకు మాటిమాటికి నమస్కరించి నారదుడు బ్రహ్మలోకమునకు పోయెను. ఎవరైతే సంసారమందు ఆశను వదలి కేవలము శ్రీహరి భక్తిద్వారా సాయుజ్యము నొందుదురో వారు ధన్యులు.

కలియుగ పాపములన్నింటినీ నాశనము చేయు
శ్రీరామచరితమానసమునందలి అరణ్యకాండమను
మూడవ సోపానము సమాప్తము.

★ ★ ★

# శ్రీరామచంద్ర స్తుతి

(శ్రీరామచరితమానసమునందలి అరణ్యాకాండలోనిది)

రచన: శ్రీ గోస్వామీ తులసీదాసు (పేజి213 214)

1. భక్తవత్సలుడవు, కృపాళువు, అతికోమలస్వభావుడవైన నీకు నమస్కరించెదను. నిష్కాములైన వారికి నీ పరమధామమును ప్రసాదించు నీ చరణకమలములను భజించెదను. అతి సుందరశ్యామల శరీరముగల వాడవు. సంసారరూప సముద్రమును మధించు మందరాచలమవు, వికసించిన కమలములవంటి నేత్రములు గలవాడవు. మాలోని మదము మున్నగు దోషములను నివారించువాడవు. అట్టి నీకు నమస్కరించెదను.

2. మిక్కిలి పొడవై బలిష్ఠములైన బహువులు గలవాడవు. నీవైభవమునకెట్టి యవధులు లేవు. ధనుర్బాణములను, తూణీరమును ధరించినవాడవు. త్రిలోకనాథుడవు, సూర్యకుల భూషణుడవు, శ్రీ శంకరుని ధనస్సును భంగము గావించిన వాడవు. మునిజనులకు, సత్పురుషులకు ఆనందము నిచ్చువాడవు. దైత్య సమూహమును నాశము చేయువాడవు. అట్టి నీకు నమస్కరించెదను.

3. కామారియైన శివునిచే, బ్రహ్మ మొదలగు దేవతలచే సేవింపబడువాడవు. విశుద్ధబోధ స్వరూపుడవు. సమస్త దోషములను దూరముచేయువాడవు. సుఖ విధానమవు, సత్పురుషులకు గతివి నీవే. శచీపతియైన ఇంద్రునికి సోదరుడవు. లక్ష్మీపతీ! ప్రభూ! శ్రీ సీతాలక్ష్మణసహితుడవైన నిన్ను భజించెదను.

4. మదమత్సరాది దోషరహితులై నీచరణముల నాశ్రయించినవారు అనేక వితర్కతరంగసంకులమైన ఈ సంసార సాగరమున పడరు. భవబంధ మోచనముకై ఏ మహాత్ములు ఏకాంతవాసులై

యింద్రియ సంయమమును పాటించి నిన్ను సదా భజింతురో, వారు యభీష్ట పరమపదమును పొందుచున్నారు.

5. అద్భుత ప్రభావముగలవాడవు, సర్వేశ్వరుడవు, సర్వవ్యాపివి, జగద్గురువు, నిత్యుడవు, జాగ్రదాది యవస్థలయందు కూడా విలక్షణుడవు, అద్వైతుడవు, భావ వల్లభుడవు, మిథ్యాయోగులకు దుర్లభుడవు, భక్తులపాలిటి కల్పవృక్షమవు, పక్షపాతరహితుడవు, సుసేవ్యుడవైన నిన్ను భజించెదను.

6. అనుపమరూప సౌందర్యముగల రాజాధి రాజువు. జానకీనాథుడవైన నీకు ప్రణమిల్లుదును. పదేపదే నీకు వందనమాచరించెదను. నాకు నీ పదాబ్జములందలి భక్తిని ప్రసాదించుము. ఏ మనుజులు ఈ స్తోత్రమును ఆదరపూర్వకముగా పఠించెదరో వారు భక్తి భావపూర్ణులై నీ పరమపదమును పొందెదరు. ఇందులో ఎట్టి సందేహములేదు.



# నాలుగవసోపానము

# కిష్కింధా కాండము

## 1. వందనము

మల్లెపూవు, నల్లకలువలవలె అందమైనవారు. బలశాలులు, విజ్ఞాన ఖనులు, శోభాసంపన్నులు, ధనుర్ధారులు, వేదములచే నుతింపబడిన వారు, గోబ్రాహ్మణులకు ప్రియమైన వారు, మాయామానుషరూపులు, ధర్మరక్షకులు, అందరికీ హితమొనర్చువారు, రఘువంశ శ్రేష్టులైనవారు శ్రీరామలక్ష్మణులు సీతాన్వేషణ తత్పరులై పథికులయినవారు నాకు భక్తిని ప్రసాదించెదరు గాక! వేదములనెడి సముద్రమునుండి ఉత్పన్నమై నట్టియూ కలియుగ పాపములను నాశనము చేయునట్టి, అవినాశియైన శ్రీ శంకరుని ముఖచంద్రుని సదా శోభాయమానంగా చేయునట్టి, జననమరణ రోగమునకు ఔషధము, సుఖప్రదము, శ్రీజానకీదేవికి జీవనస్వరూపమైనట్టి శ్రీ రామనామామృతమును ఎవరైతే సదా పానము చేయుదురో వారు పుణ్యాత్ములు, ధన్యులు.

## 2. హనుమత్సమాగమము - సుగ్రీవమైత్రి

పంపాసరోవరము నుండి శ్రీ రఘునాథుడు ముందుకు నడిచి ఋష్యమూక పర్వతమును సమీపించెను. అచ్చట సుగ్రీవుడు తన మంత్రులతో నివసించుచుండెను. మహాబలయుతులైన శ్రీ రామలక్ష్మ ణులను చూచి సుగ్రీవుడు భయముతో పలికెను: "ఆంజనేయా! ఈ పురుషులిద్దరూ రూపబలసంపన్నులు. నీవు బ్రహ్మచారి వేషమును

ధరించి పోయి విషయము ఏమిటో తెలుసుకొని సంకేతము ద్వారా నాకు తెలియజేయుము. ఒక వేళ వారు వాలిచే పంపబడిన వారైయినచో నేను ఈ పర్వతమును వదలి పారిపోయెదను." హనుమంతుడు బ్రాహ్మణ వేషముతో అక్కడికి పోయి నతమస్తకుడై అడిగెను: "శ్యామల గౌర శరీరములుగల వీరులారా! క్షత్రియవేషములతో వనములో ఏల తిరుగుచున్నారు? కఠోరమైన భూమిపై కాలినడకన సంచరించుటకు కారణమేమి? మీరు బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో ఇద్దరా? లేక నరనారాయణులా?" శ్రీరాముడు సమాధానమిచ్చెను: "మేము కోసలదేశాధిపతి దశరథుని పుత్రులము, రామలక్ష్మణులము. తండ్రిగారి ఆజ్ఞవలన వనమునకు వచ్చినాము. మాతో పాటున్న నా భార్య జానకిని ఎవడో రాక్షసుడు అపహరించినాడు. మేము ఆమెను వెతుకుచూ సంచరించుచున్నాము. మా కథను వినిపించినాము. మీరు మీ కథను చెప్పండి." తన ఆరాధ్య దైవమయిన శ్రీరాముని గుర్తించి హనుమంతుడు అతని చరణములపై వ్రాలెను. తన ప్రభువు సుందరరూపమును చూచుచూ పొగడసాగెను. పిదప హనుమంతుడు తన నిజశరీరమును ప్రకటించెను. శ్రీరామచంద్రుడు అతనిని లేవనెత్తి తన హృదయముకు హత్తుకొనెను. పిమ్మట హనుమంతుడు పలికెను: "స్వామీ! ఈ పర్వతముపై సుగ్రీవుడు అను వానరరాజు ఉన్నాడు. అతడు మీకు దాసుడు. అతనితో మైత్రిచేసి, దీనుడయిన అతనిని నిర్భయునిగా చేయండి. అన్ని దిశలకు కోట్లకొలది వానరులను పంపి అతడు సీతాదేవిని వెదకించును." ఆ విధముగా అన్ని విషయములను వివరించి రామలక్ష్మణులను తన వీపుపై నెక్కించుకొని పోయెను. సుగ్రీవుడు శ్రీరామచంద్రుని చూచి తన జన్మ ధన్యమయినది అని భావించి అతని చరణములకు నమస్కరించెను. శ్రీరాముడు లక్ష్మణుడు అతనిని కౌగిలించుకొనిరి. హనుమంతుడు ఇరుపక్షముల వృత్తాంతములను వివరించి అగ్నిసాక్షిగా వారికి మైత్రి చేసెను.

ఇద్దరి మధ్య మైత్రి ఏర్పడిన పిదప లక్ష్మణుడు శ్రీరాముని కధనంతయూ వినిపించెను. సుగ్రీవుడు కన్నులలో నీరు నింపుకొని ఇట్లు పలికెను: "స్వామీ! జానకీదేవి తప్పక దొరకగలదు. ఒకసారి మంత్రులతోపాటు నేను ఇచ్చట కూర్చొని ఉండగా నిస్సహాయురాలై దీనముగా విలపించుచూ ఆకాశమార్గమున పోవుచున్న సీతాదేవిని చూచితిని. ఆమె "రామా రామా" అని విలపించుచూ ఒక వస్త్రమును పడవేసెను" అని పలికి ఆ వస్త్రమును తెచ్చియిచ్చెను. శ్రీరాముడు ఆ వస్త్రమును తన హృదయమునకు హత్తుకొని విచారములో మునిగి యుండగా సుగ్రీవుడు అతనిని ఓదార్చెను.

దయాసాగరుడైన శ్రీరాముడు "సుగ్రీవుడు ఆ వనములో నుండుటకు కారణమేమి?" అని అడుగగా అతడిట్లు పలికెను: "స్వామీ! వాలి, నేను అన్నదమ్ములము. మా యిద్దరి మధ్య వర్ణింపరాని ప్రేమ ఉండెడిది. ఒక నాడు మాయావి అను దానవుడు కిష్కింధా నగరమునకు వచ్చి అర్ధరాత్రి నగరద్వారమున నిలబడి యుద్ధమునకు రమ్మని అరిచెను. శత్రుబలము సహించని వాలి వానితో యుద్ధము చేయుటకు పరుగెత్తెను. అతనిని చూచి మాయావి పరుగెత్తెను. నేనుకూడా అన్నతో పాటు పోయితిని. ఆ మాయావి ఒక పర్వత గుహలో దూరెను. వాలి నన్ను ఒక పక్షము రోజులు అచటనే యుండి తనకై ఎదురుచూడమనియూ ఒకవేళ తాను తిరిగిరానిచో చనిపోయినాడని భావించమని నాతో చెప్పిపోయెను. నేనొక్క నెలరోజులు నిరీక్షించితిని. ఆ గుహనుండి రక్తము ప్రవహించుచూ వచ్చెను. ఆ రాక్షసుడు వాలిని చంపినాడని, వచ్చి నన్ను కూడా చంపునని భావించి ఒక బండరాయితో గుహద్వారమును మూసివేసి పరుగెత్తుకొని వచ్చితిని. మంత్రులు రాజులేని నగరమును చూచి బలవంతముగా నన్ను రాజును చేసిరి. కాని వాలి ఆ మాయావిని చంపి తిరిగి వచ్చెను. సింహాసనముపై

నన్ను చూచి రాజ్యలోభముచే నేను గుహద్వారమును మూసినానని తలంచి నన్ను శత్రువువలె దెబ్బలు కొట్టెను. నా సర్వస్వమును తీసుకొనెను. నా భార్యను కూడా లాగుకొనెను. ఓ దయామయా! రఘువీరా! అతని భయముచే నేను అన్ని లోకములందు నిస్పృహతో తిరిగి చివరకు శాపకారణమున అతడు ఇక్కడికి రాలేడు కావున ఈ పర్వతముపై భయపడుతూ వున్నాను." సుగ్రీవుని దీనగాథను విని శ్రీరామచంద్రుడు పలికెను: "సుగ్రీవా! వినుము. నేను వాలిని ఒకే బాణముతో కొట్టి చంపెదను. అతడు బ్రహ్మను, శివుని శరణువేడిననూ ప్రాణములను కాపాడుకొనలేడు. నీవు చింతించవలదు, అప్పుడు సుగ్రీవుడు పలికెను: "రఘువీరా! వాలి మిక్కిలి బలశాలి. యుద్ధములో అతిధీరుడు, వీరుడు" అని పలికి దుందుభి అను రాక్షసుని ఎముకలను, తాళవృక్షములను చూపెను. శ్రీరఘునాథుడు వాటిని ఎట్టి ప్రయాస లేకుండా సులభముగా పడగొట్టెను.

## 3. వాలివధ

శ్రీరాముని అపారబలమును చూచి సుగ్రీవునికి అతనిపై విశ్వాసము కలిగెను. శ్రీరాముని భగవంతునిగా నెరింగి సుగ్రీవుని మనస్సు హర్షముతో నిండెను. అతడు పలికెను: "స్వామీ! మీ కృపవలన నా మనస్సులోని అశాంతి తొలగిపోయినది. సుఖసంపదలు, పరివారము, వైభవము అన్నింటినీ వదలి మీ సేవ చేసెదను." పిదప సుగ్రీవుని వెంటబెట్టుకొని శ్రీరాముడు ధనుర్బాణములను ధరించి బయలుదేరెను. సుగ్రీవుని వాలి వద్దకు పంపగా అతను పోయి గట్టిగా గర్జించెను. అతని గర్జనను విని కోపముతో వచ్చుచున్న వాలిని అతని భార్య అయిన తార నిలిపి ఇట్లు ప్రార్థించెను: "నాథా! వినుడు. సుగ్రీవునికి అమిత బలపరాక్రమశాలురు, కోసలాధిపతి దశరథుని పుత్రులు రామలక్ష్మణులతో మైత్రి అయినదని విన్నాను. వారిని

యుద్ధములో ఎవరు కూడా జయించలేరు." ఆ మాటలకు వాలి "పిరికిదానా! శ్రీరఘునాథుడు సమదర్శి. ఒకవేళ నేను అతనిచే చనిపోయిననూ మోక్షమునకే పోవుదును" అని పలికి సుగ్రీవుని గడ్డిపోచగా భావించి వచ్చెను. ఇద్దరూ పరస్పరమూ ఎదుర్కొనిరి. వాలి గర్జించుచూ కొట్టిన ముష్టిఘాతములతో వ్యాకులుడై సుగ్రీవుడు పారిపోయి, శ్రీరాముని పాదములపై పడెను. అప్పుడు శ్రీరాముడు "మీరు సోదరు లిద్దరూ ఒకే మాదిరి యుండుటవలన పోల్చుట కష్టమై నేను అతనిని కొట్టలేదు" అని పలికి సుగ్రీవుని శరీరమును నిమిరెను. అతని శరీరము వజ్రసమానమాయెను. శ్రీరాముడు అతని మెడలో పూలమాల వేసి పంపెను. ఇరువురూ అనేక విధముల పోరాడిరి. శ్రీరామచంద్రుడు చెట్టు చాటునుండి చూచుచుండెను. సుగ్రీవుని బలము సన్నగిల్లి ఆశ వదులుకొనెను. అప్పుడు శ్రీరాముడు బాణమునెక్కుపెట్టి వాలి హృదయమున కొట్టెను. వాలి బాధతో క్రిందపడి ఎదుట ప్రభువును చూచి లేచి కూర్చొనెను. నీలమేఘశ్యాముడు, జటాజూటధారి, ధనుర్బాణములు ధరించిన భగవంతుని చూచి వాలి అతని పాదములపై పడి తన జన్మ ధన్యమయినదని భావించెను. పిదప వాలి పలికెను: "స్వామీ! నీవు ధర్మరక్షణకై అవతరించితివి. కాని ఒక వేటగాని వలె దాగుకొని నన్ను చంపితివి. ఏ అపరాధము చేసితినని నన్ను చంపితివి?" శ్రీరాముడు సమాధానము ఇచ్చెను: "మూర్ఖుడా! వినుము. తమ్ముని భార్య, సోదరి, కోడలు, కన్య వీరిలో ఎవరినైనా చెడు దృష్టితో చూచినచో వారిని వధించుటలో పాపము లేదు. నీకు చాలా అభిమానము కలదు. సుగ్రీవుడు నా భుజబలమును ఆశ్రయించినాడని నీ భార్య హెచ్చరిక చేసిననూ లెక్కచేయక నీవు అతనిని చంపగోరితివి. నేను క్షత్రియుడనగుట వలన వేటాడుట నాకు పాపము కాదు." వాలి పలికెను: "స్వామీ! అంత్యకాలములో మీ శరణుజొచ్చిన నేనిప్పుడు కూడా పాపినేనా? ఏ రామనామము శాశ్వతమైన మోక్షమును

ప్రసాదించునో అట్టి రఘునాథుడే నా కనులముందున్నాడు. నా కర్మను అనుసరించి ఎట్టి జన్మను ఎత్తిననూ శ్రీరాముని పాదములపై నాకు అనురాగము కలుగునట్లు వరమును ప్రసాదించుడు. వీడే నా పుత్రుడు అంగదుడు. వినయములో, బలములో నాతో సమానుడు. వీనిని స్వీకరించి మీ దాసునిగా చేర్చుకొమ్ము" అని వాలి తన ప్రాణములను వదిలెను. దయాసాగరుడైన శ్రీరామచంద్రుడు వాలికి పరమపదమును ప్రసాదించెను. కిష్కింధానగరవాసులు వ్యాకులులైరి. అనేక విధముల విలపించుచున్న తారకు శ్రీరఘునాథుడు జ్ఞానోపదేశము చేసి మాయను తొలగించెను. శ్రీరాముని ఆజ్ఞచే సుగ్రీవుడు తన అన్న మృతకర్మలన్నింటినీ చేసెను. శ్రీరాముని ఆజ్ఞతో లక్ష్మణుడు శాస్త్రోక్తముగా సుగ్రీవుని రాజుగా, అంగదుని యువరాజుగా చేసెను. పిదప శ్రీరాముడు సుగ్రీవుని పిలిచి అనేక విధముల రాజనీతిని ఉపదేశించెను. "వానర రాజా! సుగ్రీవా! వినుము. నేను పదునాలుగు సంవత్సరములు ఏ నగరములో ప్రవేశించను. సమీపముననే పర్వతముపై కుటీరమును నిర్మించుకొని నివసించెదను. అంగదునితో పాటు రాజ్యపాలనము చేయుము. కాని నా కార్యమును సదా మనస్సులో నుంచుకొనుము" అని పలికి, సుగ్రీవుని అతని భవనమునకు పంపి శ్రీరాముడు ప్రహర్షణ పర్వతముపై నివసించసాగెను. కృపానిధి శ్రీరాముడు అచ్చట కొన్ని దినములు వసించునని భావించి దేవతలు ముందే ఆ పర్వతమునందు ఒక గుహను అలంకరించిరి. ఫలపుష్పములతో ఆ వనము అత్యంత మనోహరమై యుండెను. కాంతివంతమైన స్ఫటికశిలపై కూర్చుండి, శ్రీరాముడు లక్ష్మణునికి భక్తి, వైరాగ్య, రాజనీతి, వివేకమునకు సంబంధించిన కథలను చెప్పుచుండెను.

## 4. లక్ష్మణుని ఆగ్రహము

వర్ష ఋతువు శ్రీరాముని విరహమును ఇనుమడింపచేసెను. పిదప అతిమనోహరమైన శరదృతువు వచ్చెను. కాని సీతజాడ తెలియక విరహార్తుడైన శ్రీరాముడు అతి వ్యాకులుడాయెను. లక్ష్మణునితో యిట్లు పలికెను: "నాయనా! సీతజాడను తెలుపు వార్త రాలేదు. జాడ తెలిసినచో ఆమె ఎక్కడున్నాసరే, అవశ్యముగా తీసుకొని వస్తాను. సుగ్రీవుడు తన రాజ్యమును, కోశాగారమును, నగరమును, తన భార్యను పొంది నన్ను మరచినాడు. ఏ బాణముతో నేను వాలిని చంపినానో అదే బాణముతో రేపు ఆ మూఢుని వధించెదను." కోపమే ఎరుగని పరమశాంతస్వభావుడైన శ్రీరాముడు కృద్ధుడగుట చూచి, లక్ష్మణుడు ధనుర్బాణములను తీసుకొనెను. కరుణాసాగరుడైన శ్రీరాముడు "లక్ష్మణా, సుగ్రీవుడు మన మిత్రుడు. అతనిని చంపవలదు. కేవలము భయపెట్టి ఇక్కడికి పిలుచుకొని రమ్ము" అని పలికెను. కిష్కింధలో హనుమంతుడు కూడా సుగ్రీవుడు శ్రీరాముని కార్యమును పూర్తిగా మరచినాడని విచారించుచుండెను. అతడు సుగ్రీవుని వద్దకు పోయి నచ్చచెప్పగా భయభీతుడైన సుగ్రీవుడు పలికెను: "విషయవాసనలు నా జ్ఞానమును హరించినవి. ఇప్పుడు పవనపుత్రా! నీవు దూతలను పిలిచి అన్ని దిశలకు పంపుము." అదే సమయమున లక్ష్మణుడు నగరమున ప్రవేశించెను. అతడు కోపముతో నున్నాడని గ్రహించి వానరులందరూ నలుదిశలకు పారిపోయిరి. లక్ష్మణుడు ధనుస్సును ఎక్కుపెట్టి "ఇప్పుడే ఈ నగరమును కాల్చి మసి చేసెదను," అనెను. వాలిపుత్రుడు అంగదుడు వచ్చి నమస్కరించి శాంతపరచి అతనిని సుగ్రీవుని వద్దకు తీసుకొని పోయెను. సుగ్రీవుడు అతని కాళ్ళుకడిగి సర్వోపచారములు చేసిన పిదప లక్ష్మణునితో యిట్లనెను: "ప్రభూ! విషయభోగములతో సమానమైన మత్తు పదార్థములు లేవు. అవి మునులలో సయితము మోహమును కలిగించును. మేము వానరులము.

మా అపరాధమును క్షమింపుము." సుగ్రీవుని వచనములకు లక్ష్మణుడు సంతసించెను పిదప హనుమంతుడు దూతలను పంపిన సమాచారమును కూడా చెప్పెను. అంగదుడు మొదలగు వానరులను వెంటనిడుకొని, లక్ష్మణుడు ముందు నడుచుచుండగా, సుగ్రీవుడు సంతసముతో శ్రీ రఘునాథుని కడకు వచ్చెను. శ్రీరాముని చరణములకు ప్రణమిల్లి పలికెను: "ప్రభూ! నా దోషము ఏమియూ లేదు. మీ మాయ అతి ప్రబలమైనది. మీ దయగలిగినపుడే అది విడిచిపెట్టును. దేవతలు, మనుష్యులు మునులు కూడా విషయలంపటులు. నేనైతే నీచమైన పశువును, చంచలమైన కోతిని." అట్లు పలికిన సుగ్రీవునితో రఘునాథుడు చిరునవ్వుతో పలికెను: "సోదరా! నీవు నాకు భరతునివలె ప్రియుడవు. ఇప్పుడు సీతజాడ తెలుసుకొనుటకు మనః పూర్వకముగా యత్నించుము."

## 5. వానరులచే సీతాన్వేషణము

అంతలోనే వానరయూథములు అన్నియూ చేరెను. శ్రీరాముడు ప్రతిఒక్కరినీ కుశల సమాచారము అడిగెను. సుగ్రీవుడు వారితో "వానరులారా! ఇది శ్రీరామచంద్రుని కార్యము మరియు నా ఆజ్ఞ. మీరు అన్ని దిశలకు పోయి సీతాదేవి జాడను తెలుసుకొని ఒక్క నెలలో తిరిగిరావలెను. ఈ అవధి లోపల సీతాదేవి వార్తను తెలుసుకోకుండా వచ్చినవాడు నా చేతులలో మరణించును." ఆ మాటలు వినగానే వానరులందరూ వెళ్లిపోయిరి. అప్పుడు సుగ్రీవుడు అంగదుడు, హనుమంతుడు, జాంబవంతుడు, నలుడు, నీలుడు మొదలగు వీరులను పిలిచి "మీరందరూ దక్షిణ దిశగా పొండి. కలిసినవారినందరినీ సీతాదేవి జాడను గురించి అడగండి. శ్రీరామచంద్రుని కార్యమును సంపన్నము చేయండి." ఆ మాటలను విని వానరులందరూ నమస్కరించి శ్రీరాముని స్మరించుచూ ప్రసన్నులైపోయిరి. చివరగా

హనుమంతుడు ప్రణమిల్లెను. అతని ద్వారానే తన పనియగునని గ్రహించి శ్రీరాముడతనిని తన వద్దకు పిలిచి తన కరకమలములతో అతని శిరస్సును స్పృశించెను. తన భక్తుడు అని తెలుసుకొని తన చేతి ఉంగరమును యిచ్చి ఇట్లు పలికెను: "అనేకవిధముల సీతకు నచ్చచెప్పుము. నా బలమును గూర్చి, విరహమునుగూర్చి చెప్పి శీఘ్రముగా తిరిగిరావలెను." హనుమంతుడు తన జన్మ ధన్యమయినదని తలచి ప్రభువును తన హృదయముననే ధరించి బయలుదేరెను. దేవతలకు రక్షకుడైన ప్రభువు అన్నియూ తెలిసిననూ మనుష్యులవలె దూతను పంపి శత్రుసమాచారమును తెలిసికొను రాజనీతిని పాటించినాడు.

వానరులందరూ వనములను, నదులను, చెరువులను, పర్వతము లను లోయలను అవలీలగా దాటుచూ పోయిరి. ఎక్కడయిన రాక్షసుడు కనపడినచో వాని ప్రాణములను తీయుచుండిరి. మునులు కనపడిన వారిచుట్టు చేరి సీతాదేవి సమాచారమును అడుగుచుండిరి. వారు అతిదాహముచే వ్యాకులతనొంది నీరు లభించక ఒక ఘనారణ్యమున దారితప్పిరి. "నీరు దొరకక వీరు చనిపోవుదుర"ని భావించి హనుమం తుడు ఒక పర్వతశిఖరమునెక్కి నలుదిశల చూచెను. నేలలో ఒక బిలము అతనికి కనపడెను. దానిపై కొంగలు, హంసలు ఎగురుచున్నవి. కొన్ని పక్షులు లోపలికి కూడ పోవుచున్నవి. అందు నీరు ఉండునని భావించి వానరులందరినీ ఆ బిలములోనికి తీసుకొని పోయెను. లోపల ఒక ఉపవనము, ఒక సరోవరము, సుందరమైన మందిరము, అందు తపోమూర్తి అయిన ఒక స్త్రీని వారు చూచిరి. మధురమైన ఫలములను ఆరగించిన పిదప ఆమెకు నమస్కరించి విషయమంతయూ చెప్పిరి. ఆమె తన కథను వినిపించెను. పిదప "నేనిప్పుడు రఘునాథుని వద్దకు పోయెదను. మీరిప్పుడు కనులు మూసుకొనండి. ఈ బిలము వదలి పోయెదరు. సీతాదేవిని కనుగొనుటలో మీరు సఫలు లయ్యెదరు.

నిరాశ చెందవలదు" అని పలికెను. వారందరు కనులు మూసుకొని తెరవగావే సముద్ర తీరమున నుండిరి. స్వయంప్రభ అను ఆ తపస్విని శ్రీరాముని చరణములకు నమస్కరించి బదరికాశ్రమమునకు పోయెను.

సముద్రతీరమున వానరులందరూ విచారించసాగిరి. "సీతాదేవి సమాచారమును తెలుసుకోకుండా పోయినచో సుగ్రీవుడు మనలనందరినీ చంపును. ఈ లవణసముద్రమును దాటుట అతి కష్టము." అట్లు పలుకుచున్న వానరులకు జాంబవంతుడు ధైర్యము గొలిపి అనేక కథలను చెప్పుచుండెను. వాటిని అక్కడ పర్వతగుహయందున్న సంపాతి అను గ్రద్ద విని బయటికి వచ్చి "భగవంతుడు నాకీ రోజు భోజనమును సమకూర్చినాడు" అని పలికెను. వానరులు భయపడి "ఇప్పుడు మనకు నిజముగా మరణము ఆసన్నమయినది" అని పలుకసాగిరి. అంగదుడు మనస్సులో ఆలోచించి "ఆహా! జటాయువు ఎంతటి పుణ్యాత్ముడు! శ్రీరాముని కార్యముకు శరీరత్యాగము చేసి వైకుంఠమునకు పోయెను" అని పలికెను. హర్షశోకములతో కలిసిన ఆ మాటలు వినగానే సంపాతి వారి వద్దకు పోయి జటాయువు వృత్తాంతము అడుగగా వారు ఆ కథనంతయు వినిపించిరి. పిదప సంపాతి వారి సహాయమున సముద్రతీరమున తన తమ్ముడైన జటాయువునకు శ్రాద్ధక్రియలను ఆచరించి చేరి తన కథ చెప్పసాగెను: "వానరులారా! వినుడు. మేము సోదరులిద్దరము. యవ్వనదశలో . ఆకాశమున ఎగురుచూ సూర్యుని సమీపించితిమి. జటాయువు సూర్యుని తేజస్సును సహించలేక తిరిగి వచ్చెను. నేను అభిమానిని కాబట్టి సూర్యుని సమీపమునకు పోయితిమి. సూర్యుని అపారతేజస్సులో నా రెక్కలు కాలిపోయినవి. నేను గట్టిగా అరుచుచూ భూమిపై పడితిని. అక్కడ చంద్రమా అను ముని నా స్థితిని చూచి జాలిగలిగి జ్ఞానబోధచేసి నా అహంకారమును తొలగించెను. పిదప 'త్రేతాయుగమున

పరబ్రహ్మ మానవ అవతారమును దాల్చి అపహరింపబడిన తన భార్యను వెతుకుటకు దూతలను పంపును. వారిని కలిసినప్పుడు నీవు పావనము అయ్యెదవు. నీ రెక్కలు తిరిగి వచ్చును. చింతించవలదు.' అని పలికెను. ముని పలుకులు ఈనాడు సత్యమయినవి. శ్రీరామచంద్రప్రభువు కార్యము నాచరించుడు. త్రికూటపర్వతముపై లంకా నగరము ఉన్నది. అక్కడ సహజముగా అభిమాని, నిర్భయుడైన రావణుడు ఉన్నాడు. అశోకమను ఒక ఉపవనమున విచారమగ్నురాలై సీతాదేవి కూర్చొని వున్నది. గ్రద్ద దృష్టి అపారమయినది. కావున నేను చూడగలను. కాని మీరు చూడలేరు. ముసలివాడనగుటచే నేను లంఘించలేను. నూరుయోజనములు దూరముగల సముద్రమును లంఘించగల వీరుడు, బుద్ధిమంతుడు శ్రీరాముని కార్యమును సాధించగలడు. శ్రీరాముని కృపచే నా శరీరమెట్లు సుందరముగా అయినదో చూడుడు. మీరు అతని దూతలు. పిరికితనమును వదలి శ్రీరామచంద్రుని హృదయమున నిలుపుకొని ప్రయత్నించండి" అని పలికి సంపాతి తన కొత్తరెక్కలతో ఎగిరిపోయెను.

వానరులందరూ తనతమ బలములను గూర్చి ప్రకటించుకొనిరి. జాంబవంతుడు ముసలివాడగుటచే అంత దూరము ఎగురలేడు. అంగదుడు సముద్రమును దాటగలడు కాని తిరిగి వచ్చుటకు సందేహించెను. అయినను అతడు యువరాజు. కావున దూతగా పోవుట తగదు. కావున భల్లూకరాజు హనుమంతునితో "నీవు పవనపుత్రుడవు. బుద్ధి, వివేకము , విజ్ఞానములకు నిధివి. విశ్వములో నీకుకాని కఠినకార్యము లేదు. శ్రీరాముని కార్యమునకే నీవు అవతరించితివి." అని పలికెను. అది వినగానే హనుమంతుడు పర్వతమువలె పెరిగెను. మేరుపర్వతమువలె అతని శరీరము పచ్చని స్వర్ణకాంతి కలిగి తేజస్సుతో విరాజిల్లెను. సింహగర్జన చేసి "నేనీ లవణ సముద్రమును అవలీలగా లంఘించి, రావణుని సపరివారముగా పరిమార్చి, త్రికూట పర్వతమును

పెకలించుకొని తేగలను. జాంబవంతా! నాకు సరియైన సలహానిమ్ము!" అని పలికెను. జాంబవంతుడు "నాయనా! నీవు పోయి సీతాదేవిని చూచి ఆమె సమాచారమును తెలుసుకొని రమ్ము. ఇంతే నీవు చేయవలసినది. రాజీవనయనుడు శ్రీరామచంద్రుడు తన భుజబలముచే తన లీలను చూపుటకు వానరసైన్యమును తోడుగా తీసుకొని, రాక్షసులను సంహరించి సీతాదేవిని తీసికొని వచ్చును. దేవతలు, మునులు ముల్లోకములను పవిత్రమొనర్చు రామకథను వర్ణించెదరు. దానిని విని, గానము చేసి, పలికి, గ్రహించి మనుజుడు పరమపదమును పొందును."

జననమరణ రూపమయిన భవరోగమును రూపుమాపు ఔషధమయిన శ్రీరఘునాథుని కీర్తిని వినువారు, గానము చేయువారు, సకల మనోరథములను పొందుదురు.

కలియుగ సమస్త పాపములను నాశమొనరించు
శ్రీరామచరితమానసమునందలి "కిష్కింధాకాండ"మను
నాలుగవ సోపానము సమాప్తము.

★ ★ ★

## ఆంజనేయ ప్రార్థన:

1. గోష్పదీ కృతవారాశిం మశకీ కృతరాక్షసమ్
రామాయణ మహామాలారత్నం వందేనిలాత్మజమ్॥

సముద్రము నవలీలగా లంఘించి, రాక్షసులను దోమలవలె పరిమార్చి, రామాయణ మహామాల యందు రత్నమువలె భాసించు అనిలాత్మజుడైన ఆంజనేయునికి నమస్కరించుచున్నాను.

2. అంజనా నందనం వీరం జానకీ శోకనాశనమ్,
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్॥

అంజనాదేవికి ఆనందప్రదుడైన కుమారుడు, వీరుడు, జానకీదేవి శోకమును దూరముచేసినవాడు, అక్షకుమారుని వధించినవాడు, లంకలోని ప్రజలకు భయమును కల్పించినవాడు, కపిశ్రేష్ఠుడైన, ఆంజనేయునికి నమస్కారము.

3. మనోజవం మారుత తుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్।
వాతాత్మజం వానర యూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి॥

మనస్సువలె శీఘ్రగతిని, గాలితో సమానమైన వేగమును గలవాడు, జితేంద్రియుడు, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు, వాతాత్మజుడు, వానర సమూహములో ముఖ్యుడు, శ్రీరామచంద్రుని దూతయైన ఆంజనేయునికి శిరసా నమస్కరించుచున్నాను.

4. ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః।
ఆదాయ లీలైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్॥

సముద్రమునవలీలగా లంఘించి, జనకాత్మజయైన సీతాదేవి శోకాగ్నిని చల్లార్చి, లంకను కాల్చి తిరిగివచ్చిన ఆంజనేయునికి ఆంజలి ఘటించి మ్రొక్కెదను.

5. ఆంజనేయ మతి పాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహమ్,
పారిజాత తరుమూల వాసినం,
భావయామి పవమాన నందనమ్॥

అతి పాటలవర్ణముగల ముఖముగలవాడు, మేరు పర్వతము వంటికమనీయ విగ్రహము గలవాడు, పారిజాత వృక్షమూలమున నుండువాడు, పవమాన నందనుడైన ఆంజనేయుని భజించెదను.

6. యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిం
బాష్పవారి పరిపూర్ణ లోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్॥

ఎక్కడ శ్రీరఘునాథుని కీర్తిన జరుగునో, అక్కడ కృతమస్తకుడై, అంజలి ఘటించి, సజలనేత్రుడైన రాక్షసాంతకుడైన మారుతికి, ఆంజనేయునికి నమస్కరించుడు.

★ ★ ★

# ఐదవసోపానము

# సుందరకాండము

## 1. వందనము

శాంత స్వరూపుడు, శాశ్వతుడు, అప్రమేయుడు, వేదాంత వేద్యుడు, మాయామానుషరూపుడు, రఘుకులశ్రేష్ఠుడగు శ్రీరామ చంద్రుడు నాకు పరిపూర్ణ భక్తిని ప్రసాదించుటకు ప్రార్థించుచూ ప్రణమిల్లుచున్నాను. అతులిత బలవంతుడు, మేరు సమానకాంతి గలవాడు, దనుజులను వనములను దహించు అగ్ని, జ్ఞానులలో శ్రేష్ఠుడు. సకల గుణములకు నిధానమైనవాడు, వానరులకు ప్రభువు, శ్రీరఘునాథుని ప్రియదూత వాయునందనుడైన ఆంజనేయునికి నమస్కరించుచున్నాను.

## 2. సాగరలంఘనము

జాంబవంతుని పలుకులు హనుమంతునికి మిక్కిలి ఆహ్లాదకరములు ఆయెను. "సోదరా! మీరు దుఃఖమును సహించుచూ కందమూల ఫలములను తినుచూ నాకై ఎదురుచూడండి. అంతవరకు నేను సీతాదేవిని చూచి తిరిగి రాగలను." ఆ విధముగా పలికి అందరికీ నమస్కరించి మనస్సున శ్రీరామచంద్రుని ధ్యానించుచూ ఆంజనేయుడు బయలు దేరెను. సముద్రతీరమునగల ఒక సుందరపర్వతమును ఎక్కి దానిపై కాలుమోపి అతి వేగముగా ఎగిరెను. ఆ పర్వతము తక్షణము పాతాళమునకు కృంగెను. శ్రీరామబాణమువలె అమితవేగముతో పోవుచున్న హనుమంతుని ఎదుట మైనాకపర్వతము నిలిచి శ్రమ

తీర్చుకొని పొమ్మని ప్రార్థించెను. కాని "శ్రీరామచంద్రుని కార్యమును నెరవేర్చనిదే నాకు విశ్రాంతి లేదు" అనుచూ హనుమంతుడు ఆ పర్వతమును చేతితో స్పృశించి ముందుకు వెళ్లెను. హనుమంతుని బలమును, బుద్ధిని పరీక్షించదలచి దేవతలు సురస అను నాగమాతను పంపిరి. ఆమె హనుమంతుని సమీపించి "దేవతలు నాకీ రోజు భోజనము ప్రసాదించినారు" అని పలికెను. ఆంజనేయుడు "శ్రీరాముని కార్యమును నెరవేర్చి తిరిగి వచ్చి, సీతాదేవి సమాచారమును ప్రభువునకు తెలిపిన పిదప నేను నీ నోట ప్రవేశించెదను. తల్లీ! ఇప్పుడు నన్ను పోనిమ్ము," అని పలికెను. కాని ఏ ఉపాయముతో కూడా ఆమె అతనిని పోనివ్వలేదు. అయితే "నన్ను మ్రింగుము" అనెను. ఆమె తన నోటిని ఒక యోజనము వెడల్పు చేసెను. హనుమంతుడు తన శరీరమును రెండుయోజనములు పెంచెను. సురస తన నోటిని వెడల్పు చేసే కొలది హనుమంతుడు దానికి రెండింతలు తన శరీరమును పెంచెను. చివరకు ఆమె నూరుయోజనములు తన నోరు తెరిచినపుడు హనుమంతుడు చాలా చిన్నరూపమును ధరించి ఆమె నోటిలో దూరి బయటికి వచ్చి నమస్కరించెను. పోవుటకు అనుమతిని అడిగెను. సురస అతని బలమును, బుద్ధిని పొగడి ఆశీర్వదించి వెళ్లిపోయెను. హనుమంతుడు ప్రసన్నుడై ముందుకు సాగెను. సముద్రములో ఒక రాక్షసి నివసించుచుండెను. అది తన మాయవలన ఆకాశమున నెగురు ప్రాణుల నీడను పట్టుకొనుచుండెను. అవి ఎగురలేక పోవుసరికి వానిని చంపి తినుచుండెను. అదే ఉపాయమును హనుమంతునిపై కూడా ప్రయోగించగా అతడు దానిని చంపి సముద్రమును దాటెను. అక్కడ నానావిధఫలపుష్పములతో కూడిన వృక్షములు, పశుపక్షి సముదాయములు గల వనమును చూచి ప్రసన్నుడాయెను. ఎదుట ఒక విశాలమైన పర్వతమును చూచి దానిపై కెక్కి లంకానగరమును చూచెను.

అక్కడ వర్ణనాతీతమైన ఎత్తైన కోట ఉండెను. దాని నాలుగువైపుల సముద్రమును, బంగారు ప్రాకారములు శోభిల్లుచుండెను. లోపల అనేక సుందర భవనములు, అలంకరింపబడిన వీధులు, అనేక రూపధారులైన రాక్షసులు, వనములు, ఉపవనములు, చెరువులు, సరస్సులు చూచుటకు అతి మనోహరముగా నుండెను. విశాలకాయులైన యోధులు ఆ నగరము నాలుగుదిక్కులను రక్షించుచుండిరి. హనుమంతుడు దోమవలె అతి సూక్ష్మరూపమును ధరించి శ్రీరాముని స్మరించుచు లంకను ప్రవేశించెను. లంకాద్వారము వద్దనున్న లంకిణి అను రాక్షసి ఇట్లు పలికెను: "నా అనుమతి లేకుండా లోపల ప్రవేశించిన నీవెవరు? ప్రపంచములోని చోరులందరూ నాకు ఆహారము కావలసినదే." మహాబలి హనుమంతుడు దానినొక్క ముష్టిఘాతముచే వధించెను. అది రక్తము కక్కుచూ నేలకొరిగి మరల స్మృతి తెచ్చుకొని, చేతులు జోడించి వినయముతో పలికెను: "బ్రహ్మదేవుడు వరమును యిచ్చి పోవునపుడు నాకొక మాట చెప్పియుండెను. ఎప్పుడైతే ఒక వానరము నిన్ను తన దెబ్బలతో బాధించునో, అప్పుడే రాక్షస సంహారము సమీపించినదని తెలిసికొనుము. నాయనా! శ్రీరాముని దూతను కన్నులారా గాంచుట నా భాగ్యము. కోసలాధిపతిని మనస్సులో స్మరించుచూ లంకలో ప్రవేశించుము." హనుమంతుడు అతి సూక్ష్మరూపమును ధరించి నగరములో ప్రవేశించి, ప్రతి భవనమును వెదకెను.లెక్కించ వీలులేని యోధులుండిరి. పిదప అతి విచిత్రమైన అవర్ణణీయమైన రావణుని భవనమును ప్రవేశించెను. గాఢనిద్రలోనున్న రావణుని చూచెను. కాని సీతాదేవి జాడ కనపడలేదు.

## 3. సీతాదేవి దర్శనము

పిదప హనుమంతుడు శ్రీహరిమందిరము గల ఒక అందమైన భవనమును చూచెను. ఆ భవనముపై శ్రీరాముని ధను

ర్భాణములు చెక్కబడియుండెను. నూతనమైన తులసిమొక్కలు ఉండెను. ఆంజనేయుడు యిట్లు ఆలోచించెను: "లంక రాక్షసులకు నివాసస్థానము. ఇచ్చట సజ్జనులు ఎట్లుండెదరు?" ఇంతలో నిద్రనుండి లేచి రామనామస్మరణచేయుచున్న విభీషణుని చూచి హనుమంతుడు సంతసించెను. బ్రాహ్మణరూపమును ధరించి అతనిని పిలిచెను. ఆ పిలుపు వినగానే విభీషణుడు లేచి వచ్చి ప్రణమిల్లి కుశలమును అడిగి "బ్రాహ్మణోత్తమా! మీరు ఎవరు? హరిభక్తులా లేక దీనదయాళువైన శ్రీరామచంద్రులా?" అని అడిగెను. అప్పుడు హనుమంతుడు శ్రీరామకథను పూర్తిగా తెలిపి తన పేరును వెల్లడించెను. ఇద్దరి మనస్సులు ఆనందమగ్నములాయెను. విభీషణుడు పలికెను: "పవనకుమారా! దంతముల మధ్య నాలుకవలె నేను నిస్సహాయస్థితిలో నున్నాను. శ్రీరామచంద్రుడు నాపై అనుగ్రహము చూపునా? నాది తామసిక శరీరము. భగవత్ ప్రాప్తి సాధనములు నేను ఎరుగను. కాని సజ్జనులైన మీ దర్శనము అయినది. కావున నాపై ప్రభు కృప కలదని నాకు నమ్మకము ఏర్పడినది." హనుమంతుడు "విభీషణా! ప్రభువు సదా తన సేవకులపై కృప జూపును. నేను చంచల స్వభావముగల కోతిని, దీనుడను, హీనుడను. అట్టి నాపైన కూడా శ్రీరామచంద్రుడు తన కృపను ప్రసరింపచేసెను." అని పలికెను. పిమ్మట విభీషణుడు జానకీదేవి అక్కడ ఏ విధముగా నున్నదీ, ఆమె దర్శనమునకు ఉపాయములు తెలిపెను. హనుమంతుడు అతని దగ్గర సెలవు గైకొని సూక్ష్మరూపమును ధరించి సీతాదేవి యున్న అశోకవనమునకు పోయెను.

సీతాదేవిని చూడగానే హనుమంతుడు ఆమెకు మనస్సులోనే ప్రణామములు ఆచరించెను. ఆమె శరీరము కృశించినదై తలపై జడలు కట్టియుండెను. ఆమె నిరంతరము శ్రీరఘునాథునే జపించు చుండెను. ఆమెను చూచి హనుమంతుడు కూడా దుఃఖించెను. చెట్ల

ఆకులమధ్య దాగుకొని కూర్చుండి, "ఈమె దుఃఖమును బాపుటకు నేను యిప్పుడు ఏమి చేయవలెను?" అని ఆలోచించ సాగెను. అదే సమయమున కృత్రిమాలంకారములు చేసికొన్న అనేక స్త్రీలతో పాటు రావణుడు అచ్చటికి వచ్చి సామదానభయభేదోపాయములతో సీతాదేవికి నచ్చచెప్ప ప్రయత్నించుచు పలికెను: "ఓ సుముఖీ! వినుము. మందోదరి మున్నగు రాణులనందరినీ నీకు దాసీలుగా చేసెదను. ఇది నా ప్రతిజ్ఞ. ఒకసారి నావైపు చూడుము." జానకీదేవి శ్రీరాముని స్మరించి ఒక గడ్డిపోచను ఎదుటనిలుపుకొని పలికెను: "ఓ దశాననా! వినుము. మిణుగురు పురుగు ప్రకాశములో కమలము వికసించునా? దుష్టుడా! శ్రీరఘువీరుని బాణముల శక్తి నీకు తెలియుదా? ఒంటరిగానున్న నన్ను అపహరించితివి. నీచుడా! నీకు సిగ్గులేదా?" తనను మిణుగురు పురుగుతో, శ్రీరామచంద్రుని సూర్యునితో పోల్చుచూ సీతాదేవి పలికిన వచనములను విని రావణుడు తన కరవాలమును తీసికొని కోపముతో పలికెను: "ఓ సీతా, నీవు నన్ను అవమానించితివి. ఈ ఖడ్గముచే నీ శిరస్సును ఖండించెదను. ఇప్పుడే నా మాటను అంగీకరించుము లేనిచో ప్రాణములపై ఆశ వదులుకొమ్ము." సీతాదేవి సమాధానము ఇచ్చెను: "ఓ దశకంఠా! నీలకమలహారమువలె సుందరమై ఏనుగుతొండము వలె బలిష్ఠములై, విశాలములైన నా స్వామి బాహువులను అలంకరించనిచో ఈ కంఠము నీ కరవాలమునకు ఆహుతియగును. ఓ ఖడ్గమా! శ్రీరాముని వియోగాగ్నివలన కలిగిన నా సంతాపమును చల్లార్చుము. నా దుఃఖమును హరించుము." సీతాదేవి పలుకులు విని రావణుడు ఆమెను చంపుటకు ముందుకు పరుగెత్తెను. అప్పుడు మందోదరి అతనిని వారించుచూ నీతి వాక్యములచే సమాధానపరచెను. రావణుడు రాక్షసస్త్రీలను పిలిచి "మీరందరూ సీతను అనేక విధముల భయపెట్టుడు" అని యాజ్ఞాపించెను. "ఒక మాసములోగా నా మాటను అంగీకరించనిచో ఈమెను నా ఖడ్గమునకు బలి ఇచ్చెదను"

అని పలికి రావణుడు తన భవనముకు పోయెను. రాక్షసస్త్రీలు అనేక భయంకర రూపములతో సీతాదేవిని భయపెట్టసాగిరి.

వారిలో త్రిజటయను ఒక రాక్షసి ఉండెను. ఆమె శ్రీరాముని చరణములందు అనురాగము గలది. వివేకవంతురాలు. ఆమె అందరినీ పిలిచి యిట్లు పలికెను: "సీతాదేవికి సేవ చేసిన మీకు హితము గల్గును. ఒక కోతి లంకనంతయూ కాల్చుట నేను స్వప్నములో చూచితిని. రాక్షస సేన అంతయూ నశించెను. రావణుని శిరస్సులన్నియు ముండనము గావించబడి, ఇరవై భుజములు ఖండించబడి యుండెను. అతడు దిగంబరముగా గాడిదను ఎక్కి, దక్షిణ దిశగా యమపురికి పోవుచుండెను. లంకా రాజ్యము విభీషణునికి దక్కెను. శ్రీరామ చంద్రుని విజయమునుగూర్చి నగరమున చాటింపు వేయబడెను. అప్పుడు ప్రభువు సీతాదేవికై కబురు పంపెను. స్వప్నము కొలది రోజులలో సత్యమగును. నేను నిశ్చయముగా ప్రకటించుచున్నాను." ఆమె మాటలు విని రాక్షస స్త్రీలు అందరూ భయపడి జానకీదేవి పాదములపైబడి వేర్వేరు దిశలకు పోయిరి. ఒక నెల తరువాత రావణుడు తనను వధించుట తథ్యమని తలంచి సీతాదేవి చేతులు జోడించి త్రిజటతో పలికెను: "మాతా! ఈ దుఃఖసమయమున నీవే నాకు తోడు, నీడ. ఈ శరీర త్యాగము చేయుటకు వెంటనే నీవు ఏదైన ఉపాయమును చెప్పుము. ఈ విరహమును నేను సహింపజాలను. కర్రలను తెచ్చి చితిని పేర్చి అగ్నితో వ్రేల్చుము. నేను అందు నా శరీరత్యాగము చేసెదను." సీతాదేవి మాటలు విని త్రిజట ఆమె పాదములను పట్టుకొని శ్రీరామచంద్రుని బలపరాక్రమములను కీర్తించి సమాధానపరిచెను. "సుకుమారీ, రాత్రివేళల అగ్ని లభించదు." అని పలుకుచూ తన యింటికి పోయెను.

## 4. హనుమత్సందేశము

సీతాదేవి తన మనస్సున యిట్లు ఆలోచించెను: "విధాతయే నాకు ప్రతికూలుడైనాడు. నేను ఏమి చేయుదును? నిప్పు దొరకదు, బాధ తొలగదు. ఓ అశోక వృక్షమా! నా విన్నపమును వినుము. నా శోకమును హరించి నీ పేరును సార్థకమొనర్చుకొనుము. నీ కోమలమైన ఎర్రని ఆకులు అగ్నివలె నున్నవి. అగ్ని నిచ్చి నా శరీరమును అంతము చేయుము." అని అనేక విధముల వ్యాకులత నొందిన సీతాదేవిని చూచి, హనుమంతుడు కొద్దిసేపు ఆలోచించి శ్రీరాముని ఉంగరమును ఆమె ముందు పడవేసెను. తన ప్రార్థనను విని అశోకవృక్షము నిప్పుకణమును పడవేసినది అని భావించి సీతాదేవి ఆ ఉంగరమును చేతిలో తీసుకొనెను. శ్రీరామనామాంకితమైన ఆ సుందరమైన ఉంగరమును గుర్తించి సీతాదేవి ఆశ్చర్యచకితురాలై హర్షవిషాదములను అనుభవించెను. "శ్రీరఘునాథుడు అజేయుడు. అతనిని ఎవ్వరూ జయించలేరు. యిట్టి దివ్యమైన ఉంగరమును ఎవ్వరూ మాయచే కల్పించలేరు" అని ఆమె ఆలోచించుచుండగా హనుమంతుడు మధురముగా శ్రీరామచంద్రుని గుణములను వర్ణించసాగెను. వానిని విని సీతాదేవి దుఃఖము మాయమయ్యెను. చెవులను, మనస్సును లగ్నముచేసి ఆమె వినసాగెను. హనుమంతుడు ప్రారంభమునుండి కథనంతయు వినిపించెను. అప్పుడు "శ్రవణామృతమైన ఈ సుందరకథను వినిపించినది ఎవ్వరు? సోదరా! ఎదుటకేల రావు?" అని సీతాదేవి పలికెను. అప్పుడు హనుమంతుడు సమీపమునకు వచ్చెను. అతనిని చూచి సీతాదేవి ముఖమును ప్రక్కకు తిప్పుకొని విస్మయముతో కూర్చొనెను. హనుమంతుడు పలికెను: "మాతా! నేను శ్రీరామచంద్రుని దూతను. కరుణానిధియైన శ్రీరామునిపై ప్రమాణము చేసి చెప్పుచున్నాను. యిది సత్యము తల్లీ! ఈ ఉంగరమును నేనే తెచ్చినాను. శ్రీరామచంద్రుడు

మీ కొరకై ఈ సంకేతమును నాకిచ్చి పంపినాడు." సీతాదేవి "నరుల, వానరుల సమాగమము ఎట్లు జరిగినది?" అని అడుగగా హనుమంతుడు శ్రీరామ సుగ్రీవుల మైత్రి కథను విశదముగా వినిపించెను. హనుమంతుని ప్రేమభరిత వచనములను విని ఆమెకతనిపై విశ్వాసము కలిగెను. భగవంతుని సేవకుడని తెలిసిన తర్వాత అతని యెడల ప్రీతి యినుమడించెను. నేత్రములు సజలమాయెను. సీతాదేవి పలికెను: "నాయనా ఆంజనేయా! విరహసముద్రములో మునుగుచున్న నన్ను నీవు నావవలె రక్షించినావు. కరుణానిధియైన శ్రీరాముని అతని తమ్ముడు లక్ష్మణుని కుశలసమాచారములను వినిపించుము. కోమలచిత్తుడు దయామయుడైన శ్రీరఘునాథుడు ఎప్పుడైనా నన్ను జ్ఞాపకము చేయునా? మరల నా కన్నులు వారి కోమల శ్యామల శరీరమును చూచి శాంతిని పొందునా?" అని పలుకుచూ సీతాదేవి పరితపించసాగెను. హనుమంతుడు తన కోమల వినమ్ర వచనములు పలికెను: "తల్లీ! కృపానిధియైన శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో సహా కుశలముగా నున్నారు. కాని మీ విరహమువలన దుఃఖితులై వున్నారు. మీరు మనస్సులో సందేహించవలదు. మీపై అతని ప్రేమ అపారము. మాతా! ఇప్పుడు ధైర్యము వహించి శ్రీరఘునాథుని సందేశమును వినుడు. మనస్సును చిక్కబట్టుకొని సేవకులకు సుఖప్రదాతయైన శ్రీరాముని స్మరించుడు. అధైర్యమును త్యజించుడు. ఈ రాక్షస సమూహములు శలభములవలె శ్రీరాముని బాణాగ్నికి ఆహుతి కాగలరు. శ్రీరామచంద్రునికి మీ సమాచారము తెలిసియున్నట్లయితే వారే మాత్రము ఆలస్యము చేయరు. తల్లీ! నేనే మిమ్ములను ఇక్కడినుండి తీసుకొని పోయి వుండేవాడిని. కాని నాకు ప్రభువాజ్ఞ లేదు. మాతా! కొన్ని దినముల వరకు ధైర్యము వహించుడు. శ్రీరామచంద్రుడు వానరులతో పాటు యిచ్చటికి రాగలడు. రాక్షసులను సంహరించి మిమ్ములను యిక్కడినుండి పిలుచుకొని పోగలడు." ఆ మాటలను విని సీతాదేవి

పలికెను: "కుమారా! వానరులందరూ నీవలె చిన్నగా నుందురు. రాక్షసులు మిగుల బలవంతులు, యోధులు. అందుచే నా మనస్సులో సందేహము కలుగుచున్నది." అది వినగానే ఆంజనేయుడు తన శరీరమును పర్వతసమానముగా పెంచెను. అప్పుడు సీతాదేవి మనస్సు కుదుటపడి అతనిపై విశ్వాసము కలిగెను. హనుమంతుడు మరల చిన్న రూపమును ధరించెను. సీతాదేవి "కుమారా! నీవు బలమునకు, శీలమునకు నిధివగుదువు. జరామరణములు లేనివాడవై, సద్గుణ ఖనివై శ్రీరఘునాధునికి అత్యంత ప్రేమపాత్రుడివి అగుదువు. ప్రభువు నీపై కృపజూపును గాక!" అని ఆశీర్వదించెను. ఆంజనేయుడు సీతాదేవికి ప్రణమిల్లి చేతులు జోడించి, "తల్లీ! నేనిప్పుడు సఫల మనోరథుడను అయినాను. మీ ఆశీర్వాదము అమోఘము. ఈ మధురమైన ఫలవృక్షములను చూచిన పిదప నాకు మిక్కిలి ఆకలిగానున్నది" అని పలికెను. సీతాదేవి "కుమారా! బలిష్ఠులైన రాక్షసయోధులు ఈ వనమును రక్షించుచున్నారు" అనెను. హనుమంతుడు "అమ్మా! మీరు మనస్సులో ప్రసన్నులైనచో నాకా రాక్షసులవలన భయము ఏ మాత్రము లేదు" అనెను. బుద్ధి, బలమునందు హనుమంతుడు నిపుణుడు అని గ్రహించి "నాయనా! పొమ్ము శ్రీరామచంద్రుని చరణములందు మనస్సు లగ్నము చేసి ఈ మధురఫలములను ఆరగించుము" అని పలికెను. ఆంజనేయుడు సీతాదేవికి నమస్కరించి వనమున ప్రవేశించెను.

## 5. లంకాదహనము

వనమునందు ఫలములను తినుటయేగాక వృక్షములను కూల ద్రోసెను. వనరక్షకులుగానున్న రాక్షసులలో కొందరిని చంపివేసెను. మిగిలిన కొందరు రావణుని వద్దకు పోయి మొరపెట్టుకొనిరి. "ప్రభూ! 'ఒక పెద్దకోతి వచ్చి అశోకవనమును నాశనము చేసినది. వనరక్షకులను

చంపినది." ఆ మాటలు విని రావణుడు అనేక మంది యోధులను పంపెను. వారిని చూచి హనుమంతుడు గర్జించుచూ రాక్షసులందరినీ హతమార్చెను. పిదప రావణుని ఆజ్ఞచే అతని కుమారుడైన అక్షయుడు అనేకమంది యోధులను తీసుకొనిరాగా అతనిని కూడా చంపి రాక్షసులను అనేకమందిని సంహారించెను. పుత్రుని మరణవార్త విని రావణుడు కోపముతో తన జ్యేష్ఠకుమారుడైన మేఘనాథుని పంపెను. అతడు మిక్కిలి బలశాలి. ఇంద్రుని జయించినాడు. కాని హనుమంతుడు పండ్లు పటపట కొరుకుచూ గర్జించుచూ ఒక మహా వృక్షమును పెకలించి అతనిపై విసరెను. పరాక్రమశాలురైన యోధులను పట్టుకొని తన శరీరబలముతో నలిపి వేసెను. మేఘనాథుడు కొద్దిసేపు స్పృహకోల్పోయి అప్పుడే లేచి తన మాయను ప్రయోగించెను. చివరకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించి హనుమంతుని మూర్ఛితునిగా నొనర్చెను. అతనిని నాగపాశముతో బంధించి రావణుని వద్దకు తీసుకొని పోయెను. వానరుడు బంధించబడినాడని విని రాక్షసులందరూ వినోదము చూచుటకు పరుగెత్తుకొని సభకు వచ్చిరి. హనుమంతుడు గూడా వచ్చి దశముఖుని సభను చూచెను. ఆ సభ ఔన్నత్యము అవర్ణనీయము. దేవతలు దిక్పాలకులు కూడా చేతులు కట్టుకొని వినయముతో నిలుచుండిరి. కాని హనుమంతుడు మాత్రము నిర్భయుడైయుండెను. రావణుడు ఇట్లు పలికెను: "ఓ కోతీ! నీవెవరు? ఎవరి బలమును నమ్మి నీవు వనమును నాశనమొనర్చితివి. నా పేరును కీర్తిని వినలేదా? రాక్షసులను ఏల హతమొనర్చితివి? నీకు ప్రాణములు పోవునని భయము లేదా?" ఆంజనేయుడు బదులు పలికెను: "ఓ రావణా! వినుము ఎవరి బలములోని లవలేశముచే నీవు సమస్త జగత్తును జయించగలిగితివో, ఎవరి ప్రియ పత్నిని నీవు దొంగిలించితివో, అట్టి శ్రీరాముని దూతగా నన్ను యెరుంగుము. నీ గొప్పతనము నాకు తెలియును. సహస్రబాహువుతో పోరాడి ఓడింపబడితివి. వాలి యుద్ధములో నిన్ను అవలీలగా జయించెను. రాక్షసరాజా! నాకు ఆకలి

వేయుచుండెను. కావున పండ్లు తిన్నాను. రాక్షసులు నన్ను కొడితే నేను వారిని కొట్టినాను. అహంకారమును వదలి నీ వంశమర్యాదను కాపాడుచూ శ్రీరాముని భజింపుము. జానకీదేవిని తిరిగి యిచ్చి వేయుము. శ్రీరఘునాధుడు శరణాగతవత్సలుడు. శరణు జొచ్చినచో నీ అపరాధములను క్షమించి నిన్ను కాపాడును. శ్రీరామునికి విముఖుడైన వ్యక్తిని ఎవ్వరూ రక్షించలేరు."

హనుమంతుని వాక్యములను విని దురభిమానియైన రావణుడు వ్యంగ్యముగా నవ్వుచూ "మాకు గొప్ప జ్ఞానియైన కోతి గురువుగా లభించినది. మూర్ఖుడా! నీకు మృత్యువు సమీపించినది. అందులకే మాకు ఉపదేశము ఇచ్చుచున్నావు," అని పలికెను. హనుమంతుడు "నీకు మృత్యువు సమీపించినది కావున నీ బుద్ధి వక్రించినది" అని పలికెను. కుపితుడైన రావణుడు "ఈ మూర్ఖుని ప్రాణములు తీయుడు" అని పలికెను. అదే సమయమున వచ్చిన విభీషణుడు "దూతను చంపుట నీతి విరుద్ధము, కావున ఏదైనా సామాన్యమైన శిక్ష విధించుడు" అని పలికెను. రావణుడు భటులను పిలిచి, "కోతులకు తమ తోకయందు ప్రీతి యుండును. కావున నూనెలో బట్టలను ముంచి దీని తోకకు చుట్టి నిప్పు పెట్టుడు. తోకలేని ఈ కోతి తన స్వామిని వెంటబెట్టుకొని వచ్చును. అతని పరాక్రమమును చూచెదముగాక" అని ఆజ్ఞాపించెను. మూఢ రాక్షసులు నిప్పంటించుటకు ప్రారంభించగా హనుమంతుడు తన తోకను విపరీతముగా పెంచెను. నగరములోని బట్టలు, నూనె చాలలేదు. నగరవాసులు వినోదమును చూచుచూ చప్పట్లు కొట్టుచూ, హనుమంతుని గేలిచేయుచూ నగరమంతయూ తిప్పిరి. హనుమంతుడు చిన్నరూపమును దాల్చి బంధములు విడిపించుకొని ప్రాకారముపై దుమికెను. రాక్షసులందరూ భయపడిరి. అదే సమయమున ప్రచండవాయువు వీచసాగెను. హనుమంతుడు అట్టహాసము చేయుచూ, గర్జించుచూ ఆకాశమంత ఎత్తు ఎదిగి,

భవనములపై దుముకుచూ పోయెను. అగ్ని కరాళజ్వాలలు అన్ని దిశల వ్యాపించెను. ఒక్క విభీషణుని ఇల్లు తప్ప నగరమంతయూ తగలబడి పోయెను. చివరకు అగ్నిని సముద్రములో చల్లార్చి హనుమంతుడు సీతాదేవి సమ్ముఖమున నిలబడి పలికెను: "అమ్మా! శ్రీరఘునాథుడు ఇచ్చినట్లుగా మీరు నాకు ఏదైనా చిహ్నమును ఇయ్యండి." అపుడు సీతాదేవి తన చూడామణిని తీసి ఇచ్చి పలికెను: "నాయనా! ప్రభువునకు నా ప్రణామములు అందజేసి నా పలుకులను వినిపించుము. "ప్రభూ! మీరు పూర్ణకాములు అయిననూ దీనులు, దుఃఖితుల పట్ల దయ చూపెదరని మీకు కీర్తి గలదు. నేను దీనురాలిని. నా సంకటమును దూరము చేయుడు. హనుమా! ప్రభువు ఒక నెలలో రానిచో నేను జీవించియుండను. నిన్ను చూచి నా మనస్సు చల్లారినది. ఇప్పుడు మరల రాత్రింబవళ్ళు దుఃఖపూరితములు అగును." హనుమంతుడు సీతాదేవికి నచ్చచెప్పి ఆమె పాదములకు ప్రణమిల్లి శ్రీరాముని దర్శించుటకు బయలుదేరెను.

## 6. యుద్ధసన్నాహము

సముద్రమును లంఘించి ఆవలి తీరమునకు చేరిన ఆంజనేయుడు వానరులను చూచి గొప్ప హర్షధ్వని చేసెను. అది చూచి శ్రీరామకార్యము నెరవేరినది అని తెలుసుకొని వానరులందరు ప్రసన్నులై విశేషసమాచారములు అడుగుచూ శ్రీరఘునాథుని చూచుటకు బయలు దేరిరి. త్రోవలో మధువనమును ప్రవేశించిన, అంగదుని ఆజ్ఞతో తీయని ఫలములను ఆరగించిరి. వారించిన వనరక్షకులను ముష్టిఘాతములతో తరిమి వేసిరి. వారు పోయి సుగ్రీవునితో ఆ సమచారము తెలుపగా, సుగ్రీవుడు వానరులు ప్రభు కార్యమును సాధించుకొని వచ్చినారని తలచి సంతోషించెను. ఇంతలో వారందరూ వచ్చి సుగ్రీవుని పాదములకు నమస్కరించి

హనుమంతుడు నెరవేర్చిన కార్యమును వేనోళ్ళ పొగిడిరి. సుగ్రీవుడు హనుమంతుని ఆలింగనమొనర్చుకొని వానరులతో కలసి, శ్రీరఘునాథు వద్దకు పోయెను. తన కార్యమును సాధించుకొని వచ్చిన వానరులను చూచి శ్రీరాముడు మిక్కిలి సంతసించి కుశలసమాచారమును అడిగెను. జాంబవంతుని ద్వారా హనుమంతుని చరితమును విని అతనిని హృదయమునకు హత్తుకొని శ్రీరామచంద్రుడు యిట్లు పలికెను. "నాయనా! జానకి ఏ విధముగా నున్నది? ఎట్లు తన ప్రాణములు రక్షించుకొనుచున్నది.?" హనుమంతుడు పలికెను. "ప్రభూ! మీ నామమే ఆమెను సదా కాపాడుచున్నది. నేను తిరిగివచ్చినపుడు జానకీమాత తన చూడామణిని ఇచ్చి. కనుల నీరు నింపుకొని నాతో కొన్ని మాటలు చెప్పినది. ప్రభూ మీరు దీనబాంధవులు, శరణుజొచ్చిన వారి దుఃఖములు బాపుదురు. నేను మనోవాక్కర్మలచే మీ చరణములనే నమ్మితిని! ప్రభూ! ఆమె ప్రతిక్షణము యుగముగా గడుపుచున్నది. వెంటనే పోయి మీ భుజబలముచే ఆ దుష్టరాక్షసులను వధించి సీతాదేవిని తీసుకొనిరండి."

శ్రీరఘునాథుడు సీతాదేవి చూడామణిని తన హృదయమునకు హత్తుకొనెను. హనుమంతుని పలుకులు విని శ్రీరాముని నేత్రములు అశ్రుపూరితములు ఆయెను. హనుమంతునితో "హనుమా! నీతో సమానమైన ఉపకారి ఎవ్వరునూ లేరు. నేను నీకు ఏమి ప్రత్యుపకారము చేయగలను" అని పలికెను. ప్రభు వచనములను విని ప్రేమవిహ్వలుడై ఆంజనేయుడు ప్రభుపాదములపై పడెను. ప్రభువు అతనిని లేవనెత్తి తన హృదయమునకు హత్తుకొని సమీపమున కూర్చుండబెట్టుకొని పలికెను: "హనుమా! సురక్షితమైన రావణుని లంకను, అజేయమైన అతని కోటను నీవు ఎట్లు దహించితివి తెల్పుము." అభిమాన రహితుడైన హనుమంతుడు పలికెను: "ఒక శాఖనుండి మరో శాఖపైకి అతి లాఘవముగా దూకుటలో వానరము నేర్పు కలిగియుండును.

నేను సముద్రమును లంఘించి లంకను దహించుట, రాక్షసులను వధించి, అశోకవనమును ధ్వంసము చేయుట మీ ప్రతాపమహిమనే గాని నా గొప్పదనము ఏమియూ లేదు. ప్రభూ! కృపతో అత్యంత సుఖప్రదమైన మీ నిశ్చల భక్తిని ప్రసాదింపుడు." శ్రీరాముడు 'అట్లేకానిమ్ము' అని పలికెను. వానరులందరూ "శ్రీరామునికి జయమగుగాక!" అని పలికిరి. శ్రీరాముడు సుగ్రీవుని పిలిచి "లంకకు ఏగుటకు ఏర్పాట్లు గావించుడు ఇప్పుడు ఆలస్యము ఏల?" అని పలికెను. వెంటనే కపిరాజు సుగ్రీవుడు తన సేనాపతులకు ఆజ్ఞను ఇవ్వగా వారు వివిధ వర్ణములు గల వానర భల్లూక సమూహములను సమాయత్తమొనర్చిరి.

## 7. విభీషణ శరణాగతి

అపార బలశాలురైన వానర భల్లూక సైన్యములు శ్రీరామచంద్రుని చరణకమలములకు నమస్కరించి గర్జించిరి. శ్రీరామచంద్రుడు వారిపై తన కృపాదృష్టిని ప్రసరింపచేసెను. అనేక విధములైన శుభశకునములు కనిపించెను. లెక్కలేనన్ని వానరులు, భల్లూకములు, నఖములే శస్త్రములుగా పెకలించిన వృక్షములను మోసుకొనుచు, శ్రీరామచంద్రునికి జయమగుగాక అని పలుకుచూ నేలపై, ఆకాశమున పోసాగినవి. ఆ విధముగా కరుణానిధియైన శ్రీరామచంద్రుడు సముద్రతీరమును చేరెను. హనుమంతుడు లంకను కాల్చిపోయినప్పటి నుంచీ లంకావాసులైన రాక్షసులు భయభీతులై ఇండ్లలోనే దాగుకొని ఆలోచించసాగిరి. "ఇప్పుడు రాక్షసకులమును రక్షించువారు లేరు. ఎవని దూత బలమే వర్ణనాతీతమో, అతడే స్వయముగా వచ్చినచో మనకు మేలు ఎట్లు కలుగును?" నగరవాసుల మాటలను దూతలద్వారావిని మందోదరి మిక్కిలి వ్యాకులతనొందెను. ఆమె ఏకాంతముగా రావణుని పాదములపై బడి చేతులు జోడించి నీతియుక్తముగా పలికెను: "ప్రభూ,

శ్రీహరితో ద్వేషము మానుడు. అతని దూత చేసిన పనులను తలచుచూ రాక్షస స్త్రీలు భయకంపితులు అగుచున్నారు. వెంటనే మంత్రిని పిలిపించి అతనితో శ్రీరాముని భార్యను పంపండి." మూర్ఖుడు, గర్వియైన రావణుడు బిగ్గరగా నవ్వి పలికెను. "స్త్రీలు స్వభావతః పిరికివారు అను మాట నిజము. శుభసమయమున కూడా భయపడతారు. వానరసైన్యమే వచ్చినట్లయితే వారిని భక్షించి రాక్షసులు జీవించెదరు. లోకపాలకులు కూడా నా భయముచే వణకెదరు. అట్టిది నా భార్యవైన నీవు భయపడుట హాస్యాస్పదము." ఆవిధముగా పలికి రావణుడు సభకు వెళ్ళిపోయెను. శత్రుసైన్యము సముద్రపు ఆవలి తీరము చేరినది అను వార్త విని ఇప్పుడు 'మన కర్తవ్యమేమో సలహానివ్వండి' అని మంత్రులను అడిగెను. వారు "మీరు దేవతలను, రాక్షసులను కూడా జయించునపుడు ఏ మాత్రము శ్రమ చేయలేదు కదా! ఇప్పుడీ మనుష్యులను కోతులను లెక్కచేయుట ఎందులకు!" అని మంత్రులు అతని ముఖస్తుతి చేయుచుండిరి. మంత్రిగాని, వైద్యుడుగాని, గురువుగాని, భయముతో లేక పారితోషికముపై ఆశతో ప్రియవాక్యములు పలికినచో రాజ్యము, శరీరము, ధర్మము ఈ మూడు శీఘ్రముగా నాశనమగుట తథ్యము. రావణుడు కూడా ఇప్పుడు అదే స్థితిలో నుండెను.

అదే సమయమున విభీషణుడు అచ్చటికి వచ్చి రావణునికి పాదాభివందనము చేసి పలికెను. "సోదరా! మీకు శుభమగు మాట నా బుద్ధికి తోచినట్లు చెప్పెదను. కామము, క్రోధము, మదము, లోభము ఇవన్నియూ నరకమునకు మార్గములు. కావున వీనిని త్యజించి సజ్జనులు భజించు శ్రీరామచంద్రుని భజించుము. శ్రీరాముడు కేవలము నరభూపాలుడు కాదు. అతడు పదునాలుగు లోకములకు, బ్రహ్మాండములకు ప్రభువు, కృపాసాగరుడైన భగవంతుడు. పృథ్విని, బ్రాహ్మణులను, గోవులను, దేవతలను రక్షించుటకు మనుష్యుడై

అవతరించెను. అతడు దుష్టులను నాశనమొనర్చి ధర్మమును రక్షించును. రఘునాథుడు శరణాగతుల దుఃఖములను పోగొట్టువాడు. కావున అభిమానము, మోహమును, మదమును వదలి ఆ సర్వేశ్వరుని పత్నిని అతనికి అప్పగించి శరణువేడుము. పులస్త్యముని తన శిష్యుని ద్వారా ఈ సందేశమును మీకు పంపెను." మాల్యవంతుడను చతురుడైన మంత్రి కూడా రావణునితో "నాయనా! మీ తమ్ముడు నీతిమంతుడైన విభీషణుడు చెప్పిన మాటలను హృదయమున ధరించుము" అని పలికెను. వారి మాటలను విన్న రావణుడు "ఈ మూర్ఖులిద్దరూ శత్రువు గొప్పదనమును పొగడుచున్నారు. వీరిని దూరముగా పంపుటకు ఎవ్వరూ లేరా?" అని గర్జించెను. మాల్యవంతుడు తన యింటికి పోయెను. కాని విభీషణుడు మాత్రము రావణునికి అనేక విధముల నచ్చచెప్పెను. రావణుడు కోపముతో రెచ్చిపోయి పలికెను: "దుష్టుడా! నీకీ నాడు చావు మూడినది. నా అన్నము తిని బ్రతుకుతూ శత్రువును పొగిడెదవా? మూర్ఖుడా! పొమ్ము. వారికే నీతి గరుపుము" అని పలికి రావణుడు అతనిని కాలితో తన్నెను. విభీషణుడు అతని పాదములకు నమస్కరించి "మీరు నాకు తండ్రితో సమానులు. మీరు తన్నిననూ నాకు మంచిదే. కాని శ్రీరాముని భజించుటలోనే మీకు హితమున్నది" అని విభీషణుడు తన మంత్రులను వెంటతీసుకొని ఆకాశమార్గమున పోవుచూ అందరికి వినపడునట్లు పలికెను: "రావణా! శ్రీరాముడు సత్యప్రతిజ్ఞుడు, సర్వశక్తిసంపన్నుడు. మీ సభ మృత్యు వశమున నున్నది. నేను శ్రీరామచంద్రుని శరణు వేడుచున్నాను. నన్ను నిందించవలదు." అట్లు పలికి విభీషణుడు శ్రీరామచంద్రుని చరణకమలములనే ధ్యానించుచూ సముద్రపు ఆవలి ఒడ్డుకు చేరెను.

విభీషణుని చూసిన వానరులు ఎవరో శత్రుపక్షపు దూత వచ్చినాడని తలచి అతనిని బయటనే ఆపి సుగ్రీవుని వద్దకు పోయి విషయమును తెలిపిరి. సుగ్రీవుడు శ్రీరాముని వద్దకు పోయి, "రఘునాథా! రావణుని

తమ్ముడు విభీషణుడు మిమ్ములను చూచుటకు వచ్చినాడు" అని పల్కెను. ప్రభువు అతనిపై నీ అభిప్రాయము ఏమని అడుగగా సుగ్రీవుడు బదులు పల్కెను: "మహారాజా! నిశాచరుల మాయలను తెలుసుకొనుట కష్టము. వారు ఇచ్ఛానుసారము రూపమును ధరించెదరు. విభీషణుడు మన రహస్యములను తెలుసుకొనుటకే వచ్చినాడని నా అభిప్రాయము. అతనిని బంధించి వుంచుట మంచిది." అప్పుడు శ్రీరాముడు పలికెను: "మిత్రమా! నీవు రాజనీతి విచారమును తెలిపితివి. కాని శరణాగతుడైన వాని భయమును తొలగించుట నా ప్రతిజ్ఞ." శ్రీరామచంద్రుని వచనములు విని హనుమంతుడు మిక్కిలి సంతోషించెను. శ్రీరాముడు మరల పలికెను: "ఒకవేళ విభీషణుడు దుష్టహృదయుడు అయినచో నా ఎదుటకు వచ్చేవాడే కాదు. ఎవడైతే నిర్మల హృదయుడైన భక్తుడో అతడే నన్ను సమీపించును. ఒకవేళ రావణుడు అతనిని మన రహస్యములు తెలుసుకొనుటకు పంపిననూ, నాకు భయముకాని, హానికాని లేదు. ఏలనన, ప్రపంచములోని నిశాచరులందరినీ లక్ష్మణుడు ఒక్క క్షణములో మట్టుపెట్టగలడు. కాని భయభీతుడై నన్ను శరణన్న వానిని నేను నా ప్రాణములవలె రక్షించెదను. కావున అతడు ఏ ఉద్దేశ్యముతో వచ్చిననూ విభీషణుని ఇక్కడకు తీసుకొని రండు." అంగదుడు, హనుమంతుడు వెంటరాగా సుగ్రీవుడు "కృపాళువు శ్రీరామునికి జయమగుగాక" అనుచూ పోయెను.

సాదరముగా విభీషణుని ముందుంచుకొని వానరులు కరుణానిధి అయిన శ్రీరాముని వద్దకు వచ్చిరి. నేత్రానందకరులైన సోదరులు యిద్దరినీ దూరమునుండియే చూచి రెప్పవాల్చకుండా విభీషణుడు స్తబ్దుడై నిలుచుండెను. పిదప మనస్సును పదిలపరచుకొని మధురముగా పలికెను: "ప్రభూ! నేను దశముఖుని తమ్ముడను, రాక్షస కులములో జన్మించితిని. తామస స్వభావము కలవాడను. అతి పాపిని.

మీరు జనన మరణ భయమును నాశము చేయు ప్రభువులని మీ కీర్తిని విని వచ్చినాను. రఘువీరా! నన్ను రక్షించుడు" అని సాష్టాంగ నమస్కారము చేయు విభీషణుని ఆదరముతో లేవనెత్తి శ్రీరామచంద్రుడు తన హృదయమునకు హత్తుకొని సమీపమున కూర్చుండబెట్టుకొని భక్తుల భయమును పారద్రోలు వచనములను పలికెను: "లంకేశా! నీవు, నీ పరివారము కుశలమా? నీవు నివసించు స్థానము భయంకరమైనది. రాత్రింబగళ్ళు దుష్టులమధ్యనే నివసించెదవు. ఇట్టి స్థితిలో కూడా నీవు ధర్మమునే అవలంబించెదవు" విభీషణుడు పలికెను: "రఘునాథా! మీ చరణకమలముల వలన నేను కుశలుడను. నన్ను మీ భక్తునిగా నెంచి నాపై దయ చూపినారు. నా భయమంతయు దూరమైనది. నాది నీచ స్వభావము అయినను మీరు స్వయముగ ప్రసన్నులై నన్ను హృదయమునకు హత్తుకొంటిరి. నేను ధన్యుడను." శ్రీరామచంద్రుడు "లంకేశా! నీలో అన్ని సద్గుణములే గలవు. అందువలన నీవు నాకు అత్యంత ప్రియుడవు" అని పలికెను. వానరులు "కృపాసాగరుడైన శ్రీరామునికి జయమగుగాక!" అని పలికిరి. శ్రీరామచంద్రప్రభువు వెంటనే సముద్రజలములను తెప్పించి విభీషణుని రాజతిలకునిగా చేసెను. రావణుని క్రోధాగ్నిలో కాలుచున్న విభీషణుని శ్రీరామచంద్రమూర్తి రక్షించెను. అఖండ రాజ్య ప్రాప్తి వలన అది చల్లారెను.

సర్వజ్ఞుడు, అన్ని రూపములలో ప్రకటితమగువాడు, కారణవశమున మనుష్య శరీరము ధరించినవాడు రాక్షసకులమును వధించి నీతిని రక్షించువాడైన శ్రీరామచంద్రుడు పలికెను: "సుగ్రీవా, విభీషణా! ఈ లోతైన సముద్రమును ఎట్లు దాటగలము? అనేక జాతుల మొసళ్ళు, సర్పములు చేపలు గలిగి అపారమై అగాధమైన సముద్రమును దాటుట మిక్కిలి కష్టము." విభీషణుడు ఇట్లు పలికెను: "రఘునాథా! మీ బాణము ఒక్కటియే కోటి సముద్రములనైనను ఎండగొట్టును.

అయిననూ మొదట సముద్రుని ప్రార్థించుట నీతిదాయకము. మీ పూర్వజులలో పెద్దయైన సముద్రుడు ఏదో ఉపాయము చెప్పకపోడు." విభీషణుని సలహా విని శ్రీరాముడు సముద్రమును సమీపించి ప్రణమిల్లెను. పిదప తీరమున సుఖాసనము పరచి కూర్చునెను.

## 7. లక్ష్మణుని లేఖ

విభీషణుడు శ్రీరామచంద్ర ప్రభువు వద్దకు రాగానే రావణుడు అతడి వెంట దూతలను పంపెను. వారు వానరశరీరములను ధరించి సకల విషయములను చూచిరి. తమ మనస్సులలో ప్రభు గుణములను పొగడుచూ శ్రీరామచంద్రుని గుణగానము చేయసాగిరి. తమ కపటరూపమును మర్చిపోయిరి. వారిని శత్రువులుగా గుర్తించి వానరులు వారిని బంధించి సుగ్రీవుని వద్దకు తీసుకొనిపోయిరి. సుగ్రీవుని ఆజ్ఞచే వానరులు రాక్షస దూతలను బంధించి సేనకు నాలుగువైపుల త్రిప్పిరి. అనేక విధముల బాధించిరి. వారి అరుపులు విని లక్ష్మణుడు వారిని విడిపించి తన వద్దకు పిలిచి పలికెను: "రావణునికీ ఉత్తరమును ఇవ్వండి. మరియు సీతాదేవిని అప్పగించి శ్రీరామునితో సంధి చేసుకొననిచో అతనికి నాశము తప్పదని నా సందేశముగా తెలుపండి." వారు లక్ష్మణునికి నమస్కరించి శ్రీరాముని గుణములను కీర్తించుచూ వెళ్లిపోయిరి. వారు రావణుని వద్దకు వెళ్ళిపోయి యిట్లు పలికిరి: "ప్రభూ! మీ తమ్ముడు విభీషణుడు శ్రీరామునితో కలవగానే అతనిని శ్రీరాముడు రాజతిలకునిగా చేసెను. మేము దూతలమని విని వానరులు మమ్ములను కట్టివేసి చాలా బాధించిరి. శ్రీరామచంద్రుడు మమ్ములను విడిపించెను. అనేక వర్ణములు గల భల్లూకములు వానరులతో కూడిన సైన్యము వర్ణించనలవికానిది. వారందరూ అమిత పరాక్రమవంతులు వారిలో ప్రతిఒక్కడు యుద్ధములో మిమ్ములనోడించగలడు. వారు యుద్ధసన్నద్ధులై ఉన్నారు.

కాని శ్రీరాముడు వారికి ఆజ్ఞను ఇవ్వలేదు. శ్రీరామచంద్రుని తేజస్సు బలము బుద్ధి వర్ణించనలవి కానివి. ఒక్క బాణముచేతనే అతడు వంద సముద్రాలను ఎండగొట్టగలడు. అయిననూ నీతి నిపుణుడు అగుటచే మీ సోదరుని సలహాను అనుసరించి సముద్రుని దారిమ్మని ప్రార్థించుచున్నాడు." దూత పలికిన మాటలను విని రావణుడు నవ్వి పలికెను: "ఇంత తెలివితేటలు కలవాడు కావుననే అతడు వానరుల సహాయము అర్థించినాడు. పిరికివాడు కావున విభీషణుని నమ్మి సముద్రుని ప్రార్థించుచున్నాడు. అట్టివానికి విజయము ఎట్లు కలుగును?" అదే సమయమున దూత లక్ష్మణుడు ఇచ్చిన లేఖను రావణునికి ఇచ్చెను. రావణుడు దానిని ఎడమచేతితో తీసుకొని మంత్రిని పిలిచి చదవమని చెప్పెను. అతడు చదివెను: "అరే శఠుడా! కేవలము మాటలతోనే నీ మనస్సును సంతృప్తి పరచుకొనుచూ నీ వంశమును నాశనమొనర్చు శ్రీరామునితో వైరము పెంచుకొనిన నిన్ను బ్రహ్మవిష్ణుమహేశ్వరులు కూడా రక్షించలేరు. అభిమానమును వీడి మీ సోదరునివలె ప్రభు చరణకమలములను ఆశ్రయించుము. లేనిచో శ్రీరాముని బాణాగ్నికి నీ పరివారము శలభములవలె నాశనము అగును." ఆ లేఖను విని రావణుని మనస్సు భయగ్రస్తమాయెను. కాని కపటపు నవ్వును తెచ్చుకొని అందరూ వినునట్లు, "నేలపై బడిన వ్యక్తి ఆకాశమును అంటుటకు ప్రయత్నించునట్లు ఈ తాపసి తన వాచాలతను చాటుకున్నాడు" అని పలికెను. అప్పుడు దూత "ప్రభూ! అభిమానమును మాని లక్ష్మణుని మాటలను సత్యములుగా నెంచుడు. శ్రీరామునితో వైరమును మానుడు. అతడు శాంతస్వభావుడు, మీ అపరాధములన్నింటినీ ఆయన క్షమించును. జానకీదేవిని శ్రీరఘునాథునికి అప్పగించండి. నా విన్నపమును వినండి" అని పలికెను. ఆ మాటలు విన్న రావణుడు అతనిని కాలితో తన్నెను. అతడు విభీషణుని వలె రావణునికి నమస్కరించి శ్రీరాముని శరణు వేడెను. అగస్త్యుని శాపము వలన రాక్షసుడైవున్న తన నిజ

స్వరూపము అయిన మునిగా మారి శ్రీరామునికి ప్రణమిల్లి తన ఆశ్రమమునకు పోయెను.

## 8. సముద్రగర్వభంగము

మూడు దినములు గడిచినప్పటికీ సముద్రుడు ప్రభు ప్రార్థనను వినలేదు. శ్రీరాముడు కోపముతో "లక్ష్మణా! నా ధనుర్బాణములు తెమ్ము. అగ్ని బాణముచే ఈ సముద్రమును ఎండగొట్టెదను. భయపెట్టనిదే సముద్రుడు నా మాటను మన్నించడు" అని పలుకుచూ రఘునాథుడు ధనుస్సును ఎక్కుపెట్టెను. అగ్నిబాణమును సంధించగానే సముద్రుని హృదయము ప్రజ్వలితమయ్యెను. అందులోని జలచరములు వికలమై కాలిపోయెను. అప్పుడు సముద్రుడు బంగారు పళ్ళెములో మణులను నింపి, అభిమానమును వదలి బ్రాహ్మణవేషముతో వచ్చి భయముతో ప్రభు పాదములు పట్టుకొని ప్రార్థించెను. "ప్రభూ! నా అపరాధమును క్షమింపుడు. స్వభావతః పంచభూతములన్నియూ జడమైనవి. కావున నేను జడుడను. నాకీ శిక్షను ఇచ్చి నా అభిమానమును ఎండగొట్టితిరి. మీ ఆజ్ఞచే నేను ఎండిపోయెదను. మీ సైన్యము ఆవలి తీరమును చేరును. కాని దీనివలన నా పరిమితి నశించును. కావున వానరసైన్యము సముద్రమును దాటు నుపాయము తెలిపెదను. నలుడు, నీలుడు అను వానరులిద్దరు సోదరులు. బాల్యమున ఒక ఋషి వారికి వరమును ఇచ్చెను. వారు తాకిన గొప్ప పర్వతములైనను నీటిపై తేలును. ప్రభు మహిమను నేను హృదయమున నిలుపుకొని నా శక్తికొలది సహాయము చేయగలను. ముల్లోకములలో మీ కీర్తినందరు గానము చేయునట్లు సముద్రముపై వారధిని నిర్మించుడు. ఈ బాణముచే నా ఉత్తర తీరమున గల పాపులను నాశమొనరించుడు." కృపాళువు రఘువీరుడు సముద్రుని విన్నపమును విని అతని బాధలను నివారించెను. సముద్రుడు మిగుల

సంతసించెను. ప్రభువునకు నమస్కరించి తన గృహమునకు పోయెను.

కలియుగ పాపములు దూరము చేయు ఈ కథను తులసీదాసు తన బుద్ధిననుసరించి గానము చేసెను. శ్రీరఘునాథుని, గుణసమూహములు సుఖస్థానములు. ఆ గుణగానమే అన్ని శుభములకు ఆధారము. ఎవరైతే దీనిని ఆదరపూర్వకముగా వింటారో వారు ఏ ఇతర సాధనములు లేకుండగనే భవసాగరమును దాటగలరు.

కలియుగమునందలి సమస్తపాపములను నశింపచేయు
శ్రీరామచరితమానసమునందలి "సుందరకాండము"
అను ఐదవ సోపానము సమాప్తము.

★ ★ ★

# హనుమాన్ చాలీసా

## శ్రీ గోస్వామీ తులసీదాసు రచితము

*దోహా॥ శ్రీగురు చరణ సరోజరజ నిజమనముకురు సుధారి।*
*వరణౌ రఘువర విమలయశ జోదాయక ఫలచారి॥*

శ్రీ సద్గురు చరణకమల ధూళిచే నా మనోదర్పణమును శుద్ధిచేసికొని పురుషార్థ ప్రదమైన శ్రీరామచంద్రుని నిర్మలయశస్సును స్తుతించెదను..

*బుద్ధిహీన తనుజానికే సుమిరౌ పవనకుమార్।*
*బరబుద్ధి విద్యా దేహు మొహి హరహు కలేశ వికార్॥*

ఈ దేహము అజ్ఞానజానిత మని గ్రహించి, బలమును, బుద్ధిని, విద్యను యొసంగి క్లేశములను, పాపములను తొలగించు పవనపుత్రుని స్మరించెదను.

*చౌపాయి॥*

1. *జయ హనుమాన జ్ఞాన గుణ సాగర, జయ కపీశ తిహుంలోక ఉజాగర।*
2. *రామదూత అతులిత బలధామా, అంజనిపుత్ర పవన సుత నామా॥*

సకలశాస్త్రములకు, సుగుణములకు సముద్రమైన హనుమంతునకు జయమగుగాక! మూడులోకములను దీప్తి నొసగు కపీశ్వరునికి జయము. ఓ రామ దూతా! నీవు అసమానబలసంపన్నుడవు. అంజనీ పుత్రుడనియూ, పవనసుతుడనియూ నీకు పేర్లు.

3. *మహావీర విక్రమ బజరంగీ కుమతి నివార సుమతి కే సంగీ।*
4. *కంచన వరణ విరాజ సువేశా కానన కుండల కుంచిత కేశా॥*

ఓ మహావీరా! నీవు పరాక్రమశాలివి. వజ్రమయ శరీరుడవు. దుర్బుద్ధిని నివారించి, సద్బుద్ధి యుక్తమగు సత్సంగము ననుగ్రహించువాడవు. స్వర్ణమయకాంతిగల దేహము గలవాడవు. అతి సుందర వేషముతో, చెవులందు కుండలములతో, ఉంగరములు తిరిగిన కేశములతో ప్రకాశించువాడవు.

*5. హాథ వజ్ర అరు ధ్వజావిరాజై కాంధే మూంజ జనేవూ ఛాజై!*
*6. శంకర సువన కేసరీ నందన తేజ ప్రతాప మహాజగ వందన॥*

నీ చేతి యందు వజ్రము, విజయధ్వజము, భుజమున మూంజీ యజ్ఞోపవీతము శోభాయమానముగా నున్నవి. శంకరుని వరపుత్రుడవు, కేసరీనందనుడవు. అసమానమైన తేజ ప్రతాపములుగలిగి జగద్వంద్యుడవైనావు.

*7. విద్యావాన గుణీ అతి చాతుర రామకాజ కరివేకో ఆతుర!*
*8. ప్రభుచరిత్ర సునివేకో రసియా రామ లఖన సీతా మన బసియా॥*

సమస్తవిద్యలకూ, సద్గుణములకు నిధానమవు. అతిచతురుడవు. శ్రీరామ కార్యమును నేరవేర్చుటకు ఉత్సాహవంతుడవు. శ్రీరామ ప్రభువు చరితమును వినుటలో మిక్కిలి రసికుడవు. నీ మనస్సున సదా సీతారామ లక్ష్మణులు వసించుచుందురు.

*9. సూక్ష్మరూప ధరి సియహిఁ దిఖావా వికట రూప ధరి లంక జలావా!*
*10. భీమ రూప ధరి అసుర సంహారే రామచంద్ర కే కాజ సవాఁరే॥*

సూక్ష్మరూపమును ధరించి సీతాదేవికి గోచరించితివి. భయంకరరూపముతో లంకను కాల్చితివి. మహా భయంకర రూపమును దాల్చి రావణాసురసైన్యమును హతముచేసితివి. శ్రీరామచంద్రుని కార్యమును నేరవేర్చితివి.

11. లాయ సజీవన లఖన జియాయే శ్రీ రఘువీర హరషి ఉర్ లాయే।
12. రఘుపతి కీన్హీ బహుత్ బడాయీ కహా భరత సమ తుమ ప్రియ భాయీ॥

సంజీవిని మూలికను తెచ్చిన లక్ష్మణుని జీవింపజేసితివి. సంతుష్టుడైన శ్రీరాముడు నిన్ను హృదయమునకు హత్తుకొనెను. రఘునాథుడు నిన్ను మిక్కిలి ప్రశంసించుచూ "నీవు నాకు సోదరుడైన భరతునితో సమానముగా ప్రియమైనవాడవు" అని పలికెను.

13. సహస వదన తుమ్హరో యశ గావైఁ అసకహి శ్రీపతి కంఠ లగావైఁ।
14. సనకాదిక బ్రహ్మాది మునీశా నారద శారద సహిత అహీశా॥

"వేయినోళ్ళతో ఆదిశేషుడు నీ కీర్తిని గానము చేయుచున్నాడు" అని పల్కుచూ శ్రీపతియగు రామచంద్రుడు నిన్ను కౌగలించుకొనెను. సనకాది మునులు, బ్రహ్మాది దేవతలు, నారదుడు, సరస్వతీదేవి కూడా నీ కీర్తిని పొగడుచున్నారు.

15. యమ కుబేర దిగపాల జహాఁతే కవి కోవిద కహి సకే కహాఁతే।
16. తుమ ఉపకార సుగ్రీవహి కీన్హా రామమిలాయ రాజపద దీన్హా॥

యముడు, కుబేరుడు మున్నగు దిక్పాలకులు కూడా నిన్ను వర్ణించజాలకున్నారు. కవులు, పండితులు ఏమని స్తుతించగలరు? నీవు సుగ్రీవునికి మహోపకారమొనర్చితివి. శ్రీరామచంద్రునితో మైత్రిని కలిగించి అతని రాజ్యమునతనికి కప్పగించితివి.

17. తుమ్హరో మంత్ర విభీషణ మానా లంకేశ్వర భయే సబ జగ జానా।
18. యుగ సహస్ర యోజన పరభానూ లీల్యోతాహి మధుర ఫల జానూ॥

నీ సలహానుపాటించుటచేతనే విభీషణుడు లంకాధిపతియైనాడు. ఇది జగద్విదిత సత్యము. రెండువేల యోజనముల దూరముననున్న సూర్యుని మధురఫలమని భావించి లీలగా గ్రహించినావు.

19. ప్రభు ముద్రికా మేలి ముఖ మహీఁ జలధి లాంఘి గయే అచరజ నాహీఁ।

20. దుర్గమ కాజ జగత కే జేతే సుగమ అనుగ్రహ తుమ్హరే తేతే॥

శ్రీరాముడొసంగిన ముద్రికను నోట నిడుకొని సముద్రమును సునాయాసముగా దాటితివి. ఇందు ఆశ్చర్యములేదు. ఈ జగత్తున దుర్గమమైన ఏ కార్యముకూడా నీయనుగ్రహముచేత సుగమమగును.

21. రామ దు ఆరే తుమ రఖవారే హో తవ ఆజ్ఞా బిను పైఠారే।

22. సబ సుఖలహైఁ తుమ్హారీ శరణా తుమ రక్షక కాహూకో డరనా॥

నీవు శ్రీరామచంద్రుని భవన ద్వారమువద్ద రక్షకుడవు. నీ యాజ్ఞలేనిదే ఎవ్వరూ లోనికి ప్రవేశింపలేరు. నిన్ను శరణుజొచ్చిన వారికి అన్ని సుఖములు లభించును. నీవు రక్షకుడవై యుండగా ఎవ్వరికెట్టి భయము కలుగును?

23. ఆపన తేజ సమ్హారో ఆపై తీనోఁ లోక హాఁకతే కాంపై।

24. భూత పిశాచ నికట నహీఁ ఆవే మహాబీర జబనామ సునావై॥

మీ ప్రతాపమును మీరే నిగ్రహించుకోగలరు. మీరు గర్జించిన ముల్లోకములు కంపించును. ఓ మహావీరా! నీ నామమును వినినంతనే భూత పిశాచములు నీ భక్తుల దరిచేరవు.

25. నాసై రోగ హరై సబ పీరా జపత నిరంతర హనుమత వీరా।

26. సంకటసే హనుమాన ఛుడావై మన క్రమ వచన ధ్యాన జోలావై॥

నీ నామమును నిరంతరము జపించినచో సమస్త రోగములు, పీడలు

నశించిపోవును. మనో వాక్కర్మలచే హనుమంతుని ధ్యానించువారు సమస్త సంకటములనుండి ముక్తులయ్యెదరు.

*27. సబ పర రామ తపస్వీరాజా తిన కే కాజ సకల తుమ సాజా।*
*28. ఔర మనోరథ జో కోయి లావై తాసు అమిత జీవన ఫల పావై॥*

రాజగు శ్రీరాముడు తపస్వియై అందరికీ ప్రభువై యుండుగా, అతని కార్యములన్నింటినీ నీవు నెరవేర్చుచుందువు. ఏ మానవుడైననూ నిన్నాశ్రయించినచో అతని మనస్సు నందలి కోరికలన్నియూ నెరవేరును.

*29. చారోఁయుగ పరతాప తుమ్హారా హై పరసిద్ధి జగత ఉజియారా।*
*30. సాధు సంతకే తుమ రఖవారే అసుర నికందన రామ దులారే॥*

నీ ప్రతాపము నాలుగు యుగములలో ప్రసిద్ధము. దానిచే ప్రపంచము దేదీప్యమానమగుచున్నవి. సాధుసత్పురుషులకు రక్షకుడవు. అసురులను వధించి శ్రీరామునికి ప్రియుడవైతివి.

*31. అష్టసిద్ధి నవనిధి కే దాతా అస వర దీన్హా జానకీ మాతా।*
*32. రామ రసాయన తుమ్హారే పాసా సాదర తుమ రఘుపతి కే దాసా॥*

అష్టసిద్ధులను, నవనిధులను ప్రసాదించువాడవని జానకీమాత నీకు వరమొసంగినది. నీ వద్ద దివ్యమైన రామనామామృతము గలదు. సదా శ్రీరాముని సేవనే చేయుచుందువు.

*33. తుమ్హారే భజన రామకో పావై జనమ జనమ కే దుఖ బిసరావై।*
*34. అంతకాల రఘుపతిపుర జాయీ జహాఁ జన్మ హరిభక్త కహాఈ॥*

మనుజుడు నిన్ను భజించిన శ్రీరాముని సన్నిధిని చేర్చుచున్నాడు. అనేక జన్మలనుండి సంక్రమించిన దుఃఖములను పోగొట్టుకొనుచున్నాడు. నీ భక్తులు అంత్యకాలమున శ్రీరాముని చేరుదురు. నూతన జన్మపొందినచో హరిభక్తులయ్యెదరు.

35. ఔర దేవతాచిత్త న ధరఈ హనుమత సేయి సర్వసుఖ కరఈ।
36. సంకట హటై మిటై సబ పీరా జో సుమిరై హనుమత బలబీరా॥

అన్య దేవతలను చిత్తమున నిలుపుకొనక హనుమంతుని సేవించినవారు సర్వసుఖములను పొందుదురు. ఎవరు బలవంతుడైన హనుమంతుని స్మరించెదరో వారి సంకటములు, పీడలు తొలగిపోవును.

37. జైజైజై హనుమాన గోసాయీం కృపా కరో గురు దేవ కీ నాయీ।
38. జో సతబార పాఠ కర జోయీ ఛూటహిం బంది మహాసుఖ హోయీ॥

ఆంజనేయా నీకు జయము, జయము, జయము, గురుదేవునివలె నాపై కృపజూపుము. నిర్మలభక్తితో ఈ స్తుతిని నూరుసార్లు పఠించినవారు సమస్త బంధములనుండి ముక్తులై పరమ సుఖముననుభవింతురు.

39. జో యహ పఢై హనుమాన చలీసా హోయి సిద్ధి సాఖీ గౌరీశా।
40. తులసీదాస సదా హరి చేరా కీ జై నాథ హృదయ మహఁడేరా॥

ఈ హనుమాన్ చాలీసాను భక్తితో పఠించిన వారికి సర్వసిద్ధులు కలుగును. గౌరీపతియే దీనికి సాక్ష్యము. తులసీదాసుడను నేను సదా హరిభక్తుడను. ఓ హనుమా! దయయుంచి సదా నాహృదయమున వసింపుము.

॥దోహా॥ పవనతనయ సంకటహరణ
మంగళమూరతి రూప
రామలఖన సీతా సహిత
హృదయ బసహు సురభూప ॥

పవనతనయా! సంకటహరణా! మంగళమూర్తీ! శ్రీసీతారామలక్ష్మణులతోకూడి నా హృదయమున వసింపుము.

* * *

# ఆరవ సోపానము

# లంకాకాండము

## 1. వందనము

కౌమారియైన శివునికి ఆరాధ్యదైవము, భవభయమును పోగొట్టువాడు, యోగీశ్వరుడు, అజేయుడు, నిర్గుణుడు, నిర్వికారుడు, మాయాతీతుడు, దేవతలకు ప్రభువు, దుష్టులను వధించువాడు, పృథ్వీపతి అవతారమును దాల్చిన శ్రీరామునికి వందనమును ఆచరించెదను.

అతిసుందరమైన తెల్లని దేహకాంతి గలవాడు, పులి చర్మమును ధరించినవాడు, సర్పములను భూషణములుగా కలవాడు, శుభములను యిచ్చువాడు కామదేవుని భస్మము చేసినవాడు పార్వతీపతియైన శ్రీ శంకరునికి నమస్కరించుచున్నాను.

## 2. సేతుబంధనము

సముద్రుని సలహానువిన్న శ్రీరామచంద్రుడు తన సలహాదారులతో "ఇప్పుడు ఆలస్యమేల? వెంటనే వారధిని నిర్మించుడు," అని పల్కెను. జాంబవంతుడు నలుడు, నీలుడు అను సోదరులను పిలిచి "మనస్సులో శ్రీరాముని మహిమను స్మరించుచూ సేతువును నిర్మించుడు. ప్రభుప్రతాపము వలన మీకు ఏ మాత్రము శ్రమ కలుగదు," అని ఆదేశించెను. పిదప వానరసైన్యమును పిలిచి చెప్పెను: "మీరందరూ హృదయములలో శ్రీరాముని చరణకమలములను

స్మరించుచూ శ్రమలేని సేతుబంధనములో నిమగ్నులు కండు. వృక్షములను పర్వతములను మోసికొనిరండు." ఆ మాటలను విన్న వానరభల్లూకములు హుంకరించుచూ జయయధ్వానములు చేయుచూ, ఎత్తైన పర్వతములను, చెట్లను లీలగా మోసికొని వచ్చి నలునికి నీలునికి ఇచ్చుచుండిరి. వారు వాటిని బంతులవలె తీసుకొని సుందరమైన సేతువును నిర్మించిరి. ఆ సేతు నిర్మాణమును చూచి శ్రీరాముడు నవ్వుచూ పలికెను: "ఇక్కడ భూమి అతి సుందరమైనది. ఉత్తమమయినది. నేను యిచ్చట శంకర మూర్తిని ప్రతిష్ఠించెదను. ఇది నా మనస్సులోని సంకల్పము." శ్రీరామచంద్రుని వచనములను విని వానర రాజు సుగ్రీవుడు దూతలను పంపగా వారు మునిశ్రేష్ఠులను పిలుచుకొని వచ్చిరి. శ్రీరామచంద్రుడు శివలింగ ప్రతిష్ఠ చేసి యథావిధి పూజించి పలికెను: "శివునితో సమానము అగు ప్రియుడు నాకెవ్వరు లేరు. ఎవ్వరైతే ఈ రామేశ్వరమును దర్శించెదరో, గంగాజలమును తెచ్చి శివునికి అభిషేకము చేసెదరో వారికి ముక్తి లభించును. ఈ సేతు దర్శనము చేసినవారు శ్రమ లేకుండగనే సంసారసాగరమును దాటెదరు." శ్రీరాముని వచనములను విని అందరూ సంతసించిరి. మునిశ్రేష్ఠులు తమ ఆశ్రమములకు పోయిరి.

శ్రీరాముని కృపచే నలుడు, నీలుడు వేసిన రాళ్ళు సముద్రములో నావలవలె తేలిపోయెను. నలుడు, నీలుడు సేతువును అత్యంత దృఢముగా నిర్మించిరి. వానరసేనలు సేతువుపై ముందుకు నడిచినవి. శ్రీరాముడు సేతువునెక్కి విశాలమైన సముద్రమును చూచెను. కృపాళువగు శ్రీరామచంద్రుని దర్శించుటకు జలచరములన్నియూ సమూహములుగా పైకి వచ్చెను. అవి సర్వత్ర వ్యాపించి ప్రభువును దర్శించి ఆనందమగ్నమైనవి. ప్రభువాజ్ఞచే వానరసైన్యము ముందుకు నడవసాగెను. సేతువు వానరసైన్యముతో నిండిపోయెను. కొందరు ఆకాశమున ఎగురుచూ పోసాగిరి. మరి కొందరు జలచరముల

వీపులపైనెక్కి పోసాగిరి. శ్రీ రఘునాథుడు, లక్ష్మణుడు నవ్వుచూ సముద్రమును అవలీలగా దాటి ఆవలితీరమున గుడారములు వేసిరి. ప్రభువాజ్ఞచే వానరభల్లూకములు వనములోని ఫలములన్నింటినీ భక్షించిరి. వృక్షములన్నియూ కాలగతిని, ఋతుధర్మమును కూడా పాటించక ఫలభరితములు ఆయెను. వానరులు పర్వతశిఖరములను లంకవైపునకు విసరివేయుచుండిరి. ఎక్కడైనా రాక్షసుడు కనపడినచో వాని చట్టు మూగి నాట్యము చేయుచూ వాని ముక్కు, చెవులు కొరికి, ప్రభువు కీర్తిని వానితో చెప్పించి వదలివేయుచుండిరి. ముక్కు, చెవులు తెగిన రాక్షసులు రావణుని వద్దకు పోయి అన్ని విషయములు చెప్పిరి. సముద్రముపై సేతుబంధమును విన్న దశానుడు భయపడుచూ ఒక్కసారిగా పదినోళ్ళతో గట్టిగా అరిచెను. పిదప కపటపు నవ్వుతో తన భయమును కప్పిపుచ్చుకొని తన భవనమునకు పోయెను.

## 3. మందోదరి విన్నపము

శ్రీరామచంద్రప్రభువు అవలీలగా సముద్రమునకు సేతువు కట్టి లంకకు ఏతెంచిన విషయమును విని మందోదరి తన పతి చరణములకు ప్రణమిల్లి ప్రార్థించెను. "నాథా! కోపము మాని నా మాటలు వినండి. బుద్ధి, బలముచేత మనము జయించగలిగిన వానితోనే వైరము చేయవలెను. మీకు శ్రీరఘునాథుని మధ్య నిశ్చయముగా దీపపురుగుకు సూర్యునికిగల అంతరము వంటిది. శ్రీమహావిష్ణువే పృథ్వీభారమును బాపుటకు అవతరించినాడు. అతనితో విరోధము మాని అతని చరణకమలములకు నమస్కరించి జానకీదేవిని అతనికి సమర్పించుడు. కుమారునికి రాజ్యమును అప్పగించి వనములో శ్రీరఘునాథుని భజింపుడు. మీరు చేయవలసిన పనులన్నియూ చేసినారు. చరాచర ప్రపంచమునంతయూ జయించినారు. ఇప్పుడు సృష్టిస్థితిలయకారకుడైన పరమాత్మను భజింపుడు. శరణాగతవత్సలుడైన శ్రీరాముని ఆరాధిం

చుడు. మీరు నా మాటను అంగీకరించినచో మీ కీర్తి ముల్లోకములలో వ్యాపించును. నా మాంగల్యము శాశ్వతముగా నిలుచును." మందోదరి మాటలు విని దుష్టరావణుడు తన వైభవమును గూర్చి వర్ణించుచూ పలికెను: "ప్రియా! నీవు వ్యర్థముగా భయపడుచున్నావు, ఈ జగత్తులో నాకు సమానమగు యోధుడెవడున్నాడు? చెప్పుము. నా భుజబలముచే నేను దిక్పాలకులనేగాక మృత్యువును గూడ జయించినాను." అట్లు అనేక విధముల ఆమెకు నచ్చచెప్పి రావణుడు సభకు వెళ్ళి మంత్రుల సలహాను అడిగెను. వారు మరల అతనిని ప్రశంసించుచూ భయపడుటకు కారణము ఏ మాత్రము లేదని పలికిరి. అపుడు రావణుని కుమారుడైన ప్రహస్తుడు పలికెను: "ప్రభూ! మంత్రులెవరు సరియైన సలహాను ఇచ్చుటలేదు. వారు ముఖస్తుతి చేయుచున్నారు. ఒక కోతి సముద్రమును దాటి వచ్చి చేసిన అద్భుతకార్యములు ఇంకనూ అందరి మనస్సులలో మెదలుచున్నవి. ఆ కోతి సభలో అందరితో మాట్లాడునపుడు, నగరమును తగలబెట్టుచున్నప్పుడు మీరు ఎందుకు దానిని పట్టుకొని తినలేదు? ఆటలాడుచూ సముద్రముపై సేతువు నిర్మించినవాడు సామాన్య మానవుడు కాడు. కావున నా మాటను విని దూతను పంపి సీతాదేవిని అప్పగించి శ్రీరామునితో స్నేహము చేయుడు. ఒకవేళ అతడు తన భార్యను పొంది మరలిపోయినచో అతనితో కలహము పెంచవలదు. ఒకవేళ మరలిపోనిచో రణభూమిలో ఎదురెదురుగా పోరాడండి." రావణుడు ఆ మాటలను విని కోపముతో మండిపోవుచూ "అరే మూర్ఖుడా! నీకీ బుద్ధిని ఎవరు నేర్పినారురా?" అని అరచెను. ప్రహస్తుడు తండ్రిగారి కఠోరవాక్యములను విని ఇంటికి పోయెను. రావణుడు సాయంకాలము అయినందున ఎత్తైన శిఖరముపై అతి విచిత్రమైన భవనములో సంగీత, నృత్య సభలను ఆనందించుటకు పోయెను. అచట కిన్నెరులతనిని గుణములు పొగడుచూ పాడుచుండిరి. అప్సరసలు నాట్యమాడుచుండిరి. కరతాళములు, మృదంగములు మున్నగు వాద్యముల గోష్ఠి జరుగుచుండెను.

ఇక్కడ శ్రీరఘువీరుడు సుబేల పర్వతముపై యోధానయోధులు గల సైన్యముతో నుండెను. ఆ పర్వతముపై ఎత్తైన ఒక సమతల శిఖరమును చూచి లక్ష్మణుడు, స్వయముగా లేత ఆకులను మనోహరమైన పుష్పులను తెచ్చి పరచి, వాటిపై కోమలమైన జింకచర్మమును పరచెను. శ్రీరామచంద్రుడు ఆ ఆసనముపై ఆసీనుడయ్యెను. లంకేశుడు విభీషణుడు ప్రభుచెవిలో రహస్యముగా ఏదో సలహాను ఇచ్చుచుండెను. ప్రభువు వానర రాజైన సుగ్రీవుని వడిలో తలనుంచి పరుండగా అంగదుడు, హనుమంతుడు ప్రభు పాదములను వత్తుచుండిరి. ధనుర్బాణములను ధరించి లక్ష్మణుడు ప్రభువు వెనకాల నిలుచుండెను. ఇంతలో దక్షిణము వైపున వేఘములను, మెరుపులను చూచి శ్రీరామచంద్రుడు విభీషణునితో పలికెను. "విభీషణా! దక్షిణదిశవైపునకు చూడుము. గర్వముతో నిండిన మేఘములు ఎట్లు ఒక చోట చేరుతున్నవి. మధురస్వరముతో గర్జించుచున్నవి. మెరపు తళుక్కుమనుచున్నది. బహుశా వడగండ్ల వాన కురియవచ్చు." విభీషణుడు పలికెను: "కృపాసాగరా! అది మెరుపు కాదు. మేఘసముదాయము కాదు. లంకలో శిఖరముపై ఒక భవనము కలదు. దశకంఠుడు అక్కడ సంగీత, నృత్యసభలను చూచుచున్నాడు. రావణుడు తన శిరస్సుపై మేఘమువలె విశాలమైన నల్లని ఛత్రమును ధరించినాడు. మందోదరీదేవి చెవులకు ధరించిన కర్ణకుండలములు మెరుపువలె మెరియుచున్నవి. మృదంగతాళధ్వనులు మధురముగా వినపడుచున్నవి." రావణుని గర్వమును గ్రహించి ప్రభువు చిరునవ్వుతో ధనుస్సుని ఎక్కుపెట్టి బాణమును సంధించెను. ఒక బాణము చేత రావణుని ఛత్రమకుటమును మండోదరి కర్ణకుండలములను పడగొట్టెను. అట్టి చమత్కారము చేసి శ్రీరాముని బాణము తిరిగి వచ్చి తూణీరము చేరెను. ఛత్రమకుటము కర్ణకుండలములు నేలపై పడెను. ఆ రసభంగమును చూచి రావణుని సభలోని వారందరూ భయపడిరి. "భూకంపము లేదు. తుఫాను లేదు ఏ అస్త్రశస్త్రములు

కనిపించలేదు. ఈ అపశకునము ఎట్లు జరిగినది?" అని అందరూ తలంచుచుండిరి. మందోదరికి విచారము ఎక్కువాయెను. మరల ఆమె చేతులు జోడించి కన్నులలో నీరు నింపుకొనుచూ రావణునితో పలికెను: "ప్రభూ! నా విన్నపము వినండి. శ్రీరామునితో విరోధము మానండి. అతడు మానవమాత్రుడు కాదు. విశ్వరూపుడు." మందోదరి వచనములను విని. రావణుడు నవ్వి పలికెను: "ప్రియా! ఈ చరాచర విశ్వమంతయూ సహజముగా నాకు వశమై ఉన్నది. నీవు పలికినట్లు అతడు విశ్వరూపుడైనచో నా వశములో నున్నట్లే. నీ మాటలు మిక్కిలి భావయుక్తముగా నున్నవి." అట్లు హాసవిలాసములతో తెల్లవారెను. మదాంధుడు అయిన లంకాపతి తన సభాభవనమును ప్రవేశించెను. మందోదరి కాలము సమీపించుటచే తన పతికి మతి భ్రమించినది అని మనస్సులో తలంచెను.

## 4. అంగద రాయబారము

ఇక్కడ సుబేల పర్వతముపై శ్రీరఘునాథుడు ప్రాతఃకాలమున లేచి మంత్రులను పిలిచి వారి సలహాను అడిగెను. జాంబవంతుడు శ్రీరాముని చరణములను మ్రొక్కి పలికెను: "ప్రభూ! మీరు సర్వజ్ఞులు. అయిననూ నా బుద్ధికి తోచిన సలహాను ఇచ్చెదను. వాలి పుత్రుడైన అంగదుని దూతగా పంపుడు." ఈ సలహా అందరికీ నచ్చెను. శ్రీరాముడు అంగదుని పిలిచి చెప్పెను: "వాలిపుత్రా! నీవు బలము, బుద్ధి, గుణములకు స్థానము. నా కార్యము కొరకు నీవు లంకకు పొమ్ము. నీవు మిక్కిలి చతురుడవు, నీకు ఎక్కువగా ఉపదేశము యివ్వపనిలేదు. మన పని సఫలమగునట్లు శత్రువునకు హితమగునట్లు మాటాడుము." శ్రీరామచంద్రప్రభువు ఆజ్ఞను శిరసావహించి ప్రభుచరణములకు నమస్కరించి అందరికీ ప్రణమిల్లి అంగదుడు బయలు దేరెను. లంకాపురమును ప్రవేశించగానే రావణ పుత్రుడైన ప్రహస్తుడు

అతనిని కలిసెను. ఇద్దరూ బలశాలురు, యువకులు అగుటచే ఇద్దరి మధ్య మాటలతోనే పోట్లాట ఎక్కువయ్యెను. రావణపుత్రుడు అంగదుని తన్నుటకు కాలెత్తెను. వెంటనే అంగదుడు ఆ కాలును పట్టుకొని వానిని గిరగిరతిప్పి నేలకేసి కొట్టెను. వాడు అక్కడనే చనిపోయెను. రాక్షసగుంపులు ఎక్కడివారు అక్కడికి పరుగెత్తిరి. భయముతో గట్టిగా అరవలేకపోయిరి. మునుపు లంకను కాల్చిన వానరుడే మరల వచ్చినాడని నగరమంతయూ వార్త వ్యాపించెను. అత్యంత భయభీతులై అడగకుండగనే వారు అంగదునికి రావణుని సభకు మార్గమును చూపించిరి. బలయుతుడైన అంగదుడు శ్రీరాముని చరణములను స్మరించుచూ, సభా భవనద్వారమును చేరి నిర్భయముగా ఒక రాక్షసుని ద్వారా తన రాకను యెరింగించెను. రావణుడు నవ్వి "తీసుకొనిరా, ఎక్కడి కోతియో చూద్దాము" అనెను. అనేకమంది రాక్షసులు పరుగెత్తుకొని పోయి అంగదుని పిలుచుకొనివచ్చిరి. ఒక ప్రాణముగల కాటుక కొండవలెనున్న రావణుని అతడు చూచెను. అతని భుజములు వృక్షములవలె, తలలు పర్వత శిఖరములవలె; నోళ్లు, ముక్కులు, నేత్రములు, చెవులు, పర్వతగుహలవలె, లోయలవలె ఉండెను. మహాబలశాలి వాలి పుత్రుడు ఎట్టి జంకులేక సభాభవనమున ప్రవేశించెను. సభాసదులందరు లేచి నిలుచుండిరి. ఇది చూచి రావణుని హృదయము కోపముతో నిండెను.

రావణుడు 'అరే కోతీ! నీవెవరవు?' అని పలికెను. అంగదుడు బదులు పలికెను: "ఓ రావణా! నేను రఘువీరుని దూతను. నా తండ్రికి నీకు మిత్రత్వము ఉండుటచే నీ మేలు కోరి వచ్చినాను. నీవు శివుని, బ్రహ్మను పూజించి వారి నుండి వరములను పొంది లోక పాలురను, సమస్త రాజులను జయించినావు. ఇప్పుడు రాజగర్వమున మోహవశుడవై జగజ్జనని అయిన సీతాదేవిని అపహరించితివి. నా మాట విని సీతాదేవిని శ్రీరామచంద్రప్రభువునకు అప్పగించి, శరణు

పొందుము. ప్రభువు నీ అపరాధములను అన్నింటినీ క్షమించును." రావణుడు పలికెను: "అరే పిల్లకోతీ! మాటలు జాగ్రత్తగా రానీ. నీ పేరు నీ తండ్రి పేరు చెప్పుము. నీ తండ్రికి నాకు ఎలాంటి మైత్రి కలదు?" అంగదుడు "నేను వాలి కుమారుడను. నా పేరు అంగదుడు" అని బదులు పలికెను. రావణుడు కొంత జంకి పలికెను: "నీవు వాలి కొడుకువా? నీ జన్మ వ్యర్థము, తాపసులకు దూతవైతివా? ఇప్పుడు వాలి ఎక్కడ ఉన్నాడు?" అంగదుడు పలికెను: "అరే మూర్ఖుడా! పదిరోజుల తర్వాత నీవే వాలి వద్దకు పోయి, నీ మిత్రుని హృదయమునకు హత్తుకొని అతని కుశలసమాచారమును అడుగుదువులే. శ్రీరామునితో వైరము సల్పినచో ఎట్టి క్షేమము కలుగునో అతడు నీకు తెలుపును. పరస్త్రీని దొంగలించి తెచ్చి నీ ధర్మశీలతను చాటించుకున్నావు. దూతను ఏ విధముగా రక్షించినావో నేను స్వయముగా చూచినాను." ఆ మాటలను విన్న రావణుడు పలికెను: "అంగదా! నీ సేనలో నన్ను ఎదురించగలవాడెవడో తెలుపుము. నీ ప్రభువైతే భార్యావిరహములో బలహీనుడైనాడు. అతని తమ్ముడు అతని దుఃఖములో పాలుపంచుకొని దుఃఖితుడైనాడు. నా తమ్ముడు విభీషణుడు పిరికివాడు. మంత్రి జాంబవంతుడు వృద్ధుడు. ఒక్క వానరుడు మాత్రము ఆ సేనలో బలిష్ఠుడు కలడు. అతడు మునుపు కూడా వచ్చి లంకను కాల్చినాడు." అంగదుడు బదులు పలికినాడు: "నీవు చెప్పినది సత్యము. ఆ చిన్న వానరుడు ప్రభువు మహిమవలననే అంత గొప్పవాడైనాడు. అతనికంటే బలిష్ఠులైన యోధులు మా సేనలో అనేకులు గలరు. శ్రీరామచంద్ర ప్రభువు అతి సులభముగా నిన్ను మట్టు పెట్టగలడు. అయిననూ ధర్మాత్ముడు కావున మొదట నన్ను దూతగా పంపినాడు." రావణుడు నవ్వుచూ పలికెను: "తనను పోషించిన వానిని సేవించుట కోతి స్వభావము. కావున నీ యజమానిని నీవు పొగడుచున్నావు. నీ తండ్రిని చంపిన వానిని నీవు సేవించుచున్నావు. నా భుజపరాక్రమమును నీవు

ఎరుగవు. నేను కైలాసమును ఎత్తి శివుని మెప్పించినాను. నా పరాక్రమము దిక్పాలకులకు తెలియును. అట్టి నన్ను చిన్నవానిగా తలచి ఒక మనుష్యుని ప్రశంసించుచున్నావు." అంగదుడు పలికెను: "ఓరే రావణా! ఏ సహస్రబాహువు నిన్ను బంధించెనో అట్టివానిని తన గండ్రగొడ్డలితో సంహరించిన పరుశురాముని మదమును మా శ్రీరామచంద్రప్రభువు అణచెను. అశోకవనమును ధ్వంసము చేసి లంకను గాల్చి నీ కుమారుని చంపిన హనుమంతుడు సామాన్యుడు కాడు. వ్యర్థముగా నీ గొప్పలు చెప్పకోవద్దు. శ్రీరాముని బాణము తగలగానే నీ శిరస్సులన్నియూ తెగి క్రిందపడును. వానరభల్లూకములు వాటిని బంతులవలె ఆడుదురు. బాగుగా ఆలోచించి శ్రీరాముని భజింపుము." అంగదుని మాటలు విని రావణుడు కోపముతో పళ్లు కొరుకుచూ అరిచెను: "అరే వానరాధమా! నీకు చావు మూడినది. నీవు ఎవ్వరి బలమును చూచుకొని కఠోరవచనములు పలుకుచున్నావో అతనికి బలము, బుద్ధి, తేజస్సు ఏమియులేవు, గుణహీనుడు అని తెలిసియే అతని తండ్రి అతనిని వనవాసమునకు పంపెను. ఆ దుఃఖమునకు తోడు భార్యావియోగము, నా వలన భయము. అట్టి మనుష్యులను రాక్షసులు భక్షిస్తూనే ఉన్నారు." శ్రీరాముని రావణుడు నిందించగానే అంగదుడు కృద్ధుడై పండ్లు పటపటకొరుకుచు తన రెండు భుజములతో నేలను కొట్టెను. భూమి అదరెను. సభాసదులు క్రిందపడిరి. రావణుడు పడుచూ తమాయించుకొని లేచెను. కాని అతని కిరీటములు నేలపై పడెను. అందులో కొన్నింటిని రావణుడు ఏరుకొని తలపై అలంకరించుకొనెను. మరి కొన్నింటిని అంగదుడు శ్రీరామచంద్రుని వద్దకు విసిరివేసెను. వానిని చూచి వానరులు ఉల్కలు అని భావించిరి. కాని శ్రీరాముడు నవ్వి "అవి అంగదుడు విసిరివేసిన రావణుని కిరీటము"లని తెలిపెను.

రావణుడు క్రోధముతో "ఈ కోతిని పట్టుకొనండి. చంపి తినండి, వానరులను, భల్లూకములను ఎక్కడ దొరికితే అక్కడ పట్టుకొని తినండి. ఆ తాపసి సోదరులిద్దరినీ ప్రాణములతో పట్టుకొనిరండు" అని పలికెను. "అరే స్త్రీచోరుడా! దుష్టుడా! సన్నిపాతవశమున దుర్భాషలాడుచున్నావు. వానర భల్లూకములు నిన్ను చుట్టుముట్టినప్పుడు, నీ తలలు తెగి రణభూమిలో పడినప్పుడు నీ పాపఫలము అనుభవించెదవు. నిజముగా మీరు వీరులయినచో నా కాలిని కదిలించండి." అని పలుకుచూ అంగదుడు శ్రీరామచంద్రుని స్మరించుచూ సభామధ్యమున నిలబడెను. రావణుడు "ఈ కోతి కాలు పట్టుకొని నేలపై పడగొట్టండి" అని ఆజ్ఞాపించెను. ఇంద్రజిత్తు మొదలగు అనేకమంది యోధులు తమ బలమును ఉపయోగించి అంగదుని కాలును కదల్ప ప్రయత్నించిరి. కాని ఆ కాలు కొంచముకూడా కదలలేదు. ముఖము వ్రేలాడేసుకొని తమ ఆసనములలో కూర్చొనిరి. అంగదుని బలమును చూచి రాక్షసులు మనస్సులోనే తమ ఓటమిని అంగీకరించిరి. రావణుడే స్వయముగా లేచి అంగదుని కాలు పట్టుకొనెను. అంగదుడు "నా కాళ్లు పట్టుకున్నంత మాత్రమున నిన్నెవరు రక్షించరు. పోయి శ్రీరాముని పాదములను పట్టుకొనుము" అని పలికెను. ఇది విని రావణుడు సిగ్గుపడుతూ తలలు దించుకొని సింహాసనముపై కూర్చొనెను. పిదప అంగదుడు శ్రీరామచంద్రుని కీర్తించుచూ ఆ సభను వీడి వచ్చి శ్రీరామచంద్రుని చరణములపై వాలెను. సంధ్యాసమయముమగుట వలన రావణుడు విచారముతో తన భవనమునకు ఏగెను.

వికలమనస్కురాలైన మందోదరి మరల రావణునికి నమస్కరించి పలికెను: "ప్రభూ! బాగా ఆలోచించి మీ చెడుబుద్ధిని వదలండి. శ్రీరఘునాథునితో యుద్ధము తగదు. అతని తమ్ముడు గీచిన గీతను కూడా మీరు దాటలేకపోయితిరి. అతని దూత అవలీలగా సముద్రమును

లంఘించి, అశోకవనములోని రాక్షసులను వధించి, ఆ వనమును నాశనమును ఒనర్చెను. మీరు చూస్తుండగనే అక్షకుమారుని వధించెను. లంకను కాల్చి బూడిద చేసెను. అప్పుడు మీ బలగర్వము ఏమైనది? శ్రీరఘుపతి చరాచరములకు ప్రభువు. అతని బాణప్రతాపమును మారీచుడు ఎరుగును. జనకుని సభలో మీతోసహా రాజన్యులు అందరూ చూచుచుండగనే శివధనుస్సును విరచెను. విరాధుని, ఖరదూషణులను, వాలిని సంహరించిన ప్రతాపశాలి. అవలీలగా సముద్రమునకు సేతువు గట్టి తన సైన్యముతో పాటు సుబేల పర్వతముపై దిగిన శ్రీరామచంద్రుడు మీ హితముగోరి దూతను పంపెను. అతడు సభామధ్యమున మీ బలమును అణచివేసెను. అట్టి శ్రీరామునితో వైరము బూనుట దుఃఖహేతువు." బాణములవంటి తన భార్య వచనములు వినియు ప్రాతఃకాలముననే లేచి రావణుడు తన సభాభవనమునకు పోయి గర్వముతో పొంగిపోవుచూ సింహాసనముపై కూర్చుండెను.

## 5. సంగరారంభము

ఇక్కడ సుబేల పర్వతముపై శ్రీరామచంద్రప్రభువు తన చరణములకు ప్రణమిల్లిన అంగదుని సాదరముగ తన వద్ద కూర్చుండబెట్టుకొని పలికెను: "ఓ వాలిపుత్రా! రావణుడు రాక్షసకులశిరోమణి, అతులిత బలశాలి. అతని నాలుగు కిరీటములను నా వద్దకు విసిరివేసితివి. అవి నీకు ఎట్లు లభించినవి?" అంగదుడు పలికెను: "సర్వజ్ఞా! అవి మకుటములు కావు, సామదానభేదదండములను రాజగుణములు, రావణుడు ధర్మహీనుడు అగుటవలన ఆ గుణములు అతనిని వదలి మీ వద్దకు వచ్చినవి." అంగదుని వాక్చాతుర్యమునకు శ్రీరామచంద్రుడు నవ్వసాగెను. పిదప వాలిపుత్రుడు లంకాకోట విషయములన్నింటినీ తెలిపెను. శ్రీరాముడు తన మంత్రులందరినీ పిలిచి పలికెను: "లంకకు

నాలుగు పెద్ద ద్వారములున్నవి. వాటిని ఎట్లు ముట్టడించవలెనో ఆలోచించండి." అప్పుడు సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు కర్తవ్యమును ఆలోచించిరి. వానరసేనను నాలుగు దళములుగా విభజించి యోగ్యులైన సేనాపతులను నియమించిరి. శ్రీరామచంద్రుని ప్రతాపమును స్మరించుచూ వానర భల్లూకములు జయజయధ్వానములు చేయుచూ గర్జించుచూ ఎగురుచూ ముందుకు సాగిరి. మేఘములవలె నాలుగువైపుల చుట్టుముట్టి, వారు నోటితోనే భేరీనగారా శబ్దములను చేయసాగిరి.

-

దానిని విని లంకలో గొప్ప కోలాహలమాయెను. గర్విష్ఠిఅయిన రావణుడు తన సేనను పిలిచి "రాక్షసులందరూ ఆకలిగొన్నారు. బ్రహ్మదేవుడు మనకందరికీ బయటికి పోకుండానే ఆహారమును సమకూర్చినాడు" అని పలుకుచూ అట్టహాసము చేయుచూ "ఓ వీరులారా! నాలుగు దిశలందు పొండి. భల్లూకములను, వానరములను పట్టుకొని భక్షించండి" అని ఆజ్ఞాపించెను. వెంటనే నిశాచరులు వివిధ ఆయుధములను అస్త్రశస్త్రములను ధరించి కోటగోడల నెక్కి నిలబడిరి. "సుమేరు పర్వతముపై మేఘములు కూర్చున్నట్లు రాజప్రాసాదపుకోటగోడలు శోభిల్లెను. అసంఖ్యాకములైన నగారాలు, ఢంకాలు, సన్నాయిలు మ్రోగించబడెను. వాటి ధ్వని యోధుల మనస్సులలో ఉత్సాహమును కలిగించెను. పిరికివారి గుండెలు పగులగొట్టెను. రాక్షసులు ముందుకు పోయి అతికాయులైన వానర భల్లూకయోధులను చూచిరి. ఇరువైపులవారు జయజయధ్వానములు చేయుచుండగా యుద్ధము ఆరంభమాయెను. రాక్షసులు కొండలను, శిఖరములను దొర్లించుచుండిరి. వానరులు ఎగిరి వాటిని పట్టుకొని తిరిగి వారిపైనే విసరుచుండిరి. భయంకరమైన వానరభల్లూకములు రాక్షసులపై దూకి, వారిని కాళ్ళతో చేతులతో పట్టుకొని నేలకేసి కొట్టుచుండిరి. అతిలాఘవముగా కోటపైకి ఎక్కి శ్రీరాముని

యశస్సుని గానము చేయుచుండిరి. శ్రీరాముని ప్రతాపము వలన ప్రబలమైన వానరసేన రాక్షసయోధులను నలిపి వేయుచుండిరి. రాక్షస సైన్యము చెల్లాచెదరాయెను. నగరము హాహాకారములతో నిండిపోయెను. బాలురు, స్త్రీలు, వృద్ధులు, రోగులు ఆర్తనాదములతో విలపించిరి. "రాజ్యము పాలించుచూ వీడు మృత్యువును ఆహ్వానించినాడు" అని అందరూ రావణుని తిట్టసాగిరి. రావణుడు క్రుద్ధుడై పరుగెత్తే యోధులను తిరిగి పంపుచూ పలికెను: "ఎవరైనా రణభూమినుండి వెనుకకు వచ్చినారని తెలిసినచో వారిని నా కఠోర కృపాణముచే చంపెదను." ఆ వచనములను విని వారు యుద్ధములో పోరాడి మరణించుటయే మేలని తలచిరి.

పశ్చిమద్వారమున హనుమంతుడు మేఘనాథునితో యుద్ధము చేయుచుండెను. కాలునితో సమానుడైన ఆ యోధుడు గర్జించి కోటగోడపైకి ఎగిరి ఒక పర్వతశిలను తీసుకొని మేఘనాథుని రథమును విరచెను. సారథిని కొట్టి పడవేసెను. మేఘనాథుని వక్షముపై తన్నెను. మరొక సారథి వ్యాకులుడైన మేఘనాథుని తన రథముపై వేసుకొని గృహోన్ముఖుడాయెను. పవనపుత్రుడు ఒంటరిగా ఉండుటను తెలుసుకొని రణయోధుడైన అంగదుడు అవలీలగా ఎగురుచూ కోటపైకి ఎక్కెను. యోధులిద్దరూ కోపోద్రిక్తులై రావణుని భవనముపైకి ఎక్కి "శ్రీరామునికి జయము" అని పలుకసాగిరి. వారు కలశములతో పాటు భవనమును కూడా ఊపసాగిరి. దానిని చూచి రావణుడు భయభీతుడయ్యెను. స్త్రీలు తమ చేతులతో రొమ్ములపై బాదుకొనుచూ "ఇప్పుడు ఈ రెండు వానరములు వచ్చినవి. ఎట్టి ఉత్పాతమును కలిగించునో?" అని అరవసాగిరి. వారిద్దరూ కపిచేష్టలతో వారిని భయపెట్టిరి. పిమ్మట గర్జించుచూ శత్రుసేనమధ్యలో దూకి తమ భుజబలముచే వారిని మర్దించిరి. కొందరిని కాలితో తన్నిరి. కొందరిని చేతులతో చెంపలు వాయించిరి. ఒకరి తలతో మరొకరి తలను

ఢీకొట్టునట్లు చేసిరి. రాక్షసయోధులను పట్టుకొని శ్రీరామచంద్రుని వద్దకు విసరివేయుచుండిరి. విభీషణుడు వారి పేర్లను ప్రభువునకు తెలుపుచుండెను. ప్రభువు వారికి వైకుంఠమును ప్రసాదించెను. తమ బాహుబలముచే శత్రుసేనలను నుగ్గుచేసి అంగదుడు, హనుమంతుడు సాయంసమయమున అవలీలగా ఎగురుచూవచ్చి ప్రభు చరణములకు ప్రణమిల్లిరి. వారిని చూచి అతి ప్రసన్నుడై శ్రీరామచంద్రుడు తన కృపాదృష్టిని ప్రసరించెను. అంగదుడు, హనుమంతుడు రణభూమినుండి పోయినారని తెలిసి అనేక భల్లూకవానరయోధులు మరలిరి. రాక్షసులకు ప్రదోషకాలమున బలము అధికమగుటచే వానరులపై బడిరి. వానరులు తిరిగి పండ్లు పటపటకొరుకుచూ శత్రువులతో అన్ని వైపులా తలపడిరి.

తమ సైన్యముల బలము సన్నగిల్లుటచూచి అనిపుడు, అకంపనుడు, అతికాయుడు అను సేనాపతులు మాయచేసిరి. ఒక్క క్షణములో ఘోరాంధకారము వ్యాపించెను. రక్తము, రాళ్ళు, బూడిద వర్షించ సాగెను. వానరసేనలు చెల్లాచెదరయిరి. ఒకరిని ఒకరు చూచుట కష్టమాయెను. ఎక్కడ చూచిననూ అరుపులు ప్రారంభమాయెను. శ్రీరఘునాధుడు ఆ రహస్యములను తెలుసుకొని అంగదుని, హనుమంతుని పిలిచి విషయమును తెలిపి నచ్చచెప్పి పంపెను. పిదప కృపాళువు అయిన శ్రీరాముడు ధనుస్సును ఎక్కుపెట్టి అగ్ని బాణమును వేసెను. దానితో గాఢాంధకారము తొలగిపోయెను. వానరభల్లూకములు ప్రసన్నులైరి. హనుమంతుడు, అంగదుడు రణభూమిలో గర్జించిరి. వారి గర్జనను విని నిశాచరులు కాలికి బుద్ధి చెప్పిరి. పరుగెత్తిపోవు రాక్షసయోధులను పట్టుకొని నేలకేసి కొట్టుచుండిరి. కొందరిని సముద్రములో విసరివేయుచుండిరి. ఆ విధముగా కొందరు రాక్షసులు చంపబడిరి. కొందరు గాయపడిరి. మరికొందరు పారిపోయి కోటపైకి ఎక్కిరి.

అక్కడ రావణుడు తన మంత్రులను పిలిచి "వానరులు మన సగము సైన్యమును నష్టము చేసిరి. ఉపాయము ఏమిటో వెంటనే చెప్పండి" అని అడిగెను. రావణునికి తాత మరియు నీతి కోవిదుడైన మాల్యవంతుడు అను మంత్రి పలికెను: "నాయనా! నా ఉపదేశమును వినుము. నీవు సీతను హరించి తెచ్చినప్పటినుండి అన్నియూ అపశకునములే కలుగుచున్నవి. శ్రీరాముడు శ్రీహరి అవతారము. వైరము మాని వైదేహిని ఇచ్చివేసి అతనిని భజింపుము." రావణునికి ఆ మాటలు బాణములవలె గ్రుచ్చుకొనెను. అతడు పలికెను: "ఓ దౌర్భాగ్యుడా, నీ పాడు మొహము నాకు చూపవద్దు. నీవు ముసలివాడవయినావు. లేనిచో నిన్ను చంపెడివాడను." మాల్యవంతుడు తన మనస్సులో "శ్రీరాముని చేతిలో వీనికి చావు తథ్యము" అనుకొనుచూ పోయెను. తరువాత మేఘనాథుడు క్రోధముతో పలికెను: "రేపు ఉదయమున నేను చేయబోవు ఘనకార్యమును చూడుడు. చేసి చూపెడతాను." పుత్రుని వచనములు విని రావణునికి మిక్కిలి సంతోషమాయెను. వారు సమాలోచన చేయుచుండగనే తెల్లవారెను.

## 6. మేఘనాథుని యుద్ధము

మరురోజు ఉదయముననే వానరులు మరల నాలుగు ద్వారములవద్ద గుమిగూడి కోటను ముట్టడించిరి. అనేక విధములైన శస్త్రములతో రాక్షసులు కోటపైనుండి పర్వతశిఖరములను విసరివేసిరి. మారణాయుధములను వేసిరి. అవి వజ్రాయుధము వలె గర్జించుచూ వచ్చెను. వానరయోధులు శత్రువుతో తలపడిరి. అవే పర్వతశిఖరములను చేతులతో నెత్తి విసరివేయుచుండిరి. అట్టి సమయమున మేఘనాథుడు కోట క్రిందికి వచ్చి బిగ్గరగా అరుచుచూ పలికెను: "సమస్త లోకాలలో ధనుర్ధారులు అని ప్రసిద్ధికెక్కిన కోసల రాజకుమారులు ఎక్కడ? నలుడు, నీలుడు, సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు వీరందరు

ఎక్కడ? తన అన్నకే శత్రువైన విభీషణుడెక్కడ? ఈ రోజు తప్పక వారందరినీ నేను చంపెదను." అట్లు పలికి అతడు కఠినబాణములను సంధించి కోపముతో వదలగా అవి రెక్కలున్న సర్పములవలె వేగముగా పరుగెత్త సాగెను. వానరభల్లూకములు ఎక్కడవారక్కడ పారిపోయిరి. అతనిని ఎదురించు వారెవ్వరూ లేకుండిరి. తన సైన్యమంతయు వ్యాకులతను పొందుటను చూచి పవనపుత్రుడైన హనుమంతుడు అతి క్రోధముతో ఒక పర్వతమునెత్తి మేఘనాథునిపై విసిరివేసెను. పర్వతమును చూచి అతడు ఆకాశమునకు ఎగిరెను. రథము, సారథి, గుఱ్ఱములన్నియూ నష్టమాయెను. హనుమంతుడు అతనిని మాటిమాటికి యుద్ధమునకు ప్రేరేపించెను. కాని హనుమంతుని బలరహస్యము తెలుసును. కావున మేఘనాథుడు అతని దగ్గరకు రాలేదు. శ్రీరామచంద్రుని వద్దకు వచ్చి దుర్భాషలాడుచూ అనేక అస్త్రశస్త్రములు, ఆయుధములు ప్రయోగించెను. కాని శ్రీరామచంద్రుడు వాటినన్నింటినీ అవలీలగా ముక్కలు చేసెను. శ్రీరాముని బలము, ప్రతాపమును చూచి ఆ మూర్ఖుడు రకరకముల మాయలు పన్నెను. ఆకాశమునకు ఎగిరి వాడు నిప్పులవర్షము కురిపించెను. ఒకసారి భూమినుండి జలధారలు బయటకు చిమ్మెను. నానావిధ పిశాచములు నాట్యము చేయుచూ "చంపుడు, నరుకుడు" అని అరవసాగెను. ఒకసారి రాళ్లవర్షము కురిపించెను. మరొకసారి ధూళిని కురిపించెను. చీకటిని సృష్టించెను. ఈ మాయను చూచి వానరులు వ్యాకులులైయిరి. శ్రీరాముడు చిరునవ్వుతో ఒకేబాణముతో మాయనంతయూ తొలగించి తన కృపాదృష్టిని ప్రసరించెను. వారు మరల శక్తిసంపన్నులై రణభూమికి పరుగెత్తిరి.

శ్రీరాముని ఆజ్ఞను పొంది అంగదుడు మొదలగు వానరులతో గూడి లక్ష్మణుడు ధనుర్బాణములను తీసుకొని క్రుద్ధుడై బయలుదేరెను. అతని నేత్రములు ఎరుపెక్కి, వెడల్పు అయిన వక్షస్థలము, విశాలమైన భుజములతో హిమాలయ పర్వతమువలె గౌరవర్ణమును అతని శరీరము

గల ఇంకనూ ఎరుపెక్కెను. "శ్రీరామచంద్రునికి జయము" అని వానరులు రాక్షసులను ఎదురించిరి. విజయకాంక్షతో వారిపైబడి పిడికిళ్ళతో కాళ్ళతో తన్నిరి. పళ్లతో కొరికిరి. "కొట్టండి, చంపండి, పట్టుకోండి" మొదలగు అరుపులతో రణభూమి నిండిపోయెను. తలలు లేని మొండెములు వేగముగా అటునిటు పరుగెత్తసాగెను. రణభూమి రక్తముతో నిండిపోయెను. లక్ష్మణుడు, మేఘనాథుడు ఇద్దరూ యోధులే. వారు అత్యంత కృద్ధులై పరస్పరము ఎదుర్కొనిరి. మేఘనాథుడు మోసము, అధర్మము చేయసాగెను. లక్ష్మణుడు కోపగించి అతని రథమును భగ్నమొనర్చి, సారథిని కొట్టి క్రింద పడవేసెను. మేఘనాథునికి ప్రాణభయము విపరీతమాయెను. అపుడు వీరఘాతిని అని శక్తిని ప్రయోగించగా, అది లక్ష్మణుని వక్షమునకు తగిలెను. లక్ష్మణుడు మూర్ఛితుడాయెను. మేఘనాథుడు నిర్భయముగా అతని వద్దకు వచ్చెను. వేయిమంది రాక్షసయోధులు లక్ష్మణుని ఎత్తుకొనుటకు ప్రయత్నించిరి. కాని ఎత్తలేక సిగ్గుతో పోయిరి. సాయంసమయమగుటవలన రెండుపక్షముల సైన్యములు మరలిపోయెను.

## 7. లక్ష్మణుని మూర్ఛ

హనుమంతుడు లక్ష్మణుని తన భుజములపై మోసికొని వచ్చి శ్రీరాముని ముందుంచెను. తన తమ్ముని స్థితిని చూచి శ్రీరాముడత్యంత దుఃఖితుడాయెను. జాంబవంతుని సలహాపై హనుమంతుడు లంకలో నున్న సుషేణుడు అను వైద్యుని అతని ఇంటితో సహా తీసుకొని వచ్చెను. సుషేణుడు శ్రీరాముని చరణములకు నమస్కరించి ఒక పర్వతము పేరును దానిపై గల ఓషధి పేరును తెలిపి, "ఆంజనేయా! నీవు పోయి ఆ ఓషధిని తీసుకొని రమ్ము" అని పలికెను. శ్రీరాముని చరణకమలములను తన హృదయమున నుంచుకొని హనుమంతుడు బయలుదేరెను.

ఒక దూత రావణుని వద్దకు పోయి ఈ వృత్తాంతమునంతయు వినిపించెను. అతడు కాలనేమి వద్దకు పోయి విషయమంతయూ తెలిపి హనుమంతుని ప్రయత్నమును భగ్నమొనర్చుమని పలికెను. కాని, కాలనేమి నెత్తి బాదుకొనుచూ పలికెను: "ఇప్పుడు హనుమంతుని ఆపగలవాడు ఎవ్వడు? నీవు చూచుచుండగనే అతడు లంకను కాల్చలేదా? నీ అసత్య ప్రగల్భములు మాని శ్రీరాముని ఆరాధించి సుఖమును పొందుము." రావణుడు బెదిరించెను. కాలనేమి మనస్సులో "నేను శ్రీరాముని దూత చేతిలో చచ్చుటయే మేలు" అని భావించి వెళ్ళి మార్గములో మాయలు పన్నెను. ఒక సరోవరమును, మందిరమును, ఒక అందమైన వనమును నిర్మించెను. పవనపుత్రుడు ఆ ఆశ్రమమును చూచి ఇక్కడ మునిని అడిగి నీరు త్రాగిన అలసట దూరమగునని తలంచెను. కాలనేమి కపట సన్యాసి వేషములో అచట కూర్చొని శ్రీరాముని గుణములను గానము చేయుచుండెను. హనుమంతుని చూచి "సోదరా, రామరావణ యుద్ధము జరుగుచున్నది. నా జ్ఞానదృష్టిచే అంతయు చూచుచున్నాను. శ్రీరాముడే గెలుచును. చెరువులో స్నానము చేసి రమ్ము. నేను నీకు దీక్ష నిచ్చెదను" అని పలికెను. హనుమంతుడు నీటికి సరోవరములోనికి దిగగానే ఒక మొసలి అతని కాలు పట్టుకొనెను. హనుమంతుడు దానిని చంపివేసెను. అది దివ్య శరీరమును దాల్చి ఆకాశమార్గమున పోవుచు "ఓ వానరా! నీ దర్శనము వలన నాకు శాపవిముక్తి అయినది. వీడు మునికాడు, ఘోర రాక్షసుడు," అని పలికెను. పిదప హనుమంతుడు రాక్షసుని వద్దకు వచ్చి, "మునీశ్వరా, మొదట మీరు గురుదక్షిణ స్వీకరించండి, పిదప మంత్రోపదేశము చేయుడు" అని పలుకుచూ అతని తలచుట్టూ తోకను చుట్టి నేలకేసి కొట్టెను. కాలనేమి తన నిజస్వరూపమును దాల్చి "రామా – రామా" యనుచూ శ్వాస వదిలెను. హనుమంతుడు ప్రసన్నుడై పర్వతమును చూచెను. కాని ఓషధిని గుర్తించలేకపోయెను. అప్పుడు పర్వతమునే పెకలించుకొని

ఆకాశమార్గమున వచ్చుచూ అయోధ్యానగరముపైన పోవుచుండెను.

ఆకాశమున ఒక విశాలమైన స్వరూపమును భరతుడు చూచి అతడు ఒక రాక్షసుడు అయి ఉండవచ్చునని అనుమానించి శిరస్సులేని బాణమును వదిలెను. ఆ బాణము తగలగానే 'రామ – రామ' యనుచూ హనుమంతుడు మూర్ఛితుడై నేలపై బడెను. భరతుడు పరుగెత్తుకొని వచ్చి వికలుడైన హనుమంతుని చూచి మేల్కొల్పుటకు అనేక ప్రయత్నములు చేసెను. చివరకు రామనామ సంకీర్తన చేయుచూ "నాకు శ్రీరాముని చరణములయందు నిశ్చల భక్తియున్నచో, శ్రీరామచంద్రుడు నాపై ప్రసన్నుడైనచో, ఈ వానరుడు బాధనుండి ముక్తుడగుగాక!" అని పలికెను. ఆ మాటలు వినగానే హనుమంతుడు లేచి కూర్చొనెను. "అయోధ్యానాథుడైన శ్రీరామచంద్రునికి జయము జయము" అని పలికెను. భరతుడు హనుమంతుని హృదయమునకు హత్తుకొని శ్రీ సీతారామలక్ష్మణుల క్షేమసమాచారమును అడిగెను. హనుమంతుడు సంక్షిప్తముగా కథనంతయూ తెలిపెను. దానిని విని భరతుడు తాను శ్రీరాముని కార్యమునకు ఒక్కదానికి కూడా ఉపయోగపడలేదని పశ్చాత్తాపపడెను. పిదప ధైర్యము వహించి హనుమంతునితో పలికెను: "నాయనా! నీవక్కడికి చేరుటకు ఆలస్యము అగును. తెల్లవారినచో పని సఫలము కాదు. కావున పర్వతముతో సహా నీవు నా బాణము పైకి ఎక్కుము. నేను నిన్ను శ్రీరాముడున్న చోటికి చేర్చెదను." దానిని విని మొదట "నా బరువుతో ఈ బాణము ఎట్లు పోగలదు?" అని సందేహించిననూ శ్రీరామచంద్రుని ప్రభావమును తలచుకొని హనుమంతుడు భరతుని పాదములకు నమస్కరించి "ప్రభూ! మీ ప్రతాపమును నా హృదయములో నింపుకొని నేను వేగముగా పోగలను" అని పలికి బయలుదేరి వెళ్లెను.

అక్కడ లక్ష్మణుని చూచి శ్రీరాముడు సామాన్యమానవునివలె పలికెను: "అర్ధరాత్రి గడిచినది. హనుమంతుడు రాలేదు. నీవు

నన్నెప్పుడు దుఃఖితునిగా చూడలేకుంటివి. నా హితము కొరకు తల్లిదండ్రులను కూడా త్యజించితివి. వనములో చలి, ఎండ, గాలిని కూడా సహించితివి. సోదరా! ఇప్పుడు ఆ ప్రేమ ఏమయినది? నా వ్యాకుల వచనములు విని కూడా నీవేల లేవవు? జగత్తులో నీవంటి సోదరులు లభించుట కష్టము. నీవు నా హితైషివని తెలిసి మాత సుమిత్ర నీ చేయి పట్టుకొని నాకు అప్పగించినది. ఇప్పుడు పోయి నేను ఆమెకు ఏమి సమాధానము చెప్పవలెను?" అట్లు భక్తులు స్మరించగానే వారి విచారములను తొలగించు శ్రీరాముడు అనేక విధములుగా విచారించెను. అతని కన్నులలో నీరు నిండెను. శ్రీరామచంద్రుని దుఃఖమును చూచి వానరసమూహములు వికలమాయెను. అప్పుడే హనుమంతుడు వచ్చి చేరెను. శ్రీరాముడు హర్షితుడై హనుమంతుని ఆలింగనము చేసుకొనెను. వైద్యుడు సుషేణుడు వెంటనే చికిత్స చేసెను. లక్ష్మణుడు సంతోషముతో లేచి కూర్చొనెను. శ్రీరామచంద్రప్రభువు తమ్ముని తన హృదయమునకు హత్తుకొనెను. భల్లూకములు, వానరములు సంతోషించినవి. పిదప హనుమంతుడు వైద్యుని ఏవిధముగా లంకనుండి తీసుకొని వచ్చియుండెనో అదే విధముగా చేర్చెను.

## 8. కుంభకర్ణ వధ

ఆ సమాచారమును విని రావణుడు అతి విషాదముతో తన తలను బాదుకొనెను. మిక్కిలి వ్యాకులుడై కుంభకర్ణుని వద్దకు పోయి వివిధోపాయములచే అతని నిద్రనుండి మేలుకొలిపెను. లేవగానే కుంభకర్ణుడు అడిగెను: "సోదరా! నీ ముఖము వాడిపోయినది, ఏల?" రావణుడు తాను ఏవిధముగా సీతను అపహరించినది మున్నగు విషయములను తెలిపి యుద్ధములో గొప్ప రాక్షసవీరులందరూ మరణించిన విషయమును తెలిపెను. రావణుని వచనములను విని

కుంభకర్ణుడు పలికెను: "అరే మూర్ఖుడా! జగన్మాత అయిన జానకీదేవిని అపహరించి, ఇప్పుడు నీకు మేలు జరుగునని భావించుచున్నావా? నీవు చేసినది మంచిపని కాదు. ఇప్పుడు వచ్చి నన్ను ఏల మేలుకొలిపితివి? ఇప్పటికయినా అహంకారము వదలి శ్రీరాముని భజింపుము. హనుమంతుని వంటి సేవకుడు గల శ్రీరఘునాథుడు ఒక సామాన్య మానవుడని ఎట్లు తలచితివి? మొదటనే నీవు నాకు ఈ సంగతి వినిపించియుండిన నారదముని నాకు ఉపదేశించిన జ్ఞానమును నీకు వినిపించి యుండెడివాడను. కాని ఇప్పుడు సమయము మించిపోయినది. చివరిసారిగా నన్ను ఆలింగనమొనర్చుకొనుము. నేను పోయి శ్యామసుందర శరీరుడైన శ్రీరాముని దర్శించి నా కన్నులను సఫలమొనర్చుకొందును." పిదప కుంభకర్ణుడు అనేక దున్నపోతులను తిని, కోటి కడవల మదిరను త్రాగి, గర్జించుచూ రణోత్సాహముతో సేనను కూడా వెంటతీసుకోకుండా బయలుదేరెను. కుంభకర్ణుని చూచి విభీషణుడు ముందుకు వచ్చి ప్రణమిల్లెను. కుంభకర్ణుడు అతనిని లేపి హృదయమునకు హత్తుకొని, శ్రీరఘునాథుని భక్తునిగా నెఱింగి సంతసించెను. విభీషణుడు పలికెను: "సోదరా! పరమ కళ్యాణకరమయిన సలహా చెప్పినందున రావణుడు నన్ను కాలితో తన్నెను. ఆ బాధతో నేను శ్రీరాముని చేరగా ప్రభువు నన్ను దీనునిగా నెఱింగి ఆదరించెను." కుంభకర్ణుడు పలికెను: "సోదరా! రావణుడు కాలుని వశమయినాడు. అతడు మరణించుట తథ్యము. నీవు ధన్యుడవు. శ్రీరాముని భజించి మన వంశ ప్రతిష్ఠను ఎక్కువ చేసితివి. నేనయితే కాలుని వశమయినాను. నాకు తనవారు పరాయివారు తెలియుటలేదు. నీ విప్పుడు పొమ్ము." కుంభకర్ణుని వచనములు విని విభీషణుడు ప్రభువద్దకు వచ్చి "ప్రభూ! పర్వతాకార శరీరుడు, రణధీరుడయిన కుంభకర్ణుడు వచ్చుచున్నాడు" అని పలికెను. ఆ మాటలు వినగానే వానరులు హర్షధ్వనులతో వృక్షములను, పర్వతములను పెకలించి అతనిపై వేయసాగిరి. కాని

అతని మనస్సుగాని శరీరముగాని ఏ మాత్రము చలించలేదు. అప్పుడు పవనపుత్రుడు అతనికి ముష్టిఘాతము చేసెను. అతడు నేలపైపడి తిరిగిలేచి హనుమంతుని కొట్టెను. దానిచే నతడు గిరగిర తిరిగి నేలపై పడెను. నలుని, నీలుని ఇతర యోధులను ఒకరితర్వాత ఒకరిని పడగొట్టెను. కపిసేన అంతయూ తోకముడిచెను. భయభీతులై ఎవ్వరూ అతనిని ఎదుర్కొనుటకు ముందుకు రాలేదు. సుగ్రీవుడు, అంగదుడు మొదలగువారినందరినీ మూర్ఛితులుగా చేసి కుంభకర్ణుడు వానరరాజైన సుగ్రీవుని చంకలో నిరికించుకొని పోయెను. మూర్ఛనుండి లేచిన హనుమంతుడు సుగ్రీవుని వెదకెను. ఇంతలోగా సుగ్రీవుడు కూడా మూర్ఛనుండి తేరుకొని కుంభకర్ణుని చంకలోనుంచి జారి అతని చెవులను, ముక్కును కొరికెను. పిదప శీఘ్రముగా శ్రీరాముని వద్దకు వచ్చి "ప్రభువునకు జయము జయము" అని పలికెను. తన ముక్కు చెవులు కొరకబడినవి అని తెలుసుకొని కుంభకర్ణుడు కోపముతో భయంకరాకారముతో వచ్చెను. తర్వాత కోట్లాదిమంది వానరులను ఒకరి తర్వాత ఒకరిని పట్టుకొని భక్షించెను. అనేకమందిని చేతులతో నలిపి మట్టిలో కలిపెను. పొట్టలోనికి పోయిన వానరములు భల్లూకములు అతని నోరు ముక్కు చెవులనుండి పరుగెత్తసాగిరి. యోధులందరూ వెన్నుచూపి పరుగెత్తిరి. కుంభకర్ణుడు తమ సైన్యమును చెల్లాచెదరు చేసినాడని విని శ్రీరామచంద్రుడు పలికెను: "సుగ్రీవా, విభీషణా, లక్ష్మణా! వినుడు. మీరు మన సేనలను సమాయత్తపరుచుడు. నేను ఈ దుష్టుని, వాని సైన్యబలమును చూచెదను."

చేతిలో శార్ఙ్గమను ధనువును, నడుమునకు తూణీరమును ధరించి శ్రీరఘునాథుడు శత్రుసేనను నాశనమొనర్చుటకు బయలుదేరెను. ప్రభువు మొదట ధనుష్టంకారము చేసెను. దాని ఘోరధ్వనితో శత్రుసైనికులు బధిరులు అయిరి. సత్యప్రతిజ్ఞుడైన శ్రీరాముడు ఒక లక్ష బాణములను వేసెను. అవి రెక్కలున్న కాల సర్పములవలె అన్ని

దిశలకు పోయెను. వాటి శక్తికి ఘోరపిశాచయోధులు ముక్కలు ముక్కలై నేలపై పడిరి. రాక్షసులు ఆ బాణములను చూడగానే పరుగెత్తి పోవుచుండిరి. ఒక్క క్షణములో భయానక రాక్షసులను ముక్కలు చేసి బాణములన్నియూ తిరిగి వచ్చి శ్రీరాముని చేరెను. కుంభకర్ణుడు "నేను చూచుచుండగనే శ్రీరాముడు ఒక్క క్షణములో రాక్షససేనను సంహరించెను గదా!" అని ఆశ్చర్యపడుచూ అతి కృద్ధుడై గంభీర సింహనాదము చేసెను. ఒక పర్వతమును పెకలించి వానరులపైకి విసరెను. శ్రీరఘునాథుడు దానిని ముక్కలు చేసెను. పిదప అతి కృద్ధుడై శ్రీరామచంద్రుడు అనేక బాణములు వదలగా అవి కుంభకర్ణుని శరీరములోనికి గుచ్చుకొని మరొకవైపునుండి బయటికి వచ్చెను. నల్లని శరీరమునుండి నెత్తురు ప్రవహించుచుండెను. అయినప్పటికీ ఘోరగర్జనతో కుంభకర్ణుడు వానరులను పట్టుకొని నేలకు కొట్టుచుండెను. వారు ఆర్తనాదములతో పరుగెత్తుచూ "ఓ కృపాసాగరా! ప్రణతార్తిహరా! శ్రీరామా రక్షింపుము" అని పలుకుచూ పరుగెత్తిరి. వారి దీనాలాపములను విని శ్రీరామచంద్రుడు నూరు బాణములను సంధించి వదలగా అవి కుంభకర్ణుని శరీరమున గ్రుచ్చుకొనెను. వాడు కృద్ధుడై ఒక పర్వతమును లేపెను. రఘునాథుడు వాని భుజములను నరికెను. వాడు అతి ఘోరమైన కేకవేసి నోరు తెరుచుకొని పరుగెత్తి వచ్చుచుండగా శ్రీరామచంద్రుడు వాని ముఖమునిండా బాణములతో నింపెను. అయిననూ వాడు చావలేదు. అప్పుడు ప్రభువు క్రోధముతో ఒక తీవ్రమయిన బాణమును తీసుకొని వాని తలను మొండెమునుండి వేరు చేసెను. ఆ తల పోయి దశాననుని ముందు పడెను. దాని చూచి రావణుడు హతాశుడు అయ్యెను. తలలేని మొండెము పరుగెత్తెను. దాని బరువునకు భూమి కృంగసాగెను. ప్రభువు ఆ మొండెమును రెండు ఖండములు చేయగా వానరభల్లూకములను, నిశాచరులను కూడా అణచుచూ రెండు పర్వతములు పడినట్లు పడెను. వానినుండి ఒక దివ్యతేజస్సు

శ్రీరాముని ముఖమున ప్రవేశించెను. అది చూచి దేవతలు, మునులు ఆశ్చర్యచకితులై పుష్పములను వర్షించి ప్రార్థనలు చేసిపోయిరి. దేవఋషి నారదుడు వీరరసము మూర్తీభవించిన శ్రీరాముని పొగడుచూ గానము చేసెను. ప్రభువు ప్రసన్నుడాయెను. ఆలస్యము చేయకుండా ఆ దుష్టరావణుని కూడా సంహరించుడు" అని పలికి నారదుడు వెళ్ళిపోయెను. అతులిత బలధాముడయిన శ్రీరాముడు రణభూమిలో దివ్యతేజస్సుతో శోభిల్లెను. సాయంసమమగుటవలన ఉభయ సేనలు మరలిపోయెను. ఆ రోజు యుద్ధములో యోధులు బాగా అలసిపోయిరి. కాని శ్రీరాముని కృప వలన వానర సేన బలమధికమాయెను. రావణుడు విలపించుచూ కుంభకర్ణుని శిరస్సును గుండెకు హత్తుకొనెను. స్త్రీలు కుంభకర్ణుని తేజస్సును వర్ణించుచూ ఏడవసాగిరి. అదే సమయమున మేఘనాథుడు వచ్చి ధైర్యము గొలుపుచూ రావణునికి నచ్చచెప్పెను. మరియు నిట్లు పలికెను: "రేపు నా పరాక్రమమును చూడుడు. నా యిష్టదైవము నుండి ఏ బలమును, రథమును పొందినానో వాటిని మీకు ఇంతవరకు చూపలేదు." ఆ విధముగా ప్రగల్భములు పలుకుచుండగా తెల్లవారెను.

## 9. మేఘనాథవధ

మరురోజు లంక నాలుగు ద్వారములవద్ద వానరసైన్యములు సమీకరించబడినవి. ఒక వైపు వానరభల్లూకములు, మరొకవైపు రాక్షసులు తమ విజయమునకై పోరాడుచుండిరి. మేఘనాథుడు తన యిష్టదైవమునుండి పొందిన మాయారథమునెక్కి ఆకాశమునకు ఎగిరి అట్టహాసముతో గర్జించెను. దానిని విని వానర సేన భయగ్రస్తులైరి. మేఘ నాథుడు దుర్గమమయిన లోయలను, మార్గములను, పర్వతగుహలను బాణములతో నింపివేసెను. ఎటుపోవలెనో తోచక వానరులు మిక్కిలి వ్యాకులత నొందిరి. మేఘనాథుడు హనుమంతుని, అంగదుని, నలుడు,

నీలుడు మొదలగు బలవంతులనందరినీ ప్రభావహీనులుగా చేసెను. పిదప లక్ష్మణుని, సుగ్రీవుని, విభీషణుని బాణములతో గాయపరచెను. పిదప అతడు రఘునాథునితో యుద్ధము చేయసాగెను. స్వతంత్రుడు, అనంతుడు, నిర్వికారుడు అయిన శ్రీరాముడు యుద్ధమునకు శోభ నిచ్చుటకై తానే నాగపాశబద్ధుడాయెను. అతని దశను చూచి దేవతలు భయపడిరి. మేఘనాథుడు వానరసైన్యమును వ్యాకులపరుచుచుండగా జాంబవంతుడు అతనిని ఎదుర్కొని యుద్ధమునకు ప్రేరేపించెను. మేఘనాథుడు ప్రయోగించిన దేదీప్యమానమగు త్రిశూలమును చేతిలో గైకొని అతని రొమ్ముపై కొట్టెను. మేఘనాథుడు గిరగిరా తిరిగి నేలపై వ్రాలెను. జాంబవంతుడు అతని కాలిని పట్టుకొని గిరగిర తిప్పి నేలకేసి కొట్టి తన బలమును ప్రదర్శించెను. వరదానము వలన అతడు కొట్టబడిననూ చావలేదు. అప్పుడు జాంబవంతుడు అతని కాలు పట్టుకొని లంకపై విసిరివేసెను. గరుత్మంతుడు మాయరచిత సర్పములన్నింటినీ భక్షించెను. వానరులు మాయావిముక్తులై ప్రసన్నులైరి. రాక్షసులు వ్యాకులతతో పారిపోయి కోటపైకి ఎక్కిరి.

మేఘనాథుడు మూర్ఛనుండి లేవగానే తండ్రిని చూచి సిగ్గుపడెను. నేను అజేయ యజ్ఞము చేసెదనని సంకల్పించుకొని ఒక పర్వత గుహలోనికి పోయి యజ్ఞము నారంభించెను. ఇక్కడ శ్రీరాముని సైన్యములో విభీషణుడు ఆలోచించి సలహానిచ్చెను. "ప్రభూ! దేవతలను కష్టపెట్టు దుష్టుడు, మేఘనాథుడు మాయావి, అపావన యజ్ఞమును చేయుచున్నాడు. ఒకవేళ ఆ యజ్ఞము సిద్ధించినచో అతనిని జయించుట కష్టము." ఆ మాటలు విని రఘునాథుడు వానరులను పిలిచి పలికెను: "సోదరులారా! మీరందరూ లక్ష్మణునితోపాటు పోయి ఆ యజ్ఞమును ధ్వంసము చేయుడు. లక్ష్మణా! నీ బలము, బుద్ధి ఉపాయములచే ఆ రాక్షసుని సంహరించుము. జాంబవంతా! సుగ్రీవా! విభీషణా! మీరు సేనాసహితముగా తోడుగా నుండుడు." శ్రీరాముని

ఆజ్ఞ కాగానే రణధీరుడయిన లక్ష్మణుడు ధనుర్బాణములను ధరించి శ్రీరాముని ప్రతాపమును స్మరించి, రఘునాథుని చరణములకు మ్రొక్కి, ఉత్తమవానర యోధులు వెంటరాగా రణభూమికి ఏగెను. వానరులు పోయి చూడగానే మేఘనాథుడు కూర్చొని రక్తమును, దున్నపోతులను ఆహూతి ఇచ్చుచుండెను. వానరులు వాని యజ్ఞమును ధ్వంసమును చేసిరి. అయినప్పటికీ వాడు లేవలేదు. వానిని వ్యంగ్యముగా పొగడిరి. వాడు లేవలేదు. అప్పుడు వారు వాని వెంట్రుకలు పట్టుకొని కాలితో తన్నుచూ పరుగెత్తి పోయిరి. అతడు త్రిశూలముతో పరుగెత్తగా వారు పరుగెత్తుచూ లక్ష్మణుడున్న చోటుకు వచ్చిరి. అత్యంత క్రోధావేశముతో మేఘనాథుడు గర్జించెను. హనుమంతుడు, అంగదుడు వానిని ఎదురించగా వారిని త్రిశూలముతో కొట్టి నేలపై పడగొట్టెను. పిదప లక్ష్మణునిపై తన భయంకర త్రిశూలమును వదిలెను. లక్ష్మణుడు దానిని రెండుముక్కలు చేసెను. హనుమంతుడు, అంగదుడు లేచి వానిని కొట్టసాగిరి. అయిననూ వానికి దెబ్బతగలలేదు. మృత్యువువలె వచ్చుచున్న వానిని చూచి లక్ష్మణుడు వానిపై తీక్షణ బాణములు కురిపించెను. వాడు వెంటనే అంతర్ధానమై వివిధ రూపములు ధరించి యుద్ధము చేయసాగెను. ఒకసారి ప్రకటితమగును. మరొకసారి దాగుకొనును. శత్రువు అజేయుడు అని తలచి వానరులు భయపడిరి. అప్పుడు లక్ష్మణుడు కోపోద్రిక్తుడై "ఈ పాపితో ఆటలు చాలును. వీనిని ఇప్పుడు చంపుటయే యుక్తము" అని మనస్సులో తలచి శ్రీరాముని శక్తిని తలంచుకొని బాణమును సంధించెను. బాణము వదలగానే అది నేరుగా పోయి వాని రొమ్ములో గుచ్చుకొనెను.. "రాముడెక్కడ? లక్ష్మణుడు ఎక్కడ?" అనుచూ వాడు ప్రాణములు వదిలెను. అంగదుడు హనుమంతుడు పలుకసాగిరి: "నీ తల్లి ధన్యురాలు, నీవు లక్ష్మణుని చేతిలో మరణించినావు. మరణసమయమున రామలక్ష్మణుల పేర్లను ఉచ్చరించితివి." ఎట్టి శ్రమ లేకుండగనే హనుమంతుడు అతనిని

మోసుకొని లంకా ద్వారము వద్దనుంచి తిరిగి వచ్చెను. మేఘనాథుని మరణ వార్తను విని దేవతలు, గంధర్వులు విమానములు ఎక్కి ఆకాశమార్గమున వచ్చిరి. వారు పూలను వర్షించి, నగారాలు మ్రోగించి, శ్రీరఘునాథుని కీర్తిని స్తుతించిరి. లక్ష్మణుడు శ్రీరామచంద్రుని వద్దకు వచ్చెను. రావణుడు తన కుమారుని మరణ వార్తను వినగానే మూర్ఛితుడాయెను. మందోదరి అనేక విధముల విలపించెను. లంకానివాసులందరూ శోకవ్యాకులులై రావణుని తిట్టసాగిరి. అప్పుడు రావణుడు స్త్రీలకు అనేక విధములు నచ్చచెప్పెను. ఆ రాత్రి గడిచెను, తెల్లవారెను.

## 10. రామరావణ యుద్ధము

భల్లూక వానరములు మరల నాలుగు ద్వారముల వద్ద చేరిరి. రావణుడు తన వీర యోధులను పిలిచి పలికెను: "యుద్ధములో శత్రుసమ్ముఖమున ఎవరి మనస్సు ఊగిసలాడునో వారు ఇప్పుడే పారిపోవుట మంచిది. నేను నా భుజబలమును నమ్మి వైరమును పెంచుకున్నాను. మనపై దండెత్తిన శత్రువుకు తగిన సమాధానమును నేను యివ్వగలను." అట్లు పలికి రావణుడు వాయుసమానమైన తన రథమును సిద్ధపరచెను. అనేక అపశకునములు కలిగిననూ వాటిని లెక్కచేయలేదు. అపారమైన నిశాచర సైన్యము ముందుకు సాగెను. చతురంగబలము మేఘములవలె వడిగా కదలుచుండెను. వివిధ వర్ణములుగల ధ్వజపతాకములుండెను. వీరులు చిత్రవిచిత్రవర్ణములు గల దుస్తులు ధరించిరి. ఆ సేన నడుచుచుండగా దిగ్గజములే తుళ్లిపడెను. పర్వతములు కంపించెను. సముద్రము అల్లకల్లోలమాయెను. సేన నడిచినప్పుడు లేచిన ధూళి సూర్యుని కప్పివేసెను. అకస్మాత్తుగా గాలి ఆగిపోయెను. పృథ్వి వ్యాకులత నొందెను. డోలు, నగారాలు భయంకర ధ్వనులతో మ్రోగించబడెను. వీరులందరు సింహనాదము చేయుచూ

తమ బలపౌరుషములను ప్రకటించుచుండిరి. అప్పుడు దశాననుడు తన సేనను సంబోధించుచూ పలికెను: "ఉత్తమ యోధులారా, మీరు భల్లూక వానరములను మర్దించి నలిపి వేయండి. నేనా యిద్దరు రాజకుమారులను చంపెదను." అట్లు పలికి అతడు తన సైన్యమును ముందుకు నడిపెను. ఆ వార్త తెలియగనే వానరులు శ్రీరాముని సహాయము అర్థించుచూ పరుగెత్తి వచ్చిరి. రెండు పక్షములవారు జయజయధ్వానములు చేయుచూ పోరాడసాగిరి.

రావణుడు రథముపైన, శ్రీరాముడు విరథుడుగా నుండుటను చూచి విభీషణుడు ప్రేమాధిక్యతవలన భయపడసాగెను. శ్రీరాముని పాదములకు నమస్కరించి పలుకసాగెను: "ప్రభూ! మీకు రథము లేదు. శరీరమును రక్షించు కవచము లేదు. కాళ్లకు పాదరక్షలు కూడా లేవు వీరుడయిన రావణుని ఎట్లు జయించగలరు?" కృపాళువు అయిన శ్రీరాముడు పలికెను. "మిత్రమా! వినుము. విజయమును పొందుటకు అవసరమైన రథము మరొకటి ఉన్నది. పరాక్రమము, ధైర్యము ఆ రథానికి చక్రాలు. సత్యశీల సదాచారములు దాని ధ్వజపతాకములు. బలము, వివేకము, దమము, పరోపకారము దాని గుఱ్ఱములు. క్షమ, దయ సమతాసూత్రములతో అవి రథమునకు కట్టబడును. భగవత్ భజన రథసారథి. వైరాగ్యమే డాలు, సంతోషమే ఖడ్గము, దానము పరశు, బుద్ధి ప్రచండశక్తి, ఉత్తమ విజ్ఞానమే ధనుస్సు, స్థిరమైన మనస్సు తూణీరము, శమము, యమ నియమములు బాణములు, బ్రాహ్మణుల గురువుల పూజ అభేద్యమయిన కవచము. మిత్రుడా! ఎవని వద్ద ఇట్టి ధర్మయుత రథము గలదో అతనిని జయించుటకు శత్రువులు ఎవ్వరూ ఉండరు. అట్టి బలవంతులు సంసారమను గొప్ప ప్రబల శత్రువును కూడా పరాజితునిగా చేయగలరు." శ్రీరామచంద్రప్రభువు వచనములు విని విభీషణుడు ప్రసన్నుడాయెను. బ్రహ్మాది దేవతలు, సిద్ధులు, మునులు ఆకసము నుండి యుద్ధదృశ్యమును చూచుచుండిరి.

ఇరు పక్షముల వీరయోధులు రణోన్మత్తులై ఉండిరి. వారు పరస్పరము యుద్ధమునకు ప్రేరేపించుచూ ఒకరిని ఒకరు అణచివేయుచూ నేలపై పడగొట్టుచుండిరి. తలలను నరికి వాటినే ఆయుధములుగా చేసి కొట్టుచుండిరి. పొట్టలను చీలుచుండిరి. యోధుల కాళ్లను పట్టుకొని నేలకేసి కొట్టుచుండిరి. భల్లూకములు నిశాచరులను చంపి నేలలో పూడ్చి పైన ఇసుకతో కప్పుచుండిరి. కృద్ధవానరులు బలశాలురైన రాక్షస యోధులను అణచివేయుచుండిరి. చెంపలు వాయించుచుండిరి. పళ్లతో కొరుకుచుండిరి. కాళ్ళక్రింద పడద్రోసి త్రొక్కుచుండిరి. గోళ్లతో రొమ్ములు చీల్చి ప్రేగులను తీసి మెడలో వేసికొనుచుండిరి. "పట్టుకో, చంపు, కొరుకు, అణచివేయి" మొదలగు శబ్దములు పృథ్వి ఆకాశములలో వ్యాపించెను.

తన సైన్యము భయపడుట చూచి తన ఇరవై భుజములందు పది ధనుస్సులను ధరించి రథముపై నెక్కి గర్వముతో "తిరిగి రండి, తిరిగి రండి" అనుచూ అత్యంత కృద్ధుడయిన దశకంఠుడు ముందుకు సాగెను. వానరులు హూంకారము చేయుచూ వృక్షములను రాళ్లను, పర్వతములను ఒక్కసారిగా అతనిపై విసరిరి. వజ్రసమానమైన అతని దేహమునకు తగలగానే ఆ పర్వతములు ముక్కలు ముక్కలు ఆయెను. రణోన్మత్తుడయిన రావణుడు రథమును నిల్పి కదలకుండా నిలబడెను. శత్రువులపై బడి ఇటునటు తిరుగుచూ వానరయోధులను నలిపి వేసెను. వానరభల్లూకములు "అంగదా, ఆంజనేయా, రఘునాథా! రక్షింపుడు. కాలునివలె యీ దుష్టుడు మమ్ములను భక్షించుచున్నాడు" అని పలికిరి. రావణుడు పది ధనుస్సులపై అనేక బాణములను సంధించి వదిలెను. అవి దిశదిశలందు వ్యాపించెను. తన సైన్యములు వికలమగుట చూచి లక్ష్మణుడు చేతిలో ధనుర్బాణములను తీసుకొని శ్రీరాముని చరణములకు మ్రొక్కి బయలుదేరెను. సమీపమునకు పోయి "అరే, దుష్టుడా! వానరభల్లూకములను ఏల కొట్టెదవు? నన్ను చూడుము. నేను నీ పాలిట మృత్యువును" అని పలికెను.

రావణుడు పలికెను: "అరే! నా పుత్రుని వధించినవాడా! నేను నిన్నే వెదకుచుంటిని. నేడు నిన్ను చంపి నా మనస్సుకు ఊరట కలిగించెదను." అట్లు పలికి అతడు ప్రచండమయిన బాణములను కురిపించెను. లక్ష్మణుడు ఆ బాణములన్నింటిని ముక్కలుగా చేసెను. పిదప తన బాణములతో రావణుని కొట్టెను. రథమును ముక్కలు చేసి సారథిని చంపెను. లక్ష్మణుని బాణములు రావణుని శిరస్సులలోను, రొమ్ములలోను దూరెను. అతడు స్పృహ కోల్పోయి నేలపై పడెను. మూర్ఛనుండి లేచిన తర్వాత రావణుడు బ్రహ్మ తన కిచ్చిన శక్తిని వదిలెను. ఆ శక్తి నేరుగా వెళ్ళి లక్ష్మణుని రొమ్ములో గ్రుచ్చుకొనెను. అతడు నేల కూలెను. క్రింద పడిన లక్ష్మణుని చూచి పవనసుతుడు కఠోర వచనములు పలుకుచూ పరుగెత్తెను. కాని రావణుడు అతనికి భయంకరమైన ముష్టిప్రహారమును ఇచ్చెను. హనుమంతుడు మోకాళ్ళమీద కూర్చొని క్రోధముతో లేచి రావణునికి ముష్టిఘాతమును యిచ్చెను. దానితో రావణుడు మూర్ఛపోయెను. హనుమంతుడు లక్ష్మణుని లేపుకొని శ్రీరాముని వద్దకు పోయెను. రావణుడు ఆ దృశ్యమును చూచి ఆశ్చర్యమునొందెను. శ్రీరాముడు లేచి కూర్చొని ధనుర్బాణములు తీసుకొని శత్రువును ఎదిరించెను. రావణుని రథమును ముక్కలు చేసి సారథిని చంపెను. నూరు బాణములతో రావణుని రొమ్ములను చీల్చెను. దానితో నతడు వ్యాకులుడై నేలపై బడెను. వేరే సారథి అతనిని వెంటనే రథములో కూర్చుండబెట్టుకొని లంకకు తీసుకొనిపోయెను. ప్రతాపశాలి లక్ష్మణుడు శ్రీరాముని పాదములకు ప్రణమిల్లెను.

## 11. రావణ సంహారము

మూర్ఛనుండి లేచిన రావణుడు ఒక యజ్ఞమును చేయసాగెను. ఆ సంగతిని విభీషణుడు వెంటనే శ్రీరామచంద్రునికి తెలిపెను.

యజ్ఞమును భంగము చేయుటకు హనుమంతుడు, అంగదుడు మొదలగు వీరయోధులను శ్రీరాముడు పంపెను. వారందరూ అవలీలగా రావణుని భవనమును ప్రవేశించి ఇట్లు పలికిరి: "అరే, లజ్జాహీనుడా! రణభూమినుండి పారిపోయివచ్చి ఇక్కడ ధ్యానము చేయుచున్నావా?" అట్లు పలుకుచూ కాళ్ళతో తన్నిరి. పండ్లతో కొరికిరి. అయిననూ రావణుడు లేవలేదు. అప్పుడు వానరులు స్త్రీలను కొప్పుబట్టుకొని బయటికి యీడ్చుకొని రాగా వారు అతిదీనముగా విలపించసాగిరి. అప్పుడు రావణుడు క్రుద్ధుడై వానరుల కాళ్ళు పట్టుకొని నేలకేసి కొట్టసాగెను. ఈ లోగా వానరులు వాని యజ్ఞమును ధ్వంసము చేసిరి. అది చూచి రావణుని ధైర్యము సడలెను. క్రోధాగ్నిలో మండుచూ తన జీవితముపై ఆశ వదలుకొనెను. యజ్ఞము ధ్వంసమొనర్చిన పిదప వానరులు శ్రీరఘునాథుని వద్దకు వచ్చిరి. రావణుడు మరల బయలుదేరి చతురంగబలముతో వచ్చెను. ఆలోగా దేవతలందరూ వచ్చి శ్రీరాముని ప్రార్థించిరి. "శ్రీరామా! ఇతడు మమ్ములను ఎక్కువగా పీడించినాడు. వీనిని ఉపేక్షించవలదు. జానకీదేవి మిగుల దుఃఖితురాలై ఉన్నది." దేవతల వచనములు విని శ్రీరామచంద్ర ప్రభువు చిరునవ్వుతో లేచి తన బాణములను సిద్ధపరచెను. జటా జూటమును సవరించుకొనెను. ఎఱ్ఱని నేత్రములు, మేఘశ్యామల శరీరము లోకములనేత్రములకు ఆనందము కలిగించెను. నడుమునకు తూణీరము, చేతిలో శార్ఙ్గధనుస్సు, పరిపుష్టములైన భుజదండములు, మనోహరమైన వెడల్పైన రొమ్ముపై పదచిహ్నములు శోభిల్లెను. దేవతలు ప్రసన్నులై జయజయధ్వానములు చేయుచూ పూలవర్షము కురిపించిరి.

ఆలోగా ఘనమైన నిశాచరసైన్యము వానరులతో పోరాడసాగిరి. వానర యోధులు ప్రళయకాల మేఘముల వలె వారిని ఎదుర్కొనిరి. అనేక కృపాణములు, కత్తులు దశదిశలందు మెరయుచుండెను. గజతురగ శబ్దములు మేఘముల గర్జనలవలె నుండెను. వానరుల తోకలు

ఆకాశమును కప్పివేసి ఇంద్రధనుస్సులవలె శోభిల్లెను. పర్వతముల ప్రహారములు వజ్రపాతమువలె నుండెను. శ్రీరఘునాథుడు కృద్ధుడై బాణప్రవాహములు వదిలెను. అవి నిశాచరసేనను గాయపరచెను. వారిశరీరమునుండి రక్తము ప్రవహించగా వ్యాకులులై నేలకు ఒరిగిరి. తలలు లేని మొండెములు పరుగెత్తుచుండెను. ప్రేతపిశాచములు వికటాట్టహాసము చేయుచుండెను. శ్రీరాముని బాణసమూహముచే కొట్టబడిన వారందరూ యుద్ధభూమిలో శాశ్వతముగా నిద్రించిరి. రావణుడు తన మనస్సులో విచారించెను. "రాక్షసులందరూ సర్వనాశనమైరి. నేనొక్కడినే జీవించియున్నాను. వానరభల్లూకములు చాలాయున్నవి. కావున ఇప్పుడు మాయను రచించి పోరాడెదను." అంతలో శ్రీరామచంద్రప్రభువు నేలపై నిలుచుండుటను చూచి ఇంద్రుని పనుపున సారథి మాతలి ఒక దివ్యమయిన తేజోమయమయిన రథమును తెచ్చెను. శ్రీరాముడు రథారూఢుడై యుద్ధము చేయసాగెను. రావణుడు తన మాయలను విస్తరింపచేసెను. శ్రీరఘువీరుని ఆ మాయలేమియూ చేయజాలకపోయెను. లక్ష్మణుడు, వానరులు ఆ మాయను నిజమని నమ్మిరి. వానరులు నిశాచరసైన్యములో అనేకమంది రామలక్ష్మణులను చూచి భయభీతులయిరి. ఎక్కడివార క్కడ నిలబడిపోయిరి. అయోధ్యాపతి నవ్వి ధనుస్సుపై బాణమును సంధించి క్షణములో మాయను హరించెను. సమస్తవానరసేన ప్రసన్నమాయెను. పిదప అందరివైపు చూసి శ్రీరాముడు గంభీరముగా పలికెను: "మీరు వీరులందరు చాలా అలసిపోయినారు కావున ఇప్పుడు నాకూ రావణునికీ మధ్య ద్వంద్వయుద్ధమును చూడుడు."

ఆ విధముగా పలికి శ్రీరఘునాథుడు మనస్సులోనే బ్రాహ్మణ చరణములకు ప్రణమిల్లి రథమును ముందుకు పోనిచ్చెను. అప్పుడు లంకాధిపతి రావణుడు క్రోధముచే మండుచూ ముందుకు వచ్చి పలికెను: "అరే తపస్వీ! వినుము. నీవు యుద్ధములో గెలిచిన

యోధులవంటివాడను నేను కాను. నా పేరు రావణుడు. నా యశస్సు జగద్విదితము. దిక్పాలకులు సైతము నాకు బందీలుగా నున్నారు. నీవు నిశాచరవీరులను కుంభకర్ణమేఘనాధులను సంహరించితివి. ఈ రోజు నీవు యుద్ధమునుండి పారిపోకుండా నిలబడితే వారి కక్ష అంతయు తీర్చుకొందును." రావణుని దుర్భాషణములు విని కృపాసాగరుడు శ్రీరాముడు నవ్వి వజ్రసమానమైన బాణములను వదలసాగెను. అవి దశదిశలు నిండెను. శ్రీరఘునాథుడు ఆగ్నేయ అస్త్రమును వదలగా అది రావణని బాణములన్నింటినీ క్షణములో కాల్చి భస్మము చేసెను. అప్పుడు అతడు లజ్జితుడై తీక్ష్ణమైన ఒక శక్తిని వదిలెను. కాని శ్రీరాముడు దానిని తన బాణముతో తిరిగి పంపెను. రావణుడు కోట్ల కొలది చక్రములు, త్రిశూలములు, బాణములు పంపిననూ అవన్నియూ నిష్ఫలములు ఆయెను. పిమ్మట అతడు నూరు బాణములతో శ్రీరాముని సారథిని కొట్టగా అతడు క్రిందపడెను. శ్రీరాముడు కృపతో సారథిని లేపి అతి ప్రచండుడై ధనుష్టంకారము చేసెను. దానితో రాక్షసులు మూర్ఛపోయిరి. శ్రీరామచంద్రుని బాణములచే రావణుని సారథి, గుఱ్ఱములు చంపబడెను. రథము, ధ్వజపతాకములు ముక్కలాయెను. రావణుని హృదయములో బలము సన్నగిల్లెను. వెంటనే కృద్ధుడై మరొక రథముపై నెక్కి అనేక విధములైన అస్త్రశస్త్రములను వదిలెను. కాని అవి నిష్ఫలములు ఆయెను. శ్రీరాముడు రావణుని ప్రతి తలలో పది బాణములు వేయగా అవి దూసుకుపోయి రక్తము ప్రవహించసాగెను. అనేకమార్లు శ్రీరాముడు రావణుని భుజములను తలలను ఖండించిననూ, మరల వాటి స్థానములో క్రొత్తవి పుట్టుకొని వచ్చెను. ఖండింపబడిన తలలు, భుజములు ఆకాశమును కప్పి అసంఖ్యాకములైన రాహుకేతువులవలె కనిపించెను. అతికృద్ధుడయిన రావణుడు పది ధనుస్సులను ఎక్కుపెట్టి బాణముల వర్షము కురిపించి, రఘునాథుని రథమును కప్పివేసెను.

ప్రభువు కోపముతో శత్రుబాణములను తొలగించి అతని మస్తకములను ఖండించెను. అవి "రాముడెక్కడ? లక్ష్మణుడెక్కడ? వానరరాజు సుగ్రీవుడు ఎక్కడ?" అనుచూ పరుగెత్తసాగెను. వానిని చూచి వానరులు భయముతో పారిపోయిరి. శ్రీరాముడు నవ్వుచూ బాణములతో ఆ శిరస్సులను ఛేధించెను.

దశాననుడు కృద్ధుడై ఒక ప్రచండశక్తిని వదలగా అది విభీషణుని సమీపించెను. వెంటనే ప్రభువు విభీషణుని ప్రక్కకు తొలగించి తానే ముందుకు వచ్చెను. కాని ఆ శక్తి తగలగానే ప్రభువు కొద్దిగా మూర్ఛిల్లెను. విభీషణుడు పరుషవాక్యములతో రావణుని రొమ్మున గదతో కొట్టెను. ఆ గదాప్రహారము వలన రావణుడు నేలపై బడి తమాయించుకొని లేచెను. పరస్పరము ముష్టియుద్ధములో ఒకరిని ఒకరు కొట్టుకొనిరి. విభీషణుడు అలసినట్లు గమనించిన హనుమంతుడు చేత ఒక పర్వతమును గైకొని రావణుని రథములను, గుఱ్ఱములను, సారథిని కొట్టి క్రిందపడవేసి, అతని రొమ్ములపై కాలితో తన్నెను. రావణుని శరీరము వణకసాగెను. హనుమంతుడు తన తోకను పెంచి ఆకాశమునకు ఎగిరెను. ఆకాశమున ఇద్దరూ పోరాడసాగిరి. పిదప ఇద్దరూ నేలపైబడిరి. ప్రబలమైన వానరసైన్యమును చూచి రావణుడు తన మాయను ప్రకటించెను. వానర భల్లూకములు అసంఖ్యాకులైన రావణులను చూచి భయపడి రామలక్ష్మణులను శరణుజొచ్చిరి. కోసలాధిపతి శ్రీరాముడు నవ్వి మాయా రావణులనందరినీ కొట్టి పడవేసెను. పిదప వానరులందరినీ పిలిచెను. వారు ఇనుమడించిన బలముతో శ్రీరాముని స్తుతించుచూ యుద్ధము చేయసాగిరి. శ్రీ రఘుపతి రావణుని తలలను, భుజములను, ధనుస్సులను, బాణములను ఖండించెను. కాని తలలు, భుజములు మరల పెరుగజొచ్చెను. అంగదుడు, హనుమంతుడు, సుగ్రీవుడు మొగలగువారు వృక్షములను పర్వతములను అతనిపై వేసిరి. కాలితో తన్నిరి. గోళ్లతో చీరి పరుగెత్తిరి. రావణుడు వారినందరినీ మూర్ఛితులుగా చేసెను. జాంబవంతుని పాద

ఘాతమునకు రావణుడు క్రింద పడెను. సారథి అతనిని రథముపై వేసుకొని మేలుకొలుప ప్రయత్నించెను. మూర్ఛనుండి తేరుకొనిన వానర భల్లూకములు ప్రభువద్దకు వచ్చిరి. నిశాచరులందరు రావణుని చుట్టు చేరిరి.

త్రిజట అదే రాత్రి సీతాదేవి వద్దకు వచ్చి ఆమెకు కధనంతయూ వినిపించెను. శత్రువు శిరస్సులు భుజములు పెరుగు సమాచారమును విని సీతాదేవి చింతాక్రాంతయై త్రిజటతో పలికెను: "మాతా! ఏమి జరుగనున్నదో చెప్పుము. రావణుడు ఏ విధముగా మరణించును? శ్రీరఘునాధుని బాణములచే తలలు తెగిననూ వాడు చావకున్నాడే!" అట్లు శ్రీరాముని స్మరించుచూ సీతాదేవి విలపింపసాగెను. త్రిజట పలికెను. "రాజకుమారీ! వినుము. హృదయమునందు బాణము తగిలినంతనే రావణుడు మరణించును. కాని ఆ హృదయమున మీరు నివసించుచున్నారు. కావున ప్రభువు అతని హృదయమునందు కొట్టుటలేదు. కాని మాటిమాటికి తలలు తెగిపడుట వలన రావణుడు మీ ధ్యాస మరచిపోవును. అప్పుడు చతురుడయిన శ్రీరాముడు అతని హృదయములో బాణము వేయును." అదే సమయమున సీతాదేవికి శుభశకునములు కనిపించెను. అర్ధరాత్రికి రావణుడు మూర్ఛనుండి మేలుకొని తనను యుద్ధ భూమినుండి వేరుచేసిన వానిని తిట్టసాగెను. సారథి అతనికి నచ్చచెప్పెను. తెల్లవారగానే రావణుడు రథమునెక్కి యుద్ధ భూమికి పరుగు తీసెను.

రావణుని ఆగమన వార్త వినగానే వానరులలో కోలాహలమాయెను. వారు పర్వతములతో రాక్షససైన్యమును చెల్లాచెదరు చేసిరి. పిమ్మట రావణుని చుట్టు చేరిరి. అతని శరీరమును గాయపరచిరి. రావణుడు విచారించి అంతర్ధానమై తన మాయను విస్తరింపచేసెను. భేతాళభూతపిశాచములు ధనుర్బాణములు ధరించి ప్రకటితమయిరి. యోగినులు మానవకపాలములలో రక్తము త్రాగుచూ నాట్యము చేయుచూ

పాటలు పాడుచుండిరి. వానరులు భయభ్రాంతులై పారిపోగా వారిని అగ్నిజ్వాలలు చుట్టుముట్టెను. రావణుడు ఇసుకను వర్షించెను. లక్ష్మణ, సుగ్రీవులతో సహా వీరులందరూ స్పృహ కోల్పోయిరి. రావణుడు మరొక మాయను సృష్టించెను. అసంఖ్యాకులైన హనుమంతులు కన్పడిరి. శ్రీరఘువీరుడు క్రుద్ధుడై ఒక్కక్షణములో ఒకే బాణముతో రావణుని మాయను హరించెను. ఖండించిన కొలది శిరస్సులు పెరుగుచుండగా శ్రీరామచంద్రుడు విభీషణుని వైపు చూసెను. విభీషణుడు పలికెను: "సర్వజ్ఞా, శరణాగతపాలకా! వినుడు, రావణుని నాభికుండములో అమృతమున్నది. అతడు దాని బలముతోనే జీవించియున్నాడు." విభీషణుని వచనములు విని కృపాళువైన శ్రీరాముడు ముప్పది యొక్క బాణములు వదిలెను, అవి కాలసర్పములవలె పోయెను. ఒక బాణము రావణుని నాభియందుగల అమృతభాండమును భగ్నమొన ర్చెను. మిగిలిన బాణములు అతని పదిశిరస్సులను ఇరవై చేతులను, ఖండించి తమతోపాటు తీసుకొనిపోయెను. శిరస్సులు, భుజములు లేని మొండెము ప్రచండవేగముతో పరుగెత్తుచుండగా ప్రభువు దానిని రెండు ముక్కలుగా చేసెను. అవి భల్లూకవానరములను తమ బరువుకింద అణచుచూ నేలకొరిగెను. శ్రీరాముని బాణములు రావణుని భుజములను, మస్తకములను మందోదరి ముందుంచి తిరిగి వచ్చి శ్రీరాముని తూణీరమును చేరెను. అతని తేజస్సు ప్రభుముఖమున ప్రవేశించెను. బ్రహ్మాదిదేవతలు జయజయధ్వానములు చేసిరి. దేవతలు దుందుభులు మ్రోగించి పుష్పములను వర్షించిరి. "ఓ కృపాసాగరా, ముకుందా, రాగద్వేషములు, హర్షశోకములు, జన్మమృత్యువులు మొదలగు ద్వంద్వములను హరించువాడా! శరణా గతులకు సుఖమునిచ్చువాడా! కారణకారణా! కరుణామయా! మీకు జయమగుగాక!" అనుచూ దేవతలు ఆనందాతిశయముతో పొగడిరి. నగారాలు మ్రోగించిరి. శ్రీరామచంద్రుని శరీరము అనేక మన్మథుల సౌందర్యమును పొందెను. ప్రభువు తన కృపాదృష్టితో దేవతలకు

అభయము నొసంగెను. భల్లూక, వానరులు మిక్కిలి హర్షముతో నాట్యము చేయసాగిరి.

తన భర్త శిరస్సులను చూడగానే మందోదరి మూర్ఛిల్లి నేలపై బడిపోయెను. ఇతర రాణులు విలపించుచూ పరుగెత్తి ఆమెను లేపి రావణుని శరీరము వద్దకు తీసుకొని వచ్చిరి. వారు బిగ్గరగా విలపింపసాగిరి. అనేక విధముల రావణుని ప్రతాపమును పొగడిరి. "ఓ నాథా! మీ బలానికి పృథ్వి కంపించుచుండెను. అగ్నిదేవుడు, సూర్యచంద్రులు మీ ముందు కాంతి హీనులు అగుచుండిరి. ఇంద్రుడు మొదలగు దిక్పాలకులు యుద్ధములో మిమ్మెదిరించ సాహసించకుండిరి. మీ భుజబలముచే యమధర్మరాజును కూడా జయించితిరి. అట్టి మీ శరీరము నేడు ధూళితో కూడుకొని నేలపై బడినది. మీ ప్రతాపము మీ పుత్రుల బలము వర్ణించ వీలులేనిది. శ్రీరామచంద్రునితో వైరము పూనుటచే మీకీ దుర్దశ ప్రాప్తించినది. నేడు మీ వంశములో మీకై ఏడ్చేవారు కూడా లేరు. కాలుని వశమగుటచే మీరెవ్వరి మాటను వినక పోయితిరి. చరాచరసృష్టికి ప్రభువైన పరమాత్మను మానవ మాత్రునిగా భావించితిరి. బ్రహ్మాది దేవతలు ఎవనిని పూజించెదరో అట్టి కరుణామయుడైన భగవంతుని మీరు భజించకపోయితిరి. అనేక పాపములకు కూడలి అయిననూ మీకు శ్రీరాముడు తన లోకమున చోటునిచ్చెను. యోగులకుకూడా దుర్లభమయిన పరమపదమును మీ కొసంగిన శ్రీరామునివంటి కృపాసాగరుడు మరొకరు లేరు." ఆ వచనములను విని దేవతలు, మునులు, సిద్ధులు సుఖులైరి. బ్రహ్మ, మహేశుడు, నారదుడు, శౌనకాది మునులు ఇతర తత్వజ్ఞులు అందరూ శ్రీరఘునాథుని నేత్రపర్వముగా చూచి ప్రేమతో తన్మయులైరి. తన కుటుంబస్త్రీలందరూ విలపించుట చూచి విభీషణుడు అతి దుఃఖితుడై వారివద్దకు పోయెను. తన సోదరుని దశను చూచి, మిక్కిలి దుఃఖించెను. అపుడు ప్రభువు లక్ష్మణునికి ఆజ్ఞనివ్వగా అతడు అనేక విధముల విభీషణుని ఓదార్చెను. ప్రభువు కరుణాపూరిత దృష్టితో

విభీషణుని చూచి పలికెను: "ఇప్పుడు శోకమును వదలి రావణుని శ్రాద్ధకర్మలు చేయుము." ప్రభువాజ్ఞను శిరసావహించి విభీషణుడు విధిపూర్వకముగా రావణునికి తిలాంజలులు సమర్పించి, మనస్సులో శ్రీరఘునాథుని గుణములను పొగడుచు తన భవనమునకు పోయెను.

## 12. సీతాదేవి అగ్నిప్రవేశము

శ్రీరాముడు లక్ష్మణుని పిలిచి పలికెను: "నీవు, వానరరాజు సుగ్రీవుడు, అంగదుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, హనుమంతుడు అందరూ నీతి కుశలులు. మీరు విభీషణునితో పాటు పోయి అతనికి రాజ్యాభిషేకము చేయుడు. తండ్రిగారి ఆజ్ఞవలన నేను స్వయముగా నగరములోనికి రాజాలను." ప్రభు వచనములు విని వానరులు రాజ్యాభిషేకమునకు ఏర్పాటుచేసిరి. విభీషణుని సాదరముగా సింహాసనముపై కూర్చుండబెట్టి స్తుతించిరి. పిమ్మట విభీషణునితో పాటు అందరూ ప్రభువద్దకు వచ్చిరి. శ్రీరఘువీరుడు వానరులతో నిట్లనెను: "మీ బలముచేతనే రావణుని వంటి శత్రువు వధింపబడెను. విభీషణుడు రాజాయెను. మీ యశస్సు ముల్లోకములలో శాశ్వతముగా నుండును." అమృతతుల్యమగు మాటలతో ప్రభువు వారందరిని సంతృప్తి పరచెను. పిదప శ్రీరామచంద్రప్రభువు హనుమంతుని పిలిచి చెప్పెను: "నీవు లంకకు పోయి విషయమంతయూ జానకికి తెలిపి ఆమె క్షేమసమాచారములు తెలిసికొనుము." హనుమంతుడు నగరమునకు పోయి సీతాదేవికి నమస్కరించెను. జానకీదేవి "నాయనా, కృపాసాగరుడైన నా స్వామి, సోదరుడు లక్ష్మణుడు, వానరసేనతో సహా కుశలమేగదా?" అని అడిగెను. హనుమంతుడు, "మాతా! కోసలాధీశుడు, అందరూ కుశలము, ప్రభువు యుద్ధములో దశాననుని వధించెను. అఖండరాజ్యమునకు విభీషణుడు ఇప్పుడు రాజు" అని పలికెను. సీతాదేవి హృదయము ఆనంద భరితమాయెను. శరీరము

పులకించెను. నేత్రములు సజలములాయెను. "నాయనా! ఇప్పుడు కన్నులతో ప్రభు కోమల శ్యామల శరీరమును దర్శించు నుపాయము చేయుము" అని పలికెను. హనుమంతుడు సీతాదేవి సందేశమును ప్రభువునకు వినిపించెను. శ్రీరామచంద్రుడు అంగదుని విభీషణుని పిలిచి పలికెను: "మీరు పవనపుత్రునితో పాటు పోయి సాదరముగా జానకిని పిలుచుకొని రండి." వెంటనే వారు సీతాదేవి వద్దకు పోయిరి. రాక్షస స్త్రీలందరూ ఆమెకు సేవ చేయుచుండిరి. విభీషణుని ఆజ్ఞతో వారామెకు స్నానము చేయించి, వివిధ ఆభరణములతో అలంకరించిరి. అందమైన పల్లకీని తెచ్చిరి. శ్రీరాముని స్మరించుచూ సీతాదేవి ఆనందముగా పల్లకి నెక్కెను. నాలుగు వైపుల వేత్రహస్తులై రక్షకభటులు నడిచిరి. భల్లూక వానరములు సీతాదేవి దర్శనమునకు రాగా భటులు వారిని తరిమి వేసిరి. శ్రీరఘువీరుడు పలికెను: "మిత్రమా! నా మాట వినుడు. సీతను కాలినడకనే రానిండు. దానివలన వానరులందరూ ఆమెను తల్లివలె చూడగలరు." ప్రభు వచనములను విని వానర భల్లూకములు ప్రసన్నులైరి. అసలు సీతాదేవిని మొదట అగ్ని వద్ద యుంచియుండెను. సర్వసాక్షి అయిన శ్రీరాముడు ఇపుడామెను ప్రకటితమొనర్పనెంచెను. ప్రభు వచనములను శిరసావహించి పవిత్రురాలయిన సీతాదేవి యిట్లు పలికెను: "లక్ష్మణా! ఈ ధర్మరక్షణ కార్యమునందు నీవు నాకు సహాయకుడుగా నుండుము. వెంటనే అగ్నిని జ్వలింపజేయుము." లక్ష్మణుని కన్నులలో దుఃఖాశ్రువులు రాలెను. చేతులు జోడించుకొని ఏమియూ మాట్లాడలేక నిలిచిపోయెను. అంగీకారమును సూచించు శ్రీరాముని చూపులను చూచి లక్ష్మణుడు అగ్నిని జ్వలింపచేసెను. సీతాదేవి పలికెను. "మనోవాక్కర్మలచే నా హృదయము శ్రీరఘువీరుని తప్ప ఇతరులను ఆశ్రయించనిచో అగ్నిదేవుడా! నీవు చందనమువలె చల్లబడుము." అనుచూ అగ్నిలో ప్రవేశించెను. అగ్ని స్థూలరూపమును ధరించి నిజమైన సీతాదేవిని చేయిపట్టుకొని వచ్చి క్షీరసాగరుడు

లక్ష్మీదేవిని విష్ణువునకు సమర్పించినట్లు శ్రీరామచంద్రునికి సమర్పించెను. సీతాదేవి శ్రీరామునికి వామభాగమున సుశోభిత అయ్యెను. హర్షముతో దేవతలు పుష్పములు కురిపించిరి. కిన్నరులు గానము చేసిరి. అప్సరసలు నాట్యమాడిరి. శ్రీసీతారాముల అపార సౌందర్యమును చూచి భల్లూకవానరములు సంతోషమును పట్టజాలకపోయిరి. శ్రీరఘునాథుని అనుమతి గైకొని ఇంద్రుని సారథియగు మాతలి ప్రభు చరణములకు ప్రణమిల్లి వెళ్ళిపోయెను. దేవతలు అనేక విధములుగా ప్రార్థనలు చేసిరి. బ్రహ్మదేవుడు పులకితశరీరుడై ప్రేమపూర్వకముగా స్తుతించెను. అదే సమయమున దశరథుడు అక్కడికి వచ్చెను. పుత్రుని చూడగానే అతని కన్నుల నీరు నిండెను. లక్ష్మణసమేతుడై ప్రభువు తండ్రికి నమస్కరించెను. దశరథుడు ప్రసన్నుడై స్వర్గమునకు పోయెను. దేవరాజు అయిన ఇంద్రుడు ప్రభువును అనేక విధముల పొగడెను. ప్రభువు ఇంద్రునితో పలికెను: "దేవరాజా! రాక్షసులచే చంపబడిన వానరభల్లూకములన్నియూ నేలపై పడియున్నవి. వీరు నా సహాయమునకై తన ప్రాణములను త్యాగమొనర్చిరి. వీరిని బ్రతికింపుడు." శ్రీరామచంద్రప్రభువు ముల్లోకములను సంహరించి తిరిగి బ్రతికించగల సమర్థులు. కాని ఆ గొప్పతనమును ప్రభువు ఇంద్రునికి ఇవ్వదలచెను. ఇంద్రుడు అమృతమును వర్షించి భల్లూకవానరములను బ్రతికించెను. అందరూ లేచి ఆనందముతో ప్రభువద్దకు వచ్చిరి. అమృత వర్షము రెండు బలగములపై కురిసెను. రాక్షసుల మనస్సులలో చనిపోవునపుడు రాముని ఆకారము నిలిచియుండెను కావున ముక్తులైరి. వానరభల్లూకములు మాత్రము జీవితులైరి. దేవతలందరూ తమ విమానములను ఎక్కిపోయిరి. పిమ్మట పరమేశ్వరుడు చేతులు జోడించి అనేక విధముల ప్రభువును స్తుతించెను. ఎల్లప్పుడూ సీతాలక్ష్మణులతో సహా తన హృదయమున నివసించుమని ప్రార్థించి వెళ్ళిపోయెను.

## 13. అయోధ్యకు పునరాగమనము

పిమ్మట విభీషణుడు ప్రభు చరణములకు ప్రణమిల్లి ప్రార్థించెను: "ప్రభూ, రావణుని బంధుసమేతముగా సంహరించి ముల్లోకములందు మీ పవిత్రకీర్తిని విస్తరింపచేసితిరి. దీనుడనగు నాపై కృపజూపితిరి. ఈ సేవకుని గృహమును పావనము చేసి, యుద్ధపు బడలికను తీర్చుకొనుడు. నా కోశాగారము నుండి వానరులకు మీకిష్టమయినది యివ్వండి. మీతో పాటు నన్ను కూడా అయోధ్యానగరమునకు గొనిపొండు." కరుణాళువు శ్రీరాముడు పలికెను: "సోదరా! వినుము. నీ సంపద, భవనము మొదలగునవి నావియే. కాని భరతుడు ప్రతిక్షణమును యుగముగా గడుపుచున్నాడు. తాపసివేషములో చిక్కిన శరీరముతో నన్నే స్మరించుచున్నాడు. నేనతనిని త్వరగా చూచు నుపాయము చేయుము. నా వనవాసము సమాప్తి అయిన పిదప పోయినచో నా సోదరులను సజీవులుగా చూడలేను. విభీషణా! నీవు కల్పాంతము వరకు రాజ్యపాలన చేసి మరణానంతరము పరమపదమును పొందెదవు." విభీషణుడు తన భవనమును చేరి మణులతో, వస్త్రములతో విమానమును నింపెను. దయాసాగరుడైన శ్రీరాముని ఆజ్ఞచే ఆకాశమునుండి వాటిని వర్షించెను. ఎవరికిష్టమయినది వారు తీసుకొనిరి. మణులను తిను పదార్థములుగా భావించి వానరులు వాటిని తమనోట నుంచుకొనిరి. తమ తప్పును తెలుసుకొనిరి. ఉమ్మి వేసిరి. ఈ వినోదమును సీతారామలక్ష్మణులు చూసి ఆనందించిరి. భల్లూక వానరములు వస్త్రములను, మణులను తీసుకొని ధరించి శ్రీరఘునాథుని వద్దకు వచ్చిరి. శ్రీరాముడు "సోదరులారా, మీ బలము వలననే నేను రావణుని వధించినాను. ఇప్పుడు మీరు మీ గృహములకు పోయి నన్ను స్మరించుడు," అని పలికెను. ఇష్టము లేకపోయిననూ వానరభల్లూకములు హర్షవిషాదములతో తమ యిండ్లకు పోయిరి. సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, హనుమంతుడు

విభీషణుడు మరియు ఇతర సేనాపతులు ఏమియూ చెప్పలేకపోయిరి. కన్నుల నీరు నింపుకొని శ్రీరాముని తదేకదృష్టితో చూచిరి. శ్రీరఘునాధుడు వారందరినీ విమానములో కూర్చుండబెట్టెను. తదనంతరము ప్రభువు ఉత్తరదిశగా పోవుటకు విమానమునకు ఆజ్ఞ ఇచ్చెను. అందరూ "శ్రీరఘువీరునికి జయమగుగాక" అని గట్టిగా జయజయధ్వానములు చేసిరి.

విమానములో ఒక ఎత్తైన మనోహరమైన సింహాసనముపై సీతాదేవితో సహా శ్రీరామచంద్రుడు విరాజమానుడాయెను. రణభూమియందలి వివిధప్రదేశములను ప్రభువు సీతాదేవికి చూపెను. సముద్రతీరమున పరమేశ్వరుని స్థాపించిన స్థలమును చూపి శ్రీరాముడు శివునికి ప్రణమిల్లెను. వనములో తాను ఎక్కడెక్కడ నివసించెనో, విశ్రమించెనో, ఆ ప్రదేశములన్నింటినీ సీతాదేవికి చూపెట్టెను. అగస్త్యాది అనేక మునులు నివసించు దండకారణ్యమున దిగి ఋషీశ్వరుల ఆశీర్వాదమును పొంది, పిమ్మట చిత్రకూటమును చేరెను. గంగా యమునా సంగమస్థానమైన ప్రయాగను దర్శించి గంగాదేవికి నమస్కరించి పవిత్రమైన అయోధ్యానగరమును విమానమునుండి చూచి పులకించిరి. నగర సమీపమున విమానమును దిగి ప్రభువు భరద్వాజముని వద్దకు పోయెను. నిషాదరాజు శ్రీరామచంద్రుని సాదరముగా ఆహ్వానించెను. రఘునాథుడు అతనిని ప్రేమతో హృదయమునకు హత్తుకొనెను. శ్రీరాముని ఆజ్ఞచే హనుమంతుడు బ్రహ్మచారి వేషమును ధరించి భరతుని వద్దకు పోయెను.

ఎవరయితే శ్రీరఘువీరుని సమరవిజయకథను వింటారో, వారికి భగవంతుడు శాశ్వత జయమును, వివేకమును, సంపదలను యిచ్చును.

కలియుగ సమస్త పాపములను నాశనమొనరించు
"శ్రీరామచరితమానసము" నందలి "లంకాకాండము" అను
ఆరవ సోపానము సమాప్తము.

# శ్రీరామ మంగళాశాసనమ్

## రచన: శ్రీవరవరస్వామి

*1. మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్దయే।*
*చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥*
*2. వేద వేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే।*
*పుంసాం మోహన రూపాయ పుణ్య శ్లోకాయ మంగళమ్॥*

ప్రశంసనీయ గుణసముద్రుడు, కోసలాధిపతియైన శ్రీరామచంద్రునికి మంగళము. దశరథ మహారాజుపుత్రుడు, సార్వభౌముడైన శ్రీరామునికి మంగళము. వేదములు, ఉపనిషత్తులద్వారా తెలిసికొనబడువాడు, మేఘసమాన శ్యామలమూర్తి గలవాడు, పురుషులనే మోహింపజేయు రూపము గలవాడు, పవిత్రమైన యశస్సుగలవాడైన శ్రీరామచంద్రునికి మంగళమగుగాక!

*3. విశ్వా మిత్రాంగరంగాయ మిథిలానగరీ పతేః।*
*భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్॥*
*4. పితృభక్తాయ సతతం భాతృభిః సహసీతయా।*
*నందితాఖిల లోకాయ రామభద్రాయ మంగళమ్॥*

విశ్వామిత్ర ముని కత్యంత ప్రియుడు, మిథిలాపతి జనకుని భాగ్యఫలస్వరూపుడు, భవ్యరూపుడైన శ్రీరామచంద్రునికి మంగళము. సదా పితృభక్తిపరాయణుడు, తన సోదరులతో, సీతాదేవితో శోభిల్లువాడు. సమస్తలోకముల నానందింపజేసినవాడు. అట్టి శ్రీరామునికి మంగళమగుగాక!

*5. త్యక్తసాకేత వాసాయ చిత్రకూట విహారిణే।*
*సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్॥*
*6. సౌమిత్రిణా చ జానక్యా చాప బాణాసి ధారిణే।*
*సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్॥*

అయోధ్యను వదలి చిత్రకూటమున విహరించినవాడు, సకలమును లచే సేవింపదగినవాడు, ధీరోదాత్తుడైన శ్రీరామచంద్రుని మంగళము. లక్ష్మణునిచే, జానకీదేవిచే సదా భక్తిపూర్వకముగా సేవింపబడువాడు, ధనుర్బాణములను, ఖడ్గమును ధరించినవాడు. అట్టి నా స్వామియైన శ్రీరామభద్రునకు మంగళమగుగాక!

*7. దండకారణ్య వాసాయ ఖరదూషణ శత్రవే।*
*గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్॥*
*8. సాదరం శబరీ దత్త ఫలమూలాభిలాషిణే।*
*సౌలభ్య పరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్॥*

దండ కారణ్యమున నివసించి, ఖరదూషణులను సంహరించినవాడు, భక్తుడైన జటాయువునకు ముక్తి నొసగినవాడైన శ్రీరామచంద్రునికి మంగళము. శబరి యొసంగిన ఫలమూలములను ఆదరముతో స్వీకరించినవాడు సులభముగా పొంద దగినవాడు, సత్త్వగుణ సంపన్నుడైన శ్రీరామభద్రునికి మంగళమగుగాక!

*9. హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే।*
*వాలి ప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్॥*
*10. శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘిత సింధవే।*
*జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్॥*

ఆంజనేయునితోకూడి యున్నవాడు, సుగ్రీవుని కోరికను తీర్చినవాడు, వాలిని వధించినవాడు, అట్టి మహాధీరుడైన శ్రీరామచంద్రునికి మంగళము. సేతువును నిర్మించి, సముద్రమును దాటి రాక్షసరాజైన రావణుని జయించిన రణధీరుడైన శ్రీరామభద్రునికి మంగళమగుగాక!

*11. విభీషణకృతే ప్రీత్యా లంకాభీష్ట ప్రదాయినే।*
*సర్వలోక శరణ్యాయ శ్రీరాఘవాయ మంగళమ్॥*

12. ఆసాద్య నగరీం దివ్యామభిషిక్తాయ సీతయా।
రాజాధిరాజ రాజాయ రామభద్రాయ మంగళమ్॥

విభీషణుని యెడల అతిప్రసన్నుడై అతనికి లంకా రాజ్యమును ప్రసాదించినవాడు. సర్వలోకములకు శరణ్యుడైన శ్రీరఘురామునికి మంగళము. వనవాసానంతరము దివ్యమైన అయోధ్య యందు సీతాదేవితో సహా రాజ్యాభిషిక్తుడైనవాడు. మహారాజాధిరాజైన శ్రీరామభద్రునికి మంగళమగుగాక!

13. బ్రహ్మాదిదేవసేవ్యాయ బ్రహ్మణ్యాయ మహాత్మనే।
జానకీ ప్రాణనాథాయ రఘునాథాయ మంగళమ్॥

14. శ్రీసౌమ్య జామాతృమునేః కృపయాస్మానుపేయుషే।
మహతే మమ నాథాయ రఘునాథాయ మంగళమ్॥

బ్రహ్మాది దేవతలచే సేవింపబడువాడు, బ్రాహ్మణులను, వేదములను రక్షించువాడు, శ్రీ జానకీదేవి ప్రాణనాథుడైన శ్రీరఘునాథునికి మంగళము. శ్రీ సంపన్నుడైన సుందరాకారుడైన జామాతముని కృప వలన మనకు లభ్యమైనవాడు, అట్టి మహనీయుడు, ప్రభువైన శ్రీరఘునాథునికి మంగళమగుగాక!

15. మంగళా శాసనపరైః మదాచార్య పురోగమైః।
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్॥

16. రమ్య జామాతృమునినా మంగళాశాసనం కృతమ్।
త్రైలోక్యాధిపతిః శ్రీమాన్ కరోతు మంగళమ్ సదా॥

అర్వాచీనులైన మరియు ప్రాచీనులైన ఆచార్యులు ఏ పరమాత్మను మంగాళాశాసనములతో సేవించిరో, అట్టి శ్రీరామభద్రునికి మంగళము. జామాత మునిచే రచించబడిన ఈ మంగళాశాసనముచే ప్రసన్నుడై త్రిలోకాధిపతియైన శ్రీరామచంద్రప్రభువు సర్వులకు శుభము నిచ్చుగాక!

# ఏడవ సోపానము

# ఉత్తరకాండము

## 1. వందనము

నెమలి కంఠమువలె నీల వర్ణుడు, దేవతలలో శ్రేష్ఠుడు, పీతాంబర ధారి, కమలనయనుడు, ధనుర్బాణములను ధరించినవాడు, లక్ష్మణునిచే వానరులచే సేవింపబడువాడు, జానకీదేవితో సహా పుష్పకవిమానమును అధిరోహించినవాడు బ్రహ్మచే, పరమేశ్వరునిచే సేవింపబడు సుందర చరణములు గల శ్రీరామచంద్రుడు సదా నా మనస్సునందు ఉండుగాక!

తెల్లని శరీరకాంతిగలవాడు, జగజ్జనని అయిన పార్వతీదేవికి స్వామి, కోరినకోరికలు ఇచ్చువాడు కామదేవుని నుండి ముక్తిని ప్రసాదించువాడు, పరమేశ్వరుడు నన్ను బ్రోచుగాక!

## 2. స్వాగతము

శ్రీరామచంద్రుడు, అయోధ్యకు తిరిగి వచ్చుటకు ఇంక ఒక్క దినము మాత్రమే వ్యవధి ఉండెను. నగరములోని ప్రజలు ఎదురు చూచుచుండిరి. ప్రభువు ఆగమన వార్తను సూచించు శకునములు పొడచూపెను. పురప్రజలు, రాజమాతలు సంతసించిరి. భరతుడు విచారించసాగెను: "నా ప్రాణములకు ఆధారమైన ఒక్క దినము మాత్రమే మిగిలియున్నది. స్వామి ఇంకను రాకపోవుటకు కారణము ఏమి? నన్ను కుటిలుడు అని భావించి మరచిపోయెనా? శ్రీరాముని

చరణకమలములను ఆశ్రయించుకొనివున్న లక్ష్మణుడు ఎంత ధన్యుడు! నన్ను కపటిగా కుటిలునిగా భావించి ప్రభువు తనతో పాటు తీసుకొనిపోలేదు. కాని ప్రభువు సేవకుల దోషములను చూడరు. వారి స్వభావము అతి కోమలము. శ్రీరామప్రభువు అవశ్యము రాగలరు అని నా హృదయము చెప్పుచున్నది." ఇట్లు ఆలోచించుచుండగనే హనుమంతుడు బ్రాహ్మణవేషముతో వచ్చెను. దుర్బలశరీరుడై, జటామకుటధారియై నిరంతరము 'రామరామ' యని జపించుచూ కుశాసనముపై కూర్చున్న భరతుని చూడగానే హనుమంతుడు అమితానందము నొందెను. అమృతసమానమైన వాక్కుతో పలికెను: "ఎవరి వియోగముతో మీరు రాత్రింబవళ్ళు చింతామగ్నులై వున్నారో, ఎవరి గుణసమూహమును మీరు సదా వర్ణించెదరో అట్టి రఘుకుల తిలకుడు శ్రీరామచంద్రుడు క్షేమముగా వచ్చినాడు. యుద్ధములో శత్రువులను జయించి సీతాలక్ష్మణసమేతుడై విచ్చేయుచున్నాడు." ఆ మాటలు వినగానే భరతుడు తన దుఃఖములన్నియూ మరచిపోయి, "నాయనా, మీరెవరు? ఎక్కడనుండి వచ్చినారు? నాకత్యంత ప్రీతికరమైన మాటలు పలికినారు" అని అడిగెను. అప్పుడు హనుమంతుడు "దీనబంధువయిన శ్రీరామునికి దాసుడను, పవనపుత్రుడను, నా పేరు హనుమంతుడు" అని సమాధానము ఇచ్చెను. అది వినగానే భరతుడు లేచి సాదరముగా హనుమంతుని కౌగలించుకొని పలికెను: "ఆంజనేయా! నీ దర్శనముచే నా దుఃఖములన్నియూ దూరమయినవి. నీ ద్వారా నా ప్రియమైన రామునే చూచితిని ఈ ఉపకారమునకు బదులుగా నేనేమి ఇవ్వగలను? ఈ సందేశమునకు సమానమైన విలువగల వస్తువు ఈ జగత్తులో లేదని తోచుచున్నది. కావున ఎట్టి పరిస్థితుల్లో కూడా నేను ఋణవిముక్తుడను కాలేను. ఇప్పుడు ప్రభువు చరితమును వినిపించుము." అప్పుడు ఆంజనేయుడు శ్రీరాముని గుణగాథనంతయూ వినిపించెను. పిదప భరతునికి నమస్కరించి హనుమంతుడు వెంటనే శ్రీరాముని వద్దకు వచ్చి

భరతుని క్షేమసమాచారములు తెలిపెను. అప్పుడు శ్రీరామచంద్రుడు ప్రసన్నుడై విమానమును అధిరోహించెను.

భరతుడు ఆనందముతో అయోధ్యానగరమునకు వచ్చి విషయమంతయూ గురువుగారికి వినిపించెను. రాజభవనములోని వారు, నగరవాసులు ఈ శుభవార్త విన్నంతనే హర్షోల్లాసులైరి. శ్రీరాముని స్వాగతమునకై సౌభాగ్యవతులయిన స్త్రీలు మంగళప్రదమయిన వస్తువులను బంగారు పళ్ళెములతో తీసుకొని, మంగళగీతములు పాడుచూ బయలుదేరిరి. గురు వశిష్ఠుడు, కుటుంబసభ్యులు, తమ్ముడయిన శత్రుఘ్నుడు, బ్రాహ్మణ సమూహములు వెంటరాగా భరతుడు ప్రసన్నహృదయుడై కృపాధాముడైన శ్రీరామునికి స్వాగతము నిచ్చుటకై బయలుదేరెను. స్త్రీలు మేడమిద్దెల పైభాగమున నెక్కి విమానమునకై ఆకాశము వైపు చూచుచుండిరి. అది కనపడిన వెంటనే ఆనందముతో మధురస్వరములతో సుందరగీతములు పాడిరి.

విమానములో కూర్చున్న శ్రీరాముడు వానరులకు మనోహరమైన అయోధ్యానగరమును చూపుచుండెను. "సుగ్రీవా! అంగదా! విభీషణా వినండి. ఈ అయోధ్యా నగరము అతి పవిత్రమయినది. సుందరమైనది. అందరూ వేదపురాణములలో ప్రసిద్ధికెక్కిన వైకుంఠమును పొగిడెదరు. కాని నాకు వైకుంఠముకన్న అయోధ్యానగరమే ప్రియమైనది. ఇది నా జన్మభూమి. దీనికి ఉత్తరమున పవిత్ర సరయూనది ప్రవహించుచున్నది. దీనియందు స్నానమాచరించు వారు శ్రమలేకుండగనే మోక్షమును పొందెదరు." ప్రభు వచనములు విని వానరులు ప్రసన్నులైరి. ప్రజలందరూ తనను కలుసుకొనుటకు వచ్చుటను చూచి శ్రీరామచంద్రప్రభువు నగర సమీపమున దిగవలసినదిగా విమానమును ఆదేశించెను. అప్పుడు అది భూమిపై దిగెను. పిదప కుబేరుని వద్దకు పొమ్మని ఆదేశించగా అది అట్లే పోయెను. భరతునితో పాటు ప్రజలందరూ వచ్చిరి. వారి శరీరములు కృశించి యుండెను.

వామదేవుడు మొదలగు మునులను చూచి శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో సహా పరుగెత్తి వారి చరణములపై పడెను. వశిష్ఠుడు వారిని ఆలింగనము చేసికొని, కుశలమును అడిగెను. "మీ కృపవలన మేము క్షేమము" అని పలుకుచూ రఘునాథుడు ప్రతియొక్కరికీ ప్రణమిల్లెను. పిదప భరతుడు ప్రభుపాదములు పట్టుకొని ఎంత లేపిననూ లేవలేదు. కృపాసింధువు శ్రీరాముడు బలవంతముగా అతనిని లేపి తన హృదయమునకు హత్తుకొనెను. భరతుని నోట మాట రాలేదు; పిమ్మట ధైర్యము వహించి పలికెను. "కోసలాధీశా! నన్ను సేవకునిగా గుర్తించి దర్శనము నొసంగినారు. కావున నేను కుశలమే. విరహసాగరములో మునిగిపోవుచున్న నాకు చేయూతనిచ్చి రక్షించితిరి." పిమ్మట శ్రీరామచంద్రప్రభువు శత్రుఘ్నుని హృదయమునకు హత్తుకొనెను. లక్ష్మణ భరతులు మిక్కిలి ప్రేమతో కలిసిరి. లక్ష్మణుడు శత్రుఘ్నుని కౌగిలించుకొని వియోగ దుఃఖమును దూరము చేసెను. పిదప భరతశత్రుఘ్నులు సీతాదేవి చరణములకు ప్రణమిల్లిరి. శ్రీరామచంద్రప్రభువును చూచి అయోధ్యావాసులు ప్రసన్నులైరి. ప్రభువు ఒక చమత్కారమును చేసెను. ఒకే సమయమున ప్రభువు అనేక రూపములలో ప్రకటితమై ప్రతిఒక్కరిని ఒకే కాలమున యోగ్యతానుసారము కలిసెను. అంతలో కౌసల్యాది రాజమాతలు తమ దూడలకై పరుగెత్తు గోవులవలె పరుగెత్తుకొని వచ్చిరి. ప్రభువు అత్యంత ప్రేమతో వారికి ప్రణమిల్లెను. జానకీదేవి అమితానందముతో తన అత్తగార్ల పాదములకు అభివాదము చేసెను. వారు ఆమె కుశలమును అడిగి "నిత్యసుమంగళివి కమ్ము" అని ఆశీర్వదించిరి. రాజమాతలు అందరూ సీతారాములకు బంగారుపళ్ళెములతో హారతులు యిచ్చిరి. కౌసల్యాదేవి "నా కుమారులిద్దరు అత్యంత సుకుమారులు. ఆ రాక్షసులు మిక్కిలి పరాక్రమశాలురు. వారిని, ఆ రావణుని వీరు ఏ విధముగా చంపియుండవచ్చును?" అని ఆలోచించుచూ ఆనందసాగరమున మునిగెను.

లంకాపతి విభీషణుడు, వానరరాజు సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు మొదలగు వానరులందరూ సుందరమానవశరీరములను ధరించిరి. వారందరూ భరతుని ప్రేమసుందరస్వభావమును అతని వ్రతనియమమును కొనియాడిరి. నగరవాసుల ప్రేమ వినయ శీలములను చూచి ప్రభువుయందు వారి ప్రేమను పొగిడిరి. శ్రీరఘునాథుడు తన మిత్రులందరినీ వశిష్ఠునికి పరిచయము చేసి పలికెను: "మునిశ్రేష్ఠా! వీరందరూ నా మిత్రులు, సంగ్రామములో నా హితము కొరకు వారు తమ ప్రాణములను కూడా పణముగా పెట్టిరి. వీరు నాకు భరతునికంటే ఎక్కువ ప్రియులు." ప్రభు వచనములను విని వారందరూ ప్రేమానందములో మునిగిరి. పిదప వారు కౌసల్యాదేవి చరణములకు ప్రణమిల్లిరి. కౌసల్యాదేవి ప్రసన్నురాలై ఆశీర్వదించి "మీరందరూ నాకు రఘునాథునితో సమానముగా ప్రియమైనవారు," అని పలికెను. శ్రీరఘునాథుడు తన భవనమునకు పోవునపుడు మేడ మిద్దెలనుండి స్త్రీలు దర్శనము చేయుచూ పుష్పములను వర్షించిరి. ప్రజలు స్వర్ణకలశములను చిత్రవిచిత్రముగా అలంకరించి తమ గుమ్మముల ముందు ఉంచిరి. మంగళమయమయిన తోరణములు ధ్వజపతాకములు ఉంచిరి. వీధులన్నింటిలో సుగంధ ద్రవ్యములతో పానుపు చల్లిరి. వీధి కూడళ్లయందు చదరములు, ముగ్గులు రచించబడి ముత్యములచే నింపబడెను. సౌభాగ్యవతులయిన యువతులు బంగారు పళ్ళెములందు హారతులను అలంకరించి పాటలు పాడిరి. కైకేయి మిక్కిలి లజ్జితురాలయినదను విషయము ప్రభువు ఎరుంగును. కావున ప్రభువు మొదట ఆమె భవనమునకు పోయెను. ఆమెకు అనేక విధముల నచ్చచెప్పి శ్రీరాముడు తన భవనముకు పోయెను. అయోధ్యలోని స్త్రీపురుషులందరూ సంతుష్టులైరి.

# 3. రాజ్యాభిషేకము

గురువైన వశిష్ఠుడు బ్రాహ్మణులను పిలిచి "ఈ రోజు ఈ వేళ శకునములు అన్నియూ శుభప్రదమయినవి. శ్రీరామచంద్రుడు సింహాసనమును అధిష్ఠించుటకు మీరందరూ ఆజ్ఞను ఇవ్వండి" అని బ్రాహ్మణులను అడిగెను. వశిష్ఠముని వచనములను విని బ్రాహ్మణులు హర్షితులై పలికిరి: "మునిశ్రేష్ఠా! శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకము విశ్వమునకే ఆనందదాయకము. ఇంక ఆలస్యము ఏ మాత్రము చేయక మహారాజును రాజ్యాభిషిక్తునిగా చేయుడు." పిమ్మట వశిష్ఠముని సుమంత్రుని పిలిచి సూచనలు ఇచ్చెను. అతడు ప్రణమిల్లి అనేక రథగజతురగములను అలంకరించెను. సుమంత్రుడు నలుదిశల దూతలను పంపి మంగళకరవస్తువులను తెప్పించి ఆనందముతో వశిష్ఠుని వద్దకు పోయి అతని చరణములకు ప్రణమిల్లెను.

అయోధ్యానగరము మిక్కిలి అందముగా అలంకరించబడెను. దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. శ్రీరామచంద్రుడు సేవకులను పిలిచి, "మొదట నా స్నేహితులకు స్నానము చేయించుడు" అని పలికెను. వారు మొదట సుగ్రీవుడు మొదలగువారికి స్నానము చేయించిరి. పిదప కరుణానిధి శ్రీరాముడు భరతుని పిలిచి తన చేతులతో స్వయముగా అతని జటాజూటమును విప్పెను. పిమ్మట తన ముగ్గురు సోదరులకు స్నానము చేయించెను. పిమ్మట తన జటాజూటమును విప్పి గురువాజ్ఞచే స్నానమాచరించెను. సీతాదేవిని అత్తగార్లు వెంటనే సాదరముగా స్నానము చేయించి, దివ్యవస్త్రములను ధరింపచేసి ప్రతి అంగమును ఆభరణములతో అలంకరింపచేసిరి. సర్వాలంకారభూషితుడైన శ్రీరాముని వామభాగమున సుగుణరాశి అయిన సీతాదేవి శోభిల్లెను. రాజమాతలు తమ జన్మలు సఫలమయినవని తలంచుచూ సంతసించిరి. అదే సమయమున

బ్రహ్మదేవుడు, శివుడు, మునిబృందములు, విమానములపై దేవతలు ఆనందకందుడగు భగవంతుని దర్శనమునకు వచ్చిరి. ప్రభువును చూచి వశిష్ఠముని ప్రేమమగ్నుడు అయెను. ఆయన ఒక దివ్య సింహాసనమును తెప్పించెను. దాని సౌందర్యము అవర్ణనీయము. మునులకు నమస్కరించి శ్రీరామచంద్రప్రభువు దానిపై కూర్చొనెను. సీతాదేవితో సహా శ్రీరాముని చూచి మునులు అత్యంత హర్షితులైరి. బ్రాహ్మణులు వేదమంత్రోచ్చారణ చేసిరి. దేవతలు, మునులు "శ్రీరామునికి జయమగుగాక!" అని పలికిరి. మొదట వశిష్ఠుడు తిలకమును పెట్టి బ్రాహ్మణు లందరినీ తిలకమును ఉంచమని ఆదేశించెను. శ్రీరామచంద్రుడు రాజతిలకుడు అగుటను చూచి రాజమాతలు అత్యంత ఆనందము నొందిరి. వారు మాటిమాటికి మంగళహారతులను ఎత్తిరి. బ్రాహ్మణులకు, యాచకులకు తృప్తికరముగా దానములొసంగిరి. ముల్లోకములకు ప్రభువయిన శ్రీరామచంద్రమూర్తి సింహాసనముపై విరాజమానుడై ఉండుట చూచి దేవతలు నగారాలు మ్రోగించిరి. గంధర్వులు, కిన్నెరలు గానము చేసిరి. అప్సరాంగనలు నాట్యమొనర్చిరి. విభీషణుడు, అంగదుడు, హనుమంతుడు, సుగ్రీవుడు మొదలగువారితోపాటు భరతలక్ష్మణశత్రుఘ్నులు వరుసగా ఛత్రచామరములు, ధనుస్సు, ఖడ్గము మొదలగునవి తీసుకొని ఉండిరి. సీతాదేవితో కూడిన శ్రీరాముని శరీరము అనేక కామదేవుల సౌందర్యముతో శోభిల్లెను. కిరీటము, భుజకీర్తులు మొదలగు విచిత్ర ఆభరణములు ప్రత్యంగమున అలంకరింపబడి యుండెను. దేవత లందరూ అనేక విధముల స్తుతించి తమ లోకములకు వెళ్ళిరి.

పిదప వేదములు భట్రాజుల వేషములలో శ్రీరాముని వద్దకు వచ్చినవి. సర్వజ్ఞుడైయిన ప్రభువు వారిని సాదరముగా ఆహ్వానించెను. వేదములు ప్రభుగుణములను గానము చేయసాగిరి: "ఓ సగుణనిర్గుణరూపా! అనుపమ రూపలావణ్యభూషితా! రాజశిరోమణీ!

మీకు జయము. మీరు రావణాది ప్రచండప్రబలదుష్టరాక్షసులను మీ బాహుబలముచే వధించితిరి. మానవ అవతారములను దాల్చి సంసారభారమును బాపితిరి. సీతాదేవితో కూడిన శక్తిమంతులగు మీకు మేము నమస్కరించుచున్నాము. శ్రీహరీ! మీ ప్రచండ మాయావశులై దేవతలు, రాక్షసులు, మనుష్యులు, చరాచరజీవులన్నియూ కాలకర్మ గుణములచే నిండిన జననమరణరూపమైన సంసారమున అలసిసొలసి తిరుగుచుందురు. వీరిలో ఎవరిపై మీ కృపాదృష్టి ప్రసరించునో వారు తాపత్రయముల నుండి విముక్తులయ్యెదరు. ఏ జనులయితే విపరీత జ్ఞానాభిమానమత్తులై పునర్జన్మను హరించు మీ భక్తిని గౌరవించరో, వారు దుర్లభమయిన పదవిని పొందికూడా పదవీభ్రష్టులగుదురు. ఎవరైతే ఆశలన్నీ త్యజించి విశ్వాసముతో మీకు దాసులగుదురో వారు కేవలము మీ నామజపముచేతనే ఎట్టి శ్రమలేకుండా భవసాగరమును దాటెదరు. అట్టి మిమ్ము మేము స్మరించెదము. ఏ చరణములు పరమేశ్వరునికి బ్రహ్మకు కూడా పూజనీయములో, ఏ చరణముల మంగళప్రదమయిన ధూళి స్పర్శ మాత్రముచే ఋషిపత్ని అహల్య ఉద్ధరింపబడినదో, ఏ చరణకమలములనుండి ముల్లోకములను పావనమొనర్చు గంగానది ఉద్భవించినదో అట్టి పాదములకు శ్రీరామా! సదా మేము నమస్కరించెదము. దేవా! మనోవాక్కర్మలచే వికార రహితులమై మేము సదా మీ చరణములనే ప్రేమించునట్లు వరమును కోరెదము." ఆ విధముగా వేదములు ప్రభువును ప్రార్థించి అంతర్ధానమై బ్రహ్మలోకమునకు పోయిరి.

వేదములు వెళ్లిన తర్వాత శివుడు శ్రీరాముని సన్నిధికి వచ్చెను. అతని శరీరము పులకరించుచుండగా, గద్గదస్వరముతో విన్నపము చేసెను. "శ్రీరామా! రమారమణా! భవతాపవిధ్వంసకా! మీకు జయము. పునర్జన్మ భయముచే పీడింపబడు జనులను రక్షించుడు. నిశాచరులను శలభములన్నియూ మీ బాణాగ్ని తేజస్సులో భస్మ

మయినవి. మీరు పృథ్వీమండలమునకు సుందర భూషణము, ఘోర అహంకారము, మోహము, మమతయను అంధకారమును దూరము చేయుటకు తేజశ్శాలి అయిన కిరణసమూహము, కామదేవుడు అను వేటగాడు మనుష్యులను, మృగములను భోగేచ్ఛ అను బాణముతో పడగొట్టుచున్నాడు. శ్రీహరీ! ఆ వేటగానిని వధించి విషయవాంఛలు అను వనమున సంచరించు అనాథులయిన జనులను రక్షించుడు. మీ చరణములను ప్రేమించని వారు అత్యంతదీనులు, దుఃఖితులు. వారు అగాధమయిన భవసాగరమున పడియుందురు. కాని ఎవరైతే మీ కథను ఆశ్రయించెదరో వారు సజ్జనులకు, భగవంతునికి ప్రియులు. వారిలో రాగము, లోభము, అభిమానము, మదము ఉండవు. సంపద, ఆపద రెండునూ వారికి సమానమే.వారు ప్రేమ పూర్వకముగా నియమనిష్ఠలతో నిరంతరము పవిత్రహృదయముతో మీ చరణకమలములనే సేవించెదరు. అట్టి సజ్జనులందరూ భూమిపై సుఖముగా చరించెదరు. రణధీరా! రఘువీరా! మిమ్ము భజించెదను. మీ పేరును జపించెదను మీకు ప్రణమిల్లెదను. ఈ దీనుని, సేవకునిపై కృపాదృష్టిని ప్రసరింపచేయుడు. మీ పదకమలములయందు అనన్యభక్తి, మీ భక్తుల సత్ సాంగత్యము నాకు కలుగునట్లు వరమును ప్రసాదించుడు." శ్రీరామచంద్రుని గుణములను వర్ణించి ఉమాపతి, మహాదేవుడు కైలాసమునకు పోయెను.

పిదప ప్రభువు వానరులకు సుఖమైన నివాస స్థానములను కేటాయించెను. "ఈ కథ శ్రోతలను పవిత్రులుగా చేయుటయేగాక వారి దైవిక, దైహిక, భౌతిక తాపములను, జననమరణ భయమును, భవభయ బాధలను తొలగించును. శ్రీరామచంద్రుని రాజ్యాభిషేక వర్ణనను భక్తిభావముతో వినిన మానవులు వైరాగ్యమును, జ్ఞానమును పొందగలరు. ఏదైనా కోరికతో ఈ కథను ఎవరయితే గానము చేస్తారో లేక వింటారో, వారు అనేకవిధముల సుఖసంపదలను

పొందెదరు. వారు ప్రపంచములో సుఖములను అనుభవించి, అంత్యకాలమున శ్రీరఘునాథుని పరమపదమును పొందెదరు. జీవన్ముక్తులు, వైరాగ్యవంతులు, విషయలోలురు ఈ కథను విన్నచో, వారు వరుసగా భక్తి, ముక్తి, సంపదలను పొందెదరు," అని ఈ విధముగా శ్రీకాభుశుండి గరుత్మంతునికి ఈ కథా మాహాత్మ్యమును తెలిపెను.

## 4. రామరాజ్యము

అయోధ్యలో నిత్యనూతన మంగళోత్సవములు జరుగుచున్నవి. అన్ని వర్గప్రజలు ఆనందముతో నుండిరి. శ్రీరామపాదములపై అందరికీ నిత్యనూతన భక్తియుండెను. వానరులు బ్రహ్మానందమగ్నులైరి. ప్రభు చరణములందు వారికి అనన్యభక్తి కలిగెను. ఇట్లు ఆరు మాసములు గడిచెను. వారు తమ ఇండ్లను కూడా మరచిరి. అప్పుడు శ్రీరఘునాథుడు మిత్రులందరినీ పిలిచి అత్యంత ప్రేమతో తన వద్ద కూర్చుండబెట్టుకొని మధురముగా పలికెను: "మీరు నాకెంతో సేవ చేసినారు. నా హితము కొరకు మీరు యిల్లు, కుటుంబములు, అన్ని సుఖములను త్యజించితిరి. అందువలన మీరు నాకు ఎంతో ప్రియమైన వారు. మిత్రులారా! ఇప్పుడు మీ ఇండ్లకు తరలిపొండి. దృఢమయిన నియమముతో నన్ను భజింపుడు." ప్రభు వచనములను వినగానే అందరూ ప్రేమమగ్నులై చేతులు జోడించి రెప్పవాల్చక చూడసాగిరి. వారికి నోటమాట రాలేదు. వారు ఏమియూ సమాధానము చెప్పలేక ప్రభుచరణములనే దర్శించుచుండిరి. అప్పుడు ప్రభువు వివిధవర్ణములుగల అనుపమసౌందర్యముగల భూషణములను, వస్త్రములను తెప్పించెను. భరతుడు స్వయముగా సుగ్రీవుని వస్త్రభూషణములచే అలంకరించెను. ప్రభువు ఆదేశముతో లక్ష్మణుడు, విభీషణుని వస్త్రభూషణాలంకృతునిగా చేసెను. రఘునాథుని మనస్సు మిక్కిలి సంతసించెను. జాంబవంతుడు, నీలుడు మొదలగు వారినందరినీ శ్రీరఘునాథుడే

స్వయముగా వస్త్రభూషణములను ధరింపచేసెను. వారందరూ తమ హృదయములలో శ్రీరామచంద్రప్రభువు రూపమునే ధరించి ప్రభువు చరణములకు ప్రణమిల్లి పోయిరి. పిదప అంగదుడు లేచి నతమస్తకుడై సజలనేత్రుడై చేతులు జోడించి అతి వినయముతో పలికెను: "సర్వజ్ఞా, కృపాసాగరా, ప్రభూ! చనిపోవునపుడు మా తండ్రిగారైన వాలి నన్ను మీ రక్షణలోనుంచి పోయెను. అశరణ్యాశరణ్యులు గావున మీ ప్రతిజ్ఞను మనస్సులో నుంచుకొని నన్ను త్యజించకండి. నాకు ప్రభువు, గురువు, తల్లి, దండ్రి అన్నియూ మీరే. మీ చరణకమలములను వదిలి నేను ఎక్కడికి పోను? ప్రభువైన మిమ్ము వదలి ఇంటిలో నాకు ఏమి పని? జ్ఞానము, బుద్ధి బలములేని ఈ బాలకుని మీ రక్షణలో నుంచుడు." అంగదుని వినయపూర్వక వచనములను విని కరుణానిధి శ్రీరాముడు అతనిని లేవనెత్తి తన హృదయమునకు హత్తుకొనెను. ప్రభువు నేత్రములందు ప్రేమాశ్రువులు నిండెను. తన వక్షస్థలమునందలి మాలను, అనేక వస్త్రములను, మణులను, అంగదునికి ధరింపచేసి అనేక విధముల నచ్చచెప్పి శ్రీరాముడు అతనికి వీడ్కోలునిచ్చెను. అంగదుని భక్తితో కూడిన సేవలను గుర్తించి లక్ష్మణభరతశత్రుఘ్నులు అతనితో పోయి సాగనంపిరి. పిమ్మట భరతుడు, అతని సోదరులు అత్యంత ఆదరముతో వానరులను అందరినీ తమ నివాసములకు చేర్చిరి.

హనుమంతుడు సుగ్రీవుని పాదములకు నమస్కరించి వినయముతో పలికెను: "నేను పది రోజులు శ్రీరామచంద్రుని సేవలో గడిపి తిరిగి మీ వద్దకు వచ్చెదను." సుగ్రీవుడు సమాధాననిచ్చెను: "ఆంజనేయా! నీవు పుణ్యరాశివి. పోయి దయానిధానమైన శ్రీరామచంద్రుని సేవించుము." హనుమంతుడు తిరిగి వచ్చి వానరశ్రేష్ఠుల అనన్య భక్తిని గూర్చి ప్రభువునకు నివేదించెను. శ్రీరాముడు అమితానందమును పొందెను. పిమ్మట కృపాళులైన శ్రీరామచంద్రుడు నిషాదరాజును

పిలిపించి వస్త్రభూషణములను కానుకలుగా సమర్పించి పలికెను: "ఇప్పుడు మీరు ఇంటికిపోయి నన్ను స్మరించుచూ మనోవాక్కర్మలచే ధర్మాచరణమును చేయుడు. మీరు నా మిత్రులు. భరతునితో సమానులు. అయోధ్యకు తరచుగా వచ్చుచుండవలెను." ప్రభువచనములు విని నిషాదరాజు నేత్రములు ప్రేమాశ్రువులతో నిండెను. రామచంద్రప్రభుచరణములను హృదయమున ధరించి అతడు తన ఇంటికి పోయెను. అచ్చట తన కుటుంబ సభ్యులందరికీ శ్రీరఘునాథుని స్వభావమును గూర్చి వినిపించెను. "శ్రీరఘునాథుని చరిత్రమును చూసిన అయోధ్యవాసులు అందరూ సర్వసుఖములను అనుభవించిరి. వారందరూ ధన్యులు," అని నిషాదరాజు వారికి తెలిపెను.

శ్రీరామచంద్రుడు సింహాసనాసీనుడగుటచే ముల్లోకములు సంతసించెను. ప్రజల శోకతాపములు మటుమాయము ఆయెను. అందరూ భేదభావమును, వైరమును మాని, పరస్పరము మైత్రిలో మెలగిరి. రామరాజ్యమునందు ప్రజలందరూ తమ వర్ణాశ్రమధర్మములను నెరవేర్చుచుండిరి. ఎవ్వరూ కూడ దైహిక, దైవిక, భౌతికమగు తాపములను అనుభవించుట లేదు. వారెల్లరూ వేదములలో చెప్పిన నీతిమార్గమునందు తత్పరులై యుండిరి. ధర్మము నాలుగు పాదములపై అనగా సత్యము, శౌచము, దయ, దానములపై పరిపుష్టిగా నుండెను. ప్రజలు స్వప్నములో కూడ పాపమును ఆచరించుటలేదు. స్త్రీ పురుషులు రామభక్తిలో లీనమై ఉండిరి. అయోధ్యావాసులందరూ పరమపదమునకు అధికారులై ఉండిరి. చిన్నతనమున అకాలమరణము సంభవించకుండెను. అందరి శరీరములు ఆరోగ్యముగా సుందరముగా నుండెను. ఎవరికి ఎట్టి బాధ లేకుండెను. దరిద్రులు, దీనులు, దుఃఖితులు, మూర్ఖులు, శుభలక్షణ హీనులు ఎక్కడ కూడా లేకుండిరి. అందరూ వినమ్రులు, ధర్మపరాయణులు పుణ్యాత్ములై ఉండిరి. స్త్రీలు పురుషులు ఎల్లరూ చతురులు, గుణవంతులు, పండితులు,

జ్ఞానులు, కృతజ్ఞులు, కపటమును ఎరుగని వారు. కోసల రాజ్యమున సప్తసముద్రముల మధ్యగల భూమికంతకూ శ్రీరఘునాథుడే ఏకఛత్రాధిపతిగా నుండెను. పురుషులు ఏక పత్నీవ్రతులుగా తమ ధర్మములను ఆచరించుచుండిరి. శ్రీరామచంద్రుని రాజ్యములో దండము కేవలము సన్యాసుల చేతులలో మాత్రమే ఉండెను. అనగా శిక్షకు అర్హులు ఎవ్వరూ లేరు. భేదము అను పదము కేవలము వర్తకసమూహములలో, రాగతాళములందు వినిపించుచుండెను. 'జయము' అను పదము కేవలము మనస్సును జయించుట అను సందర్భమునందు వాడబడుచుండెను. వనములో చెట్లు ఎల్లప్పుడు పుష్పించి ఫలించుచుండెను. ఏనుగులు, సింహములు, పక్షులు, వన్య మృగములు సహజవైరమును మరచి పరస్పరము ప్రేమ కలిగియుండెను. పక్షులు మధురముగా కూయుచుండెను. వివిధ పశుసమూహములు నిర్భయముగా సంచరించుచూ ఉల్లాసముగా నుండెను. శీతలమంద సుగంధిత పవనములు వీచుచుండెను. పుష్పముల మకరందముచే మత్తిల్లిన తుమ్మెదలు ఝుంకార ధ్వనులు చేయుచుండెను, భూమి సమృద్ధిగా పంటలనొసంగుచుండెను. గోవులు కావలసినంత పాలను ఇచ్చుచుండెను. పర్వతములు అనేకములైన ఖనిజములనొసంగుచుండెను. నదులన్నియూ శీతల, నిర్మల, సుఖప్రదమయిన తీయని నీటిలో ప్రవహించుచుండెను. సాగరములు తమ పరిధిలో నుండి, మనుష్యులకై తీరమునందు రత్నములు వదలుచుండెను. శ్రీరాముని రాజ్యములో చంద్రుడు తన కిరణములచే పృథ్విని నింపెను. సూర్యుడు అవసరము ఉన్నంత వేడినే యొసంగుచుండెను. మేఘములు వలసినంత వర్షమును ఇచ్చుచుండెను. అతివృష్టి, అనావృష్టి బాధలు లేవు.

శ్రీరామచంద్రప్రభువు అనేక అశ్వమేధయాగములు చేసి వేదమార్గమును సంరక్షించెను. ధర్మమును పాటించెను. త్రిగుణాతీతుడయిన శ్రీరాముడు ఐశ్వర్యమున ఇంద్రునితో సమానుడాయెను. సౌందర్యరాశి,

సుశీల, వినయశీల సీతాదేవి సదా పతిమనస్సునకు అనుకూలముగా ప్రవర్తించుచుండెను. హృదయ పూర్వకముగా ప్రభుచరణములను సేవించుచుండెను. గృహములో అనేక దాసదాసీజనులున్ననూ, వారు తమ సేవా విధులన్నియు చేయుచున్ననూ, సీతాదేవి తన పనులన్నియూ తానే స్వయముగా చేయుచూ శ్రీరామచంద్రుని ఆజ్ఞను పాలించుచుండెను. కౌసల్య మొదలగు అత్తగార్లను సేవించుచుండెను. ఆమెకు ఏ విషయములో కూడా గర్వము కాని మదము కాని లేకుండెను. ఆమె బ్రహ్మాదిదేవతలకు కూడా పూజనీయురాలు. లక్ష్మణ భరతశత్రుఘ్నులు శ్రీరామచంద్రుని చరణకమలములందు అమిత ప్రేమతో సేవచేయుచుండిరి. శ్రీరాముడు కూడా సోదరులపై మిక్కిలి అనురాగము కలిగి వారికి అనేక విధముల నీతి బోధలు చేయుచుండిరి. సీతాదేవి లవకుశులను ఇద్దరు కుమారులను ప్రసవించెను. వారిద్దరూ రణములో విజయులు. వినయమునకు, సద్గుణములకు నిధానములు. అత్యంత సుందరులు. శ్రీరామచంద్రునికి ప్రతిబింబములు, శ్రీరాముని సోదరులకు కూడా ఒక్కొక్కరికీ ఇద్దరు కుమారులు కలిగిరి. వారందరూ సుందరులు, సుశీలురు, సద్గుణసంపన్నులు.

శ్రీరామచంద్రుడు ప్రాతఃకాలముననే సరయూనదిలో స్నానమాచరించి బ్రాహ్మణులతో సజ్జనులతో సభలో కూర్చొనును. వశిష్ఠుడు వేదపురాణములను వర్ణించును. సర్వజ్ఞుడు అయిననూ శ్రీరాముడు వాటిని శ్రద్ధగా వినెను. ప్రభువు సోదరులతో కలిసి భుజించును. ఈ దృశ్యము అందరికీ నయనానందకరముగానుండెను. భరత శత్రుఘ్నులు హనుమంతునితో కలిసి ఉపవనమునకు పోయెదరు. అచ్చట కూర్చొని శ్రీరామచంద్రుని లోకోత్తరగుణముల కథలను అడిగెదరు. హనుమంతుడు తన సుబుద్ధిని అనుసరించి ప్రభుగుణగానములో నిమగ్నుడై వర్ణించును. ప్రభునిర్మలగుణములను

విని సోదరులిద్దరూ అతి ప్రసన్నులు అగుచుండిరి. నగరవాసుల ఇండ్లలో పురాణకథలు, శ్రీరాముని పవిత్ర కథలు అనేకములు వినపడుచుండెను. నారదుడు, శౌనకాది మహర్షులు, కోసలాధీశుని దర్శనమునకై నిత్యము అయోధ్యకు ఏతెంచుచుండిరి. బంగారు మణులతో నిర్మితమైన ముంగిళ్ళు, విచిత్రవర్ణములలో కూడిన పాదచారుల మార్గములుండెను. నగరమునకు నాలుగు వైపుల అందమైన ప్రహరీ గోడ కలదు. దానిపై వివిధ వర్ణముల చిత్రములు రచించబడియున్నవి. కాంతివంతమగు భవనములు ఆకాశమును అంటుచుండెను. వాటిపైగల కలశములు తమ కాంతిచే సూర్యచంద్రులను కూడా అధఃకరించుచుండెను. ప్రతి గృహములో మణులు దీపకాంతులను వెదజల్లుచుండెను. ప్రతి ఇంటిలో శ్రీరాముని చరిత్రమును వర్ణించు చిత్రములు ఎన్నియో గలవు. ప్రజలు వివిధ పుష్పవాటికలను పెంచుచుండిరి. వాటియందు అనేక జాతులకు చెందిన మనోహరలతలు పుష్పించి, సదా వసంత ఋతుశోభను కలిగియుండెను. బాలురు అనేక రకముల పక్షులను పెంచుచుండిరి. వాటి మధురమయిన పలుకులు, ఎగురునపుడు వాటి సౌందర్యము అందరి మనస్సులను ఆకర్షించుచుండెను. భవనములపై నెమళ్లు, హంసలు, పావురములు అతిసుందరముగా నుండి, మణులచే నిర్మించబడిన గోడలపై తమ ప్రతిబింబములను చూచి కూయుచూ నాట్యమాడుచుండును. బాలురు చిలుకలకు, గోరువంకలకు "రామ, రఘుపతి" అను మాటలు నేర్పుచుండిరి. రాజభవన ప్రవేశ ద్వారము అతి సుందరము. వీధులు, కూడళ్ళు, అంగళ్ళు అతి మనోహరములు. అంగళ్లలో మూల్యము చెల్లించకున్ననూ అన్ని వస్తువులు లభ్యమగుచుండెను. అక్కడి పరిపాలకుడే స్వయముగా లక్ష్మీపతి అయినప్పుడు అక్కడి సంపదను ఎట్లు వర్ణించగలము? వస్త్ర వ్యాపారస్తులు, ద్రవ్యమును యిచ్చిపుచ్చుకొనువారు ఇతర వర్తకులు కుబేరులవలెనుండిరి.

అయోధ్యకు ఉత్తర దిశన సరయూనది ప్రవహించుచున్నది. అందలి జలములు నిర్మలములు లోతైనవి. సుందరఘట్టముల నుండి తీరములందు కొంచెము కూడ బురదలేకుండెను. అతి దూరమునగల ఒక విశాలమైన ఘట్టములో స్త్రీలు నీరు తీసుకొని పోవుటకు వచ్చెదరు. పురుషులు అచ్చట స్నానము చేయరు. అన్నిటికంటే సుందరమైనది రాజఘట్టము. అచ్చట అన్ని వర్ణముల పురుషులు స్నానము చేసెదరు. సరయూ తీరమునందు అనేక దేవాలయములు, వాటి చుట్టూ సుందరోద్యానములు గలవు. నదీతీరమున అచ్చటచ్చట విరాగులు అయిన మునులు, సన్యాసులు నివసించుచుందురు. వారు సదా జ్ఞానమగ్నులై ఉందురు. నదీతీరమునందు వారు తులసీ వృక్షములను నాటినారు. అయోధ్యా నగరము లోపల, వెలుపల కూడా వర్ణించరాని సౌందర్యము కలదు. వనములు, ఉపవనములు, బావులు, చెరువులు విశాలములు, మనోహరములు అయివున్నవి. తటాకములందు వివిధవర్ణములుగల కమలములు వికసించుచుండెను. పక్షుల కలరవములు భ్రమరముల ఝుంకారములు, కోకిలల మధుర స్వరములు, రమణీయమైన తోటలలో ప్రయాణీకులను ఆహ్వానించు చుండెను. లక్ష్మీపతియే ప్రభువైన ఆ నగరము అణిమాద్యష్ట సిద్ధులకు, సుఖసంపదలకు నిలయమై యుండెను. ఎక్కడ చూచిన ప్రజలు శ్రీరఘునాథుని గుణగానమే చేయుచుండిరి. "శరణాగతపాలకుడు, రూపగుణశీల శోభితుడగు శ్రీరాముని భజింపుడు" అని ఒకరితోనొకరు ఉపదేశములను ఇచ్చుచుండిరి. నగరములోని స్త్రీపురుషులందరూ శ్రీరామచంద్రుని గుణగానము చేయుచుండిరి. కృపానిధి అయిన శ్రీరాముడు వారి యెడల అత్యంత ప్రసన్నుడు అయివుండెను. శ్రీరామచంద్రుని ప్రభుత్వము అనేకులకు సుఖము, మరికొందరికి దుఃఖము కలిగించెను. దుఃఖితులయినవారు అవిద్య, పాపములు, కామక్రోధములు, అభిమానము, మోహము, మదము, మత్సరము బంధకారణములగు వివిధ కర్మలు, గుణములు మొదలగునవి. ఎవరి

హృదయమున శ్రీరామచంద్రుని భక్తినిండియుండెనో వారిలో ధర్మము, జ్ఞానవిజ్ఞానములు, వివేకవైరాగ్యములు అధికమాయెను. అవిద్య, పాపము, కామక్రోధములు, కాలకర్మ గుణస్వభావములు నష్టమాయెను.

ఒకసారి శ్రీరామచంద్రప్రభువు సోదరులను వెంటపెట్టుకొని హనుమంతునితో సహా సుందరమైన ఉపవనమును చూచుటకు పోయెను. తోటలోని వృక్షములన్నియూ పుష్పించి క్రొత్త ఆకులతో శోభిల్లుచుండెను. అది సరియైన సమయమని గ్రహించి శౌనకాదిమునులు అచ్చటికి ఏతెంచిరి. వారు తేజోరాశులు, సుందరగుణశీల సంపన్నులు, సదా బ్రహ్మానందమగ్నులు. చూచుటకు బాలురవలెనున్ననూ వారు వయోవృద్ధులు. సాక్షాత్తు నాలుగు వేదములు ప్రత్యక్షమయినట్టుండిరి. ఆ మునులు సమదర్శులు. భేదభావములకు అతీతులు. శ్రీరాముడు సనకాది మునులను చూడగానే వారికి సాష్టాంగ ప్రణామములు ఆచరించి, కుశలములడిగి వారు కూర్చొనుటకు తన పీతాంబరమును పరచెను. తదనంతరము హనుమంతునితో సహా సోదరులు ముగ్గురూ వారికి సాష్టాంగ ప్రణామములు ఆచరించిరి. వారు ప్రసన్నులై శ్రీరఘునాథుని అనుపమసౌందర్యములో నిమగ్నులైరి. భవభయమును పారద్రోలునట్టి శ్యామల శరీరము గల్గిన కమలనయనుడు, సౌందర్యరాశి అయిన శ్రీరామచంద్రుని రెప్పలార్పక చూచుచూ వారు నిలబడిరి. ప్రభువు చేతులు జోడించి వారితో మధురముగా పలికెను: "మునీశ్వరులారా! నేడు నేను ధన్యుడనైతిని. మీ దర్శనముచే పాపములన్నియూ నశించును. భాగ్యవశమున సజ్జనసాంగత్యము లభించును. దానివలన పరిశ్రమ లేకుండగనే జననమరణ చక్రము నశించును." శ్రీరామచంద్రప్రభువు వచనములను విని నలుగురు మునులు హర్షితులై పులకిత శరీరులై స్తుతిచేయ సాగిరి: "ఓ దేవాధిదేవా! మీకు జయము. మీరు అనంతులు, నిర్వికారులు, నిష్కాములు, అనేక రూపములు గల్గిననూ అప్రతిమరూపులు. కరుణామయా!

త్రిగుణరహితులు మీకు జయము. మీరు అతి సుందరులు, చతురులు, పృథ్వీని ధరించువారు. జన్మరహితులు, జ్ఞానమునకు ఆధారము. వేద పురాణములు మీ పావన సుందరయశమున గానము చేయును. మీరు తత్త్వజ్ఞులు. అజ్ఞానమును పారద్రోలువారు. మీకు అనేక నామములు ఉన్ననూ నామములకు అతీతులు, మీరు సర్వవ్యాప్తులు, సర్వరూపులు, అందరి హృదయములలో నివసించువారు. మమ్ములను పాలించుడు. రాగద్వేషములు, హర్షవిషాదములు, జన్మమృత్యువులు మొదలగు ద్వంద్వములనుండి, సంసారమోహమునుండి మమ్ములను రక్షించుడు. శ్రీరామా! మీరు మా హృదయములలో నుండి కామమును, మదమును నాశనమొనర్చి మాకు మీ నిశ్చలభక్తిని ప్రసాదింపుడు. రఘునాథా! మమ్ములను దైహిక, భౌతిక తాపములనుండి, జననమరణ భ్రమణజనితమైన క్లేశములనుండి రక్షించి భక్తిని ప్రసాదింపుడు. సేవ చేయుటకు మీరు సులభులు, సుఖప్రదాతలు. మాలో సమదృష్టిని విస్తరింపచేయుడు. ఆశ, భయము, ఈర్ష్యలను తొలగించి, వినయము, వివేకము విస్తరింపచేయుడు. మునుల మనస్సులనెడి మానససరోవరమున నివసించు హంసా! మీ చరణకమలములను బ్రహ్మ, శివుడు కూడా పూజించెదరు. మీరు వేదమర్యాదలను రక్షించువారు. కాలకర్మ, స్వభావ, గుణ, బంధముల నుండి ముక్తిని ప్రసాదించువారు. త్రిభువనములకు భూషణమైన మీరు తులసీదాసునకు స్వామి." ఈ విధముగా అనేక స్తుతులు చేసి ప్రేమపూర్వకముగా ప్రణమిల్లి తాము కోరిన వరములను పొంది సనకాది మునులు బ్రహ్మలోకమునకు పోయిరి.

## 5. ధర్మోపదేశములు

పిదప సోదరులందరూ శ్రీరామచంద్రునికి శిరసా ప్రణమిల్లిరి. ప్రభువును అడుగుటకు సంకోచించి హనుమంతుని చూచిరి. అంతర్యామి అయిన ప్రభువునకు తెలిసిననూ, "హనుమా! విష

యమేమి? చెప్పుము" అని పలికెను. అప్పుడు హనుమంతుడు చేతులు జోడించి పలికెను: "దీనదయాళూ, ప్రభూ, భరతుల వారేమో అడగదలచినారు, కాని ప్రశ్నించుటకు వారి మనస్సు సంకోచించుచున్నది." శ్రీరామచంద్రుడు పలికెను: "హనుమా, నీవు నా స్వభావము నెరుగుదువు. నాకు భరతునికి మధ్య ఎట్టి భేదము లేదు." ప్రభు వచనములు విని భరతుడు ప్రణమిల్లి పలికెను: "ప్రభూ, శరణాగతదుఃఖహరణా! నాకు ఎట్టి సందేహము లేదు. మీ కృపవలన స్వప్నములో కూడా శోకమోహములు లేవు. అయినప్పటికీ సాహసించి ఒక విన్నపము చేసెదను. నేను మీ సేవకుడను. మీరు సేవకులకు సుఖము నిచ్చువారు. రఘునాథా! వేదపురాణములు సజ్జనుల మహిమను గూర్చి చాలా గానము చేసినవి. మీరు కూడా మీ ముఖతః వారిని ప్రశంసించినారు. వారిపై మీ ప్రేమ అపారము. నేను వారి లక్షణములను వినగోరెదను. మీరు దయాసాగరులు, జ్ఞానగుణనిపుణులు. సాధువు, అసాధువులోగల భేదములను వివరించి చెప్పండి." శ్రీరామచంద్రుడు పలికెను: "సోదరా! వినుము. సజ్జనుల లక్షణములు అనేకములు. అవి వేదపురాణములలో ప్రసిద్ధము. సజ్జనుల, దుర్జనుల స్వభావము చందన వృక్షము, గొడ్డలి వంటివి. గొడ్డలి చందన వృక్షమును నరికివేయును కాని చందనవృక్షము తనను నరికిన గొడ్డలికే తన సువాసన నిచ్చును. ఈ స్వాభావిక గుణము వల్లనే చందనము అందరికీ ప్రియమై దేవతల శిరస్సును అధిరోహించును. కాని గొడ్డలిని నిప్పులో కాల్చి సమ్మెటతో కొట్టెదరు. సజ్జనులు విషయవాసనాలోలురు కారు. వారు శీలసద్గుణాకరులు. ఇతరుల దుఃఖమును తమ దుఃఖముగా, ఇతరుల సుఖమును తమ సుఖముగా భావించెదరు. వారు అన్నిటియందు అన్నిచోట్ల అన్ని సమయములందు సామర్థ్యము కలిగి యుందురు. వారి మనస్సులలో శత్రుత్వము ఉండదు. అభిమాన రహితులు, విరాగులు. వారిలో లోభము, క్రోధము, హర్షము, భయము లేశమాత్రము కూడా వుండవు. వారి

హృదయము కోమలము. దీనులు, దుఃఖితులయెడ దయ చూపెదరు. మనోవాక్కర్మలచే - నాపై నిష్కపట భక్తిని కలిగియుందురు. వారు స్వయముగా అభిమానరహితులై ఇతరులను సన్మానించెదరు. భరతా! ఇట్టి సజ్జనులు నాకు ప్రాణసమానులు. వారు ఎట్టి కోరికలు లేనివారు నా పేరునందే ఆసక్తులు. సజ్జనులు, శాంతి, వైరాగ్యము, వినయము, ప్రసన్నత గలవారు. వారిలో శీతలత్వము, సరళత, మిత్రభావము, బ్రాహ్మణులయందు ప్రీతి యుండును. ఇదియే ధర్మమునకు మూలము. ఈ లక్షణములు ఎవ్వని యందుండునో అతనిని నిజమైన సజ్జనునిగా ఎరుగుము. వారు శమ దమ నియమ నీతి మార్గములనుండి ఎప్పుడూ తొలగరు. ఎప్పుడూ కఠినవచనములను పలుకరు. ఎవరికయితే నిందాస్తుతులు సమానమో, ఎవరికి నా చరణములందు అపార-ప్రేమ యుండునో, అట్టి గుణధాములు, సుఖపుంజములు నాకు ప్రాణసమానులు.

ఇప్పుడు దుర్జనుల విషయమును వినుము. పొరపాటున కూడా వారితో మైత్రి చేయరాదు. వారి సహవాసము దుఃఖమును కలిగించును. దుష్టులయినవారి హృదయమున సంతాపము అధికము. వారు ఇతరుల సుఖసంపదలను చూచి అసూయపడెదరు. ఎక్కడయినా ఇతరులను గూర్చిన నిందను విన్నచో త్రోవలో నిధి దొరికినంత సంతోషింతురు. వారు కామక్రోధమదలోభములందు ఆసక్తులు, నిర్దయులు, కపటులు, కుటిలులు, పాపులు. వారు అకారణముగా ఇతరులతో వైరము బూనెదరు. మేలు చేసినవారికే కీడు తలపోయుదురు. వారి ఆదాన ప్రదానములన్నియూ సత్యదూరములు. వారు అన్ని విషయములందు అనృతమే పలికెదరు. వారి వచనములు తీయనివైననూ హృదయము నిష్ఠురమైనది. పరస్త్రీలయందు, ధనమునందు నిందయందును ఆసక్తులై ఉందురు. వారు నీచులు, పాపమయులైనవారు, మానవ శరీరమును ధరించిన రాక్షసులు. వారు విషయాసక్తులు. యమలోకభయము వారికి

ఉండదు. ఎవరిదైన అభివృద్ధిని విన్నచో జ్వరపీడితులవలె నిట్టూర్పు వదలెదరు. ఇతరుల విపత్తును చూచినచో విశ్వమునకంతటికీ రాజైనంత సంతోషము పొందెదరు. వారు స్వార్ధపరులు. తమ కుటుంబ సభ్యులతో విరోధము కలిగి కామలోభలంపటులై అత్యంత క్రోధులై యుండెదరు. వారు తల్లిదండ్రులను, గురుబ్రాహ్మణులను ఎవ్వరినీ గౌరవించరు. తాము నశించుటయేగాక ఇతరులను నష్టపరిచెదరు. వారికి సజ్జనుల సహవాసమునందు, హరికథలయందు అభిలాష యుండదు. వారు దుర్గుణసాగరులు, మందబుద్ధులు, కాముకులు, వేదములను దూషించువారు. పరధనమును అపహరించువారు. బ్రాహ్మణులకు విశేషముగా దేవతలకు ద్రోహము చేసెదరు. వారి హృదయము మోసకపటపూరితము. కాని పైకి చూచుటకు సుందరవేషములను దాల్చెదరు. ఇట్టి దుష్టులయిన వారు సత్యయుగము నందు త్రేతాయుగమునందు ఉండరు. ద్వాపరములో కొద్దిగా నుందురు. కాని కలియుగములో వీరి సమూహము అపారము. సోదరా! పరోపకారముతో సమానమైన ధర్మము ఏదియు లేదు. ఇతరులకు కీడు చేయుటకన్న పాపము వేరులేదు. మానవ శరీరమును పొందిననూ ఇతరులకు కీడు చేయువారు జననమరణసంకటముల ననుభవించెదరు. మనుష్యులు మోహవశమున స్వార్థములో మునిగి అనేక పాపములను చేయుదురు. వారి మంచి చెడ్డ కర్మలకు తగిన ఫలితములను నేను ఒసంగెదను, సజ్జనులయినవారు ఈ సంసారము దుఃఖరూపమని తెలుసుకొని నన్ను భజింతురు. కావున శుభాశుభఫలములను ఇచ్చు కర్మలను వదలి, వారు దేవతలకు, మనుష్యులకు, మునీశ్వరులకు అధిదేవతనైన నన్ను భజింతురు. నేను సజ్జనుల, దుర్జనుల లక్షణములను తెలిపినాను."

శ్రీరామచంద్రప్రభుముఖతః ఈ వచనములను విన్న పిదప సోదరులందరూ ప్రసన్నులైరి. ముఖ్యముగా ఆంజనేయుని హృదయములో పట్టరాని ఆనందము కలిగెను. పిదప శ్రీరామచంద్రుడు తన

భవనమునకు పోయెను. ఆ విధముగా ప్రభువు నూతనమైన లీలలను ప్రతిదినము చూపెను. నారదముని తరచుగా అయోధ్యకు వచ్చి పరమపావనమైన శ్రీరామచరితమును గానమొనర్చుచుండెను. నారదముని ప్రతిదినము ప్రభు నూతన లీలలను చూచి బ్రహ్మలోకమును చేరి వానిని వర్ణించుచుండెను. బ్రహ్మదేవుడు వానిని విని అమితానందమునొంది పలుకుచుండెను: "నాయనా! శ్రీరాముని గుణములను మాటిమాటికి తెలుపుము." సనకాదిమునులు నారదుని ప్రశంసించుచుండిరి. వారు బ్రహ్మనిష్ఠులయినను శ్రీరాముని గుణగానము వినినపుడు బ్రహ్మసమాధిని మరచి ప్రేమమగ్నులు అగుచుండిరి.

ఒకసారి శ్రీరామచంద్రుడు వశిష్ఠమునిని, బ్రాహ్మణులను ఇతర నగరవాసులను పిలిపించెను. సభలో సోదరులు, మునులు, ఇతర సజ్జనులు యోగ్యతానుసారమును కూర్చొని యుండగా శ్రీరాముడు పలికెను: "సమస్త నగరవాసులారా! నేను చెప్పునది వినుడు, నేను భావుకతా వశుడనై చెప్పుటలేదు. అధికారపూర్వకముగా చెప్పుటలేదు. ఇది నీతి వాక్యము. నా వచనములు విన్న పిదప మీ యిష్టము వచ్చినది చేయుడు. భాగ్యవశమున ఈ మానవ శరీరము లభించినది. ఈ దేహము దేవతలకు కూడా దుర్లభము. ఇది సాధనకు ఉపకరణము. మోక్షమునకు ద్వారము. ఈ శరీరప్రాప్తికి ఫలము. విషయభోగములు కావు. స్వర్గసుఖములు కూడా అల్పములు. వాటి ఫలములు దుఃఖప్రదములు. మానవ శరీరము పొందిననూ విషయములందు ఎవరు మునిగి ఉంటారో, ఆ మూర్ఖులు అమృతము బదులు విషమును పానము చేస్తారు. నాశరహితమైన జీవుడు నాలుగు విధములైన ఎనభైనాలుగు లక్షల జీవరాశులలో పరిభ్రమించుచుండును. మాయాప్రేరితుడై కాలకర్మస్వభావ గుణములకు వశుడై ఈ జీవుడు వివిధయోనులందు సంచరించుచుండును. ఎట్టి కారణము లేకుండగనే

దయాళువు అయిన భగవంతుడు వానికి మానవ శరీరమును ఇచ్చును. భవసాగరమును దాటుటకు ఈ మానవ శరీరము నావ వంటిది. నా అనుగ్రహము అనుకూలమయిన పవనము. సద్గురువు ఈ నావకు కర్ణధారుడు. ఇట్టి దుర్లభసాధనములు భగవత్ కృపచే సులభముగా ప్రాప్తించును. ఇట్టి సాధనములు పొందినప్పటికీ ఏ వ్యక్తి భవసాగరమున మునిగి యుండునో వాడు కృతఘ్నుడు, మందబుద్ధి. వాడు ఆత్మహత్య చేసుకున్న వాని గతిని పొందగలడు. ఇక్కడ మరియు పరలోకమున కూడా సుఖము కోరినచో భక్తిమార్గమును అనుసరించుడు. ఇది అతిసులభము, సుఖప్రదము. జ్ఞానమార్గము సుగమము కాదు. దానికి అనేక విఘ్నములు కలవు. జ్ఞానమార్గసాధనము కఠినము. దానిలో మనస్సునకు ఆధారము దొరకదు. అతి కష్టము మీద ఏ ఒక్కరికో జ్ఞానము లభ్యమగును. కాని అట్టివాడుకూడా భక్తిహీనుడు అయినచో నాకు ప్రియుడు కాడు. భక్తి స్వతంత్రమైనది. అన్ని సుఖములకు నిధానము. కాని సజ్జన సాంగత్యము లేకుండా ప్రాణులకు ఇది లభించదు. పుణ్యసమూహము లేకుండా సజ్జన సాంగత్యము లభించదు. సత్ సాంగత్యమే జననమరణచక్రమునుండి ముక్తిని లభింపచేయును. ఉపవాసములు అవసరము లేదు. కేవలము సరళస్వభావము కావలెను. మనస్సులో కపటము ఉండరాదు. వచ్చిన దానితో తృప్తి చెందవలెను. ఎవరినీ ద్వేషించనివాడు, పోట్లాడనివాడు ఆశ, భయములేనివాడు సుఖములను పొందును. ఫలాపేక్షతో ఎవడు కర్మలు చేయడో, భక్తిభావముతో సజ్జనసాంగత్యమును ప్రేమించునో, విషయభోగములేగాక స్వర్గము, ముక్తిని కూడా తృణప్రాయముగా చూచునో, అన్యమతముల నెవడు దూషించడో, కుతర్కములను ఎవడు విడనాడునో, నా గుణసమూహమునందు నా నామజపము నందు ఎవడు లీనమైయుండునో, అట్లే మమతా మోహములకు ఎవడు అతీతుడో వాడు పరమాత్మస్వరూపమును తెలిసికొని ఆత్మానందమును పొందును."

శ్రీరాముని అమృతతుల్యమైన వచనములను విని నగరవాసులం దరూ ప్రభు పాదములను పట్టుకొని పలికిరి: "కృపానిధానా! మీరే మా తల్లిదండ్రులు, గురువు, సోదరులు, ప్రాణముకన్న ప్రియమైనవారు. మా హితైషులు. ఇట్టి ఉపదేశమును మీరు తప్ప వేరొకరు ఇవ్వలేరు. ఎట్టి కారణము లేకుండా మేలు చేయువారు మీరూ మీ సేవకులు. ఈ జగత్తులో మిగతావారందరూ స్వార్థపరులు. స్వప్నము నందు కూడా వారికి పరమార్థభావము రాదు." ప్రేమరసములో మునిగిన వారి వచనములు విని శ్రీరామచంద్రుని హృదయము మిక్కిలి ప్రసన్నమాయెను. పిదప ప్రభువాజ్ఞగైకొని ప్రభుసుందరవచనములను వర్ణించుచూ అందరూ తమ గృహమునకు పోయిరి.

ఒకసారి వశిష్ఠమహాముని శ్రీరాముని వద్దకు వచ్చెను. శ్రీరా అతనిని అత్యాదరముతో ఆదరించి కాళ్ళు కడిగి ప్రణమిల్లెను. వశిష్ఠముని చేతులు జోడించి పలికెను: "శ్రీరామా! మీ మానవోచిత కార్యములను చూచి నా హృదయము మోహములో పడిపోవుచున్నది. మీ మహిమ అపారము. రఘువంశమునకు పురోహితుని కార్యమును నేను స్వీకరించునపుడు బ్రహ్మదేవుడు నాతో పలికెను: 'కుమారా! నీవు ఈ పనిని స్వీకరింపుము. దానివలన నీకు మున్ముందు లాభము కలుగును. పరమాత్ముడు స్వయముగా నరరూపముతో రఘుకుల భూషణుడై జన్మించును.' అప్పుడు నేను మనస్సులో ఆలోచించితిని – ఎవరి కొరకు యోగము, యజ్ఞములు, వ్రతములు, దానము మున్నగు ధర్మకార్యములు జనులు చేసెదరో, అట్టి పరమాత్మను నేను ఈ పురోహితుని కార్యము వలన పొందగలిగినప్పుడు దీనివంటి మరొక ధర్మము లేదు. రఘునాథా! ప్రేమ, భక్తియనెడు నీరు లేకుండా అంతఃకరణమునందలి అజ్ఞానమను మైల తొలగదు. ఎవడైతే మీ చరణకమలములపై భక్తి కలిగియుండునో వాడే సర్వజ్ఞుడు, తత్వజ్ఞుడు, పండితుడు, విజ్ఞాని, గుణవంతుడు. కావున మీ చరణకమలములపై

నా భక్తి జన్మజన్మాంతరములందు కూడా తరగకుండా ఉండునట్లు వరమును ప్రసాదింపుడు." ఆ విధముగా పలికి వశిష్ఠముని ఇంటికి పోయెను. ఆయన శ్రీరామునికి అత్యంత ప్రీతిపాత్రుడయ్యెను.

పిదప సుఖప్రదుడయిన శ్రీరామచంద్రుడు హనుమంతుని, భరతుడు మున్నగు సోదరులను తనతో తీసుకొని నగరము వెలుపలకు పోయెను. రథములను, ఏనుగులను, గుఱ్ఱములను తెప్పించి, వాటిని ప్రశంసించుచూ ప్రజలకు దానము చేసెను. తరువాత చల్లని మామిడితోపు నీడన విశ్రమించెను. సోదరులు, హనుమంతుడు ప్రభుసేవ చేయసాగిరి. వారి సేవను ప్రభువు స్వయముగా మాటి మాటికి పొగడెను. ఆ సమయముననే నారదముని వీణను చేత తీసుకొని శ్రీరాముని కీర్తిని గానము చేయసాగెను: "ఓ కమలనయనా! శోకనాశకా! నాపై మీ కృపాదృష్టిని ప్రసరింపచేయుడు. మీరు రాక్షసుల బలమును నాశము చేసి, గురువులకు సజ్జనులకు ఆనందము నిచ్చితిరి. దీనజనులను పాలించి పృథ్వీ భారమును బాపితిరి. మీకు జయమగుగాక! మీ కీర్తి వేద పురాణములందు శాస్త్రములందు వర్ణించబడినది. దేవతలు, మునులు, సజ్జనులు దానిని గానము చేసెదరు. మీ శరణాగతుడనైన నన్ను రక్షింపుడు." ఆ విధముగా శ్రీరామచంద్రుని గుణములను వర్ణించి నారదముని బ్రహ్మలోకమునకు పోయెను.

## 6. కాకభుశుండి వృత్తాంతము

శివుడు ఈ విధముగా పలికెను: "గిరిజా! నా బుద్ధికి తోచినట్టు నీకీ ఉజ్వలమైన కథను వినిపించినాను. శ్రీరాముని కథలు, గుణములు అపారములు. అతని జన్మలు, కర్మలు, నామములు అనంతములు. ఈ పావన నిర్మల కథ శ్రీహరి పరమపదమును లభింపచేయును. దీనిని వినుటచే హృదయములో అచంచలమైన భక్తిగల జన్మ లభించును. ఉమా! కాకభుశుండి గరుడునికి వినిపించిన కథను నేను నీకు

వినిపించినాను. నేను శ్రీరాముని గుణములను కొన్నింటినే తెలిపినాను. భవానీ! ఇప్పుడు నేను ఏమి చెప్పవలెను?" శ్రీరాముని కళ్యాణ ప్రదమైన కథను విని పార్వతిదేవి ప్రసన్నురాలై మధురముగా పలికెను: "స్వామీ! జన్మమృత్యుభయమును హరించు శ్రీరాముని చరిత్రను విన్న నేను ధన్యురాలను, కృతార్థురాలను. జీవన్ముక్తులయిన మునులు కూడా భగవంతుని గుణములను నిరంతరము రసాస్వాదన చేయుచూ వినుచుందురు. భవసాగరమును దాటదలంచినవారికి శ్రీరామకథ నౌకవంటిది. చెవులున్న ఏ మానవునికి శ్రీరామకథ సంతోషము కలిగించదో, ఎవనికి శ్రీ రఘునాథుని కథ రుచించదో, ఆ జడప్రాణి ఆత్మ ఘాతకుడు. నాథా! మీరు శ్రీరామచరితమానసమును గానము చేసితిరి. కాకభుశుండి గరుడునికి చెప్పిన ఆ సుందరకథను నాకు వినిపించితిరి. ఈ విషయములో నాకు మిక్కిలి సందేహము కలుగుచున్నది. ధర్మపరాయణులు, విరక్తులు, జ్ఞానులు, జీవన్ముక్తులు – వీరందరిలో గర్వము, మాయనుండి ముక్తులై శ్రీరామభక్తిలో లీనమైనవారు అరుదు. అట్టి అనన్య హరిభక్తిని ఒక కాకి ఎట్లు పొందెను? శ్రీరామచంద్రునిపై ఆసక్తుడు, జ్ఞానరతుడైన భుశుండుడు కాకి శరీరమును ధరించుటకు కారణము ఏమి? ఆ కాకి ప్రభువు యొక్క దివ్యమైన చరిత్రమును ఎక్కడ నుండి పొందెను? దానిని మీరు ఏవిధముగా వింటిరి? గరుత్మంతుడు గొప్ప జ్ఞాని, హరిభక్తుడు, హరివాహనము, హరికి అతి సన్నిహితుడు, అతడు ఋషులను, మునులను వదిలిపెట్టి ఒక కాకి వద్ద ఈ రామ కథను ఏల వినెను? కాకభుశుండి గరుడుల మధ్య సంభాషణ ఏ విధముగా జరిగెను? నాకు ఈ విషములన్నియూ విన కుతూహలముగా నున్నది."

పార్వతీదేవి సరళమైన మనోహరమైన వాణిని విని శివుడు సంతోషించి సాదరముగా పలికెను: "ఓ సతీ! నీవు ధన్యురాలవు. నీ బుద్ధి మిక్కిలి పవిత్రమయినది. శ్రీరఘుపతి చరణముల పట్ల

నీ భక్తి గొప్పది. ఇప్పుడు ఆ పరమ పవిత్రమైన కథను వినుము. దానిని వినుటచే దుఃఖము, భ్రమ తొలగిపోవును. పక్షిరాజు గరుడుడు కూడా కాకభుశుండి వద్దకు పోయి యిట్టి ప్రశ్ననే అడిగెను. జననమరణములనుండి ముక్తినిచ్చు నీ కథను నేను ఏ విధముగా విన్నానో ఆ ప్రసంగమును వినుము. మొదట నీ అవతారము దక్షుని యింట జరిగెను. అప్పుడు నీ పేరు సతి. దక్షుని యజ్ఞములో నీకు అవమానము జరిగెను. అప్పుడు కృద్ధురాలవైన నీవు ప్రాణత్యాగమును చేసితివి. నా అనుచరగణము యజ్ఞధ్వంసము చేసిరి. ఆ కథలన్నియూ నీకు తెలిసినవే. అపుడు నా మనస్సు అతి చింతాక్రాంతమై యుండుటచే నీ వియోగదుఃఖమున విరక్తుడనై సుందరమైన వనములందు, పర్వతములందు దృశ్యములను చూచుచూ తిరుగుచుంటిని. సుమేరు పర్వతమునకు ఉత్తరదిశకు ఒక అందమైన నీల పర్వతము కలదు. అందలి నాలుగు స్వర్ణమయశిఖరములు నా మనస్సును ఆకర్షించెను. ఆ పర్వతముపై ఒక సరస్సు కలదు. ఆ పర్వతముపైన కాకభుశుండి అను పక్షి నివసించును. కల్పాంతమునందు కూడా అది నశించదు. విశ్వమందు వ్యాపించిన గుణదోషములు ఆ పర్వతసమీపమునకు రావు. ఈ కాకి నిరంతరము భగవత్ ధ్యానములోనే గడుపుచూ, ఒక వటవృక్షముక్రింద శ్రీహరి కథలను చెప్పుచుండును. అనేక పక్షులు అచ్చట గుమిగూడి ఆ కథలను వినుచుండును. సరోవరమునందు నివసించు హంసలుకూడా శ్రీరామకథాగానమును వినుచుండును. నేను ఆ దృశ్యమును చూచినపుడు ఆనందముతో కొంతకాలము హంస శరీరమును ధరించి అచ్చట నివసించితిని. శ్రీరఘునాథుని కథను శ్రద్ధగా విని తిరిగి కైలాసమునకు వచ్చితిని. ఇక పక్షిరాజైన గరుత్మంతుడు ఆ కాకి వద్దకు ఏల పోయెనో ఆ కథను వినుము. శ్రీరఘురాముడు మేఘనాథుని చేతిలో తనకు తానే బంధింపబడినప్పుడు నారద మహర్షి పంపున గరుడుడు పోయి ఆ బంధములను తెగకోసెను.

కాని గరుడుని మనస్సులో అనేక విధముల ఆలోచనలు వచ్చెను. "సర్వవ్యాపకుడు, నిర్వికారుడు, మాయాతీతుడైన పరమేశ్వరుడు జగత్తులో అవతారము నెత్తి ఒక తుచ్ఛరాక్షసుని నాగపాశముచే ఎట్లు బంధింపబడెను?" ఇట్టి ఆలోచనలతో అతని మనస్సునందు కుతర్కము అధికమై మోహావేశుడాయెను. నారదుని వద్దకు పోయి తన సందేహమును తెలిపెను. నారదముని దయతో పలికెను: "గరుడా! శ్రీరాముని మాయ అతి ప్రబలమైనది. అది జ్ఞానుల చిత్తమును కూడా భ్రమింపచేయును. నన్ను కూడా అనేక మార్లు మోహావేశపరునిగా చేసినది. నీ హృదయములోని మాయ నా మాటలతో పోవునది కాదు. కావున నీవు బ్రహ్మదేవుని వద్దకు పోయి అతని ఆజ్ఞను అనుసరించుము" అని పలికి నారదమహర్షి శ్రీరాముని గుణగానము చేయుచూ పోయెను. పిమ్మట పక్షిరాజైన గరుడుడు బ్రహ్మదేవుని వద్దకు పోయి తన సందేహమును వినిపించెను. "సమస్త జడచేతన జగత్తు శ్రీహరి మాయకు వశమగునపుడు పక్షిరాజు మోహావేశపరుడు అగుటలో ఆశ్చర్యము ఏమున్నది?" అని తలచి బ్రహ్మదేవుడు పలికెను: "శ్రీరాముని మహిమను మహేశుడు బాగా ఎరుగును. కావున గరుడా! నీవు మహేశ్వరుని వద్దకు పొమ్ము." బ్రహ్మ వచనములు విని గరుడుడు నా వద్దకు వచ్చెను. నేను ఆ సమయమున కుబేరుని ఇంటికి పోవుచుంటిని. అతని విన్నపమును విని నేను నివేదించితిని: "గురుడా! నేను ఇప్పుడు కుబేరుని ఇంటికి పోవుచున్నాను. నీవు చాలా కాలము సజ్జనుల సహవాసము చేసినకాని సందేహములు దూరములు కావు. సోదరా! ఎక్కడయితే నిరంతరము హరికథా ప్రసంగము జరుగునో అచ్చటికి నిన్ను పంపెదను. అచ్చట నీ సందేహములు దూరము అగును. సత్సాంగత్యము లేనిదే హరికథా శ్రవణము జరగదు. హరికథలు విననిదే మోహము దూరము కాదు. మోహరహితుడు కానివానికి శ్రీరామచంద్రుని చరణములయందు అనన్య ప్రేమ కలుగదు. కావున సత్సాంగత్యమునకై ఉత్తరదిశకు

పొమ్ము. అచ్చట ఒక అందమైన నీల పర్వతము కలదు. అక్కడ పరమసుశీలుడైన కాకభుశుండి నివసించుచున్నాడు. ఆయన రామభక్తి మార్గమునందు నిపుణుడు. నిరంతరము అతను శ్రీరామచంద్రుని కథను తెలుపును. అనేకరకములైన సుందర పక్షులు ఆ కథను సాదరముగా వినుచుండును. అచ్చటికి పోయి శ్రీహరి గుణములను వినుము. నీ మోహజనిత దుఃఖము దూరమగును." నేను ఈ విధముగా నచ్చచెప్పగా గరుడుడు నాకు ప్రణమిల్లి ప్రసన్నుడై పోయెను. ఓ ఉమా! శ్రీ రఘునాథుని కృపవలన నేను గరుడుని మోహము నెరిగియున్ననూ స్వయముగా ఉపదేశము నివ్వలేదు. అతడు ఎప్పుడైనా గర్వము చెందియుండవచ్చును. అందులకై దయానిధి శ్రీరాముడు అతనిని దూరము చేయ తలంచియుండెను. మరొక కారణమేమనగా ఒక పక్షి మరొక పక్షి భాష మాత్రమే గ్రహించగలదు. గరుడుడు జ్ఞానులలో, భక్తులలో శిరోమణి. ముల్లోకములకు స్వామియైన భగవంతునికి వాహనము. అతడే మాయామోహితుడు అయినపుడు నీచమానవులు దానినుండి ఎట్లు తప్పించుకొనగలరు?

నిశ్చలమైన హరిభక్తి తీవ్రబుద్ధిగల కాకభుశుండి నివసించు ప్రదేశమునకు గరుడుడు పోయెను. ఆ నీలగిరిని చూచి అతని మనస్సు ప్రసన్నమాయెను. మాయ, మోహము, విచారము పోసాగెను. కాకభుశుండి చెరువులో స్నానమాడి నీరు సేవించి ప్రసన్నమైన మనస్సుతో వటవృక్షము క్రిందికి వచ్చెను. శ్రీరాముని సుందరసుమనోహరచరిత్రను వినుటకు ముసలి పక్షులన్నియూ గుమిగూడియుండెను. కాకభుశుండి కథను ఆరంభించబోవుచుండెను. ఇంతలో పక్షిరాజైన గరుడుడు అచ్చటికి వచ్చెను. పక్షులన్నియూ హర్షితులైరి. కాకభుశుండి గరుడుని మిక్కిలి గౌరవించి, ప్రేమతో పూజించి పలికెను: "ప్రభూ! పక్షిరాజా! మీ దర్శనముచే నేను కృతార్థుడనైయితిని. మీ రాకకు కారణము ఏమి?" అప్పుడు పక్షిరాజు మధురముగా పలికెను: "మహాదేవుడే స్వయముగా ముఖతః ప్రశంసించిన మీరు

సదా కృతార్థస్వరూపులే. ఏ కారణమున నేను వచ్చి యుంటినో అది నేను రాగానే పూర్తి అయినది. మీ దర్శనము లభించినది. మీ పవిత్రమయిన ఆశ్రమమును చూచినంతనే మోహము, సందేహము, భ్రమలు తొలగిపోయినవి. ఇప్పుడు దుఃఖములను తొలగించు సదా సుఖప్రదమైన శ్రీరామచంద్రుని కథను వినిపించుడు అని విన్నపము చేయుచున్నాను." గరుత్మంతుని వినయపూర్వకమైన వచనములను విని కాకభుశుండి మనస్సున ఉత్సాహము కలిగి శ్రీరఘునాథుని గుణములు తెలుపుకథను చెప్పసాగెను.

మొదట రామచరితమును, మానససరోవరమును వర్ణించిన పిదప నారదుని మోహము, రావణుని జననము గూర్చి తెలిపెను. ప్రభువు అవతార గాథను శ్రీరాముని బాల్యలీలలను, విశ్వామిత్రయాగ సంరక్షణ, సీతారాముల వివాహము, విపులముగా వర్ణించెను. ఆ విధముగా కాకభుశుండి గరుడునికి రామాయణగాథను అయోధ్యలో శ్రీరామపట్టాభిషేకము వరకు విశదముగా వర్ణించి శ్రీరాముని రాజ్య పరిపాలనను, మహిమను అనేక విధముల గానము చేసెను. కథనంతయూ విన్న గరుడుడు అమితోత్సాహముతో పలికెను: "కాక కుల శిరోమణీ! మీ దయవలన శ్రీరాముని చరణకమలములపై నా భక్తి దృఢమాయెను. రణభూమిలో ప్రభువు నాగపాశబద్ధుడై ఉండుట చూచి నేను అతిమోహావేశుడనై సచ్చిదానంద ఘనుడైన శ్రీరామచంద్రుడు ఎట్లు వ్యాకులత నొందెనో తెలుసుకొన గోరితిని. ఆ భ్రమ నాకు గొప్ప హితమొనర్చినది. ఎండలో వ్యాకులుడైన వ్యక్తియే వృక్షఛాయను సంతోషముగా అనుభవించునట్లు నా భ్రమ మీ దర్శనము, ఉపదేశములచే హర్షితుడను అగునట్లు చేసెను. సజ్జనుల సమాగమము శ్రీరాముని కృపయున్నవారికే లభించును. మీ దయవలన నా సందేహము తొలగినది." పక్షిరాజు గరుడుని వినయవచనములను విని కాకభుశుండి పులకితశరీరుడై పలికెను: "ప్రభూ! మీరు సర్వవిధముల నాకు ఆరాధ్యులు. శ్రీరఘునాథుని కృపాపాత్రులు.

మీరు మాయావశులుకారు. నాపై కృపచూపితిరి. మోహమను నెపముతో శ్రీరఘునాథుడు మిమ్ము నా వద్దకు పంపి నన్ను గొప్పవానిగా చేసెను. ఈ చరాచరజగత్తులో కామము, క్రోధము, మదము, మాత్సర్యము, లోభము, మోహము అను అరిషడ్వర్గములచే వశుడు కానివాడు ఎవడు? ఏ మాయ ప్రపంచములోని ప్రజలను ఆడించునో, అట్టిమాయ శ్రీరామచంద్రప్రభువు కనుసన్నలను అనుసరించి ఆడును. ఆ ప్రభువు సచ్చిదానంద స్వరూపుడు, అఖండుడు, అనంతుడు, అమోఘశక్తిమంతుడు. వాక్కునకు, జ్ఞానేంద్రియములకు అగోచరుడు. అందరి హృదయములలో నుండువాడు. అట్టి శ్రీరాముని యందు మోహము ఉండదు. భగవంతుడైన శ్రీరామచంద్రప్రభువు తన భక్తులకై రాజుగా శరీరధారణచేసి సామాన్య మానవునివలె పరమ పవిత్ర జీవనము గడిపెను. ఎట్లైతే ఒక నటుడు అనేక రూపధారణలు చేసి నృత్యములు చేసిననూ ఆ వేషములకు తగినట్టు భావములను ప్రకటించిననూ? స్వయముగా తాను అది కాడో అట్లే పరమాత్ముడు మానవ రూపమును ధరించి మానవునివలె ఆచరించిననూ తాను మానవుడు కాడు. శ్రీరఘునాథుని లీలలు రాక్షసులను మోహితులుగా చేసెను. రామభక్తులకు సుఖమును ఇచ్చెను. మూర్ఖుడు విషయలోలుడు, కాముకుడు అయినవాడు మాత్రమే ప్రభువుపై అట్టి మోహమును ఆరోపించును. కామక్రోధలోభమదములందు మునిగినవారు దుఃఖరూపమగు సంసారవ్యామోహములో చిక్కినవారు శ్రీరఘునాథుని సగుణరూపమును తెలిసికొనలేరు.

## 7. భుశుండీ మోహము

"గరుడా! శ్రీరఘునాథుని ప్రభుత్వమును గూర్చి ఏ విధముగా నేను మోహావేశుడనైనది ఆ కథను వినిపించెదను. శ్రీరామునికృప, నా మూర్ఖత్వమును గూర్చి తెలిపెదను. శ్రీరాముడు మానవ

రూపమును ధరించి భక్తులకై అనేక లీలలను చేసెను. నేను అయోధ్యకు వెళ్ళి శ్రీరాముని బాల్యక్రీడలను, అతని జన్మదిన మహోత్సవమును చూచెదను. బాల్యములో శ్రీరాముడు ఎక్కడెక్కడ తిరుగునో, అక్కడ అతనితోబాటు ఎగిరెదను. ఒకసారి శ్రీరఘువీరుడు అత్యంత బాల్యచేష్టలను చేసెను. నలుగురు సోదరులు రాజభవన ప్రాంగణములో ఆడుకొనుచూ రాజమాతలకు కనువిందొనర్చుచుండిరి. శ్రీరామచంద్రుని శ్యామలసుందరశరీరము, అప్పుడే వికసించిన కమలములవంటి ఎర్రని కోమల పాదములు, చంద్రునికాంతి వంటి కాలిగోళ్లు, పాదములందు వజ్రము, అంకుశము, ధ్వజము, కమలముల చిహ్నములు, చరణములందు మధురధ్వనులు వినుపించు సుందర నూపురములు, మణులు గూర్చిన బంగారు వడ్డాణము, ముద్దులొలుకు మాటలు, ఎర్రని పెదవులు, తెల్లని దంతములు, సుందరమైన చెక్కిళ్ళు, మనోహరమైన నాసిక, చంద్రకిరణములవలె సుఖప్రదమయిన చిరునవ్వు, నీలకమలముల వంటి కన్నులు, భవబంధములను బాపునట్టి లలాటమున గోరోచన తిలకము, వంకరతిరిగిన కనుబొమ్మలు, చక్కని చెవులు, నల్లని ఉంగరాలజుట్టు శోభిల్లుచుండెను. పసుపుపచ్చని పట్టు ఉత్తరీయము శరీర శోభను పెంచుచుండెను. అతని కేరింతలు నాట్యము నా మనస్సును హరించినది. కేరింతలు కొట్టుచూ నన్ను పట్టుకొనుటకు నా వెంటపడితే పక్షిస్వభావముతో నేను పరుగెత్తుచుంటిని. నేను సమీపించినపుడు ప్రభువు నవ్వుచుండెను. నేను దూరముగా పోయినపుడు ఏడ్చుచుండెను, సాధారణబాలకులవలె సచ్చిదానందఘనుడగు ప్రభువు యీ లీలలేల చేయుచున్నాడు?" అని నాకు మోహము కలిగెను.

గరుడా! ఈ మాత్రము సందేహము రాగానే శ్రీరామచంద్రుని ప్రేరణచే మాయ నన్ను ఆవరించెను. శ్రీరామచంద్రుడు నన్ను భ్రమతో ఆశ్చర్యచకితునిగా చూచి నవ్వెను. ఈ కౌతుకలీలారహస్యము

అతని సోదరులుగాని తల్లులుగాని ఎరుగరు. శ్యామశరీరుడు, ఎర్రని చేతులు కాళ్లు గల బాలరూపుడైన శ్రీరాముడు మోకాళ్ళపై దోగాడుతూ నన్ను పట్టుకొనుటకు ప్రయత్నించెను. నేనప్పుడు పరుగెత్తితిని. శ్రీరాముడు నన్ను పట్టుకొనుటకు తన భుజములను చాపెను. నేనాకసమున ఎగిరేకొలది శ్రీరాముని భుజములను నా సమీపమున చూచితిని. నేను ఎగురుచూ బ్రహ్మలోకమునకు పోయితిని. వెనుకకు తిరిగి చూడగా ప్రభుభుజములు నాకు కేవలము రెండడుగుల దూరములో నుండెను. పృథ్వి, జలము మొదలగు ఏడు అవరణములో నేను ఎక్కడికి పోయిననూ ప్రభుభుజముల నచ్చట చూచి ఆశ్చర్యచకితుడనయితిని. భయముతో కన్నులు మూసుకొంటిని. మరల కన్నులు తెరవగానే అయోధ్యానగరమును చేరియుంటిని. నన్ను చూచి శ్రీరాముడు చిరునవ్వు నవ్వసాగెను. వెంటనే నేనతని నోటిలో ప్రవేశించితిని. పక్షిరాజా! వినుము. నేనతని ఉదరములో అనేక బ్రహ్మాండములను చూచితిని. అందులో అనేక విలక్షణమైన లోకములు ఒకదానికంటే మరొకటి మిన్నగా నుండెను. కోట్లాది చతుర్ముఖబ్రహ్మలు, శివులు, అసంఖ్యాకములయిన తారలు, సూర్యచంద్రులు, లోకపాలురు, పర్వతములు, నదులు, సముద్రములు, వనములు, నానావిధ సృష్టి విచిత్రములను చూచి తిని. ప్రతి భువనమునందు వేరు వేరు అయోధ్యానగరములు, సరయూనదులు, స్త్రీపురుషులు ఉండిరి. దశరథుడు, కౌసల్యాదేవి, భరతుడు మొదలగు సోదరులుకూడా అనేక రూపములు కలిగి ఉండిరి. నేను ప్రతి బ్రహ్మాండమున శ్రీరాముని అవతారమును, అతని అపార బాల్యక్రీడలను చూచుచూ తిరుగుచుంటిని, కాని శ్రీరామచంద్రప్రభువు ఆకారమును మాత్రము వేర్వేరుగా చూడలేదు. అన్నిచోట్లా అదే బాల్యము, అదే సౌందర్యము, దయాళువు అయిన శ్రీరఘువీరుడు. ఈ విధముగా అనేక బ్రహ్మాండములు భ్రమించుచూ మోహమను వాయువుచే కొట్టబడి, తిరుగుచూ నూరు కల్పములు

గడిచినట్లాయెను. పిదప నా ఆశ్రమమునకు వచ్చి కొంతకాలము అచ్చట గడిపితిని. నా స్వామి అయోధ్యానగరమున జన్మించిన విషయమును విని భక్తిపూర్ణుడనై లేచి పరుగెత్తితిని. మరల అయోధ్యలో శ్రీరామచంద్రుని జన్మమహోత్సవమును చూచితిని. మనస్సును మోహమావరించుటచే నేను అలసిపోయితిని. నేను డస్సినది చూచి శ్రీరామచంద్రప్రభువు నవ్వెను. నేనతనినోటినుండి బయటికి వచ్చితిని. ప్రభువు మరల అవే బాల్యక్రీడలు ఆడసాగెను. ఆ బాల్యచేష్టలను చూచి అతని ఉదరములో నేను చూచిన ప్రభుమహిమను తలంచుకొని నేను నా శరీరమునే మరచితిని, "ఆర్తజన రక్షకా! నన్ను రక్షింపుము" అని అరుచుచూ నేలవాలితిని . నేను ప్రేమవిహ్వాలుడ నగుట చూచి తన మాయా మహిమను నిలిపివేసెను. తన కరకమలములను నా శిరస్సుపై నుంచెను. నా దుఃఖమును పూర్తిగా హరించెను. నన్ను మోహమునుండి విముక్తునిగా చేసెను. నా హృదయములో అమితప్రేమ ఉత్పన్నమాయెను. నేత్రములందు ప్రేమాశ్రువులు నిండగా శరీరము రోమాంచితము కాగా చేతులు జోడించి నేను అనేక విధముల విన్నపము చేసితిని. నా దీనావస్థను చూచి శ్రీరామచంద్రప్రభువు తన గంభీరకోమలవచనములు పలికెను: "ఓ కాకభుశుండీ! నేను అత్యంత ప్రసన్నుడనైతిని. నీవు నన్ను ఏదైనా వరము నడుగుము. అణిమాద్యష్టసిద్ధులు, ఎనలేని సంపద, మోక్షము, జ్ఞానవివేక వైరాగ్యములు ఇవన్నియూ నీకిచ్చెదను." ప్రభు వచనములు విని నా మనస్సులో ఆలోచించితిని. "ప్రభువు అన్ని సుఖములను ఇచ్చెదను అని పలికెను. కాని తన భక్తిని ఇచ్చెదనని అనలేదు. ఉప్పులేనిదే ఏ భోజన పదార్థములైనను ఎట్లు భోజ్యములు కావో, భక్తి లేనిదే ఏ గుణము కాని, సుఖముకాని హీనమే." ఇట్లు ఆలోచించి నేను పలికితిని "ప్రభూ! ఏ ప్రగాఢనిష్కామ భక్తిని గూర్చి శ్రుతిపురాణములు గానము చేయునో, దేనిని యోగీశ్వరులైన మునులు వెదకుచూ తిరుగుతారో, దేనిని ప్రభు కృపలేనిది పొందలేమో,

కృపాసాగరా! అట్టి మీ అనన్య భక్తిని నాకు ప్రసాదించుడు." "అట్లే కానిమ్ము" అని పలికి రఘుకులస్వామి పరమానందకరముగా వచనము పలికెను: "ఓ వాయసమా! నీ చాతుర్యము నాకు బాగా నచ్చినది. నా కృపచే అన్ని శుభగుణములు నీ హృదయములో నివాసము ఉండును. భక్తిజ్ఞాన వైరాగ్యయోగములు, నా లీలలు మరియు వాటి రహస్యములు, విభాగములు, వాటి భేదములను అన్నింటిని సాధన చేయకనే నీవు తెలుసుకొనెదవు. మాయచే యుత్పన్నమైన భ్రమలు నిన్ను ఆవరించవు. విశ్వమంతయూ నా మాయవల్ల ఉద్భవించినది. ఇందులో అనేక జడచేతన జీవులున్నవి. కాని వారిలో అత్యంత భక్తిభావము కలవారు నాకు మిక్కిలి ప్రియులు. ఎవడు కపట ప్రపంచమును విడిచి అన్నియూ నేనే అని భావించి భజించునో, అట్టి వాడు నాకత్యంత ప్రియుడు. కావున ఆశావిశ్వాసములను వదలి నన్నే స్మరించుము." అమృతతుల్యమగు ప్రభు వచనములు విని నా మనస్సు ఆనందముతో నిండెను. నన్ను అనేక విధముల సమాధానపరచి ప్రభువు మరల తన బాల్యక్రీడలను చేయసాగెను. నేను కొద్దికాలము వరకు అయోధ్యలో నుంటిని. అక్కడ శ్రీరాముని రసపూర్ణమైన అనేక బాల్యలీలలను చూచితిని. తదనంతరము ప్రభుచరణములకు వందనము లాచరించి నా ఆశ్రమమునకు తిరిగివచ్చితిని.

ఎప్పటి నుండి శ్రీరఘునాథుడు నన్ను తనవానిగా చేసికొనెనో అప్పటినుండి అతని మాయ నన్ను ఆవరించలేదు. పక్షిరాజా! హరిభజన లేకుండా క్లేశములు దూరము కావు. శ్రీరాముని దయలేనిదే ప్రభు మహిమను గూర్చిన జ్ఞానము లభ్యముకాదు. అతని మహిమ తెలియనిదే ప్రభువుపై విశ్వాసము ఏర్పడదు. విశ్వాసము లేనిదే ప్రేమ కలుగదు. ప్రేమ లేనిదే భక్తి నిలువదు. భక్తి లేనిదే శ్రీరాముని హృదయము ద్రవించదు. ప్రభుకృప లేనిదే స్వప్నములో కూడా శాంతి కలుగదు. పక్షిరాజా! నా బుద్ధిననుసరించి ప్రభు ప్రతాపమును,

మహిమను గానము చేసితిని. శ్రీరఘునాథుని మహిమ, పేరు, రూపము, గుణములు, అపారములు, అనంతములు. మునులు కూడా తమ బుద్ధిననుసరించి శ్రీహరి గుణములను గానము చేసెదరు. శ్రీరామచంద్రునితో పోల్చదగినది ఈ జగత్తులో లేదు. ఆయనకు ఆయనయే సాటి. ఎట్లైతే కోటి దీపపు పురుగులతో సమానమని సూర్యకాంతిని పోల్చిననూ ఆ వర్ణన సరిపోదో. అట్లే మునీశ్వరులు తమ బుద్ధిని అనుసరించి శ్రీరాముని వర్ణించిననూ అది సరిపోదు. కాని భగవంతుడు భక్తుల భావగ్రాహి కావున ప్రేమపూర్వకముగా ఆ వర్ణనను విని ఆనందించును. మమకారము, గర్వము వదలి శ్రీ జానకీనాథుని భజించవలెను.

## 8. భుశుండీ పూర్వజన్మగాధ

కాకభుశుండి యొక్క సుందర మనోహర వచనములు విని పక్షిరాజైన గరుడుడు ప్రసన్నుడాయెను. అతని కంట ప్రేమాశ్రువులు నిండెను. మనస్సు ఆనందముతో నిండెను. రఘునాథుని ప్రతాపమును తన హృదయమున నింపుకొనెను. తన మునుపటి మోహమును తలచి పశ్చాత్తప్తుడాయెను. "అనాదియైన బ్రహ్మను సామాన్య మానవునివలె తలంచినాను గదా యని చింతించసాగెను. మాటిమాటికీ కాకభుశుండి చరణములకు ప్రణమిల్లి అతనిని శ్రీరామునితో సమానముగా భావించి చేతులు జోడించి, ప్రేమపూర్వక వినయవచనములను పలికెను: "ప్రభూ! అజ్ఞానమున నేను మిమ్మడిగిన సందేహమునకు కృపతో సమాధానమును ఇచ్చితిరి. నన్ను మీ దాసునిగా భావించి మరొక ప్రశ్నకు సమాధానము తెలుపుడు. మీరు సర్వజ్ఞులు, బ్రహ్మవిదులు. సరళమైన ఆచరణగలవారు. శ్రీరఘునాథుని ప్రియదాసులు. మీరే కారణమున ఈ కాకి శరీరమును ధరించితిరి? మీరీ సుందర రామచరితమానసమును ఎచ్చట పొందితిరి? మహా ప్రళయకాలమునందు కూడా

మీకు నాశము లేదని పరమేశ్వరుడు తెలిపినాడు. స్థావరజంగమములతో కూడిన జగత్తు అంతయూ కాలుని వశమగును. అట్టి భయంకరమైన కాలుడు మిమ్మేమాత్రము ప్రభావితము చేయుకుండుటకు కారణము ఏమి? ఇది జ్ఞాన ప్రభావమా? యోగబలమా? మీ ఆశ్రమమునకు రాగానే నా మోహము, భ్రమ దూరమాయెను. దీనికి కారణమేమి? దయచేసి తెలుపుడు"

గరుడుని పలుకులు విని కాకభుశుండి ప్రసన్నుడై అనురాగపూర్వకముగా పలికెను: "గరుడా! నీ బుద్ధి ధన్యము, నీ ప్రశ్నలు మెచ్చదగినవి. నీ ప్రేమపూరితమైన ప్రశ్నలు విని నా పూర్వజన్మములు అనేకములు స్మరణకు వచ్చినవి. వాటి కథను వినిపించెదను. జప, తప, యజ్ఞ, వ్రత, దాన, వైరాగ్య, యోగ, విజ్ఞానము లనేకముల ఫలము శ్రీరామచంద్రుని చరణములందు అనురాగము. నేనీకాకి శరీరముతోనే శ్రీరాముని భక్తిని పొందియుంటిని. కావున దీనిపై నాకు మోహము అధికము. మనోవాక్కర్మలచే శ్రీరామునిపై భక్తి కలిగియుండుటయే జీవునికి నిజమైన స్వార్థము. ఈ శరీరముతోనే నాకు మొదట శ్రీరామునిపై భక్తి జనించెను. అందువలన నాకిది అత్యంత ప్రియమైనది. ఒకవేళ నాకిచ్ఛామరణము వచ్చినను నేను ఈ శరీరమును వదలను. ఏలయన, శరీరము లేకుండా హరిభజన సాధ్యముకాదు. మొదట మోహము నన్ను దుర్దశపాలు చేసినది. శ్రీరామునికి విముఖుడను అగుటచే నేను సుఖముగా నిద్రించలేకపోయిననూ అనేక జన్మలలో నేను అనేక విధములైన యోగ, జప, తప, యజ్ఞ, దానాది కర్మలను ఆచరించితిని కాని, ఇప్పటివలె సుఖము కలుగలేదు. నాకిప్పుడు పూర్వజన్మలస్మృతి కలదు. శివుని కృపవలన నా బుద్ధి మోహమునకు వశము కాలేదు.

పక్షిరాజా! వినుము. నేను నా పూర్వజన్మకథను తెలిపెదను. పూర్వము ఒక కల్పములో పాపకూపమైన కలియుగమున నేను అయోధ్యానగరమున శూద్రునిగా జన్మించితిని. మనోవాక్కర్మలచే

నేను శివభక్తుడనై ఇతరదేవతలను నిందించుచుంటిని. అతి గర్వము గలిగి ధనమదోన్మత్తుడనై వాచాలునిగా ఉంటిని. శ్రీరఘునాథుని రాజధాని నగరము అయిన అయోధ్యానగరములో ఉన్నప్పటికీ దాని మహిమను ఎరుగనైతిని. కలికాలము చాలా కఠినమైనది. స్త్రీ, పురుషులందరూ పాపమగ్నులు, ధర్మములన్నియూ నశించెను. సత్ గ్రంథములు మాయమాయెను. పాఖండులు తమ విపరీతబుద్ధితో నూతన మార్గములు కనిపెట్టిరి. జనులందరూ మోహములకు అధీనులైరి, లోభము, శుభకార్యములను కబళించెను. ఓ జ్ఞానసాగరుడా! నేను కొన్ని కలియుగధర్మములను తెలిపెదను వినుము.

## 9. కలియుగ లక్షణములు

కలియుగమున వర్ణాశ్రమధర్మములు అడుగంటును. స్త్రీ, పురుషులు వేదములకు విరుద్ధముగా ప్రవర్తింతురు. బ్రాహ్మణులు, వేదములను అమ్ముకొందురు. రాజులు ప్రజలను పీడించెదరు. వేదశాస్త్రముల బోధలను ఎవ్వరూ గౌరవించరు. ఎవ్వనికి ఏది ఇష్టమయితే అదే వాని ధర్మము. బిగ్గరగా అరుచువాడే పండితుడు. ఆడంబర జీవనము గడుపువానిని, కపటములో మునిగియుండువానిని ప్రజలు గౌరవిస్తారు. ఇతరుల ధనము అపహరించువాడే చతురుడు. కపటవర్తనుడే ఆచారపరుడు. ఎవడు అసత్యము ఆడునో, హేళన చేయుటలో ప్రవీణుడో కలియుగములో వాడే గుణవంతుడు అనబడును. ఆచారహీనుడు, వేదమార్గమును త్యజించువాడు జ్ఞాని, వైరాగి అనబడును. పొడవైన గోళ్ళు, జడలు గలవాడే తపస్వీ యనబడును అశుభవేషభూషణములు ధరించువాడు, భోజ్య, అభోజ్యములను తినువాడే యోగి, సిద్ధుడు, కలియుగములో పూజ్యుడు. ఇతరులకు అపకారము చేయువాడే గౌరవింపబడును. అసత్యప్రలాపములు పలుకువారు గొప్ప వక్తలు.

కలియుగమున మనుష్యులందరూ స్త్రీలకు వశులై కోతులవలె ఆడుచుందురు. బ్రాహ్మణులకు శూద్రులు ఉపదేశమును ఇచ్చెదరు. మెడలో జందెములు వేసుకొని కుత్సితదానములు స్వీకరించెదరు. అభాగినులు అయిన స్త్రీలు సర్వగుణసంపన్నుడు, సుందరుడైన పతిని వదిలి పరపురుషుల సేవ చేయుదురు. ముత్తయిదువుల శరీరముపై ఆభరణములుండవు కాని విధవలు నిత్యము నూతన శృంగారము చేసుకుందురు. గురుశిష్యుల సంబంధము చెవిటి, గ్రుడ్డివాని మధ్యగల సంబంధము వంటిది. శిష్యులు గురూపదేశమును వినరు. గురువునకు జ్ఞానదృష్టి ఉండదు. తల్లిదండ్రులు పిల్లలకు ఉదరపోషణకు ఉపయోగించు ధర్మమునే బోధించెదరు. కలియుగమున కపటము పరాకాష్ఠము చేరును. స్త్రీపురుషులు బ్రహ్మజ్ఞానమును గూర్చి తప్ప మాట్లాడరు. కాని వారు లోభమున ఒక గవ్వ కొరకు బ్రాహ్మణుని, గురువును కూడా హత్యచేయుటకు వెనుకాడరు. శూద్రులు, బ్రాహ్మణులతో మేము మీకంటే తక్కువనా? అని వాదనకు దిగెదరు. బ్రాహ్మణులు విద్యాహీనులు, లోభులు, మూర్ఖులు, విషయాసక్తులై ఉందురు. శూద్రులు నానావిధములైన జప, తప, వ్రతాదులు చేసి ఉన్నతాసనముపై కూర్చుండి, పురాణములు చెప్పెదరు. కలియుగమున మనుష్యులందరూ తమ ఇచ్ఛాను సారము ప్రవర్తించెదరు. వర్ణసంకరులై మర్యాదను ఉల్లఘించెదరు. మోహావేశమున వేదసమ్మతమైన జ్ఞానవైరాగ్యయుక్తమయిన హరిభక్తి మార్గమును వదలి నిరర్థకముగా క్రొత్త మతములకు కల్పన చేసెదరు, సన్యాసులు ధనమును వెచ్చించి తమ గృహములను అలంకరించెదరు. వారిలో వైరాగ్యము ఉండదు. వారు భోగలాలసులు, తాపసులు, ధనవంతులు అయ్యేదరు. గృహస్థులు దరిద్రులు అయ్యేదరు. జనులు కులవతి, పతివ్రత అయిన తమ స్త్రీని వెడల గొట్టి సన్మార్గమును వదలి ఇంటిలో దాసీలను తెచ్చెదరు. పుత్రులు తలిదండ్రులను గౌరవించరు. ధనవంతులు నీచజాతివారైననూ కులీనులుగా గౌరవింప

బడుదురు. వేదపురాణములను తిరస్కరించువారే సజ్జనులుగా పరిగణింపబడుదురు. కవులు తండోపతండంబులుగా ఉందురు. కాని వారిని పోషించువారు మచ్చుకైన కనపడరు. ఇతరుల గుణములను దోషములుగా చూపువారు అనేకులు. స్త్రీలు అనేక వస్తువులపై మమకారము వలన మూర్ఖసుఖములను ఆశించెదరు. ధర్మముపై వారి మనస్సు లగ్నము కాదు. కోమలత్వము వారిలో క్లేశమాత్రము కూడా ఉండదు. మనుష్యులు రోగ పీడితులై అకారణమున వైరము, విరోధము కలిగియుందురు. ఈర్ష్య, కఠోరసంభాషణ, లోభము, సంపూర్ణముగా ఉండును. సమతా భావము, దానము, దయ, అవగాహన కనపడవు. శరీరపోషణయందే స్త్రీ, పురుషులు ఆసక్తి కనపరచెదరు.

గరుడా! కలియుగము పాపములకు, అవగుణములకు నిలయమైననూ అందు సుగుణములు కూడా అనేకములు గలవు. ఎట్టి శ్రమలేకుండా ఇందు జనులకు జనన మరణములనుండి ముక్తి లభించును. సత్యయుగము, త్రేతా, ద్వాపర యుగములందు పూజ, యజ్ఞ, యోగములవలన ఏ గతి ప్రాప్తించునో ఆ గతి కలియుగమున జనులకు భగవన్నామ స్మరణ వలన లభించును. సత్యయుగమునందు ఎల్లరూ యోగులు, విజ్ఞానులుందురు. వారు భగవంతుని ధ్యానముచే భవసాగరమును దాటెదరు. త్రేతాయుగమున జనులు రకరకములైన యజ్ఞములు చేసి తమ కర్మలన్నింటినీ ప్రభువునకు అర్పించి భవసాగరమును తరించెదరు. ద్వాపరయుగమును శ్రీహరి చరణమును పూజించి సంసారమునుండి తరించెదరు. కాని కలియుగమున కేవలము శ్రీహరిగుణములను గానము చేసి సంసారసాగరమునుండి ముక్తిని పొందెదరు. యోగము, యజ్ఞము, జ్ఞానము అవసరములేదు. కేవలము శ్రీరాముని గుణగానమే సాధనము. కలియుగమున నామమహిమ గొప్పది. మానవుడు విశ్వాసమును కలిగియున్నచో కలియుగముతో సమానమైనది లేదు. శ్రీరాముని నిర్మల గుణసమూహామును

గానము చేసి మనుష్యుడు ప్రయాసలేకుండగనే సంసారసాగరమును దాటగలడు. ధర్మమునకు సత్యము, దయా, తపము, దానము అను నాలుగు చరణములు ప్రసిద్ధము. కాని కలియుగమున దానమను చరణమే ముఖ్యము.

శ్రీరాముని మాయాప్రేరణ వలన అందరి హృదయములలో అన్నియుగముల ధర్మములు ప్రకటితమగును. శుద్ధసత్వగుణము, సమత్వము, విజ్ఞానము, మనఃప్రసన్నత – ఇవి సత్యయుగ ప్రభావము. సత్త్వగుణము అధికముగా నుండును. కొంత రజోగుణముకూడా వుండును. కర్మలయందు ప్రీతి, అన్ని విధముల సుఖము – ఇవి త్రేతాయుగ ధర్మములు. రజోగుణము ఎక్కువగా నుండి సత్త్వగుణము చాలాకొద్దిగానుండి, కొంత తమోగుణము వుండి మనస్సులందు హర్షము, భయము, ఉండుట ద్వాపరయుగ లక్షణము. తమోగుణము అధికముగా నుండి, కొద్దిగా రజోగుణము ఉండి, నలుదిశల వైరము, విరోధము – ఇవి కలియుగ లక్షణము. పండితులైనవారు యుగ ధర్మములను మనస్సున నాలోచించి అధర్మమును త్యజించి ధర్మమును ప్రేమించెదరు. శ్రీరఘునాథుని చరణములందు అత్యంత ప్రీతి ఎవనికి యుండునో వానిని యుగధర్మములు అంటవు. కావున కోరికలను త్యజించి నిష్కామభావముతో శ్రీరాముని భజించవలెను.

## 10. శివుని శాపము

“పక్షిరాజా! ఈ కలియుగమున నేను అనేక సంవత్సరములు అయోధ్యానగరమున నివసించితిని. అక్కడ కరువు సంభవించగా దీనుడనై, దరిద్రుడనై, దుఃఖితుడనై ఉజ్జయినికి పోయితిని. కొంత కాలము అచ్చట గడిపి కొంత ధనము సంపాదించి శివుని ఆరాధించసాగితిని. అక్కడ ఒక బ్రాహ్మణుడు వైదిక పద్ధతిలో శివుని పూజించుచుండెను. అతను పరమసాధువు పరమార్థమును

ఎరిగినవాడు. శివుని ఉపాసించుచుండెను. నేను కపటభావముతో అతనిని సేవించుచుంటిని. ఆ బ్రాహ్మణుడు నా బాహ్యావినయమును చూచి నన్ను తన పుత్రునివలె బోధించెను. నాకు అనేక శుభ విషయములతోపాటు శివమంత్రమును కూడా ఉపదేశించెను. నేను ప్రతిదినము దేవాలయమునకు పోయి ఆ మంత్రమును జపించుచుంటిని. కాని నా హృదయమున దంభాహంకారములు వృద్ధిచెందెను. నేను దుష్టుడను, పాపబుద్ధినై, హరిభక్తులను బ్రాహ్మణులను చూడగానే కోపముతో మండుచుంటిని. గురువుగారు నా ప్రవర్తనను చూచి నిత్యము నాకుపదేశమును ఇచ్చుచుండిరి. ఒకరోజు గురువుగారు నన్ను పిలిచి "పుత్రా! శివుని సేవాఫలము నిరంతరము శ్రీరాముని చరణములపై భక్తికలుగుటయే" అని అనేక విధముల నీతిగరిపెను. నాయనా! బ్రహ్మ, పరమేశ్వరుడు కూడా ఎవ్వని చరణములందు ఆసక్తులో అట్టి శ్రీరామునితో వైరము పూని నీవు సుఖమును ఆశించుచున్నావా?" ఆ మాట వినగానే నా హృదయము కోపాగ్నిలో దహించుకుపోయెను. విద్యవలన నేను పాలు పోసిన సర్పమువలెనైతిని. రాత్రింబవళ్లు గురువుకే ద్రోహము చేయసాగితిని. కాని ఆయన పరమ దయాళువు. కోపము ఏ మాత్రము రాలేదు. నీచుడు ఎవనిచే గొప్పదనమును పొందునో అతనినే చంపి నాశనము చేయును. ఈ ప్రసంగమును గ్రహించిన బుద్ధిమంతులు అధముల సాంగత్యము చేయరు. దుష్టులతో కలహముగాని స్నేహము గాని మంచిది కాదని పండితులు పలికెదరు. నేను దుష్టుడను, కుటిలుడను. గురువుగారు బోధించు హితవాక్యములు నాకు రుచించలేదు.

ఒకరోజు నేను శివాలయములో, శివనామమును జపించుచుంటిని. అదే సమయమున గురువుగారు అచ్చటికి వచ్చిరి. కాని గర్వముతో నేను అతనికి లేచి నమస్కరించలేదు. నా దౌష్ట్యమును చూచి కూడా ఆయన ఏమియూ అనలేదు. అతని హృదయములో కోపము ఏ

మాత్రము లేదు. కాని గురువును నిరాదరణతో చూచిన నా పాపమును మహాదేవుడు సహించలేకపోయెను. మందిరములో ఆకాశవాణి పలికెను: "అరే మూర్ఖుడా! అభిమానీ, నీ గురువు దయాహృదయుడు. కావున ఆయన కోపగించలేదు. నీతిబాహ్యమయిన నీ పని నాకు రుచించదు. కావున నిన్ను శపించెదను. నీవు గురువుగారి ముందు అజగరమువలె కూర్చొని యుంటివి. కావున సర్పమై జన్మించి అధోగతిని పొంది ఏదో పెద్ద చెట్టు తొర్రలో నుండెదవు." శివుని భయంకర శాపము విని గురువుగారు వణుకుచున్న నన్ను చూచి గద్గదకంఠముతో చేతులు జోడించి ప్రణామములు ఆచరించి ప్రార్థన చేసెను: "ఓ మోక్షస్వరూపా! సర్వవ్యాపకా, పరమేశా! మీకు నమస్కారము. స్వతంత్రుడవై స్వయముగా ప్రకటించుకొనువాడవు. నిరాకారుడవు, ఓంకారమునకు మూలమయిన వాడవు. వాక్కునకు ఇంద్రియములకు అగోచరుడవు, అభయంకరుడవు, మహామృత్యుంజయుడవు. మీకు ప్రణామములు. హిమాలయమువలె తెల్లని దేహకాంతి, శిరమున జటాజూటము, పవిత్ర గంగానది, లలాటమున విదియచంద్రుడు, కంఠమున సర్పములు, చెవులందు కుండలములు, సుందరమైన భృకుటి, విశాలమైన నేత్రములు, ప్రసన్న ముఖము, నీలకంఠముతో మీరు దయామయులు, పులిచర్మము, కపాలమాల ధరించిన మీకు నమస్కారము, తాపత్రయములను హరించి చేత త్రిశూలమును దాల్చిన సకల కళాపూర్ణులు. కల్పాంతమునొనర్చువారు. సజ్జనులకు ఆనందప్రదాత, త్రిపురారి, కామారి, ప్రసన్నుడవు కమ్ము. ఉమాపతీ! నీ చరణకమలములను భజించనివారికి ఈ లోకమున పరలోకమున సుఖశాంతులు లేవు. ప్రభూ! ప్రసన్నుడవు కమ్ము." సర్వజ్ఞుడైన శివుడు ఈ స్తుతిని విని బ్రాహ్మణుని అనురాగముతో చూచెను. అప్పుడు మందిరములో మరల ఆకాశవాణి పలికెను: "ఓ ద్విజశ్రేష్ఠా! వరమడుగుము." బ్రాహ్మణుడు పలికెను: "ప్రభూ! ఈ జడప్రాణి మీ మాయకు వశుడై నిత్యము నిరంతరము తిరుగుచుండును.

కృపాసాగరా! అతనిపై కోపగించకుము. కృపజూపి కొద్దిసమయములోనే ఇతనికి శాపవిముక్తిని ప్రసాదించుడు." పరహితమును గోరు బ్రాహ్మణ వచనములు విని ఆకాశవాణి "అట్లే కానిమ్ము" అని అనెను. "ఇతని భయానక పాపమును జూచి నేను కోపముతో ఇతనికి శాపము నిచ్చితిని. కాని నీ సాధుత్వమును చూచి నేను ఇతినిపై కృప జూపెదను. నా శాపము వ్యర్థముకాదు. ఇతనికి వేయి జన్మలు లభించును. కాని జననమరణ దుఃఖములు ఇతనిని బాధించవు. ఏ జన్మలో కూడా ఇతని జ్ఞానము నష్టముకాదు." మరియు ఆకాశవాణి నాతో నిట్లు పలికెను: "నీ జన్మ శ్రీరఘునాథుని నగరమున అయినది. పైగా నీవు నా సేవలోనే నీ మనస్సు నుంచితివి. నగర ప్రభావము, నా అనుగ్రహము వలన నీ హృదయమున రామభక్తి ఉదయించును. సజ్జనులను ఎన్నడునూ నిరాదరణ చేయవద్దు. నీవు ఎక్కడికైనా నిరాటంకముగా పోవచ్చును." శివుని వచనములను విని గురువు ప్రసన్నుడై "అట్లే అగును" అని పలికి నాకు నచ్చచెప్పి తన యింటికి పోయెను. కాలవిధి ప్రేరితుడనై నేను వింధ్యాచలమున సర్పమైతిని. కాని కొద్దికాలము తర్వాత నేను ఆ శరీరమును వదిలితిని. ఏ శరీరమునైననూ అనాయాసముగా ధరించి త్యజించితిని. కాని నా జ్ఞానము నష్టము కాలేదు. ఏ శరీరములోనైనా నేను శ్రీరాముని భజన చేసితిని. చేయుచునే ఉన్నాను. కాని గురువుగారి కోమల స్వభావము నా నిరాదరణ మాత్రము నన్ను బాధించుచునే ఉన్నది.

నేను చివరిజన్మ బ్రాహ్మణశరీరము పొందితిని. ఆ దేహమున బాలకులతో సహా కలిసి ఆడుచూ శ్రీరాముని లీలలను అన్నింటినీ చేయుచుంటిని. నేను పెద్దవాడను కాగానే నా తండ్రిగారు నన్ను చదివించిరి. కాని ఆ విద్య నాకు రుచించలేదు. నా మనస్సునుండి సాంసారిక వాసనలు దూరమైనవి. కేవలము శ్రీరాముని చరణములందే నా మనస్సు లగ్నమై ఉండెను. నా తల్లిదండ్రులు గతించిన పిదప

నేను భక్తరక్షకుడైన శ్రీరాముని భజించుచూ వనమునకు పోయి నేను చూచిన ప్రతి మునీశ్వరుని ఆశ్రమమునకుపోయి నతమస్తకుడను అయితిని. వారితో శ్రీరాముని గుణగాథలను అడుగుచుంటిని. వారు చెప్పగా నేను ఆనందముతో వినుచుంటిని. శివుని అనుగ్రహమును నేను ఎక్కడికి పోవలెనన్ననూ ఆటంకములు లేకుండెను. నా నుండి ఈ షణత్రయములు పారిపోయెను. శ్రీరామచంద్రుని చరణకమలములను చూచి నా జన్మసఫలమొనర్చుకొనవలెనని కోరిక మాత్రము నా హృదయములో ప్రబలమాయెను. నేను ఏ మునినడిగినను "ఈశ్వరుడు సర్వభూతమయుడు" అని తెలుపుచుండిరి. కాని నాకీ నిర్గుణ ఉపాసన నచ్చలేదు. నా హృదయమున సగుణబ్రహ్మపై ప్రీతి అధికమాయెను. శ్రీరఘునాథుని యశోగానమును చేయుచూ తిరుగుచుంటిని. ఆ అనురాగము క్షణక్షణము అధికమగుచుండెను.

చివరకు సుమేరు పర్వతశిఖరమున, ఒక వటవృక్షఛాయన కూర్చున్న లోమష మునిని చూచి ప్రణమిల్లి ప్రార్థించితిని. దయాళువు అయిన ముని నేను వచ్చిన పనిని గూర్చి అడిగిరి. నేను నాకు సగుణబ్రహ్మోపాసన ప్రక్రియను తెలుపమని అడిగితిని. అప్పుడు మునీశ్వరుడు సాదరముగా శ్రీరఘురాముని గుణములను తెలుపు కథలు కొన్ని చెప్పెను. పిదప బ్రహ్మోపదేశమును చేయసాగెను. "పరబ్రహ్మ జన్మరహితుడు. అద్వితీయుడు, అఖండుడు, నిర్గుణుడు. మనస్సుకు, ఇంద్రియములకు అతీతుడు, అనుభవము ద్వారానే తెలుసుకొన దగినవాడు," అని బోధించెను. నీటికి నీటి అలలకు భేదము లేనట్లే, బ్రహ్మకు శివునికి భేదము లేదనీ, దానినే వేదములు "తత్త్వమసి" అను సూత్రము ద్వారా తెలుపుచున్నవని ఉపదేశించెను. కాని నిర్గుణ బ్రహ్మయందు నా మనస్సు నిలువలేదు. నాకు సగుణ బ్రహ్మోపాసనను గూర్చి తెలుపుడని పదేపదే ప్రార్థించితిని, కాని ముని మరల అనేక హరికథలు వినిపించి సగుణమతమును ఖండించి నిర్గుణమతమును ప్రతిపాదించెను.

అప్పుడు నేను నిర్గుణమతమును ఖండించి సగుణమతమును ప్రతిపాదించ సాగితిని. అందువలన లోమష మహర్షి మిక్కిలి క్రుద్ధుడై "మూర్ఖుడా! నేను నీకు సర్వోత్తమమయిన ఉపదేశమును ఇచ్చుచుండగా, నీవు దానిని విశ్వసించక ఉత్తర ప్రత్యుత్తరములను ఇచ్చుచున్నావు. నీ అభిప్రాయము మీదనే నీకు ఎక్కువ పట్టుదల ఉన్నది. కాకివలె అన్నింటియందు సంశయము కలిగియువున్నావు. కావున వెంటనే కాకివి కమ్ము" అని శపించెను. నేను ఆ శాపమును సాదరముగా అంగీకరించి మునికి ప్రణమిల్లితిని. పక్షిరాజా! శాపమిచ్చుటలో ఋషి తప్పిదమేమియు లేదు. దయాసాగరుడైన శ్రీరాముడు ముని బుద్ధిని భ్రమింపచేసి నా ప్రేమను పరీక్షించెను. కాని, మరల ముని బుద్ధిని మార్చెను. అప్పుడు ముని అతి దుఃఖముతో పశ్చాత్తాపపడెను.

నన్ను సాదరముగా పిలిచి రామమంత్రమును ఉపదేశించెను. బాల్యస్వరూపుడైన శ్రీరాముని ధ్యానవిధిని నేర్పెను. ముని కొద్దికాలము అచ్చటనే నన్ను నిలిపి రామచరిత మానసమును వర్ణించెను. పిదప మధురమయిన వాణితో పలికెను: "నాయనా! ఈ రహస్యమయిన, సుందరమయిన రామచరిత మానసమును నేను శివుని అనుగ్రహముచే పొందినాను. నిన్ను శ్రీరాముని నిజమైన భక్తునిగా గుర్తించి నీకీ చరిత్రను తెలిపితిని. నాయనా! ఎవ్వని హృదయములో రామభక్తి లేదో వాని ఎదుట ఎప్పుడూ కూడా దీనిని చెప్పరాదు." అట్లు అనేకవిధముల బోధించి ఆశీర్వదించెను. "నీవు సదా శ్రీరామునికి ప్రియుడవు అగుదువు. శుభగుణములకు నిలయమై మానరహితుడవు, కామరూపుడవు, ఇచ్ఛామృత్యువు కలిగి జ్ఞానవైరాగ్యములకు నిధానమగుదువు. భగవంతుని స్మరణచేయుచూ నీవే ఆశ్రమమున ఉండెదవో దానికి ఒక యోజనము వరకు మాయామోహములుండవు. సుందరరామ రహస్యములు అన్నియూ నీకు కరతలామలకము అగును." నేను ప్రేమమగ్నుడను అయితిని.

నా సందేహములు తొలగిపోయెను. తదనంతరము ముని అజ్ఞను గైకొని అతని చరణములకు నమస్కరించి హర్షోల్లాసముతో నేను ఈ ఆశ్రమమునకు వచ్చితిని. శ్రీరామచంద్రుని కృపచే నేను దుర్లభమయిన వరమును పొందితిని. పక్షిరాజా! నేను ఇక్కడ నివసించుచు ఇరవైఏడు కల్పములు ఆయెను. శ్రీరఘునాథుని గుణములను నిరంతరము గానము చేయుదును. చతురులయిన పక్షులు వానిని సాదరముగా విందురు. శ్రీరఘువీరుడు అయోధ్యానగరమున భక్తుల హితముకై ఎప్పుడు మానవ శరీరధారణ చేసెదరో అప్పుడు ఆ నగరమునకు పోయి ప్రభు బాలలీలలను చూచి సంతోషించెదను. శ్రీరాముని బాలస్వరూపమును హృదయములో నుంచుకొని ఈ ఆశ్రమమునకు తిరిగి వచ్చెదను. నేను ఏ కారణమున కాకి శరీమును పొందినానో ఆ కథనంతయూ నీకు వినిపించినాను. నీ ప్రశ్నలన్నింటికీ సమాధానములిచ్చినాను. ఈ కాకి శరీరముతోనే నాకు ప్రభు దర్శనము కలిగెను. నా సందేహములు దూర మాయెను. పట్టుదలతో నేను భక్తిమార్గమును అనుసరించితిని. పక్షిరాజా! ఏ జనులు హరిభక్తిని వదిలి ఇతర ఉపాయములచే సుఖములను పొందగోరెదరో, ఆ మూర్ఖులు పడవలేకుండా మహాసముద్రములు దాటగోరువారితో సమానము.

## 11. జ్ఞాన, భక్తిమార్గములు

భవానీ! కాకభుశుండి వచనములు విని గరుడుడు ప్రసన్నుడై కోమలవాణితో పలికెను: "ప్రభూ! మీ కృపవలన నా మనస్సున సందేహము, శోకము, మోహము భ్రమలు తొలగిపోయినవి. శ్రీరామ చంద్రుని పవిత్రగుణసమూహములను విన్నాను. శాంతిని పొందితిని. కాని మిమ్ము ఒక మాట అడిగెదను. విశదీకరించుడు. జ్ఞానముతో సమానముగా దుర్లభయినది ఏదియూ లేదని సజ్జనులు, మునులు, వేదపురాణములు చెప్పుచున్నవి కదా! అట్టి జ్ఞానమార్గమును ముని

మీతో చెప్పగా మీరు భక్తిమార్గమువలె దానిని గౌరవించలేదు. జ్ఞాన, భక్తి మార్గముల భేదము ఏమి? వివరింపుడు." గరుడుని వచనములు విని కాకభుశుండి పలికెను: "భక్తి జ్ఞానములలో భేదము ఏమియూ లేదు. ఈ రెండును సాంసారిక దుఃఖములను బాపును. కాని మునీశ్వరులు ఈ రెండింటి మధ్య భేదములను తెలిపెదరు. జ్ఞానము, యోగము, వైరాగ్యము, విజ్ఞానము ఇవన్నియూ పురుషవర్గీయములు. పురుషుని ప్రతాపము ప్రబలమై యుండును. స్త్రీస్వభావతః అబలయై జడప్రకృతియై యుండును. వైరాగ్యవంతుడు ధీరబుద్ధి అయిన పురుషుడే స్త్రీని త్యజించగలడు. కాముకుడు, శ్రీరఘువీరుని పట్ల విముఖుడు త్యజించలేడు. అట్లే జ్ఞానులైన మునులు కూడా అందమైన స్త్రీని చూచి ఆమెకు అధీను లయ్యెదరు. విష్ణుభగవానుని మాయయే స్త్రీ రూపములో ప్రకటితమగును. భక్తి, మాయ – ఈ రెండు స్త్రీవర్గీయములు. ఒక స్త్రీ మరొక స్త్రీరూపమును చూచి మోహము చెందరు. అట్లే భక్తిమార్గమును అనుసరించువాడు మాయామోహితుడు కాడు. శ్రీరఘువీరుడు భక్తికి అనుకూలుడు. ఎవరి హృదయములో నిరుపాధికమైన రామభక్తి యుండునో అట్టివానిని చూచి మాయ సంకోచించును. అందుల్లనే విజ్ఞానులైన మునులు సమస్త సుఖములనిచ్చు భక్తిమార్గమును అవలంబించెదరు. శ్రీరఘునాథుని కృపచే ఎవడు ఈ విషయమును గ్రహించునో వానిని మోహము ఆవరించదు.

జ్ఞాన భక్తి మార్గములకు మరొక భేదము వున్నది. జీవుడు ఈశ్వరుని అంశమే కావున అతడు అమరుడు, చేతనుడు, పరిశుద్ధుడు. అట్టి జీవాత్మ మాయావశుడై చిలుక లేక కోతివలె తనకు తానే బంధనములో చిక్కుకొనును. ఈ విధముగా జడచేతనములు ముడిపడియున్నవి. ఈ ముడి అసత్యము అయిననూ దానిని విప్పుట మిక్కిలి కష్టము. జడమయిన మాయా చేతనుడైన జీవుడు ముడిబడియున్నప్పటినుండి

జీవుడు సంసారబంధములో చిక్కుకొనును. ఆ ముడి విడువదు. వదులుకాదు. పైగా ఇంకా గట్టిపడును. జీవుని హృదయములో మోహమను అంధకారము వ్యాపించివుండుటచే ముడి కనబడదు. భగవంతుని కృపచే సాత్త్విక శ్రద్ధ అను ఆవు హృదయమను ఇంటిలో నివసించినచో, జపతపవ్రతాదులను ధర్మాచరణమను పచ్చనిగడ్డిని ఆ యావు మేసినప్పుడు, ఆస్తిక భావములను దూడలను పొంది, పొదుగులో పాలు కాసాగును. నివృత్తి మార్గము ఆవు వెనుక కాళ్ళు కట్టు త్రాడు, విశ్వాసమే పాత్ర, నిర్మల మనస్సే పాలు పితుకువాడు, పరమధర్మమయిన పాలను పితికి దానిని నిష్కామభావమను మంటపై కాచవలెను. క్షమ, సంతోషములనెడి గాలి దానిని చల్లార్చును. ధైర్యము, శమములు వాటిని పెరుగుగా మార్చును. అప్పుడు ప్రసన్నత అనెడి కుండలో తత్త్వవిచారమను కవ్వముతో దమమను ఆధారము కలిగి, సత్యము, మధురవాణి అనెడి త్రాటిని కట్టి చిలుకవలెను. అప్పుడు దానినుండి వైరాగ్యమనెడి శుద్ధమయిన వెన్న వచ్చును. యోగాగ్నియందు శుభాశుభ కర్మలనెడి ఇంధనముతో కాచవలెను. అప్పుడు మమతయను మురికి మాడిపోయి జ్ఞానమనెడి నెయ్యి మిగులును. నిశ్చల బుద్ధిచే దానిని చల్లార్చి విజ్ఞానరూపమైన బుద్ధి ఆ స్వచ్ఛమయిన నెయ్యిని పొంది, చిక్కమను ప్రమిదలో నింపి సమతయను పెమ్మెపై దృఢముగా నుంచవలెను. సుషుప్తి, స్వప్నావస్థలు మరియు సత్వరజస్తమోగుణములు అను దూదితో తురీయావస్థ అను శుభ్రమైన ప్రత్తిని తీసి సుందరమైన వత్తిని సిద్ధపరచవలెను. తేజోరాశి తత్త్వజ్ఞానమనెడి దీపమును వెలిగించిన దానిని సమీపించగనే మదము మొదలగు పురుగులు కాలిపోవును, "సోహమస్మి" ఆ బ్రహ్మయే నేను. ఇది అఖండ జ్యోతి. జ్ఞానదీపము యొక్క ప్రచండ దీపశిఖ ఎప్పుడైతే ఆత్మజ్ఞానసముజ్జ్వల ప్రకాశము వ్యాపించునో అప్పుడు సంసారమునకు మూలకారణమైన భేదరూపమైన భ్రమ నశించును. అవిద్య యొక్క ప్రబల పరివారమైన మోహము మొదలగు

వాని అంధకారము నష్టమగును. అప్పుడు విజ్ఞానరూపమగు బుద్ధి ఆత్మానుభవ ప్రకాశమును పొంది హృదయమను ఇంటిలో కూర్చొనిన జడచేతన ముడిని విప్పివేయును. అప్పుడు ఆ జీవుడు కృతార్థుడు అగును. కాని పక్షిరాజా! ఆ ముడి విడిపోతున్నదని తెలియగానే మాయ అనేక విఘ్నములను కలిగించును. అవి వచ్చి బుద్ధిని ప్రలోభపరచి కళలు, బలము, మోసముతో సమీపించి జ్ఞానరూప శిఖను ఆర్పివేయును. వికసించిన బుద్ధి వాటివైపు చూడదు. అప్పుడు దేవతలు హృదయమను గృహమునకు గల ఇంద్రియములను కిటికీలను తెరచి విషయములను గాలి అవిచ్ఛిన్నముగా వచ్చునట్లు చేయుదురు. ఆ పెనుగాలికి విజ్ఞాన దీపము ఆరిపోవును. ఆత్మానుబోధ ప్రకాశము కూడా అంతరించును. ముడి గట్టిపడును. మరల జీవుడు జనన మరణ క్లేశములు పొందును. కావున పక్షిరాజా! హరి మాయను తప్పించుకొనుట మిగులు కష్టము. ఈ వివేకమును గ్రహించుట, వ్యక్తపరచుట, సాధన చేయుట కూడా కష్టము. సంయోగవశమున జ్ఞానము వచ్చినను దానిని రక్షించుకొనుటలో అనేక కష్టములు ఉన్నవి. జ్ఞానమార్గము అసిధారా వ్రతము వంటిది. మార్గము నుండి పడిపోవుటకు ఆలస్యము కాదు. ఈ మార్గమును నిర్విఘ్నముగా అనుసరించువాడు కైవల్యమను పరమపదమును పొందును.

దుర్లభమయిన ఈ ముక్తి రామభజన చేసినచో కోరకున్ననూ లభించును. ఎన్ని ఉపాయములు చేసినప్పటికీ లోతైన నేల లేనిదే నీరు ఎట్లా ఆగదో అట్లే మోక్షసుఖము భగవత్ భక్తిలేనిదే లభించదు. కావున చతురులయిన హరిభక్తులు ముక్తిని కూడా కోరకుండా భక్తినే కోరుదురు. భక్తికలిగిన వానికి జననమరణ పరంపరకు కారణమైన అవిద్య ఎట్టి ప్రయత్నము శ్రమలేకుండగనే నాశనము అగును. గరుడా! "నేను సేవకుడను, శ్రీరామచంద్ర ప్రభువు నాకు స్వామి." ఈ భావము లేనిదే సంసారసాగరము దాటుట

సంభవము కాదు. ఈ సిద్ధాంతమును విశ్వసించి శ్రీరామచంద్రుని చరణకమలములను భజించుము. చేతనమును జడముగాను, జడమును చేతనముగాను చేయుటకు సమర్థుడైన శ్రీరఘునాథుని ఏ జీవులు భజింతురో వారు ధన్యులు. రామ భక్తి ఒక అందమైన చింతామణి. అది ఎవరి హృదయమున ఉండునో పరమప్రకాశము పొందును. మోహమను దరిద్రము అతని వద్దకు రాదు. లోభము అను గాలి దానిని ఆర్పదు. దాని కాంతిలో అజ్ఞానాంధకారము నాశనమగును. మదము మొదలగు దీపపురుగులు భస్మమగును. ఎవని హృదయములో భక్తియుండునో వాని చెంతకు కామక్రోధాది రాక్షసులు రారు. అతనికి విషముకూడ అమృతతుల్యము అగును. శత్రువు మిత్రుడు అగును. ఏ మానసరోగములకు అధీనులై జీవులు దుఃఖించెదరో అవి అతనిని ఆవరించవు. ఈ మణికై ప్రయత్నము చేయువారు చతురులలో శ్రేష్ఠులు. కాని శ్రీరాముని అనుగ్రహము లేనిదే ఇది లభ్యము కాదు. అది ప్రాప్తించు ఉపాయము సుగమము. వేదపురాణములు పావన పర్వతములు. శ్రీరాముని కథలు అందలి గనులు. సజ్జనులు ఆ గనుల మర్మమును ఎరిగినవారు. సుందరమైన బుద్ధి ఈ గనిని త్రవ్వి మణిని బయటికి తీయు పార. జ్ఞానవైరాగ్యములు వాని నేత్రములు. ఏ ప్రాణి ప్రేమతో వెదుకుతాడో అతడే భక్తియను మణిని పొందగలడు. హరిభక్తియే అన్ని సాధనముల ఫలము, సజ్జనుల సహాయము లేనిదే దానిని ఎవ్వరూ పొందలేరు. కావున సత్‌సాంగత్యము చేయువారికి రామభక్తి సులభముగా లభ్యమగును."

## 12. ఏడు ప్రశ్నలు

తరువాత పక్షిరాజైన గరుడుడు ప్రేమతో పలికెను: "ప్రభూ! నన్ను మీ సేవకునిగా భావించి నా ఏడు ప్రశ్నలకు సమాధానములు తెలుపుడు. ఏ శరీరము చాలా దుర్లభమయినది? అన్నింటికంటే

ఘోరమైన దుఃఖము ఏది? గొప్ప సుఖమేది? సజ్జనుల, దుర్జనుల సహజ స్వభావములు ఏవి? శ్రుతులలో వర్ణించబడిన గొప్ప పుణ్యము ఏది? గొప్ప పాపము ఏది? మానసిక రోగములు అనగానేమి? ఈ విషయములన్నియూ వివరింపుడు." కాకభుశుండి పలికెను: "నాయనా! మానవ శరీరముతో సమానమైనది ఏదియు లేదు. జడ చేతన చరాచర ప్రాణులన్నియూ దీనిని కోరును. ఈ మనుష్య శరీరము నరకము, స్వర్గము, మోక్షములకు సోపానము. మంగళకరమయిన జ్ఞానవైరాగ్య భక్తిమార్గములను ప్రసాదించునది. ఇట్టి శరీరము లభించిన తరువాత కూడా ఏ మనుజుడు శ్రీహరిని భజించక నీచాతినీచమైన విషయభోగములలో లీనమగుదురో, వారు చేతిలో నున్న పారసమణిని పడవేసి గాజు ముక్కను వెదకు మూర్ఖులవంటివారు. జగత్తులో దరిద్రమువంటి దుఃఖము ఏదియు లేదు మనోవాక్కాయములచే పరోపకారము చేయుటయే సజ్జనుల జన్మసిద్ధమయిన స్వభావము. వారు ఇతరుల హితము కొరకు దుఃఖము సహించెదరు. దుర్జనులు ఇతరులకు దుఃఖము కలిగించెదరు. దుష్టుల అభివృద్ధి కేతు గ్రహము వలె ప్రపంచమునకు దుఃఖహేతువు. సజ్జనుల ప్రాదుర్భావము సూర్యచంద్రుల ఉదయమువలె విశ్వమునకు సుఖదాయకము. "అహింసా పరమో ధర్మః" అని వేదములు పలికినవి. ఇతరులను నిందించుటవంటి పాపము మరొకటి లేదు. ఇప్పుడు మానసిక రోగముల గురించి వినుము: మోహము అన్ని రోగములకు మూలము. దానినుండి జనించిన కామము, లోభము, క్రోధము అనునవి కఫ, వాత, పిత్తము అనునవి. అవి హృదయమును దహించును. ఈ మూడు కలిసినచో సన్నిపాతరోగము ఉత్పన్నమగును. విషయభోగములపై మక్కువ. అనేక బాధలు కలిగించును. మమత, ఈర్ష్య, కుటిలత, అహంకారము, దంభము, మానము, తృష్ణ తాపత్రయములు మొదలగు లెక్కించుటకు వీలులేని అనేక మానసిక రోగములు కలవు. ఒక్క రోగముతోనే మనుష్యుడు చనిపోవును. ఇన్ని

అసాధ్యమయిన రోగములు నిరంతరము అతనిని పీడించునపుడు ఆ నిర్భాగ్యుడు శాంతి నెట్లు పొందును? నియమము, ధర్మము, జ్ఞానము, జపము, ధ్యానము మున్నగు ఔషధములు ఉన్నవి. వాటితో ఈ రోగములు పోవును. సద్గురువు అను వైద్యునిపై విశ్వాసము నుంచి శ్రీరఘునాథునిపై భక్తియను సంజీవనీమూలికను స్వీకరించినపుడు ఈ మానసిక రోగములు అన్నియు అంతరించును. విషయవాంఛలు ఉండకపోవుటయే పథ్యము. శ్రద్ధతో కూడిన బుద్ధి అనుపానము. మహాత్మా! హృదయమున వైరాగ్యమను బలము అధికమైనపుడు ఉత్తమబుద్ధియను ఆకలి వృద్ధిచెందునపుడు, విషయవాంఛలు బల హీన మైనపుడు మనస్సు రోగరరహితమై శ్రీరామభక్తితో నిండును. శ్రీరాముని పదకమలములయందు భక్తిలేనిచో సుఖము లేదని వేదపురాణాది గ్రంథములు శివుడు, బ్రహ్మ, నారదుడు, సనకాది మహర్షులు వక్కాణించిరి. శ్రీహరికి విముఖుడైన జీవునికి సుఖము లేదు. ఇట్లు ఆలోచించి చతురులయిన వారు సందేహమును వదలి శ్రీరాముని భజించెదరు. ఏ మనుష్యులు శ్రీహరిని భజిస్తారో వారు దుస్తరమయిన సంసారసాగరమును అనాయాసముగా తరించెదరు. గరుడా! శ్రీహరి అనుపమచరిత్రను నా బుద్ధికి తోచినట్లు వర్ణించితిని. నావంటి మూర్ఖునిపైన కూడా కరుణ చూపిన శ్రీరఘునాథుని కాదని ఎవరిని సేవించెదవు? శ్రీరామచంద్రుని అనుగ్రహముచే నాకు మీవంటి సత్పురుషుల సాంగత్యము లభించెను. ఎవని శరణుజొచ్చిన పాపులు కూడా పాపహీనులు అగుదురో, ఎవని నామము జీనన్మ రణరోగములకు దివ్యౌషధమో అట్టి శ్రీరామచంద్రుదు నాపైన, మీ పైన కృపజూపుగాక!"

కాకభుశుండీ మంగళకరమయిన వచనములు విని శ్రీరాముని చరణములపై అతని అపూర్వ భక్తిని చూచి సందేహరహితుడైన గరుడుడు పలికెను: "శ్రీరఘువీరుని భక్తిరసములో మునిగిన మీ వాణిని

విని నేను కృతార్థుడను అయితిని. శ్రీరామచరణములపై నాకు అనన్యభక్తి ఏర్పడినది. మాయా జనితమైన ఆపదలు తొలగిపోయినవి. మోహసముద్రములో మునుగుచున్న నన్ను మీరు నౌకవలె దరిజేర్చితిరి. మీకేమి ప్రత్యుపకారము చేయుగలను? మీకు వందనము నాచరించెదను. మీరు సదా నన్ను మీ సేవకునిగా నెరుగవలెను." భుశుండీ చరణములకు ప్రేమపూర్వకముగా నమస్కరించి హృదయములో శ్రీరఘువీరుని ప్రతిష్ఠించుకొని గరుడుడు వైకుంఠమునకు పోయెను.

## 13. శ్రీరామకథాశ్రవణ ఫలము

శివుడు పలుకుచున్నాడు: "గిరిజా, పరమపవిత్రమయిన శ్రీరామ చరితమును చెప్పితిని. దీనిని వినినంతనే సంసారబంధములన్నియూ తెగిపోవును. శరణాగత కల్పవృక్షము, కరుణామూర్తియగు శ్రీరాముని పదకమలములందు ప్రీతి కలుగును. మనోవాక్కర్మలచే ఉత్పన్నమైన పాపములు నష్టమగును. తీర్థయాత్రలు, యోగవైరాగ్యజ్ఞానములు, ధర్మవ్రతదానములు, జపతపయజ్ఞములు, విద్యా వినయ వివేకములు మొదలగు సాధనముల ఫలము హరిభక్తియే. ఏ మనుజుడు విశ్వాసపూర్వకముగా ఈ కథను నిత్యము నిరంతరము వింటాడో, వాడు అనాయాసముగా దుర్లభమయిన హరిభక్తిని పొందును. ఎవని మనస్సు శ్రీరాముని చరణములందు అనురక్తమో వాడే సర్వజ్ఞుడు, గుణవంతుడు, జ్ఞాని, విద్వాంసుడు, నీతికోవిదుడు. పవిత్ర గంగానది ప్రవహించు దేశమే ధన్యమయినది. పతివ్రతాధర్మములను అనుసరించు స్త్రీలే ధన్యులు. నీతి నియమములతో పరిపాలన చేయు రాజులే ధన్యులు. తమ ధర్మములను వదలని బ్రాహ్మణులు ధన్యులు. దాన ధర్మములకు వినియోగమైన ధన సంపదయే సార్థకమైనది. ఏ వంశమునందు శ్రీరామభక్తి పరాయణులు జన్మింతురో ఆ వంశము ధన్యము. వారు జగత్తులో పూజ్యులు పవిత్రులు.

"ఉమా! వినుము. శఠుడు, హఠస్వభావము కలవాడు శ్రీహరిలీలలను మనస్ఫూర్తిగా విననివాడు ఈ కథను వినుటకు అర్హుడుకాడు. లోభి, క్రోధి, కామి అయినవానికి, బ్రాహ్మణవైరి అయినవానికి శ్రీరామభజన చేయనివానికి ఈ కథను వినిపించరాదు. సత్ సాంగత్యముపై ప్రేమగలవాడు శ్రీరామకథాశ్రవణమునకు అధికారి. గురుచరణములపై ప్రీతిగలవాడు, నీతిపరాయణుడు, బ్రాహ్మణులను సేవించువాడు ఈ కథను వినుటకు అర్హుడు. వారికి ఈ కథ మిక్కిలి సుఖప్రదము. వారు శ్రీరఘునాథునికి ప్రాణసమానులు. ఎవరైతే శ్రీరామచరణములయందు ప్రేమను కోరెదరో, మోక్షపదమును ఆశింతురో, వారే ఈ రామకథామృతమును గ్రోలెదరు. గిరిజా! కలియుగ పాపములను నష్టమొనర్చునట్టి, మనోమాలిన్యములను హరించునట్టి రామకథను వినిపించితిని. ఇది జనన మరణరూపమైన రోగమునకు సంజీవనీమూలిక. దీనికి సప్త సోపానములు కలవు. శ్రీరఘునాథుని భక్తిని పొందుటకు ఇవి మార్గములు. శ్రీహరికృపయున్నవాడే ఈ మార్గముపై కాలిడును. కపటమును మాని ఈ కథను గానము చేయువారు తమ మనోవాంఛసిద్ధిని పొందెదరు. దీనిని చెప్పుచూ, వినుచూ ప్రశంసించువారు సంసారసాగరమును దాటెదరు."

యాజ్యవల్క్యుడు పలికెను: "అంతయూ విన్న శ్రీపార్వతీదేవికి ఈ కథ మిక్కిలి ఆహ్లాదమొనర్చెను. మధురమయిన వాణితో పార్వతీదేవి పలికెను: "స్వామీ మీ కృపవలన నా సందేహము తొలగినది. నేను కృతకృత్యురాలను అయితిని. నాలో అఖండమైన రామభక్తి జనించెను." ఉమాశంకరుల ఈ సంవాదము సుఖప్రదము, శోకనాశకము, జననమరణ హారకము. సందేహములను నష్టమొనర్చి, భక్తులకు ఆనందము నిచ్చునది, సత్పురుషులకు ప్రియమైనది. జగత్తులో శ్రీరాముని ఉపాసకులకు రామకథ కంటే ప్రియమైనది మరొకటిలేదు. శ్రీరఘునాథుని కృపచే నేనీ సుందర పవిత్ర కథను నా బుద్ధిని అనుసరించి గానము చేసితిని."

తులసీదాసు పలుకుచున్నాడు: "కలియుగమున యోగము, యజ్ఞము, జపము, తపము, వ్రతము, పూజనము మొదలగు ఏ సాధనములు కూడా అవసరము లేదు. శ్రీరాముని స్మరించుట, రామకథలను వినుట గుణగానము చేయుటయే మనుజుల కర్తవ్యము. పతితులను పవిత్రులుగా నొనర్చు శ్రీరాముని భజించువారు మోక్షమును పొందెదరు. పతితపావనుడైన శ్రీరాముని భజించి ఒక గణిక, అజామిళుడు, వ్యాధుడు, గద్ద, ఏనుగు మొదలగునవన్నియూ తరించినవి. ఒక అభీరుడు, యవనుడు, కిరాతుడు, కంసుడు, చండాలుడు మొదలగు పాపులు కూడా రామనామముచే పవిత్రులైరి. అట్టి శ్రీరామునికి నమస్కరింతును. ఏ మనుష్యులు రఘువంశభూషణుడైన శ్రీరాముని చరితమును చెప్పెదురో, విందురో, గానము చేయుదురో వారు కలియుగ పాపములను మనోమాలిన్యములను కడిగి శ్రమ లేకుండగనే రామ ధామమును చేరుదురు. ఈ రామచరితమానసమందలి దోహాలను, లేదా, 5 లేక 6 చౌపాయిలను హృదయములో నిలుపుకొందురో, వారు అవిద్యాజనితవికారములనుండి ముక్తి గాంచెదరు. సౌందర్యనిధానుడు. దయాసాగరుడు, కళ్యాణప్రదుడు మోక్షమునిచ్చు శ్రీరామునితో సమానుడు అయిన ప్రభువు ఎవరూ లేరు. అతని లేశమాత్రకృపచేతనే మందబుద్ధి అయిన తులసీదాసు పరమశాంతిని పొందెను.

ఓ శ్రీరఘువీరా! నా వంటి దీనుడు ఎవ్వడూ లేడు. నీ వంటి దీనరక్షకుడు లేడు. కావున నన్ను భవసాగరమునుండి రక్షింపుము. కామునికి స్త్రీవలె, లోభికి ధనమువలె శ్రీరామా! మీరు నాకు అత్యంత ప్రియులు. శ్రీరాముని చరణకమలములందు నిరంతర భక్తిని పొందుటకు సమర్థుడు శ్రేష్ఠుడైన కవి శ్రీ శంకరుడు మొదట ఏ మానసరామాయణమును రచించెనో, అదే రామనామమునందు తత్పరుడై తన అంతఃకరణమునందలి అంధకారమును మాయము చేయుటకు తులసీదాసు తన మానసరూపమైన రామాయణమును

భాషాబద్ధమొనర్చెను. పుణ్యరూపము, పాపహారము, శుభంకరము, విజ్ఞానభక్తి ప్రదము, మాయామోహమలనాశకము, అతినిర్మలము, ప్రేమజలపూర్ణము, మంగళకారి అయిన ఈ శ్రీరామచరితమానసము సరోవరమున ఏ మనుజులు స్నానమాడుదురో వారు సంసారసాగరమును దాటి పరమశాంతిని పొందెదరు."

కలియుగ సమస్త పాపములను హరించు
శ్రీరామచరితమానసముమందలి "ఉత్తరాకాండ"మను
ఏడవ సోపానము సమాప్తము.

★ ★ ★

## హారతి

1. ఓం జయ జగదీశ హరే, స్వామి జయ జగదీశ హరే,
భక్త జనన కే సంకట, దాస జనన కే సంకట,
క్షణమే దూర కరే ॥ఓం జయ జగదీశ హరే॥

2. జో ధ్యావే ఫలపావే, దుఃఖ వినసే మనకా,
స్వామి దుఃఖ వినసే మనకా।
సుఖ సంపతి ఘర ఆవే, సుఖ సంపతి ఘర ఆవే,
కష్టమిటే తనకా ॥ ఓం జయ జగదీశ హరే ॥

3. మాతు పితా తుమ మేరే, శరణ గహూ కిస్‌కీ,
స్వామి శరణ గహూ కిస్‌కీ,।
తుమ బిను ఔర నదూజా,
తుమ బిను ఔరన దూజా ఆసకరూఁ జిన్‌కీ ఁ
॥ఓం జయ జగదీశ హరే॥

4. తుమ పురాణ పరమాత్మా, తుమ అంతర్యామీ,
స్వామి తుమ అంతర్యామీ।
పారబ్రహ్మ పరమేశ్వర, పార బ్రహ్మ పరమేశ్వర,
తుమ సబకే స్వామీ ॥ఓం జయ జగదీశ హరే॥

5. తుమ కరుణా కే సాగర, తుమ పాలన కర్తా,
స్వామి తుమ పాలనకర్తా।
మై మూరఖ ఖల కామీ, మై మూరఖ ఖలకామీ,
కృపాకరో భర్తా ॥ఓం జయ జగదీశ హరే॥

6. తుమ హో ఏక్ అగోచర, సబ్ కే ప్రాణపతీ,
స్వామి సబ్ కే ప్రాణపతీ।

